# చరక సంహిత

## సూత్ర స్థానము

(మొదటి పది అధ్యాయములు)

మూలము మరియు చక్రపాణి వ్యాఖ్యలకు తెలుగు అనువాదము





డా॥ శాస్త్రుల మాణిక్య శర్మ






ఆం.ప్ర. ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్‌మెంట్ ట్రస్ట్

హైదరాబాద్

# CHARAKASAMHITA - SUTRA STANAM

1 to 10 Adhyayams

with Chakrapani's Commentary in Telugu

by

**Dr SASTRULA MANIKYA SARMA**

Director,
Indian Medicines & Homoeopathy Dept,
Govt of A P

Published by
A P Ayurvedic Literature Improvement Trust,
SECUNDERABAD

**PRICE : Rs.175/-**

For Copies
Dr Y Krishna Manohar,
Indian Remedies,
18-4-54, 2nd Lane, Kedareswarapet,
VIJAYAWADA-520 003
✆ 536602

Laser Type Setting
Vijaya Maruthi D T P
S N Puram, Vijayawada-520 011
✆ 533458

Printed at
**Sai Offset,**
Gandhinagar, Vijayawada-2



**డా. వై. సూర్యనారాయణరావు L.I.M.**

**(1906 - 1980)**

వ్యవస్థాపకులు మరియు ప్రథమ అధ్యక్షులు

ఆం ప్ర ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్ట్



# అభిప్రాయము

ఆంధ్రప్రదేశ్ ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్‌మెంట్ ట్రస్టు వారు ప్రచురించుచున్న ఆయుర్వేద పాఠ్యగ్రంథములో ఈ చరక సూత్ర స్థానము మరొక మైలురాయి చరక సంహితలో ఒక భాగమైన సూత్రస్థానము పూర్తియగుటకు మరొక రెండు భాగములు ప్రచురించవలసియున్నది

ఆయుర్వేద వైద్య గ్రంథాలలో చరక సంహితకు ప్రత్యేక విశిష్టతయున్నది తెలుగు వ్యాఖ్యానములో ప్రస్తుతమేగ్రంథమూ అందుబాటులో లేదు ఆ కొరత ఈ గ్రంథ ప్రచురణతో కొంత వరకు తీరగలదు మిగతా భాగాలన్నీ కూడా త్వరలో ప్రచురించబడ గలవని ఆశిస్తున్నాను

చక్కని తెలుగువ్యాఖ్య వ్రాసిన డా॥ మాణిక్యశర్మ గారిని, శ్రమ కోర్చి చక్కగా ముద్రించిన శ్రీ కృష్ణమనోహర్‌గారిని హృదయ పూర్వకముగా అభినందిస్తున్నాను

ఈ గ్రంథము వైద్య విద్యార్థులకేగాక, ఆయుర్వేద వైద్యులకు, ఆయుర్వేద జిజ్ఞాసులకు మిక్కిలి ఉపయోగకరము

ఇంకా ఈలాంటి అనేక గ్రంథాల రచన, ఆంధ్రీకరణ, పండితులు, వైద్యులు, వైద్యాభిమానుల సహకారముతో జరుపవలసి యున్నది

హైదరాబాదు,

తేది 24 1 1998

ఇట్లు

**(సం.) డా. కె. నరసింహారెడ్డి**

అదనపు సంచాలకులు (ఆయుర్వేద)

భారతీయ వైద్య మరియు హోమియోపతి శాఖ



## శాస్త్రుల మాణిక్యశర్మ

| | |
|---|---|
| జన్మ స్థలము | శివంపేట, మెదక్ జిల్లా |
| జననీ జనకులు | శా॥ ప్రమీలాబాయి, శా॥ నృశింహ్మాశర్మగారలు |
| విద్యా గురువు | ఆచార్య శిరోమణి శాస్త్రుల విశ్వనాథశర్మగారు |
| విద్యార్హతలు | డిప్ ఓ ఎల్ (సంస్కృతం) ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1975<br>బి ఎ ఎండ్ ఎస్ (ప్రభుత్వాయుర్వేద కళాశాల) హైదరాబాదు ఎం డి (ఆయుర్వేద) 1979 ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు |
| వృత్తి | రీడర్, డా బూర్గుల రామకృష్ణారావు ప్రభుత్వాయుర్వేద కళాశాల హైదరాబాదు, ఆం ప్ర |
| ఇతర వ్యాసంగములు | ఆకాశవాణియందు ఆయుర్వేద కార్యక్రమాలు, ఆయుర్వేద శాస్త్రజ్ఞ పరిషత్ సభ్యులుగా నుండి భారతదేశమునందలి పలు ఆయుర్వేద కళాశాలలందు, చికిత్సా లయములందు వివిధ తద్విద్యా సంభాషా పరిషత్తులందు పాల్గొనినారు<br>పలు రాష్ట్రీయ తద్విద్య సంభాషా పరిషత్తులందు పాల్గొనుట, అఖిల భారత ఆయుర్వేద మహాసమ్మేళన సభ్యులుగా నున్నారు<br>ఆయుర్వేద పత్రికలయందు ఆయుర్వేద విషయ వ్యాసములు వ్రాయుట మొ॥నవి |






# ముందుమాట

ఆయుర్వేద సాహిత్యమంతా సంస్కృతంలో ఉంది తగినన్ని ఆయుర్వేద పుస్తకములు తెలుగులో లభ్యంకాక ఆయుర్వేద విద్యార్థులు, ఆయుర్వేద అధ్యాపకులు ఇబ్బంది పడేవారు

తెలుగులో తగినన్ని ఆయుర్వేద పుస్తకములు అందుబాటులో ఉండాలనే మంచి తలంపుతో ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్టును ఏర్పాటు చేయడం జరిగింది విజయవాడ వాస్తవ్యులు కీ శే డాII వై సూర్యనారాయణరావుగారు అందించిన విరాళంతో ఈ ట్రస్టును 1986 సంవత్సరంలో ఏర్పాటు చేయడం జరిగింది ఇంతవరకు ట్రస్ట్ ఆధ్వర్యంలో ఇరువై ఆరు ఆయుర్వేద పాఠ్యగ్రంథములను తెలుగులో ముద్రించడం జరిగింది ఇపుడు అందిస్తున్న పుస్తకము చరకసూత్ర స్థానము (ప్రథమ బాగము) గతంలో మాదిరిగా ఈ పుస్తకం కూడా పాఠకుల అబిమానాన్ని పొందుతుందని ఆశిస్తున్నాను

ఎంతో శ్రమకోర్చి డాII ఎస్ మాణిక్యశర్మగారు (రీడర్, బి ఆర్ కె ఆర్ ప్రభుత్వ ఆయుర్వేద వైద్య కళాశాల, హైదరాబాద్) ఈ గ్రంథాన్ని రూపొందించారు

ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్ట్ కార్యక్రమాలను ముమ్మరంగా చేసేందుకు ఆయుర్వేద అబిమానులు ధనరూపేణ విరాళాలు, ఇంత వరకు వెలువరించిన గ్రంథాల కాంటెంట్ (Content) ను మరింత ఉపయోగ పడేందుకు వీలుగా సలహాలను ఇవ్వవలసిందిగా అందరిని అర్థిస్తున్నాను

(సం) బి అరవింద రెడ్డి I.A.S.

సంచాలకులు, భారతీయ వైద్య మరియు హోమియోపతి శాఖ

మరియు

అధ్యక్షులు, ఆం ప్ర ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్ట్

ఆం ప్ర ప్రభుత్వము, సికింద్రాబాద్

తేదీ 24-1-1998

# ప్రథమాధ్యాయము

అథాతోదీర్ఘం జీవితీయ మధ్యాయం వ్యాఖ్యాస్యామః॥

అటు తరువాత దీర్ఘం జీవితీయమను అధ్యాయమును వ్యాఖ్యానించు చున్నాము ఈ రీతిగ ఆత్రేయ మహర్షులు చెప్పిరి

ధర్మార్థకామమోక్ష రూపమైన చతుర్విధ పురుషార్థములకు అవరోధములైన రోగములను శమింపచేయుట కొరకు బ్రహ్మ మొదలగు వారితో రచించబడిన ఆయుర్వేద తంత్రములతివిస్తారముగా నుండుట వలన వర్తమాన కాలమునందలి అల్పాయువు, అల్పబుద్ధికల పురుషుల కతి సులభముగా బోధపడకపోవుట వలన, ఆ తంత్రములందు వివరించిన వాటి ననుష్ఠించుట బాధితులకు సాధ్యము కాదని తలచి పరమదయాళువై పూజ్యుడైన అగ్నివేశుడు అల్పాయువు అల్పబుద్ధిగలవారికి సైతము సులభముగా బోధపడుటకు నాతి సంక్షేప విస్తరంగా లేని కాయచికిత్సా ప్రధానమైన ఆయుర్వేద తంత్రమును రచించుటకారంభించెను అట్టి తంత్రమునందుకూడా శ్లోక (సూత్ర) నిదాన విమానశారీర ఇంద్రియ చికిత్సా కల్ప సిద్ధి స్థానములు చెప్పవలసి యుండగా సమస్తమైన తంత్రముయొక్క ప్రధానమగు విషయమును సూచించునదగుట వలన, సూత్రస్థానము ప్రధానమైనదని తలచి, మొదట సూత్రస్థానమును చెప్పుచున్నాడు "శ్లోకస్థానం సముద్దిష్టం తంత్రస్యాస్యశిరః శుభమ్। చతుష్కాణాంమహార్థానాం స్థానేఽస్మిన్ సంగ్రహః కృతః" (సూ అ 30) అనగా నీ తంత్రమునకు శ్లోక(సూత్ర) స్థానము శిరస్సు వంటిది, మరియు శుభకరమైనది, కారణమేమనగా అతి ముఖ్యములైన విషయములు చతుష్కములు ముందు చెప్పగలడు అట్టి సూత్రస్థానమునగూడా రోగములుత్పన్న ములగునపుడు ఆలసించక రోగోపశమనమగు చికిత్సను చెప్పు భేషజ చతుష్కమును

చెప్పవలసియుండగా సమస్తతంత్రమునకు మూలభూతమైన హేతు లింగ, ఔషధములను ప్రతిపాదించునదియు మరియు తంత్ర ప్రవృత్తికి అంగభూతమైన ప్రయోజనముగల ఆయుర్వేదము యొక్క ఆగమనము మొదలగునవి తెలుపు "దీర్ఘం జీవితీయ"మను అధ్యాయమును చెప్పుటకు ఉపక్రమించినాడు చదువరు (వినువారు) లైన వారికి శాస్త్రము బోధపడుటకు కారణములైన అభిధేయము, ప్రయోజనము, సంబంధమును వివరించు ప్రతిజ్ఞాపరమైన సూత్రమును ఎనిమిది సంఖ్య మంగళకరమైనదిగాన ఎనిమిది పదములతో "అథాతోదీర్ఘం జీవితీయ మధ్యాయం వ్యాఖ్యాస్యామః" అని చెప్పినాడు అర్థములేనట్టి క,చ,ట,త,ప మొదలగు వాటి యందును, ప్రయోజనము లేనట్టి కాక దంతపరీక్ష (కాకులయొక్క పళ్ళను పరీక్షించుట) యందును ఎవరికీ ప్రవృత్తి కలుగదు ఆకారణమువలన అభిధేయము (చెప్పవలసిన విషయము) ప్రయోజనము చెప్పవలసియుండును "అభిధేయఫల జ్ఞాన విరహస్తిమితోద్యమాః। శ్రోతుమల్పమపి గ్రంథంనాద్రియంతే హిసాధనః" అనగా ప్రతిపాదింపబడు విషయమునకు, ఆ విషయమును ప్రతిపాదించు శాస్త్రమునకు గల సంబంధము అభిదాన - అభిధేయ సంబంధము అనబడును అట్లే ప్రయోజనమునకు, శాస్త్రమునకుగల సంబంధము, సాధ్య-సాధన భావసంబంధము ఇచట అభిధేయము (వివరింపబడు విషయము) హితము, అహితము మొదలగు రూపముననున్న అయువు ఇది ముందు "హితాహితం సుఖందుఃఖమాయుః తస్య హితాహితం। మానంచతచ్ఛయ త్రోక్తమా యుర్వేదస్స ఉచ్యతే।" (సూ అ 30) అని చెప్పబడును ఇది ప్రకరణమునను సరించి ఆయా స్థలములందు వివరించబడును ఈ శాస్త్రమునకు ప్రయోజనము ధాతు సామ్యము ఇది ధాతుసామ్య క్రియాచోక్తాతంత్రస్యాస్య ప్రయోజనమ్ (సూ అ1) అని చెప్పబడినది సంబంధము తెలుపవలసి వచ్చినప్పుడు హితాహితరూపమైన ఆయువు మరియు దానిని ప్రతిపాదించు శాస్త్రమునకు గల సంబంధము, అభిదాన అభిదేయ సంబంధము (ఆయువు అభిదేయము, శాస్త్రము అభిదానము) ఇది గ్రహించతగినది, ఇది విసర్జించ తగినది అను జ్ఞానమును కలిగించుట అను అవాంతర వ్యాపారముగల శాస్త్రమునకు ప్రయోజనమైన ధాతు సామ్యమునకు గల సంబంధము, సాధ్యసాధన భావ సంబందము ఒక వేళ ప్రయోజనమును తెలుపుట వలన శాస్త్రమునందు ప్రవృత్తి గలుగును గాన ప్రయోజనము తెలుపుట అవసరమనియన్నచో అది సరికాదు కారణమేమనగా ప్రయోజనమును చెప్పినంత మాత్రమున శాస్త్రము ప్రయోజనముగలదను నిశ్చయము కలుగక పోవచ్చును ప్రయోజనము

చెప్పబడినప్పటికిని, ఏ విధమైన ప్రయోజనమును కలిగించవు శాస్త్రమున ప్రవృత్తి కలుగవలెనన్న శాస్త్రమునకు ప్రయోజనము తెలియవలెను ప్రయోజనము తెలియనిదే శాస్త్రమున ప్రవృత్తిగలుగదు రెండవది శాస్త్రమున ప్రవృత్తి గలుగనిదే శాస్త్రమునకు గల యధార్థత్వమూ తెలియదు శాస్త్రమునకుగల యధార్థత్వము అవగతముగానిదే శాస్త్రకారునికి అప్తత్వము సిద్ధించదు శాస్త్రకారునికాప్తత్వము సిద్ధించనిచో అతడు చెప్పిన శాస్త్రము ప్రయోజనము గలదని విశ్వసించుట ఎట్లు? అను చక్రక దోషము గలుగును అందువలన పై చెప్పిన విధముగాగాక అనగా (ప్రయోజనముగలది శాస్త్రము అని విశ్వసించుట వలన పై చక్రకదోషముత్పన్నమై నందున అట్టి చర్చను వదలి) శాస్త్రకారుడు ప్రయోజనము చెప్పినాడు గాన అట్టి ప్రయోజనము సత్యమా? గాదా? (శాస్త్రమునకు శాస్త్రకారుడు చెప్పిన ప్రయోజనమున్నదా? లేదా?) అను సందేహమే శాస్త్రమునందు పారకుడు ప్రవృత్తించుటకు కారణమగును ఉదా వ్యవసాయము మొదలగు కర్మలందు ప్రవృత్తి గూడా సందేహము వలననే గలుగును వ్యవసాయదారులకు తప్పక ఫలమువచ్చునను నమ్మిక ఆరంభమున యుండదు ఐనను ఆ సందేహమే కృషీవలులను వ్యవసాయమున ప్రవర్తింపజేయు చున్నది అట్లే నిచటగూడా సందేహమే (ప్రయోజనరూప), శాస్త్ర ప్రవృత్తియందు కారణమగును మరియు ప్రయోజనము చెప్పబడక పోయినను సప్రయోజన నిష్ప్రయోజన శాస్త్రములు గూడా కనపడుచుండుట వలన శాస్త్రమునకు గల శాస్త్రత్వమే ప్రయోజనముగలదా? లేదా? అను సందేహమును సూచించును గాన అట్టి సందేహమే శా[illegible] ప్రవృత్తిని గలిగించుటకు సామర్థ్యము గలిగియుండును అని మరియొక పూర్వపక్షము గాని ఇదియును సరిగాదు అదెట్లనగా ఒక విశేష ప్రయోజనమునాశించు పాఠకుని, తానాశించు విశేష ప్రయోజనమునకు [illegible] శాస్త్ర[illegible]నందు ప్రవర్తింపజేయునో అట్లు సామాన్య సందేహము ఆకర్షించదు తానాశించిన ఒకవిశిష్టమైన సందేహము అట్టి విశేష విషయము స్మరించ కున్నచో గలుగదు అనగా ఆయుర్వేద శాస్త్రమునభ్యసించగోరువానికి ఆయుర్వేద ప్రయోజనమైన ధాతుసామ్య రూపమైన విశిష్ట ప్రయోజనమిందుగలదా లేదా అను సందేహము గలిగిననే గాని ఆయుర్వేద శాస్త్రమున ప్రవృత్తి గలుగదు అందువలన అగ్నివేశాదుల నాప్తులుగా నంగీకరించిన వారికి, ఈ శాస్త్రమున వారు చెప్పిన ధాతు సామ్యమను ప్రయోజనము ఉన్నదా లేదా? అను సందేహమే శాస్త్రమునందు ప్రవర్తింప జేయును అట్లుగాక అగ్నివేశాదుల నాప్తులుగా నంగీకరించిన వారికి వారు చెప్పిన ధాతుసామ్యరూపమైన ప్రయోజనమీ

తంత్రమునగలదు అను నిశ్చయాత్మకమైన జ్ఞానమే శాస్త్రమునందు చదువరులు ప్రవర్తించుటకు కారణమగును అందువలన ధాతుసామ్యరూప ప్రయోజన సందేహము, నిశ్చయము ఈ రెండూ శాస్త్రమున ప్రవర్తించుటకు కారణములు అందువలన ప్రయోజనము చెప్పుట ఆవశ్యకమైనది మరియు స్వల్ప ప్రయత్నముతో విదితమగు ప్రయోజనమును తెలుపు ఒక వాక్యమునందు ప్రవృత్తి సామాన్య సందేహమువలననే గలుగును గాని అనేక సంవత్సరములు అతి కష్టముతో తెలియజేయు శాస్త్రమున ప్రవృత్తి గలుగదు అందువలన ధాతు సామ్యరూపమైన ప్రయోజనము ఆప్తోపదేశము ద్వారా ఒక వాక్యములో "ధాతుసామ్య క్రియాచోక్తా తంత్రస్యాస్య ప్రయోజనమ్" అని చెప్పబడినది సందేహమే శాస్త్ర ప్రవృత్తి యందు కారణమని చెప్పినచో "ప్రయోజనాభిధాన వాక్య ప్రవృత్తావపి ప్రయోజన మభిధాతవ్యం" అనగా ప్రయోజనమును తెలుపు వాక్యమునందు ప్రవృత్తి గలుగుటకు గూడా ఆ వాక్యమునకు ప్రయోజనము తెలుపవలసి యుండును ఇట్లు ఒకదాని ప్రయోజనమును తెలుసుకొనుటకు మరియొక వాక్యము అట్లే ఆ వాక్యప్రయోజనమును తెలుసుకొనుటకింకొక వాక్యము అను అనవస్థా దోషము ప్రాప్తించును అందువలన ఆప్తోపదేశము వలన మొదట ప్రయోజనమును తెలుసుకొనుట ఆవశ్యకమని ఎంచి, "ధాతుసామ్య క్రియా చోక్తా తంత్రస్యాస్య ప్రయోజనమ్" అని ప్రయోజనము చెప్పబడి సందేహ నివృత్తి చేయబడినది. "అథాతో, అనుసూత్రమునందలి "అథ" శబ్దము బ్రహ్మ మొదలగు వారిచే రచించ బడిన తంత్రములు అల్పాయువు. అల్పమేధస్సు గలవారికి అర్థముగావు గాన అటు తరువాత సులభముగా తెలియుటకు ఈ తంత్రమును రచించుచున్నామని యర్థము తెలియజేయును మరియు గ్రంథరచనా ప్రారంభమున ఇష్టదేవతానమస్కారము, గుర్వాజ్ఞను బడసిన తరువాత అని అర్థమున ప్రయోగించబడినది ఐనప్పటికి, నీళ్ళను గొని తెచ్చుటకు బయలుదేరిన వారికి నీళ్ళ బిందెలు ఎదురైనట్లు మంగళ వాచకముగా ప్రయోగింపబడినది గ్రంథప్రారంభమున మంగళసేవ రచయితలకు శ్రోతలకు విఘ్నములను పోగొట్టుట ద్వారా తామాశించిన ఫలమునిచ్చువ దగుట వలన మంగళ శబ్దముతో ప్రారంభించుట యుక్తమని తలచి మంగళరూపమైన "అథ" శబ్దముచే శాస్త్రము ప్రారంభించబడినది. "అథ" శబ్దము మంగళవాచకమనుటకు "ఓంకార శ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా। కంఠం భిత్వా వినిర్యాతౌ తేన మాంగలికావుభౌ" అనగా ఓంకారము, అథ శబ్దము శబ్దసమామ్నాయమునకు మొట్టమొదట బ్రహ్మ యొక్క కంఠమును భేదించుకొని బ్రహ్మముఖమునుండి వెలువడినవి గాన ఆ రెండు

శబ్దములు మంగళవాచకములు అని అర్థము ఇతర శాస్త్రములందు గూడా అథ శబ్దము మంగళ వాచకముగా తెలుపబడినది ఉదా "అథ శబ్దానుశాసనమ్" అని వ్యాకరణ మహాభాష్యమున (అ 1, పా 1, సూ1) అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః (వై అ1, ఆ1, సూ1) మొదలగు శాస్త్రములందు తెలుపబడినది గ్రంథ ప్రారంభమున ఇష్టదేవతా నమస్కారము శిష్టాచారముగా వచ్చుచున్నది అట్టి దేవతా నమస్కారము పరమ శిష్టుడైన అగ్ని వేశునిచే చేయబడినదనుట నిశ్చయము చేయబడినచో శిష్టాచారము నుల్లంఘించుట వలన అగ్నివేశునికి శిష్టత్వమేయుండదు, గ్రంథము పరిసమాప్తము గాదు మరియు ఇష్టదేవతా నమస్కారము గ్రంథమున చేర్చబడనప్పటికిని అది విఘ్నములను పోగొట్టుట యందు సామర్థ్యముగలదై యుండుట వలన దీనిని గ్రంథస్తము చేయలేదు మరియు "అథమైత్రీపరః పుణ్యం" (సూ అ1) అను మొదలగు సూత్రములందు గుర్వాజ్ఞను పొందిన పిదప నీతంత్రముచేయుట స్పష్టముగా చెప్పబడినది గుర్వాజ్ఞను ప్రతిపాదించుటవలన ఈ గ్రంథమునకు విధేయత్వము (అనగా ఈ గ్రంథము చదువదగినదిగా) తెలుపబడినది అథ శబ్దమునకు శిష్యులడిగిన పిమ్మటఅని పిమ్మట అను అర్థము చెప్పుట మాకు సమ్మతముగాదు కారణమేమనగా శిష్యుల ముందు శాస్త్రమును రచించుట జరగదు చదువరులకు విషయ పరిజ్ఞానము చేయుటకు శాస్త్రరచన చేయుట జరుగును విషయ పరిజ్ఞానము కలవారు ప్రశ్నలు అడగరు అందువల్ల "అథ" శబ్దము శిష్యులడిగిన పిమ్మట అను అర్థమును స్ఫురింప చేయదు "అథః" అను శబ్దము "దీర్ఘం జీవితీయ"మను అధికార సూత్రమునకు ముందుగల అవధిని తెలియజేయు శబ్దము లేక హేతువు (కారణము) ను తెలియజేయు శబ్దము అనగా బ్రహ్మ మొదలగు వారిచే రచింపబడిన తంత్రములు సులభముగా బోధ పడని వగుట వలన అని అర్థము ఆ కారణము వలన "దీర్ఘంజీవితీయ" మను అధ్యాయమును వివరించు చున్నామని గ్రహించ వలయును "దీర్ఘం జీవితీయ" మనుచోట "దీర్ఘం జీవిత" మను శబ్దము ఈ సూత్రమున కలదు అను మత్వర్థమున "అధ్యాయాను వాకయోర్లుక్ చ" (పా అ 5 పా 2, సూ 60) అను సూత్రమునననుసరించి "ఛ" ప్రత్యయము వచ్చి "దీర్ఘం జీవితీయ" మని యగును లేక "దీర్ఘం జీవిత" మను శబ్దము అధికారికముగా చేసుకొని రచింపబడిన గ్రంథము అని మరియొక్క అర్థము అధ్యాయరూపమైన తంత్రము అను అర్థమున "అధికృత్యకృతే గ్రంథే" (పా.అ 4/3/ 88) అను సూత్రము ద్వారా "ఛ" ప్రత్యయము వచ్చి "దీర్ఘం జీవితీయ" మని యగును ఇట్లే ఇతర స్థలములను తెలుసుకొనవలెను. ఇచ్చట దీర్ఘం జీవితీయమను

పదములకంటె ఇతర శబ్దములున్నప్పటికీ ప్రశస్థమైన దగుట వలనను, ప్రవచనములందు ప్రయోగింపబడుట వలనను దీర్ఘం జీవిత శబ్దము చేతనే అధ్యాయమునకు నామకరణం చేయబడినది "దీర్ఘం జీవిత" శబ్ద మిందుకలదు అని లేక "దీర్ఘం జీవిత" శబ్దమును ఆధికారికముగా చేసుకొని అనుయుత్పత్తి చేత దీర్ఘంజీవిత శబ్దము తంత్రమునందునూ అధ్యాయమునందును ప్రవర్తింపజేయవలయును ఇట్లు చేసినచో "దీర్ఘం జీవితీయం వ్యాఖ్యాస్యామః" అను వాక్యముతో తంత్రమును గూర్చిన వ్యాఖ్యాన ప్రతిజ్ఞ చేసిన ట్లైనది తిరిగి దీర్ఘం జీవితీయమను పదమునావృత్తి చేసి అధ్యాయపదముతో కలిపి ఉచ్ఛరించినచో అధ్యాయమును వ్యాఖ్యానించుచున్నామని ప్రతిజ్ఞ చేసినట్లుగా కూడా చెప్పవచ్చును. ఒక పదమును మరల మరల ఆవృత్తిచేసి అన్వయించుకొనుట శాస్త్రమున గూడా అచ్చటచ్చట కనబడును ఉదా అపామార్గతండులీయమున "గౌరవే శిరసః శూలేపీనసే" (సూ అ 2) అను మొదలగు సూత్రములందు "శిరసః అను పదము గౌరవే అను పదముతో అన్వయించును ద్విరావృత్తి చేసి (రెండవ మారు ఆ శబ్దమునుచ్ఛరించి) శూలే అను పదముతో అన్వయించి శిరోగౌరవముననను, శిరః శూలయందును అని అర్థమును చెప్పవచ్చును అందువలననె శాస్త్రమున "తంత్ర ప్రతిజ్ఞచేయకయే అధ్యాయ ప్రతిజ్ఞ చేసిన సరిపోదను భావము పైదానిలో తిరస్కరించ బడినది లేక దీర్ఘం జీవితీయాధ్యాయమనునది అధ్యాయ ప్రతిజ్ఞగానే యుండని దానితోనే తంత్రప్రతిజ్ఞగూడా చేసినట్లగును అని మరొయొక సమాధానము ఎందు కనగా అధ్యాయము తంత్రమునకంటే వేరుగా నుండదు అవయవమైన అధ్యాయ ప్రతిజ్ఞ చేయుట ద్వారా అవయవియైన (అవయవముగలదైన) తంత్ర ప్రతిజ్ఞ చేసినట్లే యగును ఉదా వ్రేళ్ళను చెప్పినపుడు వ్రేళ్ళుగల వ్యక్తి (దేవదత్తాపుత్రుడు) గూడా గ్రహించబడును [illegible] అవయవముల ప్రతిజ్ఞ పైసూత్రముల [illegible] అట్టి అవయవాంతరములు (ఇతర విషయములందు) ఆయా అధ్యాయములందు వ్యాఖ్యానించబడును అధ్యాయమను పదము అదిశబ్దము పూర్వముగాకల "ఇఙ్" నకు సఙశ్చ (పా.అ/3/2/4 ప్రత్యయము వచ్చి అధ్యాయమను పదము నిష్పన్నమైనది దానిననుసరించి అధ్యయనము చేయబడునది అధ్యాయము అని అర్థము ఈ వ్యుత్పత్తిననుసరించి స్వస్థవృత్త చతుష్కము మొదలగు ప్రకరణములందలి వ్యాప్తి సంభవించదు కారణ మేమనగా అధ్యాయమనునీ సంజ్ఞ యోగరూఢి పదమగుట వలన దీర్ఘం జీవితీయము మొదలగు వాటి యందు మాత్రమే అన్వయించునుగాని యోగము వలన చతుష్కాదులందు అన్వయించదు ఇదే విషయము ముందు

"అధికృత్యేయమధ్యాయనామ సంజ్ఞా ప్రతిష్ఠితా" (సూ అ30) ఒక విషయము నాధారముగా చేసికొని చెప్పబడుటచేత అధ్యాయమని చెప్పబడినదని ముందు చెప్పబడును లేక కారణము అధికరణము అను అర్థములందు "అధ్యాయన్యాయోధ్యావసంహారాశ్చ" (పా అ 3/3/112) అను సూత్రముననుసరించి నిపాతము వలన అధ్యాయమను పదము సిద్ధించును 'అధీయతేఽస్మిన్ననేనవా అర్థ విశేష ఇత్యధ్యాయః' అనగా ఒకానొక అర్థవిశేషము దీనియందు, లేక దీనిచేత తెలుసుకోబడునుగాన అధ్యాయమనబడునని అధ్యాయ శబ్దవ్యుత్పత్తి వ్యాఖ్యాస్యామ అను పదము వ్యాఙ్ పూర్వమైన ఖ్యాతి ధాతువునకు లుట్ చేర్చి సాధింపబడినది చషిఙ్ యొక్క ప్రయోగమున వ్యాఖ్యాత ఇష్టపడనప్పటికిని క్రియా ఫలము నివారించరాని దగుటవలన "స్వరిత జిత" (పా అ3/3/72) అను సూత్రముచేత ఆత్మనే పదము వచ్చును "వి" అనగా విశేషముగా, విశేషమనగా వ్యాన సమాసాదులు (ఒకచోట విషయము అధికముగానున్నచో దానిని సంక్షేపించుట, మిక్కిలి సంక్షేపముగా నున్న విషయమును సందర్భముననుసరించి విశదీకరించుట విశేషము) ఆ ఖ్యాస్యామః అను చోట ఆఙ్ క్రియతో అన్వయించును ఆఙ్ను మర్యాదాసూచకమైన అర్థము నందును విధ్యర్థమునను ప్రయోగించువారి అభిప్రాయము తెలియదు మర్యాద మరియు అభివిధి అర్థమున "ఆఙ్" ప్రయోగించిన అది ప్రాతికతో కలియును ఉదా "ఆ సముద్రక్షితీశానాం", "ఆపాటలీపుత్రాద్‌దృష్టో దేవః" మొదలగువాటి యందువలె ఇచట గూడా ప్రాతిపదికతో కలిసి వేరొక అర్థము నిచ్చును గాని క్రియతో అన్వయించి క్రియార్థమునివ్వదు క్రియచే అన్వయించనపుడు "ఉపసర్గాః క్రియాయోగే" (పా అ 1/4/59) అను నియమానుసారము ఆఙ్నకుపసర్గత్వమురాదు ఆఙ్ నకుపసర్గత్వమురాని ఎడల "వ్యా" అను పదమునందు మొదటిదైన "వి" కి గూడా "ఆఙ్" వ్యవధానముగా నుండుట వలన ఉపసర్గత్వము రాదు కారణమేమనగా సజాతీయ వర్ణములు వ్యవధానముగా నున్నను, లేక వ్యవధానము లేకున్నను ఉపసర్గత్వము వచ్చునను నియమము గలదు ఇచ్చట ఆ రెండు నియమములు ఉల్లంఘించబడినవి గాన 'వి' 'ఆఙ్' ఈ రెండింటికి ఉపసర్గత్వము లేకుండుట వలన ప్రాతిపదికార్థము కల్పించు గౌరవము ఏర్పడును అందువలన క్రియాయోగిత్వమె న్యాయము "అథ, అతః, దీర్ఘం, జీవితీయం, అధ్యాయం, వి, ఆ, ఖ్యాస్యామః" అని అష్టపదత్వమీసూత్రమునకు చెప్పబడినది

సూ॥ ఇతి హస్మాహ భగవానాత్రేయః॥ 2॥

అని బగవంతుడైన ఆత్రేయుడు పలికెను

సకల పదార్థముల యొక్క అశేషవిశేష విజ్ఞానమును వ్యాఖ్యానించు ఆయుర్వేదమును అగ్నివేశుడు ఎట్లు వ్యాఖ్యానించగలడు? అను సందేహము కారణమేమనగా భేషజము మొదలగు వాటి యొక్క అశేష విశేషము ప్రత్యక్షముగా తెలియదు కారణమేమనగా అన్ని పదార్థముల యొక్క విశేషములు ప్రత్యక్ష విషయములు కావు, గావున మరియు అన్వయ వ్యతిరేక వ్యాప్తుల చేత అన్ని పదార్థములను తెల్సుకొనుట దుష్కరము కారణ మేమనగా ఒకే మధు (తేనె) స్వరూపముచేత (స్వాభావిక గుణముచేత) జీవింపచేయును వేడి చేసినను, సమానముగా ఘృతమును కలిపినను మరణమును గలుగజేయును కఫ ప్రకృతిగలవారికి హితముగా నుండి వాత ప్రకృతిగలవారలకు అహితము అనూప దేశమునసాత్మ్యము, మరుప్రదేశమున అసాత్మ్యము శీతకాలమున సేవించదగినది, గ్రీష్మమున సేవించదగదు వృద్ధులు కానివారికి హితము, వృద్ధులకహితము అల్పముగా సేవించిన సద్గుణములను గలుగజేయును అతిగానుపయోగించిన బాధాకరమై ఉదరమున ఆమత్వమును పొంది ఉపక్రమ విరోధియగుట వలన అతి విభ్రమమును గలిగించుచు చిరకాలము బాధించును కాక మాచితో కలిపిగాని, పక్వమైన నికుచముతో కలిపి గాని ఉపయోగించిన మరణమును గలిగించును లేక బల, వర్ణ, వీర్య, తేజస్సులను నశింపజేయును ఈ విధముగా ఆయా విధములుగా అనేక విధములైన కర్మలను జేయును అందువలన పై చెప్పబడిన యుక్తులననుసరించి ఒక్క తేనెయొక్క స్వరూపమే తెలుసుకొనుట కష్టతరమైనపుడు, సమస్త పదార్థముల యొక్క అశేష విశేషములను తెలుసుకొనుట ఎట్లు సంభవము (తెలుసుకొనుట అసలే సంభవము కాదు) తెలియక వ్యాఖ్యానించినచో అట్టి వ్యాఖ్యానము ఎట్లు గ్రహించదగినదిగా నుండును? (గ్రహించదగినదిగాదు అని అర్థము) అనిసంశయమును దృష్టియందుంచుకొనియె ఆప్తుడైన గురువు వలన ప్రతిపాదింపబడిన విషయమునే ప్రతిపాదించ గలమని తెలుపుచు పై సందేహమును తొలగించుటకై తన గ్రంథమును గురువు చెప్పిన దానికి అనువాదముగా చెప్పబడుటను చూపించు "ఇతిహస్మాహ భగవానా త్రేయః" అని చెప్పినాడు ఈ సూత్రమునందలి "ఇతి" అను శబ్దము చెప్పబోవు అర్థమును సూచించును "హ" శబ్దము నిశ్చయార్థకము ఉదా "న హవైస శరీరస్య ప్రియా ప్రియయోరపహతి రస్తి" ఇచట నహ అనగా లేనేలేదని యర్థము మరియు "స్మాహ" అనుచోట "స్మ" శబ్దమున సామాన్య భూతకాల వాచ్యమై "లిజ్" అర్థమున "లట్స్మే" (3/2/118) అను సూత్రము ద్వారా "లట్",వచ్చును అంతేగాని భూతానద్యతనపరోక్షమైన "లిట్" గాదు కారణమేమనగా

ఆత్రేయుడు అగ్నివేశునికి సాక్షాత్తుగా నుపదేశించినాడు "భగం పూజితం జ్ఞానం తద్వాన్ భగవాన్" అనగా ప్రస్తుతించదగిన జ్ఞానముగలవాడు భగవంతుడు ఇందుకు ప్రమాణము "ఉత్పత్తిం ప్రలయంచైవ భూతానా మాగతింగతిం। వేత్తి విద్యామవిద్యాంచ వాచ్యోభగవానితి" అనగా భూతముల యొక్క ఉత్పత్తిని ప్రలయమును, గతి, స్థిరత్వమును, విద్యను, అవిద్యను (విద్యలేమిని) ఎవడు తెలుసుకొనునో అతడు భగవంతుడు అని శాస్త్ర ప్రమాణము లేక భగశబ్దము సమస్త ఐశ్వర్యము, మహాత్మ్యమును తెలియజేయునది అని మరియొక అర్థము ఇందుకు వచనము "ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాంభగఇతీంగనాః" అనగా సమస్తమైన ఐశ్వర్యమునకు, ధర్మమునకు, యశస్సునకు, సంపదకు, జ్ఞానమునకు, వైరాగ్యమునకు ఈ ఆరింటికి "భగ"మని పేరు ఇవిగలవాడు భగవంతుడు "ఆత్రేరపత్యం ఆత్రేయః" అనగా అత్రి వంశమునందలి వాడాత్రేయుడని చెప్పబడుటచేత ఆత్రేయునికిగల విశుద్ధ వంశత్వము తెలుపబడినది పై విషయమునీ క్రింది విధముగా కొందరు వ్యాఖ్యానించుచున్నారు సూత్రము నాల్గువిధములుగా నుండును అవి 1 గురుసూత్రము 2 శిష్యసూత్రము 3 ప్రతి సంస్కర్తృసూత్రము 4 ఏకీయసూత్రము వాటిలో "నైతద్బుద్ధిమతా ద్రష్టవ్యమగ్నివేశ (సూ అ 4) అనునట్టివి గురుసూత్రములు "తమువాచ భగవానాత్రేయః" (సూ అ4) అనునట్టివి ప్రతి సంస్కర్తృసూత్రములు నైతాని భగవన్ పంచకషాయ శతాని పూర్యంతే (సూ అ-4) అనునట్టివి శిష్య సూత్రములు "కుమారస్య శిరః పూర్వం అభినిర్వర్తత ఇతి కుమార శిరాభరద్వాజః" (శా సా అ6) అనునట్టివి ఏకీయ సూత్రములు అందువలన మొదటిదైన వ్యాఖ్యాన ప్రతిజ్ఞాసూత్రము (అథాతో స్యామః అనునది) ఉపదేశమునందు శిష్యునకధికారము లేకుండుటవలన అది గురుసూత్రమే రెండవదైన "ఇతి హస్మాహ భగవానాత్రేయః" అనునది ప్రతి సంస్కర్తృ సూత్రము ప్రకారవాచకమైన "ఇతి" శబ్దముచే "దీర్ఘం జీవితీయం వ్యాఖ్యాస్యామః" అను వాక్యము (పరామర్శించబడును) గ్రహించబడి "అహస్మ" అనునది భూతానద్యతన పరోక్షమైన "లిట్" రూపమని కొందరి అభిప్రాయము ఎందులకనగా ప్రతి సంస్కర్తకు ఉపదేష్టయైన ఆత్రేయునకుపదేష్టమైన ఆత్రేయనకు సాక్షాత్సంబంధము లేదు అందువలన "అహస్మ" అనునది భూతానద్యతన పరోక్షమైన రూపమని కొందరి అభిప్రాయము దీనిననుసరించి "తమువాచ భగవానాత్రేయః" అను మొదలగువాటియందు 'లిట్' సరిపోవును సుశ్రుతమునగూడా "యథోవాచ భగవాన్ ధన్వంతరిః" (సు సూఅ-1) అనునది ప్రతిసంస్కర్తృసూత్రమనియే యెంచి

టీకా కారుడు "లిట్" విధిని ప్రతిపాదించినాడు కావున సాధారణ భూతకాలమైన "లిఙ్" కాక భూతానద్యతన పరోక్షమైన "లిట్" రూపమేయని కొందరి యభిప్రాయము ఇచ్చట మా యభిప్రాయమేమనగా అది సరికాదు శిష్యుడైన అగ్నివేశునికి ఉపదేశము నందధికారము లేకుండట వలన మొదటిసూత్రము గురుసూత్రమను యభిప్రాయము సరికాదు కారణమేమనగా ఎవరును పుట్టకతో గురువులుగారు ఆత్రేయుడు గూడా తన గురువుకు శిష్యుడు శిష్యులైన అగ్నివేశాదులకు గురువు అట్లే అగ్నివేశుడు కూడా ఆత్రేయునికి శిష్యుడు తన శిష్యులకు గురువు అట్లే అగ్నివేశుడు కూడా గ్రంధరచనా కాలమున తన శిష్యులను గూర్చి గురువగుటలో దోషము లేదు ఇకపోతే ద్వితీయ సూత్రము ప్రతిసంస్కర్తృసూత్రముగా చెప్పి భూతానద్యతన పరోక్షమైన "లిట్" ప్రతి పాదించు విషయమున విచారించవలసి యున్నది అదేమనగా ఈ ద్వితీయసూత్రము పూర్వవాక్యముతో కలిపి ఉచ్చరించబడినదా లేదా? ఒకవేళ కలిపి ఉచ్చరించబడిన దన్నచో సుశ్రుతమున చెప్పబడిన "తధావ్యాఖ్యాస్యామోయధోవాచ భగవాన్ ధన్వం తరిః" అన్నట్లుగా ఉచ్చరించబడియుండవలయును మరియును తధావ్యాఖ్యాస్యామః అను క్రియతో ఏకీభవించిన "ఉవాచ" అను పదము ఏకకర్తృత్వమును బోధించును అటువంటి సందర్భమున "లిట్" విధి అవసరము లేదు అట్లుగాక పూర్వవాక్యము రెండవ వాక్యముతో కలవదు అన్నచో అపుడు గౌః, అశ్వః, పురుషః, హస్తి అన్నట్లు సరియైన అర్థము వాక్యములకు పొసగదు మరియు జతూకర్ణసంహిత మొదలగు గ్రంధములందు ప్రతిసంస్కర్తృగ్రంధము గూడా లేదు అందువలన "నానాశ్వాత పరిపూర్ణకంఠ! శిష్యోజతూకర్ణః ప్రాంజలి రధిగమ్య ఉవాచ" అను మొదలగు వాక్యము లందు "లిట్" విధి ఎటు పొసగును? పొసగదు అని భావము ఇదే న్యాయమునను సరించి చరకమున గూడా ప్రతిసంస్కర్తృ సూత్రవిషయమున "లిట్" విధి లేదు అందువలన చరకమున అగ్నివేశుడు సుశ్రుతమున సుశ్రుతుడే సూత్రరచనా కారులు ఒక్కొక్క సందర్భమున ఒక విషయమును ప్రస్తుతించుటకు, లేక నిందించుటకు ఆఖ్యాయికా రూపమున పూర్వకల్పమును తెలియజేయుచు కొన్ని సూత్రములను గురువు చెప్పినవాటికి అనువాద రూపములుగాను, కొన్నింటికి ఏకీయ మతమున కనువాద రూపములుగాను రచించినాడు ప్రతి సంస్కర్త మాత్రము మొట్టమొదటి గ్రంధకర్తృత్వము చేతనే దీనిని పూరించినాడు" "లిట్" విధి మాత్రము భూతానద్యతన కాలమున మాత్రమే ఛందోవిహితమై లౌకిక భాషలో గూడా వర్ణించబడినది అట్లు గానిచో జతూకర్ణాది సంహితలలో "ఉవాచ" అను పదము లేకుండెడిది అట్లే హరి

వంశమున ధన్యోపాఖ్యానమున "మామువాచ" అను పదము "అహమువాచ" అను పదముగూడా ఉండకుండెడివి ఉదా సమామువాచాంబుచరః కూర్మోమానుషవత్ స్వయమ్ కిమాశ్చర్యం మయిమునే ధన్యశ్చాహంకంరం లిభో" (హరివంశము విష్ణుపర్వం 2 అ 110) అని అట్లే స్వయంభు వచనాత్ సోఽహం వేదాన్వైసముపస్థితః ఉవాచ చైనాంశ్చతురః" అని మొదలగు శ్లోకములు ఉదాహరణము కొరకై చెప్పబడినవి "ఇతి హస్మాహ" అనుచోట ఇతి శబ్దము పూర్వసూత్రముతో సంబంధము తెలుపునది అనుకొన్నచో అదిగూడా సరిగాదు (అనగా ఇతి శబ్దములో పూర్వసూత్రమైన అథాతో దీర్ఘం జీవితీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః" అను వాక్యము గ్రహించవలెనన్నచో అదియును సరిగాదు) కారణమేమనగా "దీర్ఘం జీవితీయము" మొదలగు సూత్రములు లేక వాటి అర్థములు గురువు చెప్పినవని ప్రతిపాదించినంత మాత్రమున ముందు చెప్పబోవు అభిదేయ (చెప్పవలసిన విషయము) అభిదాన (చెప్పుశాస్త్రము) రూపమైన శాస్త్రమంతయు గురువుచేత చెప్పబడిన దానికనువాద రూపమని చెప్పుట చదువరుల కంతగా రుచించదు గాన ముందు వ్యాఖ్యానించినట్లుగా వివరించుచున్నాను అని భావించుటకు వీలున్నది అదే సమంజసము అగ్నివేశుని యొక్క 'వ్యాఖ్యాస్యామః' అను పదమునగల బహువచన ప్రయోగము ఒకే వ్యక్తివిషయమున ప్రయోగించ బడినప్పటికిని శబ్దమునకు గల సాధుత్వము బహువచన ప్రయోగమున గల ప్రయోజనమై యున్నది సత్పురుషులు "వయం కరిష్యామః" అనుటయే మంచి ప్రయోగముగా చెప్పినారు "భగవానాత్రేయః"అనుచోట ఆత్రేయుని ఏకవచన ప్రయోగముతో చెప్పబడినది "భగవాన్" అని చెప్పుటచేతనే ఆత్రేయునికి గురురూపమైన గౌరవము తెలుపబడుటచేత ఆచార్యునికిగల గౌరవము "భగవాన్" శబ్దముచేతనే తెలుపబడినది గావున ఇది సత్ప్రయోగమే

మూ॥ దీర్ఘం జీవిత మన్విచ్ఛన్ భరద్వాజ ఉపాగమత్।
ఇంద్రముగ్రతపాబుద్ధ్వా శరణ్యమమరేశ్వరమ్॥ 3॥

తాత్పర్యము మిక్కిలి యుగ్రమైన తపోబలముగల భరద్వాజుడను బ్రహ్మర్షి చిరకాల జీవితమును కోరినవాడై దేవతలకు పరిపాలకుడైన ఇంద్రుడు శరణమొందదగిన వాడని తలచి (అట్టి ఇంద్రునివలన దీర్ఘజీవితోపాయము తెలుసుకొనుటకై) ఇంద్రుని సమీపమునకు వెళ్ళెను

చ పా వ్యా ఆం అ ఆయుర్వేదము దురధిగమమగుటచే (సులభముగా తెలుసుకొనదగి నది కాకుండుటచే) ప్రత్యక్ష ప్రమాణము వలనను అన్వయ వ్యతిరేక ప్రమాణముల

వలనను అగ్నివేశునికి ఆయుర్వేద జ్ఞానము కలుగనపుడు అతనికుపదేశించిన ఆత్రేయునికి మాత్రము ఆయుర్వేదజ్ఞానము ఎట్లు కలుగును? అను సందేహమును వెలిబుచ్చి దానికి సమాధానముగా ఆయుర్వేదము యొక్క క్రమాగతత్వమును "దీర్ఘం జీవితమన్విచ్ఛన్" అను శ్లోకముతో తెలుపుచున్నాడు జీవితం అనగా శరీర ఇంద్రియ, సత్వ ఆత్మల సంయోగము అట్టి జీవితము చిరకాలము వృద్ధినొందుటకు ఆ శ్లోకమున "కాల" శబ్దములుప్త నిర్దిష్టమైనదిగా తెలుసుకోవలయును ఆది, మధ్య, అంత పదములను లోపించి చెప్పుట ఆచార్యునియొక్క తంత్రశైలి కావున లుప్తము లైనప్పటికిని ఆ శబ్దములు గోచరించును ఉదా "గ్రామ్యానూ పౌదక రసా" (సూ అ 21) అనుచోట మాంసశబ్దము లోపించినది అట్లే "దగ్ధ విద్ధ" అనుచోట విష శబ్దము లోపించినది ఐనను మాంస విషశబ్దములు అచట అన్వయించుకోవలయును అన్విచ్ఛన్ అనగా దీర్ఘజీవితమును కోరినవాడై వెళ్ళెను భరద్వాజ శబ్దము ఇచట గోత్ర నామము "ఉగ్రతపా" అను విశేషము చెప్పుటచే మానవుడైనప్పటికిని భరద్వాజునికి ఇంద్రుని గూర్చి వెళ్ళు శక్తి ఉగ్రతపస్సు వలన గలిగినదని తెలియుట కొరకుగ్రతపా అను విశేషణముఉపయోగించబడినది మరియు శరణ్యమమ శక్తిగా చూపించడినది తపస్సుల యొక్క ప్రభావము అచింత్యమైనది అగస్త్యుడు తపః ప్రభావమువలననే మహాసముద్రమును గూడా ఆపోసనము పట్టగలిగినాడు తపః ప్రభావమున కింత శక్తియున్నప్పుడు తపః ప్రభావముచేతనే భరద్వాజుడు ఆయుర్వేదమును తెలుసుకో వచ్చును గదా అని శంక గలుగవచ్చును గాని అది పొసగదు కారణమేమనగా తపః ప్రభావము కొన్ని నియమితములైన కార్యములను మాత్రమే సాధించగలదు (ప్రతి నియత విషయము) కావున అన్ని స్థలములందు శక్తివంతముగాదు తపఃశ్శక్తి కార్యము వలన ఊహించదగినదిగా యుండును ఆ కారణమున గురువు లేకయే ఆయుర్వేద జ్ఞానము, లక్షణము, కార్యము మొ॥ కలుగుట అసంభవముగాన తపస్సునకు ఆయుర్వేద పరిజ్ఞానమున సామర్థ్యము లేదని మా అభిప్రాయము లేక గురూపదేశ క్రమముననే ఆయుర్వేదజ్ఞానము ఫలించునని తలచి భరద్వాజుడు ఇంద్రునికడ కేగెనని తలచ వచ్చును అటుతరువాత మరియొక ప్రశ్న బ్రహ్మమొదలగు గాగల ఇంద్రుని పూర్వ వైద్యులున్నప్పుడు వారినాశ్రయించక ఇంద్రునే ఎందుల కాశ్రయించెనను శంక గలుగ వచ్చును ఇంతేగాక ప్రధాన గురువునుండిచేయు విద్యాభ్యాసమే యుక్తముగా నుండును శిష్యపరంపరాగతమైన విద్య అసమ్యగ్రహణాది దోషముల వలన పాత్ర పరం పరాగతమైన తేనెవలె క్షీణించవచ్చును అందువలన

శిష్యపరంపరలో చివరివాడైన ఇంద్రుని నుండి గాక పరమగురువైన బ్రహ్మనుండే సాక్షాత్తుగా ఆయుర్వేదజ్ఞానమును పొందవచ్చును గదా! అట్లుగాక ఇంద్రుని నుండే ఎందులకాయుర్వేదమును భరద్వాజుడు గ్రహించి నాడను సందేహముగలుగును ఆ సందేహమునకు సమాధానమును "బుద్ధ్వా శరణ్యమమరేశ్వరం" అనుదానితో చెప్పుచున్నాడు ఇంద్రుని శరణువేడుటకు కారణమేమనగా ఇంద్రుడే స్వతహా అల్పాయువుగలవాడు అల్పాయువుగలవాడే అల్పాయుర్ధాయము గలవారిని రక్షించునట్లు దీర్ఘాయువుగల బ్రహ్మాదులు రక్షించరు ఆ కారణము వలన భరద్వాజుడు ఇంద్రునే ఆశ్రయించెను మరియు రాజు ప్రజారక్షణమున ఎక్కువశ్రద్ధ గలిగియుండునుగాన రాజైన ఇంద్రుడే రక్షణ కలిగించ గలడని చెప్పుటకొరకై ఇంద్రునకీ శ్లోకమున "అమరేశ్వరం" అని విశేషము చెప్పబడినది "దీర్ఘం జీవితమన్విచ్ఛన్" అనగా దీర్ఘజీవితమును కోరినవాడై అనుచోట దీర్ఘమనునది అవ్యవస్థితమగుట వలన అనగా పరిమితి లేకుండుట వలన ఎంత దీర్ఘమైన ఆయువు అనుసంశయము గలుగును ఆయుః ప్రమాణము ఈ యుగమునసరించి నూరు సంవత్సరములు ఇదే విషయము "వర్షశతం ఖల్వాయుషః ప్రమాణమస్మిన్ కాలే" అనగా ఈయుగమున ఆయుః ప్రమాణము నూరు సంవత్సరములని వి స్థా 3వ అధ్యాయమున చెప్పబడినది ఇట్టి ఆయువు కలికాలము ప్రారంభమునకు సంబంధించిన పరమాయుః ప్రమాణము కాలము క్షీణించిన కొలది ఆయువు గూడా క్షీణించును ఈ విషయమునే ఆచార్యుడు విమాన స్థానమున 3వ అధ్యాయమున "సంవత్సరశతే పూర్ణే యాతి సంవత్సరక్షయమ్। దేహినామాయుషః కాలేయత్ర యన్మానమిష్యతే" అనగా ఏయుగమునందైన వంద సంవత్సరములు పరమాయువు ఆయా యుగములందు ఆయుగ ప్రమాణము ననుసరించి నూరవ భాగము గడచినచో ఒక సంవత్సరము ఆయుః ప్రమాణము క్షీణించును అని చెప్పబడినది దీనిననుస రించి పూర్వయుగమునందు మరియు యుగము యొక్క పూర్వభాగమునను ఆయుః ప్రమాణమధికముగా నుండును ఇందుకుదాహరణముగా భగవంతుడైన వ్యాసుని వచనమీవిధముగానున్నది "పురుషాః సర్వసిద్ధాశ్చ చతుర్వర్ష శతాయుషఃకృతే త్రేతాది కేష్వేవం పాదశోహ్రసతి క్రమాత్" అనగా కృతయుగములో 400 సంవత్సరములు ఆయుఃప్రమాణమైయుండగా త్రేతాది అనంతరయుగములందు ఒక్కొక్క పాదము ఆయువు క్షీణించి కలియుగమున వంద సంవత్సరములు పరమాయుః ప్రమాణమై యున్నది అని భగవద్వ్యాసుని వాక్యము మరియు నిట్టి యాయువు కర్మననుసరించి నియతమనియు అనియతమనియు

రెండు విధములుగా నుండును పై రెండింటిలో బలవత్కర్మారబ్ధమైన ఆయువు అనగా ఈ మనుజుడు ఈ కాలమున మాత్రమే మరణించును అని తెలియజేయునది నియతాయువు అబలవత్కర్మారబ్ధమైన ఆయువు అనియమితముగా నుండును అనగా కర్మకంటే బలవత్తరమైన కారణములతో మనుజుడు పరమాయువును పొందక మధ్యకాలముననే మరణించవచ్చును ఉదా హింస, విషము మొదలగు మరణకారణములు బలవంతములగుట వలన నియమితకాలమునకు ముందే మరణించవచ్చును పై చెప్పబడిన అవాంతరములు లేనిచోయుగానురూపమైన ఆయువును పొంది యుగప్రభావము వలన గలుగు ముసలి తనము గలిగి దీర్ఘాయువును పొంది చివరను మరణించవచ్చును అందు వలననే ఇది అనియతాయువని చెప్పబడినది దానికి ఆచార్యుడు చక్కటి ఉదాహరణమును గూడా చూపించినాడు అది ఏమన బండిచక్రము చక్కగా నిర్మించబడినది సక్రమముగా నుపయోగించినపుడు దానికి నియమింపబడిన కాలము వరకు పనిచేసి నియతకాలావసానముననే క్షయించును అట్లుగాక అధిక భారమును మోపుట, ఎత్తుపల్లములుగానున్న దారులందు నడిపించుట, పోగూడని దారులందు నడుపుట, వాహ్య-వాహకదోషములు, తైలమును పట్టించకుండుట మొదలగు కారణముల వలన స్వనియత ప్రమాణ కాలమునకు ముందే అవసానమును పొందును (నశించును) అని వి స్థా 3వ అధ్యాయమున తెలిపినాడు అనియతమైన ఆయువు గలవారు రసాయనమునుపయోగించిన ఆ రసాయన ప్రభావము వలన యుగ ప్రభావ నియతాయువును దాటగలరు ఇదే విషయము "తానియావంతి భక్షయేత్। జీవేద్వర్షసహస్రాణి తావంత్యాగతయౌవనః" (చ చి స్థా అ1) అనగా చికిత్సా స్థానమున రసాయన ప్రయోగ సందర్భమున, రసాయనమును ప్రయోగించినచో అనేక సంవత్సరములు (వేయి అను శబ్దమునకు ఇచట నూరు అనుదానికి ప్రయోగింపబడినది) జీవించునని చెప్పబడినది బలవత్కర్మ నియతమైన ఆయువును మాత్రము ఏ ఉపాయముచేతను దాటుటకు వీలుకాదు విమానస్థానమున "కర్మకించిత్ క్వచిత్కాలే విపాక నియతం మహత్। కించిత్వకాల నియతం ప్రత్యయైః ప్రతిబుధ్యతే" (వి అ3) అనగా కొన్ని కర్మలు నియతమైన కాలమున విపాకమునొందును మరికొన్ని కర్మల ၊ నియత విపాక కాలములేదు ఇట్టి నియత విపాకములేని కర్మలను ప్రతీకారష ద్వారా తొలగించవచ్చును ఇట్లు అన్ని విషయములందు అనగా జీవించియుండుటకు, మరణించుటకు, వ్యాధికి, వ్యాధిశమనమునకు అన్నింటికి కర్మయే కారణమగు

నపుడు అట్టి కర్మజన్యమైన ఫలమునను సరించి వచ్చు వ్యాధులలో ఆయుర్వేదము వలన గలుగు ప్రయోజనమేమి? అదెట్లనగా కర్మనియతమైనపుడు అచట ఆయుర్వేదము యొక్క ప్రవృత్తిలేదు (అవసరమే లేదు) ఆయువునియత కర్మను అనుసరించి యున్నచో విషములు మొదలగునవి ప్రయోగించబడినప్పటికిని అవి ఆయువు నియతమగుట వలన ఆ నియతకాలము వరకు మరణమును గల్గించక విఫలము లగును ఒకవేళ అబలవత్కర్మారబ్దమగుట వలన ఆయువుఅనియతమని చెప్పినచో అదిగూడా సరిసోదు అదృష్టమైన కర్మశక్తిని నశింపచేసి దృష్టములైన విషాదులు మరణమును గల్గించుట కనపడుచున్నప్పటికిని వివాదాస్పదమైన నీ విషయమున అదృష్టమే కారణమని తెలియుచున్నది అదెట్లనగా దృష్టములైన విషాదులు అదృష్టమైన కర్మచేతనే ఆకర్షించబడి మరణమును గల్గించుచున్నవి కావున కర్మయే జనన మరణాదులకు, వ్యాధి, వ్యాధిశమనమునకు కారణములుగావచ్చును అని పూర్వపక్షము కాని అది సరికాదు అన్నింటికి కర్మయే కారణమనియన్నచో అన్ని అనుష్ఠానములు నిరర్థకములగును మరియు కేవల కర్మవాదులు (కర్మయే కారణమనువారు) దృష్టములైన వాటిని అంగీకరించకపోయినచో దృష్టజన్యములైన అదృష్టకర్మ ఫలమును గూడా పొందరు కారణమేమనగా అదృష్టమైన కర్మఫలము గూడా అగ్నిష్టోమము మొదలగు దృష్టకర్మల నుండియేనుద్భవించును ఇట్టి దృష్టము లైన అగ్నిష్టోమాది కర్మలు కర్మవాదులంగీకరించినవే అందువలన అదృష్టమైన కర్మకు దృష్టములైన అగ్నిష్టోమాదులే కారణములని కర్మవాదులయభిప్రాయము అదే న్యాయమునను సరించి దృష్టములైన దహనము మొదలగునవి చలినిబోగొట్టుట, బొబ్బలు మొదలగునవి గలిగించునని అంగీకరించవచ్చును మరియు కేవల కర్మవాదులకు దృష్టమైన కారణమునందు వ్యాప్తి గ్రహణము లేకుండుట వలన అదృష్టానుమానమే గలుగదు అందువలన దృష్టము, అదృష్టము రెండు కారణములే వాటిలో కొన్ని అదృష్టములైన కర్మలు దృష్టములైన విషాదులచే బాధింపబడును కొన్ని దృష్టకర్మలు అదృష్టకర్మచే బాధింపబడును వాటిలో ఏ వ్యక్తియందు నియతమరణము నకు కారణమైన బలవత్కర్మ రూపమైన అదృష్టము కారణమో అట్టి వ్యక్తియొక్క జీవితమునకు, మరణమునకు సంబంధించిన విషయములో ఆయుర్వేదము అకించిత్కరము (ఏమీపనిచేయదు) కాని అట్టి వ్యక్తియందు సైతము నియత మరణ కాలమునకు పూర్వము దుఃఖమును గల్గించు వ్యాధిశమనము గల్గించుటలో ఆయుర్వేదము తోడ్పడును అది (వ్యాధి) కూడా నియతకర్మజన్యమైనది గానపుడే

ఆయువు అనియత కర్మవిపాకజన్యమైనపుడు మాత్రము అట్టి వానికి వచ్చు వ్యాధి, మరణములకు ఆయుర్వేదము ఉపయోగకారిగానేయుండును యుగ నియతమైన ఆయువేదైతే గలదో అట్టివానికి గలుగుకర్మ విపాకము రసాయన ప్రయోగమువలన తగ్గుచున్నది అందువలన అది ఎక్కువబలమైన కర్మతో నియమితమైన కర్మగాదని అనుమానించవలసి యున్నది అట్టి వాటికి స్వస్థహితము, ఆతురహితమూనైన చికిత్స ఉపయోగించదు ఇట్టి వాదము శాస్త్రకారునిచే స్వయముగా వివరించబడవలసి యున్నదిగాని ఇచ్చట వివరించబడలేదు

మూ। బ్రహ్మణాహి యథాప్రోక్త మాయుర్వేదం ప్రజాపతిః।
జగ్రాహ నిఖిలేనాదా అశ్వినౌతు పునస్తతః॥ 4

అశ్విభ్యాం బగవాన్ఛక్రః ప్రతిపేదేహ కేవలమ్।
ఋషిప్రోక్తో భరద్వాజస్తస్మాం చక్రముపాగమత్॥ 5

**తాత్పర్యము** సకల వేదములను "యస్యనిశ్వసితావేదాః, అనునభియుక్తోక్తి ప్రకారము నిశ్వాసరూపముగ బైట వెడలించి బ్రహ్మదేవుని వలన దక్షప్రజాపతి మొట్టమొదట బ్రహ్మఎట్లు పదేశించెనో అందులేశమైనను - వికారాంతరము లేక పూర్తిగ యథాతథముగ గ్రహించెను పిదప అశ్వినీకుమారులు బ్రహ్మదక్షునకుపదేశించిన దానిని న్యూనాతిరేకములు లేక ఆయుర్వేదమును గ్రహించిరి అటుతరువాత ఇంద్రుడు అశ్వనీదేవతల నుండి సంపూర్ణముగ ఆయుర్వేద శాస్త్రమును గ్రహించెను అట్టి ఇంద్రునినుండి అంగీరసుడు మొదలగు ఋషులచే ప్రేరేపించబడిన వాడైన భరద్వాజుడు పైచెప్పబడిన దీర్ఘంజీవితమునందిచ్చగలవాడై ఆయుర్వేదమును నేర్చుకొనుటకు ఇంద్రునివద్దకేగెను

చ పా వ్యా ఆం అ బ్రహ్మాదులుండగా ఇంద్రునేశరణుజొచ్చుటకు కారణమును "బ్రహ్మణాహి" అనుశ్లోకములో చెప్పుచున్నాడు 'హి' ఏకారణము వలన అని అర్థమున ప్రయోగించబడినది ప్రజాపతియనునది దక్షునికిగల పేరు ప్రోక్తం అనగా ప్రకర్షతో చెప్పబడినది అని అర్థము (ప్రకర్ష అనగా నిఃశేషముగా చెప్పబడినది అని అర్థము ) శ్లోకమున చెప్పబడిన "యథా" అను శబ్దము తథా అను శబ్దముతో నిత్యసంబంధము గలదగుట వలన ఏ విధముగా చెప్పబడినదో ఆ విధముగా గ్రహించెనను అర్థము నిచ్చును నిఖిలేన అనగా నిఃశేషముగా, అటు తరువాత ప్రజాపతి నుండి అశ్వినీ దేవతలిరువులు గ్రహించిరి ప్రజాపతి నుండి అశ్వినీదేవతలు గ్రహించినపుడు కూడా ప్రజాపతి ఉపదేశించిన దానిని యథాతథముగా నిఃశేషముగా అశ్వనీదేవతలు

గ్రహించినారని అనుకోవలయును ఇట్లే అశ్వనీదేవతల నుండి భగవంతుడైన ఇంద్రుడు గ్రహించినపుడు కూడా ఉపదేశించిన దానిని యధాతధముగా నిఃశేషముగా అశ్వనుల నుండి ఇంద్రుడు గ్రహించినాడని అనుకొనవలయును "భగవాన్ చక్రః ప్రతిపేదేహ కేవలం" అను వాక్యమునందలి 'హ' అవధారణార్థమున ప్రయోగించ బడినది దీనిననుసరించి ఇంద్రుడు ఆయుర్వేదశాస్త్రమును పొందినాడేగాని ఎవరికీ ఆయుర్వేదమునివ్వలేదని అర్థము పైజెప్పిన క్రమాగతత్త్వమును పరిశీలించిన బ్రహ్మకెటువంటి ఆయుర్వేదజ్ఞానము గలదో ఇంద్రునికి కూడా అటువంటి జ్ఞానమే ఆయుర్వేదమున గలదని బ్రహ్మనుండి ఇంద్రుని వరకు వచ్చిన ఆయుర్వేదములో ఏ మాత్రము లోపము లేదని తెలుపబడినది కావున బ్రహ్మనుండి ఆయుర్వేదమును నేర్చుకొన్నను లేక ఇంద్రునినుండి నేర్చుకొన్నను తేడా ఏమియు లేదు ప్రయోజన భేదము కూడా ఉండదు ఐతే ఇంద్రుని శరణువేడుటలో ఒక విశేషమున్నది అదేమన ఇంద్రుడు తను నేర్చిన విద్యను ఉపదేశించుటకై శిష్యులను వెదకుచుండెను కారణమేమనగా "యోహిగురుభ్యః సమ్యగాదాయ విద్యాంనప్రయచ్ఛత్యంతేవాసిభ్యఃసఖల్వృణీ గురుజనస్య మహదేనోవిందతి" అనగా ఎవడైతే గురువుల నుండి చక్కగా విద్యాభ్యాసము చేసి దానిని శిష్యులకీయగలడో అతడు గురువులకు ఋణపడి యుండును అని శాస్త్రమున గలదు అందువలన ఇంద్రుడు తాను నేర్చిన విద్యను ఉపదేశించుటకు శిష్యాన్వేషిగా ఉన్నాడు గావున బ్రహ్మమొదలైన వారిని గాక ఇంద్రునే భరద్వాజుడు శరణ్యుడుగా భావించెను బ్రహ్మ పరమగురువు గాన అతనికి అన్ని వేదములు తెలిసినవే గావునను అన్ని విషయములందు పరిపూర్ణ పరిజ్ఞానము గలవాడగుట వలనను ఆయుర్వేద జ్ఞానము గూడా స్వతఃసిద్ధముగానే బ్రహ్మకు గలిగినది గావున బ్రహ్మకు ఇంకొక గురువు అవసరము లేదు పై జెప్పబడిన నీ పరంపర ఆయుర్వేదమునకు గల తృటిరహితమైన అవతరణ క్రమమును, బ్రహ్మ ఇంద్రునివంటి మహాపురుషుల చే సేవించబడుటవలన ఉపాదేయత్వమును (గ్రహించతగినది) సూచించుచున్నది ఇదే విషయమును "తత్రయన్మన్యేత మహాద్యశస్వి సుధీర పురుషాసేవితమ్" అని మొదలగుకొని "తదభిప్రపద్యేతశాస్త్రమ్" (వి సా అ8) అను వరకు చెప్పబడినది "ఋషిప్రోక్తః" ముందుచెప్పబడు ఋషులచే చెప్పబడినవాడై అని అర్థము, తస్మాత్ అనగా ఆకారణము వలన ఇంద్రుడే శరణువేడగలవాడని ఇంద్రుని కడకేగెను అని అర్థము

మూ॥ విఘ్నభూతాయదా రోగాః ప్రాదుర్భూతాః శరీరిణామ్।
తపోపవాసాధ్యయన బ్రహ్మచర్యవ్రతాయుషామ్॥ 6

తదాభూతేష్వనుక్రోశం పురస్కృత్య మహర్షయః।
సమేతాః పుణ్యకర్మాణః పార్శ్వే హిమవతః శుభే॥ 7

తాత్పర్యము శరీరమనగా తనంతట తానే కొంతకామునకు చెడిపోవు స్వభావముగల దేహము అట్టి శరీరమును ధరించిన ప్రాణులకు తపోరూపములగు చాంద్రాయణాదుల నాచరించుటకును (పాపములకు కారణములగు కామక్రోధాదుల విసర్జించి సత్వాది గుణములనవలంభించుట) వేదముల పఠించుటకును, బ్రహ్మచర్యమునకు (మోక్షాసక్తిచే స్త్రీసేవాదులవర్జించుట) వ్రతాది నియమములకును విఘ్నములు గల్గించు రోగములు బయల్వెడలి బాధించుచున్న సమయమున చెప్పబోవు అంగీరసుడు మొదలగు మహర్షులు జంతువుల విషయమై కృత్రిమమగు దయగలవారై వారు పుణ్యకర్మల నాచరించు స్వభావముగువారగుట వలన హిమాలయ పర్వత ప్రాంతమున నొక శుభ్రమైన ప్రదేశముననొక సభచేసిరి

చ పా వ్యా ఆ అ ఋషి ప్రోక్తమైన నీ ఆయుర్వేదము మర్త్యలోకమునకు ఎట్లు వచ్చినదను దానికి కారణమును "విఘ్నభూతా" అను రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు విఘ్నభూతాః అనగా అంతరాయమును గలిగించునవైన, రోగాః అనగా బాధను గలిగించునవి రోగములు అని యర్థము "ప్రాదుర్భూతాః" అనగా ఆవిర్భవించినవి అని అర్థము ఇట్టి రోగప్రాదుర్భావము కృతయుగాంతమున జరిగినదని తెలుసుకో వలయును ఇదే విషయమును ఈ గ్రంథమున ముందు (భశ్యతి తు కృతయుగే (వి స్థా అ 3) అని జనపదోధ్వంసమున రోగప్రాదుర్భావము చెప్పబడినది ఇచ్చట చెప్పబడిన ప్రాదుర్భావము గూడా ఇంతకుముందు ఉత్పన్నమైన వాటియొక్క ఆవిర్భావమే దీనిననుసరించి అర్థేదశమహామూలీయమున (సూ అ 30)చెప్పబడు రోగ సంతాన నిత్యత్వము గూడా విరుద్ధముగాదు శరీరిణాం అనగా శీర్యత ఇతి శరీరం అను వ్యుత్పత్తిననుసరించి నశించు స్వభావముగలది శరీరము అది గలవారు 'శరీరి' అని పిలువబడుదురు ఈ శబ్దప్రయోగముననుసరించి స్వతహాగానే నశించు స్వభావము గల శరీరము రోగ సంబంధమువలన మిక్కిలి నశించునది అని తెలుపు చున్నాడు అటుతరువాత "విఘ్నాభూతాయదా" అను శ్లోకములో రోగములు వేటికి విఘ్నభూతములు? అని చెప్పుచున్నాడు రోగగ్రస్తులైన శరీరములు గలవారు వికారములు గల్గియుండుట వలన తపస్సు మొదలగు వాటినాచరించుటకు సామర్థ్యము గలవారుగా

నుండరు ఇచట తపస్సనగా చాంద్రాయణము మొ॥నవి ఉపవాసమనగా క్రోధము మొ॥ వాటిని విడచిపెట్టుట, సత్యము మొ॥ వాటిని ఆచరించుట ఇందుకు ప్రమాణము "ఉపావృత్తస్యపాపేభ్యః" సహవాసో గుణేహియః। ఉపవాసః సవిజ్ఞేయో నశరీరస్య శోషణమ్॥ పాపములనువదలి సద్గుణములందు సంచరించుట ఉపవాసము అంతేగాని శరీర శోషణము ఉపవాసము గాదు అని అర్ధము అధ్యయనం అనగా వేదాధ్యయనము, బ్రహ్మచర్యమనగా మోక్షమున కొరకైన స్త్రీసేవ నుండి విరమించుకొనుట మొదలగు నవి వ్రతమనగా కోరికలు సిద్ధించుకొనుటకై చేయునియమము అయువు అనునది ఇంతకుముందే చెప్పబడినది ఇచట తపోపవాసః అను ప్రయోగము పూర్వత్రాసిద్ధవిధి అనిత్యమగుట వలన "తపస్" శబ్దమునందలి సకారమునకు స్థానిభూతమైన యకారము లోపించుట వలన "తపోపవాసః" అని సిద్ధించినదిగా తెలియవలెను ఉదా "నో పధాయాః" అనుసూత్రము (పా అ 6 పా4 సూ7) భూతేషు = ప్రాణులందు, అనుకంపాం = దయను, (ధాతువులకనేకార్ధములు గలవు గావున), పురస్కృత్య = పురస్కరించుకొని (ఆదరించి), దీనిననుసరించి ప్రాణులయొక్క రోగములను బోగొట్టుటయే మహర్షులు ఆయుర్వేదమును ఆశ్రయించుటకు ఫలము ఆయువును పెంపొందించుట ద్వితీయ ఫలము మాత్రమేయని భావము మానవుల వ్యాధులనుబోగొట్టుటకై అని ప్రయోగించవలసియుండగా "భూతేషు" అని ప్రాణి మాత్రులను తెలుపుట వలన సమానజీవులందు మాత్రమే దయగలుగుట గాదు సర్వప్రాణిహితమును మహర్షులు ఆకాంక్షించిరి అని చెప్పబడినది దీనివలన ఋషులకు గల సమాన భావము తెలుపబడినది మహర్షులు అనగా మహాత్ములైన ఋషులు, దీనిననుసరించి నాల్గువిధములైన ఋషులు గలరు వారు ఋషికులు, ఋషిపుత్రులు, దేవర్షులు, మహర్షులు మహర్షులననుసరించిన వారగుటచేత ఋషికాదులు గూడా గ్రహించబడుదురు, పుణ్యకర్మాణః పవిత్రములైన కర్మలు చేయువారు (గలవారు), పార్శ్వం అనగా పర్శుకలచేత వ్యాప్తమైన భాగము, అటువంటిదే పర్వత పార్శ్వము (పర్వతము యొక్క ప్రక్క భాగము), శుభే అనగా చేయదగు పుణ్యకార్యమునకు అనువైన పవిత్రప్రదేశమునందు, శుభమైన (పవిత్రమైన) ప్రదేశమునందే సమాధి మొదలగునవి సిద్ధించునుగాన పవిత్రదేశమునందే ఋషులు సమావేశమైరి అని భావము

మూ॥ అంగిరా జమదగ్నిశ్చ వశిష్ఠః కశ్యపోభృగుః।
ఆత్రేయో గౌతమః సాంఖ్యః పులస్త్యోనారదోఽసితః॥ 8

అగస్త్యోవామదేవశ్చ మార్కండేయశ్వలాయనౌ।
పారిక్షిర్భిక్షురాత్రేయో భరద్వాజః కపింజ(ష్ఠ)లః॥ 9

విశ్వామిత్రాశ్మరథ్యోచ బార్గవశ్చ్యవనోఽభిజిత్ ।
గార్గ్యః శాండిల్య కౌండిల్యో(నౌ) వార్క్షిర్దేవల గాలవౌ॥ 10

సాంకృత్యో బైజవాపిశ్చ కుశికోబాదరాయణః।
బడిశః శరలోమాచకాప్యకాత్యాయనావుభౌ॥ 11

కాంకాయనః కైకశేయో ధౌమ్యోమారీచకాశ్యపౌ।
శర్కరాక్షోహిరణ్యాక్షో లోకాక్షః పైంగిరేవచ॥ 12

శౌనకః శాకునేయశ్చ మైత్రేయో మైమతాయనిః।
వైఖానసావాలఖిల్యాస్తథాచాన్యే మహర్ష యః॥ 13

బ్రహ్మజ్ఞానస్య నిధయో ద(య)మస్య నియమస్యచ।
తపసస్తే జసాదీప్తా హూయమానా ఇవాగ్నయః॥ 14
సుఖోపవిష్టాస్తే తత్ర పుణ్యాం చక్రుః కథామిమామ్॥

తాత్పర్యము బ్రహ్మజ్ఞానమునకును, దమము (ఇంద్రియనిగ్రహము)నకును, నియమమునకును, తపస్సునకును, నిధులవలెప్రధాన స్థానమున నున్న వారును, హోమము చేయబడు అగ్నులవలె, బ్రహ్మతేజస్సుచే ప్రకాశించు చున్నవారును, అగు అంగీరసుడు, జమదగ్ని, వశిష్ఠుడు, కశ్యపుడు, భృగువు, ఆత్రేయుడు, గౌతముడు, సాంఖ్యుడు, పులస్త్యుడు, నారదుడు, రసితుడు, అగస్త్యుడు, వామదేవుడు, మార్కండేయుడు, ఆశ్వలాయనుడు, పారిక్షి భిక్షువను నామాంతరముగల ఆత్రేయుడు, భరద్వాజుడు, కపింజలుడు, విశ్వామిత్రుడు, అశ్మరథ్యుడు, భార్గవుడు, చ్యవనుడు అభిజిత్తు, గార్గ్యుడు, శాండిల్యుడు, కౌండిల్యు(న్యు)డు, వార్క్షి, దేవలుడు, గాలవుడు, సాంకృత్యుడు, బైజవాపి, కుశికుడు, బాదరాయణుడు, బడిశుడు, శరలోముడు, కాప్యుడు, కాత్యాయనుడు, కాంకాయనుడు, కైకశేయుడు, ధౌమ్యుడు, మారీచి, కాశ్యపుడు, శర్కరాక్షుడు, హిరణ్యాక్షుడు, లోకాక్షుడు, పైంగి, శౌనకుడు, శాకునేయుడు, మైత్రేయుడు, మైమతాయని, వైఖానసులు, వాలఖిల్యులు మరియు ఇతర మహర్షులు పలువురు పై పేర్కొనబడిన హిమవత్పర్వత ప్రాంతమునందలి పవిత్ర ప్రదేశమున సుఖముగ నొక్కచో గూర్చుండి చెప్పబోవు పుణ్యకథను ప్రసంగించిరి

చ.పా వ్యా ఆం అ హిమవత్పర్వత ప్రాంతమున సమావేశమైన మహర్షులెవరు అను దానికి "అంగీరా " అను మొదలగు శ్లోకములందు సమాధానము చెప్పుచున్నాడు అనేక మంది మహర్షులను గ్రంధప్రారంభమున స్తుతించుట (ఉట్టంకించుట) పాపక్షయమని ఎంచుట ఒక అర్థము మరియు ఇట్టి మహర్షులచే సేవించబడిన దగుట వలన అది తప్పక సేవించదగినదని తెలుపుట మరియొక అర్థము ఈ పై జెప్పబడిన మహర్షులలో కొందరు శాలీనులు, కొందరయోనిజులు, కొందరు యాయావరులు ఈ విధమైన అందరు ఒకచోట కలిసినారని తెలుసుకోవలయును, ఇచ్చటగల రెండవ ఆత్రేయునికి గల భిక్షువిశేషణము "తన్నేతిభిక్షు రాత్రేయః (సూ స్థా అ 25) అను ఆత్రేయుని సూచించుచున్నది వైఖానసులనికర్మ విశేషమును సూచించు సంజ్ఞ వాలఖిల్యులనగా హ్రస్వములైన ఆకారములుగల ఋషులు, నిధయః తరగని సంపద (జ్ఞాన) గలవారు, దమః = ఇంద్రియ నిగ్రహము, ఇమాం అనగా చెప్పబోవు కధను అని అర్థము

మూ॥ ధర్మార్థకామమోక్షాణా మారోగ్యం మూలముత్తమమ్॥ 15
రోగాస్తస్యాపహర్తారః శ్రేయసోజీవితస్య చ॥
ప్రాదుర్భూతోమనుష్యాణామంతరాయో మహానయమ్॥ 16
కస్స్యాత్తే షాంశమోపాయ ఇత్యుక్త్వా ధ్యానమాస్థితాః।
అధతేశరణం శక్రం దదృశుర్ధ్యానచక్షుషా॥ 17
సవక్ష్య శమోపాయం యధావదమర ప్రభుః

తాత్పర్యము ధర్మార్థకామమోక్షములకు శరీరము ధాతుసామ్యరూపమైన ఆరోగ్య స్థితిలో నుండుట ప్రధాన కారణము (రోగ బాధితుడైనవాడు పైజెప్పబడిన పురుషార్థము లను సాధింపలేడు కావున ఆరోగ్యము ప్రధానకారణమని భావము) అట్టి ఆరోగ్యమును రోగములు అపహరించునవి (రోగములు వ్యాపించినపుడే ఆరోగ్యము చెడును కావున దానినపహరించునవి రోగములని చెప్పబడినది) అంతేగాక ధర్మాది శ్రేయస్సును సకలప్రాణులకు సర్వదా ముఖ్యాభిలాషితమైన జీవితమును గూడా అపహరించునవి రోగములు అట్టి రోగములు వ్యాపించుట వలన మనుష్యులకుపై చెప్పిన పురుషార్థము లను సంపాదించుటకు గొప్ప విఘ్నము సంభవించినది కావున నీ రోగములను శమింపచేయు నుపాయమేది? అని ఋషులందరు ఆ విషయమునే నిశ్చలచిత్తముతో యోచించిరి కొంతసేపటికి ధ్యానరూపమైన జ్ఞానదృష్టిగరిమచే పై జెప్పిన రోగశమనోపాయ

నిమిత్తమై ఇంద్రుడు రక్షకుడని తెలిసికొనిరి అట్టి రోగశమనోపాయమును ఇంద్రుడు చెప్పగలడని నిర్ణయించిరి

చ పా వ్యా అం అ ధారణాద్ధర్మః అనువ్యుత్పత్తిచే ధరించునది ధర్మము ఇది ఆత్మతో కూడినదై కార్యదర్శనముతో అనుమానించతగినదిగా నుండును (అనగా ఆచరించ బడునది, కార్యానంతరము ఫలముతో అనుమానించదగినది) అర్థః సువర్ణము మొ॥ కామమనగా స్త్రీ పరిష్వంగము (కూడిక) మొ॥ వాటిపై కోరిక, మోక్షః = సంసారము నుండి విముక్తి, ఆరోగ్యం = రోగములేకుండుట వలన నుండు ధాతుసామ్యము, మూలం = కారణము, ఉత్తమం = ప్రధాన(కరణ)ము దీనిననుసరించి ధర్మార్థ కామమోక్షములను చతుర్వర్గ ప్రాప్తికి ఆరోగ్యము ప్రధానకారణమని తెలియుచున్నది కారణమేమనగా రోగాక్రాంతుడైన వాడు ఒకప్పుడు గూడా పురుషార్థములను సాధించుటకు సమర్థుడుగాలేడు గావున ఆరోగ్యము పురుషార్థ సాధనకు ప్రధాన కారణముగా నున్నది తస్యాపహర్తారః = ఆరొగ్యమును అపహరించునవి, రోగములకు గల నీ ఆరోగ్యమునపహరించు భావము పురుషార్థములను సంపాదించుటకవ రోధమగును వ్యాధి ఒకసారి ఉద్భవించినచో అది ఆరోగ్యమునపహరించదు అని చెప్పలేము రోగములారోగ్యము నపహరించుట వలన అనర్థము గలుగును భావా భావములు ఒకదానికొకటి ప్రభావములగుట వలన ఉత్పన్నములైన రోగములు పశ్చాత్కాలమున ఆరోగ్యములనపహరించవు ఐతే ఉత్పన్న మాత్రముననే ఆరోగ్యమునపహరిచును అందువలన రోగభావము ఆరోగ్య అభావమునకు కారణము అది చతుర్విధ పురుషార్థసిద్ధికవరోధము "శ్రేయసోజీవితస్యచ" అనగా శ్రేయోవంతమైన జీవితము హిత, సుఖరూపమైనదని అర్థేదశమహామూలీయమను (సూ అ-30) అధ్యాయమున చెప్పబడును అట్టి జీవితమును రోగములపహరించును అని అన్వయించు కోవలయును శ్రేయోరూపముగాని జీవితము అహితమైనదగుటవలన దుఃఖము కల్గించునదిగాన అట్టి జీవితము గ్రాహ్యముగాదని ఎంచి దానినపహరించుట చెప్పబడలేదు ఈ శ్లోకములందు సుఖము, హితమునునైన జీవితముయొక్క ఉపఘాతము ధర్మము మొదలగు వాటి ఉపఘాతమువలననే లభించినవి అందు వలననే సామాన్యముగా అభ్యుదయ వాచకమైన శ్రేయః శబ్దముచేత ధర్మార్థ కామమోక్షములు చెప్పబడును జీవిత శబ్దముచేత కేవలము జీవితము మాత్రము చెప్పబడును కారణమేమనగా జీవితము స్వరూపతః అన్ని ప్రాణులలో ఉపాధి రహితమైన ఉపాదేయమగుచున్నది ఇందుకు ప్రమాణము "ఆచక్రమేచ బ్రహ్మాణ

ఇయమాత్మా" ఆశీః - ఆయుష్మన్ భూయాసమ్, అనగా బ్రహ్మాదైన ఈ ఆత్మ ఆశీస్సులనిచ్చినది దీనితోనేనాయుష్మంతుడనగుచున్నాను అనగా ఇచట ఆత్మ బ్రహ్మతత్వముగానని రుపాధియైనది అది ఉపాదేయముగూడా అత్యంత దుఃఖముచే పీడితుడైనవాడు జీవితమును త్యజించు సందర్భమున అచట దుఃఖమును బోగొట్టుకొనుట కన్యధా ఉపాయము లేనపుడు ప్రియమైన జీవితమును త్యజించునే గాని స్వరూపతః జీవితమును గాదు అంతరాయః = ధర్మ అర్థ, కామ, మోక్షములను సాధనమునందంతరాయము అయం అనగా రోగప్రాదుర్భావము (ధర్మము మొదలగు నవి సాధించుటకంతరాయము గల్గించును, తేషాం అనగా ఆరోగముల యొక్క శమనోపాయము) శరణం = రక్షించువాడు, శక్రః అనగా శకృత్వాత్ శక్రః అను వ్యుత్పత్తిననుసరించి సామర్థ్యముగలవాడు (రక్షించుటయందు) ధ్యానం అనగా సమాధివిశేషము, అట్టి సమాధిని ఉపలబ్ధికి సాధనమైన నేత్రము (చక్షు) ధ్యాన చక్షువు అట్టి ధ్యాన చక్షువుద్వారా ఇంద్రుని చూచిరి

**భరద్వాజుడు ఇంద్రుని కడకేగుట**

మూ। కః సహస్రాక్ష భవనం గచ్ఛేత్ ప్రష్టుంశచీపతిమ్॥ 18
అహమర్థేనియుజ్యేయ మత్రేతి ప్రథమం వచః।
భరద్వాజోఽ బ్రవీత్తస్మాదృషిభిః సనియోజితః॥ 19
సశక్రభవనంగత్వా సురర్షిగణమధ్యగమ్।
దదర్శబలహంతారం దీప్యమానమివానలమ్॥ 20
సోభిగమ్యజయాశీర్భిరభినంద్య సురేశ్వరమ్।
ప్రోఽవాచవినయాద్ధీమానృషీణాం వాక్యముత్తమమ్॥ 21
వ్యాధయోహిసముత్పన్నాః సర్వప్రాణిభయంకరాః!
తద్బ్రూహిమేశమోపాయం యధా వదమరప్రభో॥ 22
తస్మైప్రోవాచ భగవానాయుర్వేదం శతక్రతుః।
పదైరల్పైర్మతిం బుద్ధ్వా విపులాం పరమర్షయే ॥ 23

**తాత్పర్యము** అంగీరస్సు మొదలగు మహర్షులందరు హిమవత్పర్వతపార్శ్వమున రోగశమనోపాయమును చెప్పనర్హుడు ఇంద్రుడని నిర్ణయించి, పిదప శచీదేవితో క్రీడా సక్తుడగు నింద్రునియాస్థానమునకు "నన్నుబంపుడ"ని తొలుతజెప్పువాడెవడని సభవారి నడుగ భరద్వాజుడు "నన్ను నియోగించిన నేను పోగల"నని చెప్పెను కావున ఋషు లందరునుజేరి యాభరద్వాజుని నియోగించిరి పిమ్మట నా భరధ్వాజుడు

ఇంద్రభవనమునకు బోయి దేవర్షిగణ పరివేష్టితుడు బలాసురుని సంహరించినవాడును, జ్వలించుచున్న అగ్నివలె దివ్యతేజస్సుచే ప్రకాశించుచున్న ఇంద్రునిగాంచి సమీపమున నభిముఖుడై జయజయశబ్దములతో అభినందన పూర్వకముగా నాశీర్వదించి సకల ప్రాణులకును మిక్కిలి భయంకరములగు రోగములు సంభవించి జనుల బాధించు చున్నవి అట్టి రోగములు శమించుటకు తగునుపాయము చెప్పుమని తనకు ఋషులు చెప్పిన విధమున అమరాధిపతినడిగెను

భరద్వాజుడడగగా శతక్రతువులు చేసిన ఇంద్రుడు భరధ్వాజుని యొక్క బుద్ధి మిక్కిలి విపులమైనదని తలచి సూక్ష్మరూపమున ఆయుర్వేదమంతయు పరమర్షియైన భారద్వాజునికీక్రింది విధముగా నుపదేశించెను

చ పా వ్యా ఆం అ పై చెప్పిన మహర్షులలో భరద్వాజుడు ఇంద్రుని గూర్చి ఎట్లు వెడలెను అను విషయమును "కః సహస్రాక్షభవనం" అను శ్లోకములలో చెప్పుచున్నాడు "శచీపతిం" అను శబ్దముతో శచీదేవితో కలిసియున్నప్పుడు సైతము నేను ఇంద్రుని ఉపాసించగలను అని భరద్వాజుడు తెలుపుచున్నాడు (ఇంద్రుడు ఏకాంతమున నున్నప్పుడు గూడా భరద్వాజుడు ఇంద్రునికడకేగగల స్వాతంత్ర్యముగల వాడు అని అర్థము) అర్థే = రోగములు రాకుండాజేయునుపాయమును కనుగొనుట అను ప్రయోజనమున, నియుజ్యేయం = నియోగించదగినవాడిని, అత్ర అనగా ప్రస్తుత ప్రయోజనమున, ఇచట "ఇతి" అను శబ్దము "ఏకారణము వలననగా" అను అర్థమున ప్రయోగించబడినది ఉదా "సుభిక్షమిత్యాగతః" అనుచోట 'ఇతి' అను శబ్దము సుభిక్షముగా నుండుట వలన ఇచటికి వచ్చితిని అని "ఇతి" కారణమును బోధించుచున్నది అట్లే ప్రకృతమున గూడా "ఇతి" శబ్దము కారణమును బోధించు చున్నది "నియోజితః" అనుచోట 'చేరాది రోణిచ్" అని ణిచ్ వచ్చుట ద్వారా "నియోజితః" అను శబ్దము నిష్పన్నమైనది అంతేగాని హేత్వర్థమునగాదు పైజెప్పిన దానిననుసరించి భరద్వాజుడు ఆయుర్వేదమును గొనితెచ్చుటయందు విశేషమైన అభిలాష గలవాడగుటచే అతనిని ఎవరూ ప్రేరేపించలేదని తెలుపబడినది ప్రోవాచ అనగా బాగుగా పలికెను అని అర్థము అంతేగాని 'ప్ర' శబ్దము విపులార్థమును బోధించి చాలా చెప్పెను అని అర్థముగాదు ఎందుకనగా ముందు అల్ప శబ్దములచే బోధించెను అని చెప్పబదినదిగాన 'ప్ర' శబ్దము విపులముగా అనిగాక బాగుగా చెప్పెను అని అర్థమునిచ్చును అల్ప పదములచే నేలనుపదేశించెను అను దానికి "మతిం బుద్ధ్వావిపులామితి" అని సమాధానము చెప్పుచున్నాడు భరద్వాజుడు విపులమతి

గలవాడు (విశాలమైన బుద్ధిగలవాడు (సూక్ష్మగ్రాహి) గనుకనే కొద్దిమాటలలో చెప్పినను సంపూర్ణముగా గ్రహించగలమేధాశక్తిగలవాడు గనకనే అల్ప పదములతో ఆయుర్వేదము నుపదేశించెను బుద్ధిగూడా శుశ్రూషాగ్రహణధారణ ఊహాపోహములందు మిక్కిలి నిపుణమగుట వలన నది విపులమని చెప్పబడును మరియు దివ్యదృష్టిచేత ఇంద్రుడు భరద్వాజుని అభిప్రాయమును ముందే తెలుసుకొని ఆయర్వేదమునుపదేశించినాడు అందువలన భరద్వాజుడింద్రుని అడిగినట్లుగా చెప్పబడలేదు లేక భరద్వాజుడడిగినను గ్రంథవిస్తరణభీతిచే నిచట వ్రాయబడలేదు

మూ। హేతులింగౌషధ జ్ఞానం స్వస్థాతుర పరాయణమ్।
త్రిసూత్రం శాశ్వతంపుణ్యం బబుధేయం పితామహః॥ 24

**తాత్పర్యము** స్వస్థులకు, రోగగ్రస్తులకు, మిక్కిలి ఉపయోగకారియైనదియు శాశ్వతమైనదియు (త్రికాలాబాధితమైనదియు), పుణ్యప్రదమైనదియు మరియు బ్రహ్మచే స్మరింపబడినదియు ఐన ఆయుర్వేదమును, హేతువులు (కారణములు), లింగములు (లక్షణములు) ఔషధములు (చికిత్స) అను మూడుగా విభజించి సూత్ర రూపమున ఇంద్రునికుపదేశించెను

**చ పా వ్యా ఆం అ** ఆయుర్వేదమును సంక్షిప్తముగాచేసి ఎట్లుపదేశించెనని 'హేతులింగౌషధ' అను శ్లోకముతో చెప్పుచున్నాడు హేతులింగౌషధజ్ఞానం = అనగా కారణములు, లక్షణములు, చికిత్సలను తెలియజేయునది అనగా ఆయుర్వేద శబ్దముచే చెప్ప బడునదంతయు హేతువు లింగము, ఔషధములందంతర్భవించునని యర్థము హేతు శబ్దముచేత సన్నికృష్ట, విప్రకృష్టములు మొదలగు వ్యాధి కారణములను గ్రహించబడును లింగశబ్దముచేత వ్యాధియొక్కయు ఆరోగ్యముయొక్కయు లక్షణములు గ్రహించబడును అందువలన వ్యాధి ఆరోగ్యములు రెండు లింగ శబ్ద వాచ్యములగును ఎందువలన అనగా ఆ వ్యాధ్యారోగ్యములతో వాటి లక్షణములు తెలుసుకొనబడును ఇదే విషయమును ఆచార్యుడు నిదాన స్థానమున "విషమారంభ మూలానాం జ్వర ఏకోహిలక్షణమ్। విషమారంభ మూలాద్యైజ్వర ఏకోని గద్యతే॥ (ని అ 8) ఔషధమనగా అన్ని విధములైన పథ్యములు ఇట్లు హేతు లింగములతో శరీరమునన్వయించుకొని శారీరిక హేతువులు, శారీరిక లక్షణములని గ్రహించ వలయును "స్వస్థాతురపరాయణమ్" అనగా స్వస్థులకు రోగగ్రస్తులకు ఉత్తమమైన మార్గము పై శ్లోకమున చెప్పబడిన హేతులింగౌషధజ్ఞాన రూపమైన ఆయుర్వేదము బ్రహ్మ స్మరించిన ఆయుర్వేదమునకంటే వేరైనదా లేక ఒకటియేనా అను శంకకు

"త్రిసూత్రం" అనుదానితో సమాధానము చెప్పుచున్నాడు పితామహుడైన బ్రహ్మయు ఏ త్రిసూత్ర రూపమైన ఆయుర్వేదమును స్మరించెనో అట్టి ఆయుర్వేదమునే (హేతు లింగ, ఔషధ) మను సూత్రములుగా నుండుదానిని ఇంద్రుడు ఉపదేశించెను "త్రిసూత్రమనగా హేతు, లింగౌషధములు దేనియందు లేక దేనిచేత సూత్రీకరించబడినవో అది త్రిసూత్రము సూచించబడుచు అర్థపరంపర కూర్చబడినది సూత్రము అని అర్థము పైజెప్పబడిన వ్యాఖ్యానము ననుసరించి బ్రహ్మదేనినైతే స్మరించెనో అట్టి త్రిసూత్రరూపమైన హేతు, లింగ, ఔషధ జ్ఞానమును ఇంద్రుడు యథాతథముగానుపదేశించెనని (అతిప్లుతాగమమును) చెప్పుచున్నాడు "బుబుధే" అనగా స్మరించెను అని అర్థము రచించెననిగాదు రచించబడలేదు గావుననే 'శాశ్వతం' అని చెప్పబడినది శాశ్వతమనగా నిత్యమని అర్థము ఈ నిత్యత్వము సూత్రస్థానము యొక్క చివర ప్రతిపాదింపబడును

మూ॥ సోఽనంతపారం త్రిస్కంధమాయుర్వేదం మహామతిః।
యథావదచిరాత్ సర్వం బుబుధే తన్మనామునిః॥ 25
తేనాయురమితం లేభే భరద్వాజః సుఖాన్వితమ్।
ఋషిభ్యోఽనధికంతచ్చ శశంసానవశేషయన్॥ 26

తాత్పర్యము ఆద్యంతరహితమైనదియు హేతు, లింగ, ఔషధజ్ఞానరూపమైన త్రిస్కంధ రూపమైన ఆయుర్వేదమును గొప్పధీశాలియైన భరద్వాజముని తదేక మనస్కుడై అచిరకాలముననే ఇంద్రుని నుండి యథాతథముగా స్మరించెను (గ్రహించెను) ఆ విధముగా గ్రహించిన ఆయుర్వేదము వలన భరద్వాజుడు సుఖాన్వితమైనదియు అమితమైనట్టిదియునైన ఆయుర్దాయమును బడసెను సుఖాన్వితమైన తన ఆయుః ప్రకర్షకు కారణమైన ఆ అయుర్వేదమును (తాను గ్రహించినదానిని) మిక్కిలి క్లుప్తముగాకుండగను అతి విస్తారముగాకుండగను సంపూర్ణముగా ఋషులకు బోధించెను

చ పా వ్యా ఆం అ పైన చెప్పబడిన ఆయుర్వేదమును భరద్వాజుడెట్లు గ్రహించెనను విషయమును "సోఽనంత" అను శ్లోకములతో చెప్పుచున్నాడు అనంతపారం అనగా ఆద్యంతరహితమైనది అని అర్థము ఇచట పారశబ్దము గోబలీవర్ద న్యాయముననను సరించి "ఆదియను అర్థమునిచ్చును పార శబ్దమునదికిరువైపుల నుండి ఒడ్డును సందర్భముననుసరించి తెలుపును కావున ఇచ్చట పార శబ్దము ఆదిని సూచించి అనాదియను అర్థమును ఆయుర్వేదమునగలుగచేయగా అనంతశబ్దము అంతము

లేకుండుటను ఆయుర్వేదమునకు సూచించుచున్నది అందువలన 'అనంతపారం' అనగా ఆద్యంతరహితమైన ఆయుర్వేదము అను అర్థమునిచట సూచించ బడినది మరియొక అర్థము అనంతమనగా మోక్షము అని అర్థము "పారం" అనగా ఉత్కృష్ట ఫలముగలదైన ఆయుర్వేదము "అనంతపారం" అను శబ్దము వాచ్యమైనది ఈ విషయమునే ఆచార్యుడు "నైష్ఠికీయావినోపధామ్" అని (శా సా అ1) చెప్పినాడు ఇచట నైష్ఠికీచికిత్సమోక్షసాధన హేతువు త్రి స్కంధము = స్కంధశబ్దమునకు స్థూలావయవమని యర్థము హేతువు మొదలగునవి స్థూలావయవములుగాగలది త్రిస్కంధము మునియనగా జ్ఞాన ప్రకర్షచే మననము చేయు సామర్థ్యము గలవాడు ముని ఈ వ్యుత్పత్తిచేత ఇచట చెప్పబడిన భరద్వాజుడు గొప్పమనీషియగుట వలనను మునిశ్రేష్ఠుడగుట వలనను అనంతపారమైన ఆయుర్వేదమును హేతువు మొదలగు త్రిస్కంధముల నాధారముగా చేసికొని యథాతథముగా అచిరకాలముననే గ్రహించెనని సారాంశము అచిరాత్ = అనగా అచిరకాలముననే అని యర్థము మరియు నిచట బ్రహ్మ ఏ విధముగా త్రిసూత్రమును స్మరించెనో ఎట్లైతే ఇంద్రుడు హేతు లింగ ఔషధ జ్ఞానమునుపదేశించెనో అట్లే భరద్వాజుడుగూడా త్రిస్కంధరూపమైన ఆయుర్వేద మును గ్రహించెనని చెప్పుటవలన ఆయుర్వేదముయొక్క అవిప్లుతా గమత్వము తెలుప బడినది అందువలన త్రిస్కంధ త్రిసూత్రములకు పునరుక్తి దోషము లేదు "తేనాయురమితం లేభే" అనుచోట తేన అను శబ్దమునకు ఇంద్రుని నుండి గ్రహించిన ఆయుర్వేదముతో భరద్వాజుడు అమితమైన ఆయువును పొందెను అని అర్థము ఇచట ఆయుః శబ్దము ఆయువును కల్గించునదిగాను, మరియు రసాయన జ్ఞానము ప్రయోగించబడినదిగా తెలుసుకోవలెను కారణమేమనగా ఉత్తరకాలము ననీభరద్వాజుడు రసాయనోపయోగము వలన అమితమైన ఆయువును పొందినట్లు చెప్పబడును లేక సర్వప్రాణులకుపకారముచేయుటకై అధ్యయనము చేసిన ఆయుర్వేదము వలన జనించిన ధర్మవశమున తత్కాలముననే భరద్వాజుడమి తాయువును పొందెననియు తెలుసుకోవలయును "ఋషి భ్యోఽనధికం తచ్చ" అను చోట తచ్చ అనగా తానువిన్నట్టి ఆయుర్వేదమును సంపూర్ణముగా హెచ్చుతగ్గులు లేకుండా ఋషులకు ఉపదేశించెను

మూ। ఋషయశ్చ భరద్వాజాజ్జగృహుస్తం ప్రజాహితమ్।
దీర్ఘమాయుశ్చికీర్షంతో వేదం వర్ధనమాయుషః॥ 27
మహర్షయస్తే దదృశుర్యథావత్ జ్ఞానచక్షుషా।

సామాన్యంచ విశేషంచ గుణాన్ ద్రవ్యాణి కర్మచ॥ 28

సమవాయంచతత్జ్ఞాత్వా తంత్రోక్తం విధిమాస్థితాః।
లేభిరే పరమంశర్మ జీవితం చాప్యనిత్వరమ్॥ 29

తాత్పర్యము దీర్ఘ జీవనమును కాంక్షించు మహర్షిగణము ప్రజలకు హితకరమైనదియు ఆయువును పెంపొందించునదియు నైన ఆయుర్వేదమును భరద్వాజుని నుండి గ్రహించిరి ఆ మహర్షులకెప్పుడైతే ఆయుర్వేద జ్ఞానము గలిగినదో అప్పుడు వారు దివ్య దృష్టితో 1)సామాన్యము 2) విశేషము 3) గుణములు 4) ద్రవ్యములు 5) కర్మలు 6) సమవాయము అను షట్పదార్థములను తెలుసుకొని ఆయుర్వేద శాస్త్రమున చెప్పబడిన విధులందు తమ విశ్వాసమును దృఢపరచుకొనిరి దీని ద్వారా వారు మిక్కిలి శాంతిని పొందిరి అటుతరువాత ఆయుర్వేదవిహితములైన ఉపదేశముల నుష్ఠించుట వలన నాశనములేనట్టి (అనశ్వరమైన) ఆయువును పొందిరి

చ పా వ్యా ఆం అ దీర్ఘమాయుశ్చికీర్షతః = ఇతర ప్రాణులకు తనకు దీర్ఘాయువును కోరినవారై, జ్ఞానచక్షుషా = జ్ఞానముకొరకు , జ్ఞానరూపమైన దృష్టితో గ్రహించిన ఆయుర్వేదముతో దీనిని తెలుసుకొన్నారు అను దానిని "సామాన్యంచ" అను శ్లోకము ద్వారా తెలుపుచున్నాడు సామాన్యము మొదలగు షట్పదార్థముల యొక్క లక్షణము ముందు విపులముగా తెలుపబడును కావున అది అచ్చటనే తెలుసుకొనవలయును తంత్రోక్తం విధిం = అపథ్యపరిహార రూపము పథ్యగ్రహణ రూపమైన విధిని, శర్మ = సుఖము, పరం = దుఃఖరహితమైన, అనిత్వరమ్ = నాశనములేనిదైన ఆయువును పొందిరి

మూ। అథమైత్రీపరః పుణ్యమాయుర్వేదం పునర్వసుః।
శిష్యేభ్యోదత్తవాన్ షడ్భ్యః సర్వభూతానుకంపయా॥ 30

అగ్నివేశశ్చ భేలశ్చ జతూకర్ణః పరాశరః।
హారీతః క్షారపాణిశ్చ జగృహుస్తన్మునేర్వచః॥ 31

తాత్పర్యము భరద్వాజుని శిష్యుడైన ఆత్రేయ పునర్వసు సర్వప్రాణులందు మైత్రి గలవాడై సర్వప్రాణులందు దయగలవాడై పుణ్యప్రదమైన ఆయుర్వేద శాస్త్రమును 1)అగ్నివేశుడు 2) భేలుడు, 3) జతూకర్ణుడు 4) పరాశరుడు 5) హారీతుడు 6) క్షారపాణి అనునార్గురు శిష్యులకుపదేశించెను ఈ ఆర్గురు శిష్యులు ఆత్రేయపునర్వసు చెప్పిన దానిని యథాతథముగా గ్రహించిరి

చ పా వ్యా ఆం అ "అథ" అనునీ పైశ్లోకములో పునర్వసు అనుమరొక పేరుగల భరద్వాజ శిష్యుడైన ఆత్రేయుని అగ్నివేశాదులకు గురువుగా తెలుపుచున్నాడు ఇచట భరద్వాజుడు ఆత్రేయుడు ఒకరేయని కొందరి అభిప్రాయము కాని అదిసరియైనది గాదు కారణమేమనగా ఆత్రేయునకు భరద్వాజుడను పేరు తంత్రమున ఎచటను చెప్పబడలేదు మరియు హారీత సంహితయందు భరద్వాజుడాత్రేయుని గురువని "శక్రాదహమధీతః" అని చెప్పుచు "మత్తః పునరసంఖ్యేయాః త్రిసూత్రం త్రిప్రయోజనమ్। అత్ర ఆత్రేయాది పర్యంతావిదుః సప్తమహర్షయః॥ ఆత్రేయాద్ధారీత ఋషిః" ఇది భరద్వాజుని మాటగా చెప్పబడినది భరద్వాజుడు తాను ఇంద్రుని నుండి ఆయుర్వేద శాస్త్రమును నేర్చుకొన్నట్లుగా చెప్పినాడు తరువాత తన నుండి అనేక ఋషులు త్రిసూత్రమైనదియు మూడు ప్రయోజనములుగలదియునైన వైద్యశాస్త్రమును ఆత్రేయుడు మొదలు గాగల సప్తర్షులు గ్రహించినారు ఆత్రేయుని నుండి హారీతుడు గ్రహించినాడని హారీత సంహితలో స్పష్టముగా చెప్పబడియుండుట వలన ఆత్రేయ భరద్వాజులొక్కరు గారని గ్రహించవలయును

అచార్యవాగ్భటునిచే నీవిధముగా చెప్పబడినది "బ్రహ్మాస్మృత్వాఽఽయుషోవేదం ప్రజాపతిమజిగ్రహత్। సోఽశ్వినేతౌసహస్రాక్షం సోఽత్రిపుత్రాదికాన్ మునీన్" (వా సూ అ1) అనగా బ్రహ్మ ఆయుర్వేదమును స్మరించి ప్రజాపతికుపదేశించెను అతడు అశ్వినీ కుమారులకు, వారు ఇంద్రునికి, ఇంద్రుడు అత్రిపుత్రుడు మొదలుగా గల మునులకుప దేశించెను ఈ వాగ్భట వాక్యమునను సరించి ఆత్రేయుడు ఇంద్రునికి శిష్యుడనుట స్పష్టమగుచున్నది. మైత్రీపరః = స్నేహ గుణము ప్రధానముగాగలవాడు, మరియు మైత్రియనగా అన్ని ప్రాణులందు ఆత్మబుద్ధిగలిగి యుండుట (అన్ని ప్రాణులను తనతో సమానమైనవిగా నెంచుట)

మూ। బుద్ధేర్విశేషస్తత్రాసీన్నో పదేశాంతరం మునేః।
తంత్రస్య కర్తా ప్రథమమగ్ని వేశోయతోఽభవత్॥ 32

అథభేలాదయశ్చక్రుః స్వస్వం తంత్రంకృతానిచ।
శ్రావయామాసురాత్రేయం సర్షిసంఘం సుమేధసః॥ 33

శృత్వాసూత్రణమర్థానామృషయః పుణ్యకర్మణామ్।
యథావత్సూత్రితమితి ప్రహృష్టాస్తేఽనుమేనిరే॥ 34

సర్వఏవాస్తువం స్తాంచ సర్వభూతహితైషిణః।
సాధుభూతేష్వనుక్రోశ ఇత్యుచ్చైరభ్రువన్ సమమ్॥ 35



తంపుణ్యం శుశ్రువుః శబ్దం దివిదేవర్షయః స్థితాః।
సామరాః పరమర్షీణాం శృత్వాముముదిరేపరమ్॥ 36

అహోసాధ్వితి నిర్ఘోషోలోకాంస్త్రీనన్వవాదయత్।
నభసిస్నిగ్ధ గంభీరో హర్షాద్భూతైరుదీరితః॥ 37

శివోవాయుర్వవే సర్వాబాభిరున్మీలితా దిశః।
నిపేతుః సజలాశ్చైవ దివ్యాః కుసుమవృష్టయః॥ 38

అథాగ్నివేశప్రముఖాన్ వివిశుర్జా దేవతాః।
బుద్ధిః సిద్ధిః స్మృతిర్మేధా ధృతిః కీర్తిః క్షమా దయా॥ 39

తానిచానుమతాన్యేషాం తంత్రాణి పరమర్షిభిః।
భ(భా)వాయ భూత సంఘానాం ప్రతిష్ఠాం భువిలేభిరే॥ 40

తాత్పర్యము అగ్నివేశాదులచే తంత్ర నిర్మాణము ఆత్రేయుని ఆర్గురు శిష్యులలో అగ్నివేశుడందరికన్న ధీశాలి అందువలననే అగ్నివేశుడు ప్రప్రథమముగా గ్రంథరచన చేసెను (గ్రంథ నిర్మాణము చేయుటయే ఉత్తమబుద్ధికినిదర్శనము) గురువునకు పక్షపాత బుద్ధియుండదు అందరితోపాటుగానే అగ్నివేశునికి ఇతర శిష్యులతో సమానముగానే ఉపదేశము చేయబడినది ఇదేవిషయము "నోపదేశాంతరం మునేః' ' అను పదములచే చెప్పబడినది (సమానోపదేశమున్నప్పటికిని అందరికన్న ముందుగా అగ్నివేశుడు తంత్రరచనను చేయుటచే అతడు ధీశాలిగా పేర్కొనబడినాడు) అతని తదుపరి భేలుడు మొదలగువారు తమ తమ పేర్లతో తంత్రరచన చేసి ఇతరులతో పాటుగా గురువునకు (ఆత్రేయునకు) తమ గ్రంథములను వినిపించిరి పుణ్యకర్ములైన అగ్నివేశాదులచే చేయబడిన ఆయుర్వేద అర్థముల యొక్క సూత్రరూపములైన నిబంధములను విని ఋషి సముదాయము ప్రసన్నతనొంది వారిచే రచించబడిన తంత్రములనామోదించి మీరు రచించిన ఈ గ్రంథములందు విషయములనతి చక్కగా ఉచితరూపమున సూత్రీకరించినారని తమ ఆమోదమును తెలిపిరి మరియు సర్వప్రాణులకు హితమును గోరువారైన అగ్నివేశాది తంత్రకర్తలను ఋషులందరు ప్రశంసించిరి అందరును ఉచ్చస్వరముతో మీరు ప్రాణులందు దయచూపినారని ఒకేసారి పలికిరి మహర్షులచే బిగ్గరగా చెప్పబడిన నీపుణ్యశబ్దమును స్వర్గమునందున్న దేవతలు, దేవర్షులు వినిమిక్కిలి ప్రసన్నులై సాధు, సాధు అని స్నిగ్ధ గంభీర శబ్దముతో పలుకగా ఆ శబ్దము మూడులోకములందు ప్రతిధ్వనించెను ఆ సమయమున మంగళకరమైన వాయువులు వీచెను దిక్కులన్ని ప్రకాశించినవి జలముతో పాటు

ఆకసమునుండి పుష్పవృష్టి కురిసినది అట్టి సమయముననే ఋషులయొక్క శరీరములందు బుద్ధి, సిద్ధి, స్మృతి, మేధా, ధృతి,కీర్తి, క్షమా మరియు దయా స్వరూపులైన జ్ఞానదేవతలు ప్రవేశించిరి (ఋషులందు బుద్ధి మొదలగువారి యందు వైశిష్ట్యమును సంతరించుకొన్నవని అర్థము) ఈ విధముగా అగ్నివేశుడు మొదలగు వారిచే రచించబడిన తంత్రములు పరమ ఋషులతో ఆమోదించబడి సర్వప్రాణి కల్యాణము కొరకు ప్రపంచమున సుప్రతిష్ఠితములైనవి

చ పా వ్యా ఆం అ బుద్ధేర్విశేషః = బుద్ధి ప్రకర్ష వలన, స్వంస్వంతంత్రం = వారి వారి పేర్లతో భేలసంహిత, జతూకర్ణ సంహిత అని సంహితలను రచించినారు పుణ్యకర్మణాం= ఆయుర్వేద తంత్రకరణమను లక్షణముగల పుణ్యకర్మ గలవారైన అగ్నివేశాదుల యొక్క తంత్రములను, మహర్షులు విని ఆ తంత్రములను శ్లాఘించిరి శ్లోకమున "సర్వభూతహితైషిణః" అనునది అగ్నివేశాదులకుగాని లేక ఋషులకుగాని విశేషణమగును దానిననుసరించి అగ్నివేశాదులు, మహర్షులు గూడ సమస్త ప్రాణుల యొక్క హితమును (మేలును) కోరువారని యర్థము సాధు శబ్దమిచట లింగమును పొగొట్టుకొనక వేదాః ప్రమాణమ్ అనునట్లు నపుంసక లింగముగా నేయుండును కొందరు "సాధుభూతేష్వనుక్రోశ" అనువాక్యమున సాధు అను విశేషణమునకు నపుంసక లింగత్వముండుట వలన అనుక్రోశ శబ్దమును గూడా నపుంసకలింగశబ్దముగా "అనుక్రోశం" అని చెప్పుదురు "అహో" అను పదము, "సాధు" అను పదములు ప్రశంసాపదములు "స్నిగ్ధం" అనగా కర్ణకఠోరము గాక ఆహ్లాదకరముగా నుండు ధ్వనియని యర్థము శివోవాయుర్వవే = మంగళకరమైన వాయువు వీచెను మంగళకరమైన వాయువు వీచుట మొదలిడిన కార్యమునకు శుభసూచకము ప్రకృతమున ఆయుర్వేద తంత్రములను అగ్నివేశాదులు వ్రాసిన తంత్రములను వినిపించినతోడనే మంగళకరములైన వాయువులు వీచెనని చెప్పుట వలన దేవతలుగూడా ఆ తంత్రముల నామోదించిరని తెలియుజేయుచున్నది జ్ఞానదేవతలనగా జ్ఞానమునభిమానించు దేవతలు అగ్నివేశాదులను ప్రవేశించిరి ఇచట తంత్రప్రారంభమునకు ముందు అగ్నివేశాదులందు బుద్ధి మొదలగునవి వ్యవస్థితములై యుండి తంత్ర ఉత్తర కాలమున బుద్ధ్యాది దేవతాను ప్రవేశము కల్గినది అని చెప్ప బడినది, సిద్ధిః అనగా సాధ్యసాధన జ్ఞానము, కీర్తిః = విడమరిచి బోధించు జ్ఞానము యశోరూపమైన కీర్తిగాదు, మొదలగునవి అగ్నివేశాదులను ప్రవేశించినవి భవాయ = అనగా ప్రాణులు రోగములచేత పీడింపబడక ఉండుట కొరకు, అగ్నివేశాదులచే రచించబడిన తంత్రములు భూలోకమున ప్రసిద్ధి చెందినవి

## ఆయుర్వేద పరిభాష

మూ। హితాహితం సుఖం దుఃఖం ఆయుస్తస్య హితాహితం।
మానంచ తచ్చయత్రోక్తమాయుర్వేదః స ఉచ్యతే॥ 4

**తాత్పర్యము** ఏ తంత్రమునందు హితాయువనగానేమి? అహితాయువనగానేమి సుఖాయువని దేనినందురు? దుఃఖాయువు అని దేనినందురు? ఈ నాల్గు విధములైన ఆయువులకు ఏది హితము (పథ్యము) ఏది అహితము (అపథ్యము) ఈ ఆయువు యొక్క ప్రమాణము ఎంత? మరియు ఆయువుయొక్క స్వరూపమేమి అను విషయములు తెలుపబడునో అది ఆయుర్వేదము

**చ పా వ్యా అం అ** 'హితాహితం' అను శ్లోకములో ఆయుర్వేద వ్యుత్పత్తిని చెప్పుచు ఆయుర్వేదమును నిర్వచించుచున్నాడు హిత, అహితములైన ఆయువులు సుఖమును గలిగించు దుఃఖమును గల్గించునదైన నాల్గవిధములైన ఆయువు అర్థేదశమహామూలీయాధ్యాయమున "తత్రశారీరమానసాభ్యాం" "అహితమతోవిపర్యయేణ" అను (సూ అ30) శ్లోకముద్వారా చెప్పబడును తస్య హితం = అనగా పైచెప్పబడిన నాల్గు విధములైన ఆయువునకు సంబంధించిన పథ్యాపథ్యములు మానంచ అనగా ఆయుః ప్రమాణము, ఇట్టి ఆయుః ప్రమాణము ఆయా వికృతి లక్షణములను బట్టి ఒక మాసము, రెండు మాసములు అని ఇంద్రియ స్థానమున వికృతి లక్షణములు చెప్పబడును అట్లే "ఇదమాయుష్మతాం కుమారాణాం లక్షణం భవతి" అని ప్రకృతి లక్షణముల నాధారముగా చేసికొని ఈ కుమారుని ఆయువు ఇంత దీర్ఘమైనది అని మొదటి వాక్యములలో శారీరస్థానమున చెప్పబడును తచ్చ =-అనగా ఆ ఆయువు యొక్క స్వరూపము "శరీరేంద్రియం సత్వాత్మ సంయోగో" అను మొదలగు వాక్యములలో చెప్పబడును అందువలన పై సందర్భ వాక్యముల ననుసరించి ప్రస్తుతమున పై చెప్పబడిన "హితాహితం" అను శ్లోకములో "ఆయుర్వేదయతీత్యాయుర్వేదః" అను వ్యుత్పత్తితో తెలుపబడునది ఆయుర్వేదము అని ఆయుర్వేదశబ్దార్థము అగుచున్నది ఆయుర్వేద శబ్దమునందలి 'విద' ధాతువు ఇచట జ్ఞానము అను అర్థమును మాత్రమే బోధించునుగాని ఇతరార్థములైన లాభాదులను బోధించదు ఇదే విషయము అర్థే దశమహామూలీయాధ్యాయమున "తదాయుర్వేద

యతీత్యాయుర్వేదః" (చ సూ అ30) అని చెప్పబడినది అచట గూడా "విద" ధాతువునకు జ్ఞానమే అర్థముగాని లాభాదులుగాదు కారణమేమనగా విద ధాతువునకితరార్థములైన లాభాదులకు సాక్షాత్తుగా ఆయుర్వేద జన్యత్వము లేకుండుటయే

## ఆయుర్వేద లక్షణము, నిరుక్తి

మూ। శరీరేంద్రియ సత్వాత్మసంయోగోధారి జీవితమ్।

నిత్యగశ్చాను బంధశ్చ పర్యాయై రాయురుచ్యతే॥ 42

**తాత్పర్యము** పృథివీ మొదలగు పంచభూతాత్మకమైన శరీరము, చక్షురాది ఇంద్రియములు, మనస్సు, జ్ఞానమునకు సంధానకర్తయగు ఆత్మ ఇవి అన్నియు కర్మవశమున ఒకదానితోనొకటి ఎడబాయక నుండునట్టి అవస్థావిశేషము "ఆయు" వనబడును అట్టి అయువు ధారి, జీవితము, నిత్యగము, అనుబంధము అను పర్యాయ నామములతో ఈ శాస్త్రమున వ్యవహరింపబడును

**చ పా వ్యా ఆం అ** "శరీరేంద్రియ" అను పై శ్లోకములో "ఆయుర్వేద" అను పదము నందలి పూర్వపదమైన "ఆయువును" చెప్పుచున్నాడు "శరీరం" అనగా ఆత్మకు భోగాయతనమై పంచభూత వికారాత్మకమైన వస్తువు శరీరము ఇంద్రియములనగా చక్షురాది పంచజ్ఞానేంద్రియములు, వాగాది పంచకర్మేంద్రియములు సత్త్వం = మనస్సు, ఆత్మా = జ్ఞానసంధానకర్త, సంయోగః = ఎడబాయకయుండునట్టి వీటి యొక్క సమ్యగ్రూపమైన కలయిక ఆయువని చెప్పబడును ఇచట శరీరము అని చెప్పుటతోడనే శరీరంతర్భూతములైన ఇంద్రియములు గ్రహించబడినప్పటికీ ఇంద్రియములకు గల ప్రాధాన్యతననుసరించి వాటిని విడిగా చెప్పుట జరిగినది ఇచట చెప్పబడిన "శరీరేంద్రియాది, సంయోగము సంయోగియైన శరీరము క్షణికమైనదగుట వలన సంయోగము గూడా క్షణికమైనప్పటికి పరంపరాగతమగుట వలన ఒక శరీరమునుండి ఇంకొక శరీరమును పొందుట వలన (సంతానవ్యవస్థిత మగుట వలన) ఒకటిగానే చెప్పబడును పై చెప్పబడిన ఆయువునకు 'ధారి' అను దానిలో పర్యాయములను తెలుపుచున్నాడు ధారి = పూతత్వమును శరీరము పొందకుండునట్లు చేయుచు ధరించుట వలన ధారియని చెప్పబడును జీవితమ్ = ప్రాణములను ధరించుట వలన జీవితమ్ అని చెప్పబడును నిత్యగః = శరీరము క్షణికమగుట వలన ఎప్పుడోఒకప్పుడు తప్పనిసరిగా వెళ్ళిపోవునదిగాన నిత్యగము,

అట్టి సమాన ధర్మముగల వస్తు సంబంధముచేత మరియొకటి వృద్ధినొందునని ఫలితార్థము

మరియు సర్వకాల సర్వావస్థలయందును పైజెప్పిన గుణ, ద్రవ్య క్రియల యొక్క విశేషము (విరుద్ధధర్మము) క్షయమునకు కారణమగును (ఒక ద్రవ్యము నందలి గుణములైనను, ద్రవ్యత్వమైనను, క్రియలైనను ఇంకొక ద్రవ్యమునందు విరుద్ధములుగ నున్నచో దానియుపయోగము (సంబంధము) హ్రాసమునకు (తగ్గించుటకు) కారణమగును

మరియు పై జెప్పిన రీతిగ గుణ - ద్రవ్య - క్రియలచే సామాన్యము గల ద్రవ్యములును, విరుద్ధములగు ద్రవ్యములును, పరస్పర మిలితములుగా సంబంధము కల్గియున్నచో వృద్ధియు క్షయమునూ లేక సమత్వమును కల్గును

**చ పా వ్యా అం అ** ఆయుర్వేదమునందు అబిధేయములుగా సూత్ర రూపమున చెప్పబడిన సామాన్యము మొదలగు షట్పదార్థముల యందు సామాన్యము మొదటగా చెప్పబడుట వలనను, ఆయుర్వేదమున ప్రతిపాదింపబడు హేతువు మొదలగునవి సామాన్య జ్ఞానమూలకములగుట వలనను "సర్వదా" అను పై శ్లోకముతో సామాన్య మును మొదట వివరించుచున్నాడు సర్వదా = నిత్యగము ఆవస్థికము అయిన అన్ని కాలములందును "సర్వభావానాం" అనుచోట సర్వశబ్దము కృత్స్నవాచకమైయున్నది అనగా అన్ని అని అర్థము భావ శబ్దమునకిచట "భవంతి సత్తామను భవంతీతి భావాః" అనగా ఉనికిని కల్గియున్నవైన భావములు అనగా ద్రవ్య, గుణ, కర్మలు అని అర్థము అంతేగాని పుట్టునవి అని కాదు పుట్టునవి భావములు అని భావ శబ్దమునకు అర్థమును గ్రహించినచో నిత్యములైన పృథ్వీ మొదలగు వాటి యొక్క నిత్యములైన పరమాణువులకు పార్థివములు మొదలైన ద్వ్యణుకాదులచే వృద్ధి కార్యమసంగత మగును సామాన్యమనగా "సామాన్యమేకత్వ కరం" అను మొదలగు వాటిచేత చెప్పబడు లక్షణము కలది వృద్ధిః = ఆధిక్యత ఆధిక్యమునకు కారణమైనది వృద్ధి కారణము మాంసద్రవ్యము, స్వసమానమగు మాంసము యొక్క వృద్ధికి కారణమగుట చేసి సామాన్యమని చెప్పబడుచున్నది అనగా వృద్ధి కారణమే లక్షణముగా గలది సామాన్యమని చెప్పబడును (వృద్ధికి కారణమైనది సామాన్యమని ఆయుర్వేదము ననుసరించి సామాన్య లక్షణము అందువలన మాంసత్వాది జాతి రూప సామాన్యము మాత్రమే వృద్ధికి కారణము గాదు అదెట్లనగా మాంసత్వ రూప సామాన్యము పోషకమైన భోజనమునందును శరీర ధాతురూపమైన పోష్యమునందును గలదు

అందువలన నిత్యమాంసత్వ సంబంధమువలన మాంసాహారులుకాని వారికి కూడా మాంసముతో మాత్రమే మాంసవృద్ధికలుగజేయవలసియుండును అందువలన సామాన్యము వృద్ధికారణము కాదనియు వృద్ధి కారణలక్షణమైనది మాత్రమే సామాన్యమనియు తెలియనగును అందువలననే వైశేషికమున గూడా "త్రయాణామకార్యత్వం అకారణత్వంచ" అనగా సామాన్య, విశేష, సమవాయములకు అకార్యత్వము అకారణత్వము (కార్యములు గాదు, కారణములు గాదు) అని చెప్పబడినది సమానత్వమే సామాన్యమని ద్రవ్యాదులను సామాన్యశబ్దముతో వ్యవహరించువారి మతముననుసరించి "సామాన్యంచ విశేషంచ" (సూ స్థా అ1) అను శ్లోకములో చెప్పబడు సామాన్యమునకు ప్రయోజనము లేదు అందువలన శ్లోకమునకు అసంబంధార్థత్వము కలుగును ఈ శ్లోకమున చెప్పబడిన వృద్ధి కారణత్వము సామాన్యమునకు లక్షణము గాదు పోతే ఆయుర్వేదోపయుక్తమైన ధర్మనిర్దేశము మాత్రమే లక్షణమేదనగా "సామాన్యమేకత్వకరం" అని ముందు లక్షణము చెప్పబడును ఇట్లే ద్రవ్యాది విషయములకు గూడా "ఖాదీన్యాత్మా" అను మొదలగు వాక్యములచే మొదలు నిర్దేశించి తదుపరి "యత్రాశ్రితాః కర్మగుణాః" అను మొదలగు వాక్యములచేత లక్షణము చెప్పబడును సామాన్యమునకు గూడా విరోధికారణములేనప్పుడే వృద్ధి కారణత్వముండునని తెలుసుకోవలయును అందువలననే ఆమలకము (ఉసిరిక) నందలి ఆమ్లత్వము మొదలగునవి పిత్తగతమైన ఆమ్లత్వమును సమానగుణము గలదగుట వలన వృద్ధిపొందించవలయును, గాని ఆమలకియందు ఆమ్లగుణముతో పాటు దానికి విరుద్ధమైన శిశిరత్వము మొదలగు గుణములు గూడా యుండుట వలన పిత్తమునందలి ఆమ్లత్వమును ఆమలకివృద్ధినొందించదు ఇట్లే మిగిలిన త్రిదోషహర ద్రవ్యములకు సంబంధించిన విషయమును తెలుసుకోవలయును ఇచట గూడా వృద్ధికి కారణమైనది సామాన్యమని చెప్పబడినది గాని సామాన్యము వృద్ధికికారణమని చెప్పబడలేదు ఆ కారణమువలననే సమాన ద్రవ్యములుగాని ఘృతము వలన మేధోవృద్ధి మరియు అగ్నివృద్ధి ప్రభావమువలనగలుగుట చూచు చున్నాము "ఘృతమగ్ని మేధేకరోతి" అను వాక్యమీవిషయమునే తెలియజేయు చున్నది అట్లే చింతవలన వాతవృద్ధి, సంకల్పము మరియు వృష్యమైన పాదలేపము వలన శుక్రవృద్ధి మొదలగునవి సమానములు కానప్పటికిని ప్రభావము వలననవి వృద్ధికారకములగుచున్నవి వృద్ధికారణమైనది సామాన్యమని ఇచట చెప్పబడినప్పటికి అట్టి వృద్ధి కారణము సమానమైనదైనప్పుడే వృద్ధికి కారణమగునని తెలియుచున్నది

ఉదా శోణితమునకు (రక్తమునకు) మాంసత్వము సామాన్యముగాదు అందువలన మాంసము శోణితమును వృద్ధినొందించదు అందువలననది సామాన్యముగాదు పోతే వేర్పాటు బుద్ధికి కారణమగుట వలన విశేషమేయగును సామాన్యమును పై విధముగా వివరించిన మీదట విశేషమును వివరించుచున్నాడు "హ్రాసహేతుర్వి శేషశ్చ" అను ఉత్తరార్థములో వైశేషిక దర్శనమున చెప్పబడిన అంత్య విశేషములీ శాస్త్రముననుపయుక్తములు గాకుండుట వలనను మరియు అట్టి విశేషము యొక్క ధర్మమునకంటే వేరైన ధర్మముగలదగుట వలనను సామాన్య విశేషములనే ఇచట హ్రాసహేతుర్విశేషశ్చ అని హ్రాసకారణములైన విశేషములను వివరించుచున్నాడు విశేషమును వివరించు సందర్భమున గూడా సామాన్యమునందు చెప్పబడినట్లుగానే "సర్వదా సర్వభావానాం" అను వాక్యమునన్వయించుకొని ఉనికిని గల్గియున్న అన్ని భావపదార్థముల యొక్క క్షయమునకు కారణమైనది విశేషము అని తెలుపబడినదిగా గ్రహించవలయును హ్రాసహేతు ః = క్షయమునకు కారణమైనది, "విశిష్యతే ఇతి విశేషః" అను వ్యుత్పత్తిననుసరించి వేర్పరచునది విశేషము లేక ఒకదాని కంటె భిన్నమైన ధర్మము గలది విశేషము అని అర్థము) గవేధుకము (అడవిగోధుమలు) అందలి గవేధుకత్వసామాన్యము మాంసము మొదలగు వాటికంటే వేరైనది అందువలన గవేధుకత్వము తదితరములైన గవేధుకలతో పోల్చినప్పుడు సమానమే గాని మాంసముతో పోల్చినపుడు వేర్పాటుబుద్ధిని గలిగించునదగుటవలన విశేషము కారణమేమనగా మాంసమునందు గవేధుకత్వము లేదు ఇట్లే మాంసము ఇతర మాంసములతో పోల్చినపుడు (కలిపినపుడు) సామాన్యము రక్తము మొదలగు వాటితో పోల్చినపుడు వేరైన ధర్మము గలదగుట వలన విశేషము విశేష వివరణ సందర్భమున గూడా హ్రాసకారణత్వమనగా హ్రాసమునకు కారణమైన లక్షణములు గలది విశేషమని, సామాన్యమునందు చెప్పబడిన లక్షణము మాదిరిగానే తెలుసుకోవలయును ఈ కారణమువలననే మందక, నికుచములు మొదలగు ద్రవ్యములందు వాత విరుద్ధములైన స్నిగ్ధము మొదలగు గుణములున్నప్పటికిని అపథ్య ప్రభావము వలన వాతమును శమింపజేయవని తెలుసుకోవలయును (విశేషము గూడా విరోధికారణ ములు లేనప్పుడే హ్రాసమునకు (క్షయమునకు) కారణమని యర్థము ఇచట చెప్పబడు విశేషము విరుద్ధవిశేషము అందువలననే ముందు ముందు చెప్పబోవు హ్రాసకారణమైన విశేషముగా విరుద్ధ విశేషమే చెప్పబడును ఉదా విపరీతగుణైర్దేశమాత్రాకాలోపపాది తైః (సూ అ1) "విపరీత గుణైర్ద్రవ్యైర్మారుతః సంప్రశామ్యతి" (సూ అ1) అట్లే

వాగ్భటమున "వృద్ధిః సమానైః సర్వేషాం విపరీతైర్విపర్యయః (వా సూ అ1) అను మొదలగు సందర్భములందు విరుద్ధ విశేషమునే గ్రహించ వలసియుండును జతూకర్ణ తంత్రమునగూడా "సమానైః సర్వభావానాం వృద్ధిర్హానిర్విపర్యయాత్" అనగా సర్వభావములయొక్క వృద్ధి సమాన ద్రవ్యములతోను, సర్వభావముల యొక్క క్షయము విపరీత ద్రవ్యములతోను గలుగునని చెప్పబడినది విరుద్ధముగా నట్టి విశేషము మాత్రము హ్రాసమునకు (క్షయమునకు) గాని, వృద్ధికి గాని కారణముగాదు అదెట్లనగా! పృధివీ భూతము యొక్క అనుష్ణశీత స్పర్శ గుణములు వాతము యొక్క వృద్ధికిగాని, క్షయమునకు గాని కారణములు గావు, ఐనప్పటికిని అగ్నులతో క్షీణించుచున్న ధాతువులను, సమానములుగాకుండుట వలన అనుష్ణశీతాదులు ధాతువృద్ధిని గల్గించవు వృద్ధి గల్గించకపోవుట వలన నవివృద్ధి కారణములుగావు అట్లే క్షయమునకు గూడా సాక్షాత్తుగా కారణములుగావు ఐనప్పటికిని ధాతువులు క్షీణించుచున్నపుడు (అగ్నులలో) వృద్ధిపరచక పోవుటయే పరోక్షముగా క్షయమునకు కారణముగా గోచరించును అదెట్లనగా సమానములుగాని ద్రవ్యములను (అసమానములైన) ఉపయోగించునపుడు నశించు స్వభావముగల ధాతువులకు పోషక భావములందకపోవుట వలన హ్రాసము (క్షయము) గలుగుట సంభవమే ఉదా ప్రవహించుచున్న నీటికి పైన అడ్డగట్టవేసినచో క్రిందికి పారుజలము ఎట్లు క్షీణించునో అట్లే వృద్ధిపొందు ధాతువులకు పోషక భావములు లేకుండా చేసినచో ఉత్తర ధాతువులు క్షీణించును విరుద్ధముగాని విశేష (ద్రవ్యము)ములనుఉపయోగించి నను పైయుక్తిననుసరించి హ్రాసముగలుగుచుండుటను చూచి ఆచార్యుడు సామాన్య విశేషమునే హ్రాసకారణముగా చెప్పినాడు "హ్రాసహేతుర్విశేషశ్చ" అనుచోట "చ" కారము సర్వభావములను తెలియజేయుచున్నది అనగా సర్వభావముల యొక్క హ్రాస కారణము అని అర్థము అటుతరువాత సామాన్య, విశేషములు ఏ విధమైన సంబంధము లేకయే వృద్ధిహ్రాసములకు కారణములుగావని 'ప్రవృత్తి రుభయస్యతు' అను వాక్యములో చెప్పుచున్నాడు "కారణం" అనుశబ్దమును "ప్రవృత్తిరుభయ స్యతు" అను వాక్యమునకు జోడించుకొనవలయును ఉభయస్య = సామాన్యమునకు మరియు విశేషమునకు, ప్రవృత్తిః = శరీరముతో సంపూర్ణ సంబంధము గలిగి యుండుట ఇట్లు సామాన్య విశేషములకు శరీర ధాతువులకు సంబంధమేర్పడిన అది వృద్ధి హ్రాసములకు కారణమగునని యర్థము "ప్రవృత్తిరుభయస్యతు" అను వాక్యమునందలి "తు" శబ్దము నిశ్చయార్థకము అందువలన సంబంధము నేర్పరచు

కోకున్న సామాన్యవిశేషములు వృద్ధి హ్రాసములకు కారణము కావని తెలుపుచున్నాడు లేక "ప్రవృత్తిః" అనగా "ఉచితాధాతు ప్రవృత్తిః ధాతు సామ్యం" అనగా సామాన్య విశేషముల యొక్క ఏకకాల ప్రవృత్తి ధాతు సామ్యమును గల్గించునని మరియొక అర్థము చెప్పుకోవచ్చును ఈ వ్యుత్పత్తిననుసరించి కేవలము సమాన ద్రవ్యాదులనుప యోగించినచో ధాతువృద్ధి గలిగి ధాతువైషమ్యమేర్పడును అట్లే కేవలము విశేష ద్రవ్యాదులనుపయోగించినను ధాతుక్షయము వలన ధాతువైషమ్యము గలుగును అట్లుగాక ఏకకాలమున సమాన, విశేష ద్రవ్యాదులనుపయోగించినచో వృద్ధి హ్రాసములు సమానములై ధాతుసామ్య రూపమైన ప్రవృత్తిగలుగునని మరియొక అర్థము 'ప్రవృత్తిః' అను శబ్దమువలన చెప్పినట్లగును ఈ సందర్భమున "తు" శబ్దము ఒకే ద్రవ్యమునుపయోగించు విధానమును పేర్కొను పూర్వపక్షము నుండి సిద్ధాంతాలనే వేర్పరచుటకుపయోగించబడెను అనగా సామాన్య విశేషములను ఏకకాలమున ఉపయోగించుట ధాతుసామ్యత గల్గించునదని చెప్పునిశ్చయార్థమును సూచించు చున్నది 'తు' శబ్దము ఒక ద్రవ్యమునుపయోగించుట అను పూర్వపక్షము నుండి వేర్పరచుచున్నది

శ్లో॥ సామాన్యమేకత్వకరం విశేషస్తు పృథక్త్వకృత్,
తుల్యార్థతాహి సామాన్యం విశేషణ విపర్యయః॥ 45

**తాత్పర్యము** ఏకత్వమును (రెండు వ్యక్తులకు) కల్గించునట్టి వస్తునిష్ఠ ధర్మము సామాన్యమనబడును ఉదా గోవ్యక్తులు దేశకాలాదుల భేదములచే పరస్పర భిన్నములుగా నున్నను గోత్వము గోవ్యక్తి సామాన్యముగ వ్యాపించి అన్ని గోవులకు ఐక్యమును గల్గించును గావున అట్టి గోత్వము సామాన్యమని చెప్పబడును (ఇది గోరూప వ్యక్తులకన్నింటికి గ్రాహకమగుట వలన వృద్ధికి కారణమగును)

అనేక వ్యక్తులయందు భిన్నభిన్నములుగ (వేరువేరుగ) గనబడు ధర్మము ఒక వ్యక్తి నుండి మరియొక వ్యక్తిని వేరుపరచును ఇదియే విశేషమనబడును ఉదా గోత్వము గోవ్యక్తియందున్నది గజత్వము గజ (ఏనుగు) వ్యక్తియందున్నది అట్టి ఎడ గోత్వము గజత్వబుద్ధిని, గజత్వము గోత్వబుద్ధిని మరలించును కావున నీ ధర్మము గోవుల నుండి గజములను, గజముల నుండి గోవులను వేరుపరచును ఇదియే విశేషమనబడును (ఇది వేరుపరచునట్టి ధర్మముగావున ఏకత్వబుద్ధిని గలిగించు సామాన్యమునకన్న విరుద్ధమైనది) ఇచ్చట గోత్వము గజవ్యక్తిని, గజత్వము గోవ్యక్తిని (సంఖ్యను) తగ్గించును గావున నీ విశేషము హ్రాసహేతువని బేర్కొనబడినది

దీనికి లోక దృష్టాంతమును ఉత్తరార్ధమున "తుల్యార్థతాహి సామాన్యం విశేషస్తు విపర్యయః" అని చెప్పినాడు ఏకజాతీయములగు వ్యక్తులు దేశకాలాది భేదములచే ననేకములుగనున్నను ఆ వ్యక్తులందన్నిటి యందును వ్యాపించి యుండు ధర్మము ఏకరూపముగ నుండునపుడు ఆ జాతి వ్యక్తులన్నియు సమానములని వ్యవహరింపబడును కావున అట్టి న్యాయముననుసరించి అది సామాన్యమని చెప్పబడును (గోత్వము గోవ్యక్తులందన్నిటియుందును సమత్వ బుద్ధిని గలిగించును)

పై జెప్పిన లక్షణములకు విరుద్ధముగ సమానమైన ధర్మముగాక పరస్పర విలక్షణమైన గోత్వ గజత్వాది ధర్మములు పరస్పర వ్యావర్తకములై విరుద్ధముగ లోకమున నుండును కావుని నిదివిశేషమనబడును (గోత్వము అశ్వవ్యక్తి బుద్ధి నుండి మరలించును గావున అశ్వవిషయమై గోత్వము వ్యావర్తకము (వేర్పరచును)

ఇచట సామాన్య విశేషలక్షణముల విషయమై వైశేషికాది మతముల ననుసరించి అనేక పక్షాంతరము లేర్పడును విస్తరభీతిచే అవన్నియు నిచట వివరించబడలేదు ఆయుర్వేదోపయుక్తాంశములు మాత్రము ఇచట క్లుప్తముగ చెప్పబడినవి విజ్ఞులు గమనించెదరుగాక "సామాన్యమేకత్వకరం విపర్యయః" అను శ్లోకముతో సామాన్య లక్షణమును విశేషలక్షణమును చెప్పుచున్నాడు ఏకత్వకరం = ఒకటేఅను బుద్ధిని గలిగించునది సామాన్యము భిన్నభిన్నములైన దేశ కాలములందలి గోవు మొదలగు వ్యక్తులందుగల ఇది గోవు ఇది గోవు అను ఒకే విధమైన బుద్ధి (జ్ఞానము) సామాన్యము భిన్నములైన గోవు మొదలగు వ్యక్తులందు వేరైనదిగానట్టిదియు ఒకే లక్షణము గలదియు ఐన సమత్వములేనిచో సంశయరహితమైన ఏకాకారబుద్ధి గలుగదు మరియు ఎచటనైతే "అయం పాచకోఽయం పాచకః" వీడువంటవాడు, వీడు వంటవాడు, అట్లే "అయం శుక్లోఽయంశుక్లః" ఇది తెలుపు, ఇది తెలుపు అను సందర్భములందుగూడా వంటచేయుట అను క్రియ వలన వీటి యందలి ఒకే క్రియా, గుణములు ఒకే రూపమును గ్రహించుటకు కారణములగును ఒక వంటవానియందున్న పాచక క్రియ వేరొకనియందులేదు ఐనప్పటికిని తజ్జాతీయముగాన క్రియాసామాన్యముననుసరించి ఏకత్వబుద్ధిని గలిగించుటకు కారణమైనది "పృధక్త్వకృత్" అనునది విశేషముయొక్క లక్షణము ఇది వేర్పాటుబుద్ధిని గలిగించునది దీనిననుసరించి గోవును అశ్వములతో పోల్చినపుడు వేర్పాటుబుద్ధిని గలిగించునదగుటవలన అశ్వములు మొదలగు వాటి కంటె గోవు విశేషమని చెప్పబడును అదే గోవును ఇతర గోవులతో పోల్చినపుడు గోవులన్నియు ఒకటే అను జ్ఞానమువలన గోత్వము సామాన్యమగును ఈ కారణము

వలన మాంసమునందలి మాంసత్వము ఇతర మాంసములతో పోల్చినపుడు సమాన మగుటవలనవృద్ధి కారణమగును వాతముతో పోల్చినపుడు మాంసము కంటే వాతము వేరైనది గావున క్షయకారణమగును అదే మాంసత్వము రక్తము మొదలగువాటితో పోల్చినపుడు విరుద్ధముగాని విశేషముగావున అంతగా క్షయహేతువుగాదు పోతే గుణములతో సమానమగుట వలన రక్తము మొదలగు ధాతువులకు వృద్ధినే గలిగించును "తుల్యార్థతాహి సామాన్యం" అను శ్లోకపాదముతో సామాన్యము అనేక వ్యక్తులయందు "ఒకటే" అను అవ్యభిచార జ్ఞానమును ఎట్లు గలిగించునని చెప్పుచు న్నాడు తుల్యార్థతా = అర్థములన్నిసమానమైన ఒకే రూపము గల్గియుండుట దీని ననుసరించి భిన్నములైన వ్యక్తులందు ఏకరూప సంబంధమైన సామాన్యముండుట వలన ఆ సామాన్య సంబంధము అనేక వస్తువులనాశ్రయించియున్నప్పటికిని వ్యక్తులు భిన్నములైనను ఆ వ్యక్తులందేకత్వబుద్ధి గలుగునని భావము "విశేషస్తు విపర్యయః' ' అనగా సమానత్వములేకుండుట విశేషము దీనిననుసరించి సమానములుగాని గోవు, గజములయొక్క గోత్వ, గజత్వరూపములైన అర్థము (వ్యక్తిత్వము)లందు వేరైనవి అనుబుద్ధి (జ్ఞానము) గలుగునని చెప్పబడును

కొందరు మాత్రమీ సామాన్య విశేషములనుమరొక విధముగా వివరించినారు దానిననుసరించి సామాన్యము మూడు విధములు అవి 1) ద్రవ్య గోచరము 2) గుణగోచరము 3) కర్మగోచరము. వీటిలో "సర్వదా సర్వభావానాం" అనునది ద్రవ్య సామాన్యము "సామాన్యమేకత్వకరం" అను శ్లోకముతో చెప్పబడినది గుణ సామాన్యము ఉదా పాలు, శుక్రము ఇవి రెండు భిన్న జాతీయ ద్రవ్యములైనప్పటికిని మధురత్వము మొదలగు గుణముల యొక్క సామ్యతననుసరించి ఏకత్వమును గల్గించుచున్నవి ఇట్లే విశేషమునకు సంబంధించిన వివరణమును తెలుసుకోవలయును "తుల్యార్థతా హిసామాన్యం" అను శ్లోకపాదముతో కర్మసామాన్యము చెప్పబడినది కూర్చుండుట అను కర్మ శ్లేష్మసమానమైనది కాకున్నను పానీయము మొదలగు కఫ సమానములైన ద్రవ్యముల యొక్క క్రియనుచేయుట వలన కఫవృద్ధికి కారణమగును కూర్చుండుట అను క్రియగూడా కఫ సమానమనియె చెప్పబడును ఇట్లే స్వప్నము మొదలగు కర్మల విషయమునందును చెప్పుకోవలసియుండును ఈ విధమైన వివరణము భట్టారహరి చంద్రునిచేత ఖండించబడినది భట్టారహరిచంద్రుని యభిప్రాయముననుసరించి 'సర్వదా సర్వభావానాం" అను శ్లోకమునందే త్రివిధమైన సామాన్యమును తెలుపబడినది అందువలన "సామాన్యమేకత్వకరం" అను శ్లోకములతో తిరిగి సామాన్యమును

చెప్పవలసిన అవసరములేదని అతనియభిప్రాయము మరికొందరు సామాన్యమును మూడు విధములుగా తెలుపుచు అవి అత్యంత సామాన్యము, మధ్య సామాన్యము, ఏకదేశసామాన్యములని తెలిపినారు వాటిలో "సర్వదా" అను శ్లోకముతో చెప్పబడునది అత్యంతసామాన్యమనియు "సామాన్యమేకత్వకరం" అను శ్లోకముతో తెలుపబడునది మధ్యసామాన్యమనియు "తుల్యార్థతాహి" అను వాక్యముతో చెప్పబడునది ఏకదేశ సామాన్యమనియు తెలిపినారు ఈ విధముగా చెప్పబడిన త్రివిధ సామాన్యము గూడా మిక్కిలి ఉపయోగకరము కాకుండుట వలనను, లక్షణము పొసగకుండుట వలనను అంతగానుపయోగించదని చక్రపాణి యభిప్రాయము కొందరు సామాన్యమును రెండు విధములుగా తెలిపినారు అవి 1) ఉభయవృత్తి 2) ఏకవృత్తి ఈ రెండింటిలో మాంసమును పోషించు మాంసము ఉభయవృత్తి సామాన్యము, మాంసత్వము పోష్యమైన మాంసమునందును పోషకమైన మాంసమునందు నుండుట వలన ఉభయ వృత్తి సామాన్యము ఏకవృత్తికుదాహరణము ఘృతము అగ్నికరము అట్లే ధావనము (పరుగెత్తుట) మొదలగునవి వాతకరకర్మలు మరియు కూర్చుండుట, పరుండుట మొదలగునవి కఫకరకర్మములు ఇవన్నియు పోష్యములైన వాత, కఫములకు సమానములైనవి గావు కాని ప్రభావమువలన వర్ధకములైనవి ప్రభావములు ఘృతమునందలి ఘృతత్వము, ధావనమునందలి (పరుగెత్తుటయందలి) ధావనత్వము (పరుగెత్తుట అను ధర్మము) పోషకములైన ఘృత ధావనములందు మాత్రమే యుండుటవలన (ఏక వృత్తులు) ఒకేదానియందుండును (ఏకవృత్తులు అనగా పోష్య పోషక భావములలో ఒక దానియందు మాత్రమే యుండునవి) ఆకారణము వలన ఏకవృత్తి సామాన్యము నందుగూడా వృద్ధికి కారణమైనదే సామాన్యమని చెప్పవచ్చును ఉభయ వృత్తి గాని పక్షమున సామాన్యము సామాన్యముగాక విశేషమేయగును మరియు సమానము సమానముగానిది (అసమానము) గూడా వృద్ధికి కారణమగుట చేసి "సామాన్యం వృద్ధి కారణం" అను వాక్యమునకు అర్థమేయుండదు చక్రపాణి మతమునను సరించి సామాన్యము వృద్ధికి కారణమేయగును గాని, వృద్ధికి కారణమైనదంతయు సామాన్యము గాదని నియమించబడినది అందువలన అసమానములైన వాటి వలన గూడా వృద్ధి కలుగుటలో దోషములేదు కర్మ సామాన్యము వృద్ధికారణమని శాస్త్రమున చెప్పబడ లేదని కొందరి అభిప్రాయము అందుకు వారీఉపపత్తిని చూపించుచున్నారు అదే మనగా పరుగెత్తుట అను క్రియకు వాతము సమానము గాదు అందు వలననే ఆచార్యుడు ద్రవ్య సామాన్యమును

"మాంసమాప్యాయతేమాంసేన" అను వాక్యముతో అట్లే గుణ సామాన్యమును "సమానగుణానామాహార వికారాణాముపయోగో" అను వాక్యముతో చెప్పినాడు గాని కర్మసామాన్యమును కంఠతః చెప్పక కర్మాపియదృప్యథాతోర్వృద్ధికరం తత్తదాసేవ్యం' ' (శా అ6) అని కర్మసామాన్యమని చెప్పక వృద్ధిచేయు ఆయాకర్మల నాచరించవలెనని చెప్పినాడు అందువలన శాస్త్రమున కర్మ సామాన్యము చెప్పబడ లేదని వారి అభిప్రాయము అందుకు చక్రపాణి సమాధానము కర్మలు సాధారణముగా ప్రభావమువలననే వృద్ధికారణములగుట వలన కర్మసామాన్యము అని చెప్పబడలేదు అంతేగాని కర్మ సామాన్యములేకుండుట వలన గాదు ఉదా క్రియావంతమైన వాతము వ్యాయామము మొదలగు శారీరిక క్రియలతో వృద్ధినొందును అందువలన వాతమునందలి క్రియ, శారీరకమైన వ్యాయామ రూపక్రియ ఈ రెండింటి సామాన్యతచే వాతవృద్ధి గలుగును శరీరము నిష్క్రియముగానున్న వాతక్షయమేర్పడును స్వప్నము మొదలగునవి "సంయోగేచ విభాగేచ" అను ముందు చెప్పబోవు లక్షణముతో చెప్పబడకపోయినప్పటికి శాస్త్రవ్యవహారముననుసరించి కర్మశబ్ద వాచ్యములే యగును వాటిలో స్వప్నము స్వకారణము వలననే సంచయము పొందుచున్న కఫము క్షయకారణములైన శరీర కదలికలు మొదలగు వాటిని నిరోధించుట వలన వృద్ధి నొందించును అంతేగాని సాక్షాత్తుగా స్వప్నము ద్రవ్యగుణములవలె సాక్షాత్తుగా కఫవృద్ధికరముగాదు ఇట్లే కూర్చుండుట, పరుండుట మొదలగునవి గూడా ఎచటనైతే ద్రవ్యగుణముల వలె కార్యకారణ భావమునాలోచించుట సాధ్యపడదో అచట ప్రభావమును గ్రహించవలసియుండును ఇంకొక ప్రశ్న మాంసముసమానత్వము వలన మాంసమును వృద్ధినొందించును అదే సమయమున వాతమునకు విశేషమగు వలన వాతమును క్షీణింపజేయును ఒకే కాలమున ఒకే ద్రవ్యము పరస్పర విరుద్ధములైన క్రియలనెట్లు చేయును? ఉదా దేవదత్తుడు (ఒక వ్యక్తి) ఒక సమయమున ఒక పనిచేయునపుడు అదే సమయమున మరియొక పని చేయలేడు అట్లే ద్రవ్యముగూడా ఒకే సమయమున రెండు విరుద్ధములైన పనులెట్లు చేయునను సందేహము దానికి సమాధానము ఏక కాలమున అనేక కర్మలు చేయుట అనునది క్రియవంతములైన వాటి ధర్మము ఆక్రియలను చేయలేనట్టివి లేక అల్పముగా క్రియలను చేయునట్టివి ఏకకాలమున అనేక క్రియలను చేయలేవు ఉదా శబ్దము ఒకే కాలమున అనేక శబ్దములను ఆరంభించుచున్నది అగ్ని ప్రకాశ (వెలుతురు) దాహములను ఒకే కాలమున కల్గించుచున్నది అట్లే ఒక ద్రవ్యము ఏక కాలమున సామాన్య విశేషములను

గల్గించును అందువలననే ఆచార్యుడు “తస్మాద్భేషజం సమ్యగవచార్యమాణం యుగపదూనాతిరిక్తానాం ధాతూనాం సామ్యకరం భవతి అధికమపకర్షతి న్యూనమా ప్యాయయతి (శా అ 6) అనగా యుక్తి యుక్తముగా నుపయోగించిన ఔషధము ఏక కాలమున హెచ్చుతగ్గులు గలిగిన ధాతువులను సమానముగా జేయును వృద్ధినొందినవాటిని తగ్గించును క్షీణించిన వాటిని వృద్ధినొందించునని చెప్పినాడు క్షీణించుచున్న ధాతువులుగల వృద్ధునికి, మరియు బహుదోషములు గలవానికి సమానగుణమైన ఆహారముగూడా వృద్ధి కారణముగాదు అదెట్లనగా గ్రీష్మ ఋతువునందు మధుర ప్రధానమైన ఆహారము తీసుకొన్నను తత్సమానమైన కఫమువృద్ధి జెందదు గదా అను సందేహము గలుగవచ్చును కాని ఇచట నొక విశేషము తెలుసుకోవలయును అదేమనగా క్షీణించుచున్న ధాతువులు గల వృద్ధులందు ధాతువృద్ధి కలుగకుండుటకు, బహుదోషములుగలవారియందు ధాతువృద్ధి కలుగకుండుటకు ప్రతిబంధకములైన జరా, బహుదోషత్వము (దోషములధికముగా నుండుట, గ్రీష్మమునందలి ఉష్ణత్వము మొదలగు కారణములు సామాన్యము విరోధికారణము లేనప్పుడే వృద్ధికారణమగును అనునది సిద్ధాంతము అందువలన వృద్ధులందు, బహుదోషములందు గ్రీష్మకాలమున సమాన భావములచే వృద్ధిలేకుండుటలో తప్పులేదు లేక వృద్ధులు మొదలగు వారి యందు సమానమైన ఆహారముతో వృద్ధికలుగును కాని అతిబలవంతములైన క్షీణహేతువులతో ధాతు క్షీణము సంభవించుచుండుట వలన సమాన ఆహారములో గలుగు వృద్ధి కనిపించదు ఇచటగూడా ద్రవ్యరూపమైన ధాతువులను వృద్ధినొందించునది ద్రవ్యసామాన్యమేగాని గుణ సామాన్యముగాదు కారణమేమనగా గుణములు ద్రవ్యమును అరంభించవు (గుణములు ద్రవ్యము పుట్టించలేవు) అందువలననే గుణసామాన్యము అనునపుడు గుణమునకాశ్రయమైన ద్రవ్యము ఊహించుకోవలయును అట్టిగుణాశ్రయమైన ద్రవ్యము ధాతువర్ధకమగును ఉదా రూక్షము మొదలగు గుణములుండుట వలన చిత్రకము వాతాధికమైనదిగా ఊహించి నిర్ణయించబడినది అట్టి చిత్రకమునుపయోగించిన అది వాతమునువృద్ధినొందించును కావున గుణములు గుణములనే పుట్టించుచు వాటిని వృద్ధినొందించును అందువలననే వృద్ధి లక్షణముగా గలది మాత్రమే సామాన్యముగాని సాక్షాత్తుగా సామాన్యమువృద్ధికారణముగాదని ఇంతకు పూర్వమే చెప్పబడినది ఇదే విధముగా విశేషమును గూడా తెలుసుకోవలయును మరియు పై చెప్పబడిన సామాన్య విశేషవాదము ఇంకను ఉన్నప్పటికిని గ్రంథ

విస్తారభీతిచే ఆయుర్వేదమునుపయోగించు ధర్మములు మాత్రము ఇచట చెప్పబడి నవి ఇంకను విపులీకరణ అవసరమైనచో వైశేషికమున తెలుసుకోవలయును

## ఆయురధికరణము

శ్లో॥ సత్వమాత్మాశరీరంచ త్రయమేతత్త్రిదండవత్।
లోకస్తిష్ఠతిసంయోగాత్తత్ర సర్వం ప్రతిష్ఠితమ్॥ 46

సపుమాంశ్చేతనం తచ్చ తచ్చాధికరణం స్మృతమ్।
వేదస్యాస్యతదర్ధంహి వేదోయం సంప్రకాశితః॥ 47

తాత్పర్యము "సామాన్యంచ విశేషంచ గుణాన్ ద్రవ్యాణికర్మచ" అని చెప్పిన ఆనుపూర్వి ప్రకారము తొలుత నిర్దేశింపబడిన సామాన్య విశేషములు పైన నిరూపింపబడినవి పిమ్మట క్రమప్రకారము గుణము చెప్పవలసియున్నను అందు ప్రధానమును, ఆయుర్వేద ఉపకార్యంబును, ఐన సత్వ, ఆత్మ, శరీర సంయోగ రూపమైన హేత్వాద్యధికరణము చెప్పడుచున్నది

సత్త్వము (మనస్సు) ఆత్మ, శరీరము ఈ మూడును చేరి మూడు స్తంభముల వలె లోకమునకు (జంగమ రూపమైన భూతగ్రామమునకు) ఆధారమైయుండును అనగా జంగమ రూపమైన ప్రపంచము సత్త్వ, ఆత్మ, శరీరములను మూడింటినాధారముగ జేసికొని అట్టి ఆధారము వలన తమతమ పనులకు హానిలేక నిలబడియుంటున్నది ఈ లోకమునందు కర్మఫలము మున్నగునవన్నియు అట్టి సత్వాత్మ శరీరసంయోగ రూపమైన ఆధారమునందే అధారపడియుండును మరియు పై జెప్పిన సత్త్వము, ఆత్మ, శరీరము అను నీమూడు ఒక్కటిగ జేరిన పురుషుఁడనియు, జ్ఞానమనియు జెప్పబడును మరియు నీయాయుర్వేదమునకదియే యధికరణమనియు చెప్పబడును అట్టి సత్త్వాత్మ శరీరములకుపకారమునకై ఈ ఆయుర్వేదము ప్రవర్తించినది గాన ఆయుర్వేదమునకు సత్వాత్మశరీర సంయోగము అధికరణమని భావము

చ పా వ్యా ఆ అ సామాన్య విశేషములను చెప్పిన పిదప క్రమముననుసరించి గుణము లను చెప్పవలసియుండగా గుణములందు ప్రధానమైనదియు మరియు ఆయుర్వేద ఉపకార్యము ఐన సత్త్వ, ఆత్మ, శరీర సంయోగ రూపమైన హేత్వాద్యధికరణమును "సత్త్వ మాత్మ సంప్రకాశిత" అను శ్లోకములతో చెప్పుచున్నాడు అనియు లేక సామాన్య విశేషములతోనే హేతు, లింగ, ఔషధములు తెలుపబడినవి అందువలన (సామాన్య విశేషములతో హేతులింగౌషధములు తెలుపబడుటవలన) సామాన్య

విశేషములను చెప్పుట ద్వారా హేతులింగౌషధములు మాత్రమే చెప్పినట్లగును అధికరణము (అధికరణమనగా హేతు, లింగ, ఔషధములకు ఆశ్రయము) చెప్ప బడలేదు, గాన "సత్త్వమాత్మా శరీరంచ" అను శ్లోకములతో హేతు, లింగ, ఔషధ ములకు అధికరణమును చెప్పుచున్నాడు సత్త్వం అనగా మనస్సు "చ" అను శబ్దము సముచ్చయార్థమును (అన్నింటియొక్క కలయికను) సూచించును సత్త్వం, ఆత్మా, శరీరం అని మూడు సంఖ్యలుగల పదములతో చెప్పబడుట వలన మూడు అని అర్థము వచ్చినప్పటికిని "త్రయం" అని చెప్పుటవలన మూడింటిని (సముచ్చయముగా) కలిపి గ్రహించవలెనేగాని ఒక్కొక్కటిగాదని భావము అనగా మూడు కలిసియే ఆయుర్వేదాధికరణముగాని విడివిడిగా గాదని భావము ఏతత్ అనునది చెప్పబడిన (సత్త్వ, ఆత్మ, శరీరములు) వాటిని తరువాత నిర్దేశించుటకుపయోగించబడిన శబ్దము (పై చెప్పిన సత్త్వ, ఆత్మ, శరీరముల యొక్క కలయిక అని అర్థము) త్రిదండః అనగా పరస్పరసంయోగముతో నిలచియుండు కుండలను ధరించు చక్రము ఈ చక్రమునకు మూడు దండములుండును వాటిలో ఏ ఒక్కదండము విరిగినను ఆ చక్రము నిలవదు అదే విధముగా సత్త్వ, ఆత్మ, శరీరములను మూడింటిలో ఏ ఒక్కటి నశించినను (లోకము) నిలువజాలదు "లోకః" అనగా లోకతే ఆలోకతే ఇతి లోకః అను వ్యుత్పత్తిచే జంగమ రూపమైన ప్రపంచమని యర్థము సంయోగాత్తిష్ఠతి అనగా సత్త్వ, ఆత్మ, శరీరములు పరస్పరము ఒకదానితో నొకటి సంయుక్తములై, ఒకదానితో నొకటి సహకరించుచు తమ కార్యములను ఏ విధమైన ఆటంకములు లేక నిర్వర్తిం చుచున్నవి అని అర్థము ఇచట "శరీరం" అని చెప్పుటచేత ఇంద్రియములన్నియు శరీర శబ్దముచే గ్రహించబడి ఇంద్రియములు అని ప్రత్యేకముగా చెప్పబడలేదు "తత్రసర్వం ప్రతిష్ఠితమ్" అనుచోట కర్మ ఫలము, జ్ఞానము, సుఖము, దుఃఖము, జీవితము, మరణము, శుభము మున్నగునవన్నియు సత్త్వ, ఆత్మ, శరీరములనే ఆధారముగా చేసికొనియుండునని భావము ఈ విషయమే "అత్రకర్మ ఫలంచాత్ర జ్ఞానంచాత్ర ప్రతిష్ఠితం అత్రమోహః సుఖందుఃఖం జీవితం మరణం స్వతా॥ (శా అ1) అని శారీరస్థానములో చెప్పబడినది "సపుమాన్" అనగా సత్త్వ, ఆత్మ, శరీర సంయోగ రూపమైనవాడే పురుషుడని ఈ శాస్త్రమున చెప్పబడును ఇచట సత్త్వ, ఆత్మ, శరీర సంయోగమను శబ్దము నపుంసకలింగమైనప్పటికిని "పుమాన్" అను లింగవాచక శబ్దముచేత చెప్పబడుటవలన "సః" అని పుంలింగ విశేషణమైన సర్వనామ శబ్దమ నిర్దేశించబడినది ఉదా ణేరణౌయత్ కర్మణౌచేత్ సకర్తా (పా అ1, పా 3, ...

మరియు ఏతత్ అని వర్తమానకాలమును నిర్దేశించి దానినే "సః" అని అతీత కాలమున చెప్పుటచేత సర్వనామ శబ్దములకు సర్వకాలములందు ప్రవృత్తి యుండు ననుట విరుద్ధముగాదని తెలియజేయుట కొరకు ఆ విధముగా తెలుపబడినదని గ్రహించవలయును దీనిని గూర్చి లాక్షణికులీవిధముగా చెప్పుచున్నారు "ప్రత్యక్షేచ పరోక్షేచ సామీప్యేదూర ఏవచ ఏతేష్వర్థేషు విద్వద్భిః సర్వనామ ప్రయుజ్యతే" అనగా ప్రత్యక్షమునందును పరోక్షమునందును, సమీపమును సూచించు అర్థమునందును దూరమును తెలియజేయుట యందును ఈ అర్థములందు విద్వాంసులు సర్వ నామ శబ్దములనుప్రయోగింతురు చేతనం అనగా జ్ఞానము గలిగినది అట్టి జ్ఞానముగల పురుషుడు శాస్త్రమునకధికరణము "తదర్థం" అనువాక్యములో తంత్రమునధికరణ మగుటకు గల కారణమును తెలుపుచున్నాడు తదర్థం అనగా "ఆపురుషునకుపకారము చేయుటకై" ఈ వ్యుత్పత్తిననుసరించి ఆ పురుషునుద్దేశించి గలుగు తంత్ర ప్రవృత్తి అధికరణమను అర్థముననే ప్రయోగించబడినదిగాని ఆధారమను అర్థమున గాదు ఈ అధికరణమును చెప్పుసందర్భమున త్రిస్తంభములలో సత్త్వము మొదట చెప్పబడినది ఇందుకు కారణమేమనగా ఆత్మ శరీరముల యొక్క క్రియలు మనస్సునకధీనములైనవి గావున ఈ విషయము "అచేతనం క్రియా వచ్చమనచ్చేతయితా పరః। యుక్తస్యమనసా తస్య నిర్దిశంత్యాత్మనః క్రియామ్" అని (శా అ1 న) చెప్పబడినది అనగా పర ఆత్మసాక్షాత్తుగా క్రియవంతుడుగాడు ఆత్మను అధిష్టించియున్న మనస్సే క్రియావంతమై యుండును మనస్సు ఆత్మనధిష్టించి యుండుటవలన మనస్సుచేయు కర్మలు ఆత్మచేయుచున్నదని క్రియలు ఆత్మయం దారోపింపబడుచున్నవి అని అర్థము ఇంతకుముందు శరీరము అను శబ్దములో ఆయువు చెప్పబడినది 'సత్త్వమాత్మాశరీరం' అని తిరిగి ఇచట శరీరము చెప్పబడి నప్పటికిని ఇచట తంత్రాధికరణ భూతమైన పురుషుని చెప్పుటయందిచట శరీర శబ్దముఉపయోగించుట వలన సందర్భము అర్థములు వేరుగాన ఇచట పునరుక్తి దోషముండదు మరియు నిచట "ఆత్మ" అని చెప్పబడుటచేత "ఆత్మతోపాటు" బుద్ధి, అహంకారము మొదలగునవి గ్రహించబడును మరియు "శరీరం" అను శబ్దముతో దానికి సంబంధించిన ఇంద్రియములు ఇంద్రియార్థములు గ్రహించవలెను

## ద్రవ్యసంగ్రహము సేంద్రియ నిరింద్రియ విభాగము

శ్లో॥ ఖాదీన్యాత్మా మనః కాలో దిశశ్చద్రవ్య సంగ్రహః।
సేంద్రియంచేతనం ద్రవ్యం నిరింద్రియ మ చేతనమ్॥ 48

**తాత్పర్యము** నిర్దేశక్రమముననుసరించి గుణములు చెప్పవలసి యున్నను అట్టి గుణముల కాధారమైన ద్రవ్యము ప్రధానమైనదగుట వలన ద్రవ్యసంగ్రహమును తొలుత చెప్పుచున్నాడు ఆకాశము మొదలగు పంచమహాభూతములు, నిర్వికారమైన ఆత్మ, మనసు, కాలము, దిక్కులు ఇవన్నియుచేరి సంగ్రహముగ ద్రవ్యములు కరచరణాద్యవయవములు, హరీతకి, త్రివృత్, మొదలగు ద్రవ్యములనేకములుగ నుండును గాన ఇచట సంగ్రహముగ ద్రవ్యములు చెప్పబడినవి పై జెప్పిన వానిలో ఇంద్రియజ్ఞానము గలిగినది చేతన ద్రవ్యము ఇంద్రియజ్ఞానములేనిది అచేతన ద్రవ్యము

**చ పా వ్యా ఆం అ** నిర్దేశక్రమముననుసరించి గుణములను చెప్పవలసియుండగా ద్రవ్యములను చెప్పుట ద్వారా గుణములకాధారములుగాన ద్రవ్యమునకు గల ప్రాధాన్యతను తెలుపుచున్నాడు ద్రవ్యములను నిర్దేశించు "సామాన్యంచ విశేషంచ" అను సూత్రమున, గుణములను మొదటనిర్దేశించుట ద్వారా శాస్త్రమున రసాదిగుణములకు గల కార్ముకత్వము చెప్పబడుచున్నది అందువలననే ఆత్రేయ భద్రకాప్యీయమున (సూ 26అ) మధురాది రసముల ద్వారా ద్రవ్యమునకు అన్ని గుణములు, కర్మలు చెప్పబడును మరియు సర్వప్రధానమైన జీవితిమేదిగలదో అదే సంయోగరూపమైన గుణముగాన నిర్దేశమున గుణము మొదట గ్రహించబడినది ఆ సంయోగ రూపమైన గుణము "సత్వమాత్మ" అను సూత్రముచేత మొదటనే చెప్పబడినది విశేష గుణములందు మాత్రము ద్రవ్యము ప్రధానమని ఎంచి "ఖాదీన్యాత్మా" అను శ్లోకముతో ద్రవ్యమును చెప్పుచున్నాడు ఖాదీని అనగా ఆకాశము మొదలగు పంచమహా భూతములు ఆకాశాది పంచభూతములు చెప్పు సందర్భమున ప్రధానమైనదైనను ఆత్మ ఎందుకు మొదట చెప్పబడలేదు? అని ప్రశ్న అందుకు సమాధానమేమనగా ఈ వైద్యశాస్త్రమున వ్యాధులకు ఆరోగ్యమునకు అధికరణమైనది శరీరము అందువలన శరీరము ఇచట ప్రధానము దీనిని ఆరంభించునవైన ఆకాశము మొదలగు పంచభూతములు మొదట చెప్పబడినవి గాని ఆత్మను మొదట చెప్పనవసరము లేదు ఎందువలననగా ఆత్మ నిర్వికారమైనది ఇందుకు ప్రమాణము "నిర్వికారః

పరస్త్వాత్మా'' (సూ అ1) మొదలగు వాక్యములందుకు ప్రమాణములు ఆకాశాది మహాభూతములు ''మహాభూతానిఖంవాయురగ్నిరాపః క్షితిస్తథా'' (శా అ1) అని ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి అని క్రమముగా ముందు చెప్పబోవునవి అనాగతావేక్షణమను తంత్రయుక్తి ద్వారా గ్రహించబడినవి ఆత్మ మొదలగునవి గూడా ముందు చెప్పబడును ఐనప్పటికిని ఇచట ద్రవ్యసంగ్రహమున ముందుగా నిర్దేశించ బడినవి కరచరణాదులు, హరీతకీ త్రివృత్ మొదలగు ద్రవ్యభేదముల సంఖ్యాకములుగా నుండుట వలన కార్యద్రవ్యములనన్నింటిని ఈ కారణద్రవ్యముల ద్వారా సంక్షేపించి చూపబడినదని అర్థము ''సేంద్రియం'' అను రెండవ పాదములో సర్వకార్య ద్రవ్యములకు గల వ్యవస్థను చెప్పుచున్నాడు అచేతన ద్రవ్యములను చెప్పు సందర్భమున ''నిరింద్రియమచేతనమ్'' అని ''నిః'' అను ఉపసర్గ ప్రయోగించబడినది ''నిః'' అను దానికి అభావము ''లేదు'' అని అర్థము ''నిర్మక్షికమ్'' మక్షికలులేనిది అన్నట్లు అనగా ఇంద్రియములు లేనిది (ఇంద్రియ జ్ఞానము లేనిది) అచేతనద్రవ్యమని యర్థము ఇచట ''సేంద్రియం చేతనం'' అను దానితోనే అర్థాపత్తిలో నిరింద్రియమచేతనమను అర్థమువచ్చునప్పటికిని తిరిగి నిరింద్రియమచేతనమని అర్థము వచ్చినప్పటికిని ఇట్టి అర్థాపత్తిని అనైకాంతమను తంత్రయుక్తిననుసరించి కొందరు అట్టి అర్థమును గ్రహించరు గావున తిరిగి ''నిరింద్రియమచేతనం'' అని చెప్పబడినది ఉదా నవజ్వరమున దివా స్వప్నాదులు నిషేధించబడినవి అనగా అర్థాపత్తిననుసరించి జీర్ణ జ్వరమున దివాస్వప్నము చేయవచ్చునని అర్థము గ్రహింపబడును కాని అది సరిగాదు జీర్ణ జ్వరమునగూడా దివాస్వప్నాదులు నిషేధింపబడినవి అందువలన మూడు విధములైన శిష్యులయొక్క బుద్ధికి హితమగుటవలన ఊహించదగినదైనను అట్టిది సాక్షాత్తుగానే చెప్పబడును అందువలననే న్యాయకోవిదులు గూడా ''వ్యాఖ్యానాద్వరంకరణం'' అని చెప్పుదురు సత్వ, ఆత్మ, శరీరములలో ఆత్మయే చేతనములంతేగాని మనసునగాని, శరీరముగాని చేతనముగాదు ఇదే విషయము శాస్త్రమున గూడా ''చేతనావాన్ యతశ్చాత్మాతతః కర్తానిరుచ్యతే'' అనగా ఆత్మచైతన్యవంతుడగుటచేతనే కర్తగా చెప్పబడుచున్నాడని చెప్పబడుచున్నది ఐనప్పటికి వేడినీళ్ళవలె సంయుక్త సమవాయ సంబంధమువలన శరీరము మొదలగునవి చేతనములని చెప్పబడును అనగా నీరు వేడిగానుండనప్పటికిని కాచినపుడు ఉష్ణత్వము సంయుక్తసమవాయ సంబంధముతో నీటియందు ఉష్ణత్వమును గలిగించునో అట్లే చైతన్యము ఆత్మ సంబంధమున శరీరాదులందుగలిగి శరీరాదులు చైతన్యములు అని వ్యవహరించబడును ఇట్టి చేతనత్వము ఆత్మకు ఇంద్రియాదులతో

కలయిక గలిగినపుడు గలుగును అదియే జ్ఞానశాలిత్వము అంతేగాని కేవలాత్మకు చేతనత్వము లేదు అందువలననే శాస్త్రమున "ఆత్మాజ్ఞః కరణైర్యోగాత్ జ్ఞానంత్వ స్యప్రవర్తతే" (శా అ1) అనగా ఆత్మ తెలుసుకొనువాడు, సాధన (ఇంద్రియ) యోగమువలన ఆత్మకు జ్ఞానము ప్రవర్తించును అని చెప్పబడినది ఇచట సేంద్రియములనగా వృక్షములు మొదలగువాటికి కూడా సేంద్రియత్వము తెలుపబడినది ఉదా అదెట్లనగా "సూర్యభక్త" ప్రొద్దుతిరుగుడు పూవు సూర్యునియొక్క భ్రమణముననుసరించి గతిని మార్చుకొనును అట్లే లవలీ ఉరుము శబ్దమువినబడినపుడు ఫలించును బీజపూరకము శృగాలము (నక్క) మొదలగువాటి యొక్క వసాగంధముతో ఫలములనెక్కువగానిచ్చును మామిడి చెట్టుకుచేపలవసను ఇచ్చినచో పెద్దగా నుండునవైన ఫలములు గలిగి రసము అధికముగానగును అశోకవృక్షము కామినీ పాదతలముచే స్పృశించబడినపుడు పుష్పించుటను బట్టి ఆవృక్షమునకు స్పర్శజ్ఞానము గలదని అనుమానించబడును స్మృతిగూడా ఇట్టి అనుమానమును ధృవీకరించుచున్నది అదేమనగా "యోఽభివాది తవిప్రస్తునాశిషం సంప్రయచ్ఛతి। శ్మశానే జాయతేవృక్షా గృధ్రకంకోపసేవితః" నమస్కారముచేసినపుడు ఏ విప్రుడైతే ఆశీర్వాదముచేయడో అట్టివాడు గ్రద్ధ మొదలగు పక్షులతో సేవింపబడు వృక్షమైపుడతాడని స్మృతి అభిప్రాయము పై నుదాహరణముల ననుసరించి వృక్షములు గూడా చేతనములేయని గ్రహించవలసియున్నది మరియు "వృక్షగుల్మం బహువిధం తత్రైవతృణ జాతయః। తమసాధర్మరూపేణచ్ఛాదితాః కర్మహేతునా॥ అంతః సంజ్ఞాభవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః॥ ఏతదంతాశ్చగతయో బ్రహ్మాద్యా సముదాహృతాః॥ (మనుస్మృతి అ1) అనగా వృక్షములు, గుల్మములు, తృణజాతులు అధర్మరూపమైన కర్మవశమున అంధకారముచే ఆవరించబడినవై అంతఃసంజ్ఞగలవైసుఖదుఃఖములను పొందును అందువలన ఇవి అంతశ్చేతనములని బ్రహ్మాదులు చెప్పినారని మనుస్మృతి యందు వివరించబడినవి మరియు తంత్రకారుడు గూడా వృక్షములను మూగవైన ప్రాణులుగా చెప్పినాడు అందువలన ఆగమముతో జోడించి చెప్పినయుక్తి ననుసరించి వృక్షములు చేతనములే యని గ్రహించవలసి యుండును

## గుణనిర్దేశము

సూ॥ సార్థా గుర్వాదయోబుద్ధిః ప్రయత్నాంతాః పరాదయః।

గుణాః ప్రోక్తాః

తాత్పర్యము ఇంద్రియార్థములు (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు) గుర్వాదులు (గురు-లఘు-శీత-ఉష్ణ-స్నిగ్ధ-రూక్ష-మన్ద-తీక్ష్ణ-స్థిర-సర-మృదు-కఠిన-విశద-పిచ్ఛల-శ్లక్ష్ణ-ఖర-స్థూల-సూక్ష్మ-సాంద్ర-విశదములను నిరువది) బుద్ధి - (స్మృతి-చేతన- ధృతి - అహంకారముమున్నగు బుద్ధి విశేషణములును) ప్రయత్నము అనునది అంతముగాగల ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, ప్రయత్నము అనునవి ఐదును, పరాదులును (పర్వతము, అపరత్వము, యుక్తి, సంఖ్య, సంయోగము, విభాగము, పృథక్త్వము, పరిమాణము, సంస్కారము, అభ్యాసము అనునవి పరాదులు) ఇవన్నియు గుణములు

చ పా వ్యా ఆం అ సార్థా అను సూత్రముతో గుణములను నిర్దేశించుచున్నాడు ఈ సూత్రము ద్వారా వైశేషిక, సామాన్య ఆత్మగుణములను మూడు విధములైన గుణములను తెలుపుచున్నాడు వాటిలో "అర్థాః" అనగా శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను ఐదు ఇంద్రియార్థములు శారీరస్థానము అధ్యాయము 1 యందు "అర్థాః శబ్దాదయోజ్ఞేయా గోచరా విషయా గుణాః" (శా అ 1) అనగా ఇంద్రియముల ద్వారా గ్రహింపబడు విషయములు శబ్దములు మొదలగునవి గుణములు స్థూల రూపమును పొందినపుడు వాటిని అర్థములందురు ఇవి విశేషగుణములు ఎందుకనగా ఈ గుణములు ఒక ప్రత్యేకమైన మహాభూతమునకు సంబంధించినవి గావున విశేషగుణములనబడును ఎట్లనగా ఆకాశము యొక్క గుణమే (ప్రధానముగా) శబ్దము స్పర్శ ప్రధానముగా వాయువు యొక్క గుణమే ఇట్లే అగ్ని మొదలగు వాటి యొక్క గుణములు ప్రధానముగా రూపాదులే ప్రధానముగా ఆయా గుణములు ఆయా మహాభూతములందున్నప్పటికిని ఒక మహాభూతమునందు ఇతర గుణములు గూడా కన్పడును అందులకు కారణము భూతాంతరాను ప్రవేశము (అనగా ఒక మహాభూతము ఇంకొక భూతమునందు ప్రవేశించుట) ఇందుకు ప్రమాణము "విష్టం హ్యాపరంపరేణ" (న్యా ద అ3 ఆ1 సూ 66) అనగా పూర్వమహాభూతము తన గుణములతో తరువాతి మహాభూతమున ప్రవేశించును ఉదా ఆకాశము వాయువు నందు, ఆకాశ వాయువులు అగ్నియందు, ఆకాశ వాయు, అగ్నులు జలమునందు, ఆకాశ,వాయు, అగ్ని,జలములు పృథివియందు ప్రవేశించును ఇవి వైశేషిక గుణములు

గుర్వాదులనగా గురు-లఘు-శీత-ఉష్ణ-స్నిగ్ధ-రూక్ష-మంద-తీక్ష్ణ-స్థిర-సర- మృదు-కఠిన - విశద-పిచ్ఛిల-శ్లక్ష్ణ-ఖర-స్థూల-సూక్ష్మ-సాంద్ర-ద్రవములని 20 గుణములు ఇవి సామాన్య గుణములు పృధ్వివ్యాదులందు సామాన్యముగా నుండునవి తరచుగా నీగుణములు ఆయుర్వేదముననుపయుక్తములు కావున యజ్జఃపురుషీయమున పరాది గుణములకంటే వేరుగా పేర్కొనబడినవి బుద్ధిః అనగా జ్ఞానము దీనిలో బుద్ధి విశేషములైన స్మృతి, చేతన, ధృతి అహంకారము మొదలగు వాటిని గ్రహించి ప్రయత్నము అంతముగా చెప్పబడిన ఇచ్ఛా-ద్వేషము-సుఖము-దుఃఖము-ప్రయత్నము మొదలగువాటిని గూడా గ్రహించవలయును ఈ రెండింటిని కలిపి అనగా బుద్ధి మొదలుకొని ప్రయత్న అంతము వరకు గల గుణములు ఆత్మగుణములు ఇందుకు ప్రమాణము "ఇచ్ఛాద్వేషః సుఖం దుఃఖం ప్రయత్నః చేతనా ధృతిః। బుద్ధి స్మృతి రహంకారో లింగాని పరమాత్మనః" (శా అ1) అనగా పైజెప్పబడిన బుద్ధి మొ॥ కొని ప్రయత్నము వరకు గల గుణములు ఆత్మగుణములని యర్థము ఈ సందర్భమున బుద్ధిశబ్దముచేతనే చేతన మొదలగునవి (ధృతి-స్మృతి-అహంకారములు) గ్రహించబడును శారీరమున మాత్రము ఆత్మను తెలియజేయునవగుట వలన చేతనాదులు విడిగా చెప్పబడును ఈ విషయము అచటనే చర్చించబడును పరాది గుణములేవనగా "పరాపరత్వేయుక్తిచ సంఖ్యాసంయోగఏవచ। విభాగశ్చ పృధక్త్వంచ పరిమాణ మథాపిచ॥ సంస్కారోఽభ్యాస ఇత్యేతేగుణాః ప్రోక్తాః పరాదయః (సూ అ26) అనగా పరత్వము, అపరత్వము, యుక్తి, సంఖ్యా, సంయోగము, విభాగము, పృధక్త్వము, పరిమాణము, సంస్కారము, అభ్యాసము ఇవి పరాదిగుణములని యర్థము ఇవియును సామాన్య గుణములైనప్పటికిని ఎక్కువగా ఉపయుక్తములు గాకుండుటవలనను బుద్ధి ప్రధానమైనదగుట వలన మొదట బుద్ధి గుణములను (ఆత్మగుణములను) చెప్పి చివర పరాదిగుణములు చెప్పబడినవి ప్రోక్తాః అనగా మొత్తము మీద పై జెప్పబడిన గుణములన్నియుకొంత విశిష్టతను గలిగియున్నవిగాన ఉత్కృష్టములైనవిగా చెప్పబడినవని యర్థము

## కర్మనిర్దేశము

సూ॥ ప్రయత్నాది కర్మచేష్టితముచ్యతే ॥49

తాత్పర్యము ప్రయత్నము మొదలగు చేష్టారూపమైన వ్యాపారము కర్మయనబడును

చ పా వ్యా ఆం అ ఒక కార్యార్థమై కల్గిన ఆత్మయొక్క క్రియారూపమైన ప్రవృత్తి ప్రయత్నమనబడును ఉదా తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్ (పా అ 1/1/19) అనుచోట ప్రయత్నము తెలియజేయబడినది "ప్రయత్నాది" అనుచోట "ఆది" శబ్దము ప్రకార వాచకమై సంస్కార గురుత్వము మొదలగు వాటివలన గల్గిన అన్ని క్రియలను గ్రహించును చేష్టయనునది ప్రాణి వ్యాపారమైనప్పటికిని ఇచటమాత్రము సాధారణముగా క్రియను బోధించునదైయున్నది "చేష్టితం"అను పదముచేతనే సర్వకర్మల ప్రాప్తి, మరియు వమనాది కర్మల నిషేధము సిద్ధించినప్పటికిని మిక్కిలి సూక్ష్మరూపములైన కర్మలయందు గూడా కర్మశబ్దము వ్యాపించునని తెలియజేయుటకై "ప్రయత్నాది" అను శబ్దము చేర్చబడినది కొందరు మాత్రము "ప్రయత్నాది" అను శబ్దమును ప్రయత్నమునకు కారణము అని చెప్పి కారణముచేత తెలియజేయబడునది ప్రయత్నము అని చెప్పుచున్నారు ఈ వ్యుత్పత్తిననుసరించి గురుత్వము మొదలగు కార్యములు గూడా కర్మశబ్దవాచ్యములగును ఆయుర్వేదమునగూడా ప్రయత్న శబ్దము కర్మ శబ్దవాచకమైనదిగా తెలుపబడినది అది ఏమనగా "ప్రవృత్తిస్తుచేష్టా కార్యార్థా, సైవక్రియా ప్రయత్నః కార్యసమారంభశ్చ" (వి స్థా అ 8) అనగా ఒక కార్యమును నెరవేర్చుటకై గల్గిన ఆంగికాదిచేష్టయే ప్రవృత్తియనబడును అదే క్రియయనియు, ప్రయత్నమనియు, కార్యసమారంభమనియు చెప్పబడును అనగా ఒక కార్యమును సాధించుటకై కలిగిన ఆంగికాది చేష్టా రూపమైన వ్యాపారము కర్మయని ఫలితార్థము

## సమవాయము, దాని లక్షణము

శ్లో॥ సమవాయోఽపృథగ్భావో భూమ్యాదీనాం గుణైర్మతః।
సనిత్యోయత్ర హి ద్రవ్యం నతత్రానియతో గుణః॥ 50

తాత్పర్యము ఈ శ్లోకమున సమవాయమును నిర్దేశించి దాని లక్షణము చెప్పబడును గావున పైన చెప్పబడు ద్రవ్యాది లక్షణములతో గూడా సమవాయ లక్షణమును ప్రత్యేకముగా చెప్పుటలేదు

పృథగ్భావము అనగా వేరుగ నుండుట అపృథగ్భావమనగా సర్వకాల సర్వావస్థలయందును ఒకదానినొకటి విడనాడక ఒకటిగా జేరి యుండుట అనేకములగు ఆధేయములకు ఆధారములైనవి భూమి మొదలగు ద్రవ్యములు, కావుననే అవి ప్రధానములు, అట్టి భూమి మొదలగు ప్రధాన ద్రవ్యములనాధారముగ జేసికొని

శబ్దము స్పర్శము మొదలగునవి గురు మొదలగు అన్ని గుణములు అవయవికి సంబంధించిన సామాన్యకర్మములును నిలచియుండును కావుననే గుణాదులు ఆధేయములు ఇవి ఆధారములుగా ద్రవ్యములకన్న అప్రధానములు గుణ శబ్దమునకు అప్రధానమని యర్థము గలదు (గుణీభూతము అను స్థలములందు అప్రధానము అను అర్థము చేయుట సంప్రదాయ సిద్ధము)

పలువిధములై అప్రధానములైన శబ్ద స్పర్శములు మొదలగు గుణములు మున్నగువానిలో అట్టి గుణాదులకు ఆధారములగుట చేసి ప్రధానములైన భూమి మొదలగు ద్రవ్యములకు గల అపృథగ్భావము (సర్వకాల సర్వావస్థలయందును విడనాడక కలిసియుండుట) సమవాయమనబడును అట్టి సమవాయము నిత్యము ఎట్లనగా ఎచట ఆకాశము మొదలగు ద్రవ్యమునిత్యముగనుండునో అచట ఆ ద్రవ్యము నకు సంబంధించిన ఆకాశత్వాది గుణములు నియతముగా నుండును కావున ఆ రెంటికి గల విడదీయరాని సంబంధమే సమవాయమగును గుణిని విడచి గుణములుండవు కావున నీరెండింటికిని నిత్యసంబంధము అదియే సమవాయము కావుననది నిత్యము అని పిండితార్థము

అవయవ అవయవి ద్రవ్యములకును, గుణగుణి (ద్రవ్య)లకును, కర్మ కర్మవంతములకును, సామాన్య సామాన్యవంతములకును అవినాభావ సంబంధ ముండును అదియే సమవాయము. గుణములను వదలి గుణి వేరుగానుండుట అసంభవము కావున ఆ రెండింటికి చేరిన సమవాయ సంబంధము నియతమని భావము

చ పా వ్యా అం అ సమవాయః అనుశ్లోకముతో షట్పదార్థములందలి సమవాయమును చెప్పుచున్నాడు ఈ శ్లోకమున సమవాయమును నిర్దేశించి దానినే లక్షణముగా చెప్పు చున్నాడు అందువలన ద్రవ్యాది లక్షణములను చెప్పునపుడు మరల దీని లక్షణము చెప్పబడదు ఇందు "అపృథగ్భావములను" లక్షణముగా చెప్పి "సమవాయ"మును లక్ష్యముగా చెప్పినాడు అపృథగ్భావమనగా వేరుగా నుండకుండుట, ఒకేచోట కలిసియుండుట అని భావము ఉదా అవయవము, అవయవి ఈ రెండింటికి గల సంబందము గుణ గుణి సంబంధము కర్మ, కర్మవత్, సామాన్య, సామాన్యవత్ లకు

గల సంబంధము అపృథగ్భావ సంబంధము అవయవములు లేకుండా అవయవి యుండదు కావున అవయవ, అవయవిలకు గల సంబంధము సమవాయము అనబడును "భూమ్యాదీనాం" అను శ్లోక పాదముచేత అపృథగ్భావమును విశేషించి చెప్పుచున్నాడు భూమ్యాదీనాం భూమివంటివైన వాటికి (అనగా ఇతరములైన ద్రవ్యములకు) ఇచట భూమి గ్రహించుటకొక వైశిష్ట్యము గలదు అది ఏమన భూమియే అనేకములైన ఆధేయముల కాధారము అందువలననే ఆధారమునకుదాహరణముగా భూమి చెప్పబడినది అంతేగాక, భూమికర్థములైన (అర్థము అను శబ్దము ఇంతకుముందే గుణములను వివరించు సందర్భమున వివరించబడినది) గుర్వాది గుణములు, పరాది గుణములు అన్నియు అవయవి సామాన్య ధర్మములైనప్పటికిని అవన్నియు భూమియందున్నట్లుగా అన్ని ఇతర ద్రవ్యములందు లేవు అనగా ఇతర ద్రవ్యములందు ఒక్కొక్క ద్రవ్యమునందు కొన్ని కొన్ని గుణములు మాత్రమే యుండగా పృథివియందు పరస్పరాను ప్రవేశన్యాయముననుసరించి అన్ని భూతముల యొక్క గుణములు మరియు సామాన్య గుణములైన పరాదులు గూడా అన్ని కలిసి ఒక భూమియందు మాత్రమేయుండును అందువలన సర్వాధేయ సంపత్తి (ఆశ్రయించియుండు అన్ని పదార్థముల యొక్క స్థితి) పృథివి యందు మాత్రమే గలదు గాని ఇతర ద్రవ్యములందు లేదు గాన పృథివి ఉదాహరణమునకై గ్రహించబడినది దీనిననుసరించి భూమ్యాదీనాం అనగా ఆధారములైన ద్రవ్యములయొక్క అని అర్థము గుణైః అనగా గౌణత్వాత్ గుణః అనగా అప్రధానములైన ఆధేయములచే (ఆశ్రయించియుండునవి), ఆధేయము ఆధారమునకంటే అప్రధానము అప్రధానమను అర్థమున గుణశబ్దము చెప్పబడును ఉదా గుణీభూతోఽయమితి, అనగా అప్రధానమని యర్థము ఆధారములైన, ప్రధానములైన, భూమి మొదలగు వాటికి అప్రధానములైన గుణములైన, ఆధేయములైన గుణములకు గల అపృథగ్భావము (విడదీయరాని సంబంధము) సమవాయమనబడును దీనిననుసరించి చూచినపుడు పృథివియందుగల పృథివీత్వము, గంధమునందుగల గంధవత్వములకు పృథగ్భావము లేనప్పటికిని ఆధారాధేయ భావము లేకుండుట వలన సమవాయసంబంధములేదని చెప్పవలసి యుండును అని పూర్వపక్షము ఆ పూర్వపక్షమును దృష్టిలో యుంచుకొనియే వైశేషికమున "అయుత సిద్ధానామాధార్యా ధారభూతానాం యః సంబంధః ఇహేతి

ప్రత్యయహేతుః సమవాయః'' (ప ధ సం ద్రవ్య పదార్థ నిరూపణం) అయుత సిద్ధములైన ఆధార ఆధేయభూతములయొక్క సంబంధము ఇది అను జ్ఞానము గలుగుటకు కారణమైనది సమవాయము (అయుతసిద్ధమనగా ఏ రెండింటిలోనైన ఒకటి నశించనిదై ఇంకొకదాని నాశ్రయించి ఉన్నచో అప్పుడవి రెండు అయుత సిద్ధములు ఉదా గుణము - గుణి, ఘటము -కపాలము మొదలగు ఇట్టి సంబంధము నిత్యము అనియు దీనికి (సమవాయమునకు) వినాశము లేదనియను అర్థము ఎందు వలననగా సమవాయి ద్రవ్యములు నశించినప్పటికిని సమవాయము మాత్రము నశించదు సమవాయమునకు నాశములేదనుటకుగల కారణమును ''యతహి'' అను వాక్యముతో చెప్పుచున్నాడు ఎచ్చటనైతే ద్రవ్యము సర్వకాల సర్వావస్థలయందును నియతముగా నుండునో అచ్చట నిత్యముగా (సర్వకాల సర్వావస్థలయందును) నశించనట్టి గుణముండును ఉదా ఆకాశము ఆకాశమున్నంత వరకు దానినాధారముగా జేసుకొన్న శబ్దగుణముండును మరియు నిత్యమైన ఆకాశమున గల పరిమాణము నిత్యమే అట్లే ఆకాశము ద్రవ్యముగాన ఆకాశమునగల ద్రవ్యత్వమునిత్యమే నిత్యములైన ఆకాశముదానిగుణములైన పరిమాణము ద్రవ్యత్వములకు గల సంబంధము సమవాయము అది కూడా నిత్యమేయగును ఇట్లు ఆకాశమున సమవాయము నిత్యముగా సిద్ధముచేయబడుటవలన సమానమైన ఈ సమవాయము ఇతర ద్రవ్యములందుగూడా నిత్యముగానే యుండును మరియు నిత్యమైన నీ సమవాయము ఆశ్రయమైన ద్రవ్యము నశించినపుడును సమవాయము నశించదు ఉదా ఒక గోవునశించినను సమవాయముగల గోత్వము నశించదు నిత్యమైన సమవాయమునకు పార్థివ ద్రవ్యములు మొ॥నవి వ్యక్తులుసామాన్యమున కెట్లువ్యంజకములగునో అట్లే వ్యంజకములగును కొందరు సమవాయమును నిత్యము, అనిత్యములని రెండు విధములుగా వ్యాఖ్యానించినారు ఈవాదము పృధివీ మొ॥ వాటికి గుణములతో ఏ సంబంధముగలదో అట్టిదానినే ప్రతిపాదించుచున్నదని తెలియుచున్నది ఇది వైశేషిక మతానుయాయికాకుండుట వలనను, అంతగా ప్రసిద్ధి చెందకుండుట వలనను ఇచట వివరించబడలేదు

సూ॥ యత్రాశ్రితాః కర్మగుణాః కారణం సమవాయియత్। తద్ద్రవ్యం

తాత్పర్యము  క్రియారూపమైన కర్మయు, 'సార్థాగుర్వాదయో'' అను శ్లోకముతో చెప్పబడిన విశేష సామాన్య ఆత్మ గుణములు దేనియందు ఆశ్రయించి సమవాయిగ (సమవాయ సంబంధము గల్గినదిగ) నుండునో అది ద్రవ్యమనబడును

చ పా ఆం అ  "యత్ర" అను శ్లోకముతో ద్రవ్యలక్షణమును చెప్పుచున్నాడు కర్మ గుణాః = కర్మలు (ప్రయత్నాది కర్మలు), గుణాః = సార్థ, గుర్వాది విశేష సామాన్య గుణములు, యత్రాశ్రితాః = దేనినాశ్రయించియుండునో, కారణం సమవాయియత్ = ఏది సమవాయి కారణమో అది అనగా ద్రవ్యము ద్రవ్యగుణకర్మలకు సమవాయి కారణము సమవాయి కారణమేదనగా ఏదైతే కార్యమునందు సాక్షాత్తుగా అన్వయించినదై కార్యోత్పత్తికి కారణమగునో అది సమవాయి కారణము గుణ కర్మలు సాక్షాత్తుగా కార్యమునందన్వయించి కార్యమునుత్పత్తి చేయజాలవు కావున నవి సమవాయి కారణములుగావు ఈ సూత్రమున చెప్పబడిన "కర్మకత్వ" లక్షణము "కర్మగలది ద్రవ్యము"అనునది గుణము మొ॥ ఐదు పదార్థముల నుండి ద్రవ్యమును వేర్పరచుటకై జెప్పబడిన లక్షణమెగాని సజాతీయములందు వ్యాపించి, విజాతీయముల వేర్పరచుటకై చెప్పబడిన లక్షణము కాదు దానిననుసరించి ఆకాశాదులకు కర్మ సమవాయముండదు అందువలన విజాతీయముల నుండి వేర్పరచుటకై ఆకాశాది ద్రవ్యములకు గుణవత్త్వము సమవాయికారణత్వము చెప్పబడినదని తెలుసుకోవలయును ఉత్పన్నకాల ప్రథమ క్షణమున ద్రవ్యమునిర్గుణము అయినప్పటికిని ద్వితీయ క్షణమున అవశ్యముగా గుణ సంబంధమేర్పడుట వలన "గుణవత్" అనగా గుణముగలదేయని గ్రహించవలయును వైశేషికమునగూడా "క్రియావద్గుణవత్ సమవాయికారణం ద్రవ్యమ్" (వై ద అ1 సూ15) అనగా క్రియగలదై గుణముగలదై సమవాయి కారణమైనది ద్రవ్యము అని చెప్పబడినది ఆ దర్శనమునందు గూడా ఇచటనేవిధముగా వ్యాఖ్యానించబడినదో అట్లే వ్యాఖ్యానించబడినది

సూ॥ సమవాయీతు నిశ్చేష్టః కారణం గుణః। 5

తాత్పర్యము  క్రియారూపమైన చేష్టలేక సమవాయ సంబంధమునకు ఆధేయమైన కారణము గుణమని చెప్పబడును (సమవాయ సంబంధము గలిగి ఆధేయతా ధర్మమునకు కారణమైనది గుణమని భావము)

చ పా వ్యా ఆం అ సమవాయి అనుసూత్రముతో గుణలక్షణమును చెప్పుచున్నాడు సమవాయీ = సమవాయ సంబంధమునకాధేయమైన, దీనినసుసరించి నిష్క్రియములైన వ్యాపక ద్రవ్యములైన ఆకాశాదుల నుండి గుణము వేర్పరచబడును కారణమేమనగా ఆకాశాదులు సమవాయ సంబంధమునకు ఆధేయములు గావు నిశ్చేష్టః =చేష్టలే కుండుట, చేష్టలేకుండుటయనగా చేష్టాశూన్యత్వము మరియు చేష్టావ్యతిరేకము అని గూడా అర్థము దీనినసుసరించి గుణము చేష్టారూపమైన కర్మనుండి వేర్పరచబడినది అట్లే క్రియలకాధారమైన మూర్తద్రవ్యముల నుండియు వేర్పరచబడినది గుణమునకు కారణము అని చెప్పుటవలన కారణములు గాని సామాన్య, విశేషములు, సమవాయ ముల నుండి గుణమువేర్పరచబడును ఐతే విభుద్రవ్యపరిమాణ అంత్యావయవి రూపము మొ॥ వాటిలో తెలుసుకోదగిన గుణములందు కారణత్వము లేదు అందువలన ఒక భాగమున లక్షణము సిద్ధించదు అందువలన కారణత్వమన గానిచట భావరూపమైన కారణము యొక్క అవ్యభిచారి సామాన్యత్వమును లక్షణముగా తెలుసుకోవలయును అట్టి సామాన్యవత్వము సర్వగుణములందు వ్యాపించినదియు, సామాన్యము మొదలగువాటిని (విశేషము, సమవాయము) ఏర్పరచునదియుఐ యున్నది కారణమేమనగా సామాన్యము మొదలగువాటికి సామాన్యవత్వముండదు గాబట్టి లేక విభుద్రవ్యములైన ఆకాశాది ద్రవ్యపరిమాణము యొక్క అంత్యవయవి రూపములకు గూడా కారణత్వముండుట వలన విభుద్రవ్యములైన ఆకాశాది ద్రవ్యపరిమాణ అంత్యావయవి రూపాదులందుగూడా కారణత్వ యోగ్యత్వముండును గాన వీటియందు కారణత్వమునకు భాగాసిద్ధతయుండదు లేక యోగజ ప్రత్యక్షజ్ఞానమునకు కారణములగుట వలన విభుద్రవ్య పరిమాణము మొ॥ వాటికి కారణత్వముండునని తెలుసుకోవలయును ఈ విధమైన కారణత్వము సామాన్య విశేష, సమవాయములందు కనబడినప్పటికిని "సమవాయీతు" అని పదమువలన సమవాయమునకాధారత్వము మరియు సమవాయమునకాధేయత్వము రెండు ఒకేసారి వివక్షితమగును దీనినసుసరించి కేవలము సమవాయమునకాధారమైన విభుద్రవ్యములు అట్లే కేవల సమవాయాధేయములైన సామాన్యము మొ॥నవి వేర్పరచబడుచున్నవి

## కర్మలక్షణము

సూ॥ సంయోగే చ విభాగే చ కారణం ద్రవ్యమాశ్రితం
కర్తవ్యస్య క్రియా కర్మ కర్మ నాన్యదపేక్షతే॥ 52

**తాత్పర్యము** సమకాలమున సంయోగ విభాగములు రెండింటికిని కారణమై ద్రవ్యమునాశ్రయించియుండునదియు, చేయదగిన పనికి సంబంధించినదియు, కారణాంతరమునపేక్షించనిదియునగు చేష్టారూపమైన క్రియ కర్మయని చెప్పబడును.

చ పా వ్యా అం అ "సంయోగే చ విభాగే చ" అను శ్లోకము ద్వారా కర్మలక్షణమును చెప్పుచున్నాడు సంయోగమునను విభాగమునను ఏకకాలమున కారణమైనది దీని ననుసరించి సంయోగే అనగా విభాగమునకు కారణముగాని ఉత్తర సంయోగ కారకమున, అట్లే "విభాగే చ" అనగా సంయోగమునకు కారణముగాని విభాగజన్యమైన కేవల విభాగకారణమునందు అతివ్యాప్తి తొలగించబడినది "ద్రవ్యమాశ్రితం"అను నీ శబ్దముచే కర్మస్వరూపము చెప్పబడినది "కర్మనాన్యదపేక్షతే" అను వాక్యముచేత కర్మ ద్రవ్యమున కంటేవేరైనదని చెప్పబడినది అనగా ఉత్పన్నమైన కర్మ తనకాశ్రయమైన ద్రవ్యము యొక్క పూర్వదేశవిభాగము, ఉత్తరదేశ సంయోగమును పొందుటలో ఉత్పన్నమైన తరువాత ఇంకొక కారణమునపేక్షించదు (కోరదు) ద్రవ్యము మాత్రము సంయోగ విభాగములకు ఏకకాలమున కారణమైనప్పటికిని ఉత్పన్నమైన ద్రవ్యము కర్మయుక్తమై నపుడే సంయోగ విభాగములలో కారణమగును కర్మ అట్లుగాక ఉత్పన్నమైనపుడు ఉత్పన్న పశ్చాత్కాలమున ఇతర కారణములనపేక్షించకయే సంయోగ విభాగములకు కారణమగును పోతే సంయోగ విభాగముల కాశ్రయమైన ద్రవ్యము యొక్క సాన్నిహిత్యమును అపేక్షించును కర్మకు గల ఇట్టి ద్రవ్యసన్నిహితత్వము కర్మ ఉత్పన్నము కాకపూర్వమే యుండుట వలన పశ్చాత్కాలమునందుద్భవించు కారణములనపేక్షించు నవసరము కర్మకు లేదు కర్మ శబ్దముచే నిచట వమనము మొదలగు కర్మలు అట్లే అదృష్టములైన క్రియలు చెప్పబడుటచే పై జెప్పబడిన లక్షణములు ఏ కర్మకు సంబంధించినది అను దానికి "కర్తవ్యస్య - క్రియాకర్మ" అని సమాధానము చెప్పుచున్నాడు దాని ననుసరించి ఇది క్రియా రూపమైన లక్షణమేగాని అదృష్టరూపమైక కర్మగాదని భావము

మూ। ఇత్యుక్తం కారణమ్

**తాత్పర్యము** ఈ విధముగా కారణ ద్రవ్యములు చెప్పబడినవి

చ పా వ్యా ఆం అ "ఇతి" అను వాక్యముతో ఈ ప్రకరణమునుపసంహరించు చున్నాడు "ఇతి" అనునది సమాప్తిచేయు పదము దీనిననుసరించి పై జెప్పబడిన సామాన్యము మొదలగునవి సమస్తములైన కార్యములకు కారణములు ఇవి తప్ప వేరే కారణములు లేవు అని చెప్పుచున్నాడు

### కార్య లక్షణము

శ్లో॥ కార్యంధాతు సామ్యమిహోచ్యతే।

ధాతుసామ్య క్రియాచోక్తా తంత్రస్యాస్య ప్రయోజనమ్॥ 53

తాత్పర్యము ఇతర శాస్త్రములవలెగాక ఈ వైద్య శాస్త్రమున ధాతు సామ్యరూపమైన ఆరోగ్యమె కారణమని చెప్పబడును మరియు ధాతుసామ్యరూపమైన ఆరోగ్యమే ఈ శాస్త్రమునకు ప్రయోజనము

చ పా వ్యా ఆం అ సామాన్యముగా కారణ ద్రవ్యములను చెప్పి "కార్యంధాతు" అను శ్లోకముతో ఆయుర్వేదమునకు ఉపయుక్తమైన కార్యమును చెప్పుచున్నాడు ధాతు సామ్యమనగా ఆరోగ్యము ఇదే విషయము "వికారోధాతువైషమ్యం సామ్యం ప్రకృతిరుచ్యతే। సుఖ సంజ్ఞక మారోగ్యం వికారోదుఃఖమేవచ॥" (సూ స్థా అ 9) అని ఈ తంత్రమునందేముందు చెప్పబడును ఇహ అనగా ఆయుర్వేద తంత్రమున ఇహ అని చెప్పుటవలన ఇతర శాస్త్రములందు ఘట పటాదులు కార్యములుగా చెప్పబడును ఇచ్చట (ఈ శాస్త్రమున చెప్పబడు కార్యమేదనుటకు సమాధానమును "ధాతుసామ్య' అను శ్లోకపాదముద్వారా చెప్పుచున్నాడు ఇచట చకారము కారణమును సూచించునదై యున్నది ఆయుర్వేదము యొక్క ప్రయోజనము ధాతు సామ్య క్రియయె గావున ఆయుర్వేమున ధాతుసామ్యక్రియయే కార్యముగా చెప్పబడును అదియే ఆయుర్వేదమునకు ప్రయోజనము గూడా

### రోగ కారణ సంగ్రహము

శ్లో॥ కాలబుద్ధీంద్రియార్థానాం యోగో మిథ్యానచాతిచ।

ద్వయాశ్రయాణాం వ్యాధీనాం త్రివిధో హేతు సంగ్రహః॥ 54

**తాత్పర్యము** శీత, ఉష్ణ, వర్ష భేదములచే మూడు విధములైన కాలము, బుద్ధి (ప్రకర్ష జ్ఞానము) ఇంద్రియార్థములు (పంచమహాభూతగుణములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు) అనునీమూడింటి (కాల, బుద్ధి, ఇంద్రియార్థముల) యొక్కయు, ఇంద్రియార్థ సహచరితములై ఇంద్రియముల యొక్క ద్వారకముగనుపయోగింప 

బడు ద్రవ్యగుణకర్మల యొక్క హీనయోగము (నియమిత పరిమాణముకన్న తక్కువ సంబంధము గల్గియుండుట), మిథ్యాయోగము (తనకుండవలసిన పరిస్థితి కన్న వ్యతిరేకముగ సంబంధము గల్గుట), సంబంధము బొత్తుగా లేకుండుటయు, అతి యోగము (తనకు నియమితమైన పరిమాణముకన్న అధికముగ సంబంధము గల్గి యుండుట) ఇవి శరీరమును మనస్సును ఆశ్రయించి జనించు వ్యాధులకు కారణములగును (అనగా శీత-ఉష్ణాది కాలమునకును, బుద్ధికిని, శబ్దస్పర్శాది ఇంద్రియార్థములకును సంభవించు హీన, మిథ్యా, అతియోగములు అనబడు మూడును శారీరమానస వ్యాధులనబడు రెండింటికిని కారణములగును ఇది వ్యాధి హేతువుల సంగ్రహము అని భావము)

చ పా వ్యా అం అ పైన సామాన్యముగా కారణము చెప్పబడినది అట్టి కారణముల నాయుర్వేదోపయుక్తములుగా చెప్పవలసియున్నది అట్టి కారణములలో "కాలబుద్ధీంద్రియార్థానాం" అను పై శ్లోకము ద్వారా సూత్రక్రమముననుసరించి మొదట వ్యాధికారణమునే చెప్పుచున్నాడు సూత్రక్రమమేదనగా "హేతులింగౌషధ జ్ఞానం" (సూ స్థా అ1) అను శ్లోకముననుసరించి మొదట హేతువులు, అటు తరువాత లక్షణములు ఆపైన ఔషధములు ఇది సూత్రక్రమము అందువలన మొదట వ్యాధి హేతువులు ఇచ్చట "కాలబుద్ధీ" అను శ్లోకము ద్వారా చెప్పబడుచున్నవి కాలః = శీత, ఉష్ణ, వర్షలక్షణమైన కాలము, బుద్ధిః = ప్రజ్ఞ, ఇంద్రియార్థాః = శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, అనునవి ఇంద్రియార్థములు వాటి తో సహచరితములై ఇంద్రియముల యొక్క ద్వారకముగనుపయోగింపబడు ద్రవ్యగుణకర్మలు వాటి యొక్క, యోగః = సంబంధము, అట్టి కాలము మొదలగువాటి యొక్క సంబంధ విశేషణములు మూడు అవి "యోగో మిథ్యానచాతిచ" అని దీనిననుసరించి కాలము మొదలగు వాటి యొక్క మిథ్యాయోగము, అయోగము, అతియోగములు ద్వయాశ్రయాణాం = మనస్సును శరీరమును ఆశ్రయించిన వ్యాధుల యొక్క అని యర్థము పై జెప్పబడిన శరీరాధిష్ఠానములైన, మనోఽధిష్ఠానములైన వ్యాధులయొక్క కారణములు విడివిడిగాగాని లేక కలిపిగాని ఆయా వ్యాధులకు కారణములగును అనగా పై జెప్పబడిన కారణము ఒక శరీరాధిష్ఠానములైన వ్యాధులకు అట్లే ఒక్క మనస్సు మాత్రమే ఆశ్రయించిన వ్యాధులకు విడివిడిగా కారణములగును లేక ఒక్కొక్కప్పుడు రెండింటినాశ్రయించి న వ్యాధులకు కారణములగును త్రివిధః = అనగా అయోగ, అతియోగ, మిథ్యాయోగరూపములైన, హేతు సంగ్రహః = కారణ సంక్షేపము, ఇచట

చెప్పబడిన కాలము మొదలగు వాటియొక్కొ అయోగ, అతియోగ, మిధ్యాయోగములు తిస్రైషణీయాధ్యాయమున "తత్ర అతిప్రభావతాం" (సూ అ 11) అను సూత్రము ద్వారా వివరించబడినవి గాన ఇచ్చట వాటిని వివరించుట లేదు కాలము దుష్పరి హార్యము గావున ఈ సూత్రమున మొదట కాలము గ్రహించబడినది అటుతరువాత ఇంద్రియార్థముల యొక్క అతియోగ, అయోగ, మిధ్యాయోగములకు ప్రజ్ఞాపరాధము కారణమగుట వలన బుద్ధి గ్రహించబడినది ఈ విషయము ఇదే గ్రంధమున ముందు "ప్రజ్ఞాపరాధాధ్యహితా నర్ధాన్ పంచనిషేవతే" (సూ అ 28) అనగా ప్రజ్ఞాపరాధము వలన అహితములైన పంచ ఇంద్రియార్థములను (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను) సేవించును అని చెప్పబడినది ఇట్లు అసాత్మ్యేంద్రియార్థ సంయోగము ప్రజ్ఞాపరాధమున ప్రవేశించినప్పటికిని ఇది ప్రత్యాసన్న (సన్నిహిత) కారణమగుట వలన అసాత్మ్యేంద్రియార్థ సంయోగమని వేరుగానే తంత్రమున తెలుపబడినది ప్రజ్ఞాపరాధము మాత్రము అసాత్మ్యేంద్రియార్థ సంయోగమునకు వ్యతిరిక్తములైన (వేరైన) కాయ, వాక్, మనస్సునకు సంబంధించిన క్రియాపరాధములందు వర్తించును మరియు అధర్మముగూడా నిచట వ్యాధిహేతువగుచున్నది ఇదే విషయము "క్రియాఘ్నాః కర్మజా రోగాః" (శా అ1) అని శారీరస్థానమున చెప్పబడినది ఇట్టి అధర్మమును గూడా కాలములోనే గ్రహించవలెనని కొందరు అభిప్రాయపడుచున్నారు కాని అధర్మమును ప్రజ్ఞాపరాధముతో తిస్రైషణీ యమున గ్రహించబడుటచే వారి అభిప్రాయము సరిగాదు తిస్రైషణీయమున అనృతవచనము, పాప సంకల్పము మొదలగు వాక్, మనస్సుల యొక్క మిధ్యాయోగరూపములు ప్రజ్ఞాపరాధవిశేషములుగానే చెప్పబడినవి అంతే గాని సాక్షాత్తుగా అనృతవచనము మొదలగువాటికి వ్యాధికర్తృత్వములేదు అవి అధర్మమును పుట్టించుట ద్వారా అధర్మము వ్యాధికారకమగును యాగజన్యమైన ధర్మము ఎట్లు స్వర్గమునకు కారణమగునో అట్లే అనృతవచనము మొదలగు వాటి ద్వారా జనించిన అధర్మము వ్యాధి కారణమగునని సాక్షాత్తుగా అనృతవచనాదులు వ్యాధి కారణములు గావు కర్మజన్యవికారము కాలపరిణామము వలన బుట్టుచున్నవగుట వలన అవి కాలజన్యములని కొందరి వాదన అందుకు ప్రమాణముగా "కాలస్య పరిణామేన జరామృత్యునిమిత్తజాః। రోగాః స్వాభావికాదృష్టాః స్వభావోనిష్ప్రతిక్రియః" (శా అ1) మొదలగు శ్లోకములనుదహరించినారు (అనగా జరా, మృత్యు నిమిత్తజన్యములైన స్వాభావిక రోగములు కాలపరిణామము వలన గలుగును ఇవి స్వాభావికములు స్వభావమునకు ప్రతిక్రియలేదు గాన ఇవి గూడా ప్రతీకారములేనట్టివి అని అర్థము)

కాని అదిసరికాదు ఒకవేళ కర్మజన్య వికారములు కాలజన్యములనియన్నచో అసాత్మ్యేంద్రియార్థ సంయోగము వలన గలుగు వ్యాధులుగూడా కొంతవరకు కాల పరిణామమున జనించునవి గాన అవిగూడా కాలజన్యములగును మరియు కాలాతియోగము మొదలగు చెప్పబడిన తిస్రైషణీయమున కర్మజన్య వ్యాధులు కాలమున ఏ విధముగను పరిగణింపబడలేదు కతిధాపురుషీయాధ్యాయమున మాత్రము "ధీధృతి స్మృతి విభ్రంశః సంప్రాప్తిః కాలకర్మణామ్। అసాత్మ్యేంద్రియ సంయోగా విజ్ఞాయా రోగహేతవః॥ (శా అ1) అనగా ప్రజ్ఞాపరాధము (ధీ ధృతి, స్మృతి, విభ్రంశము) సంప్రాప్తిః కాలకర్మణామ్ = కాలము యొక్క హీన, మిధ్యాతియోగములు, కర్మసంప్రాప్తి యనగా జన్మాంతరమున చేసిన పాపము పరిపక్వమైనపుడు గలుగునది) మరియు అసాత్మేంద్రియయోగము ఇవి రోగమునకు కారణములు అని చెప్పబడి స్వాభావికమైన రోగములు మరియు కర్మ జన్య రోగములు కాలజన్యమైన రోగములందే అంతర్భవింపజేయబడినవి మరియు అదేశారీరస్థానమున "కాలస్య పరిణామేన జరామృత్యు నిమిత్తజాః। రోగాః స్వాభావికా దృష్టాః స్వభావోనిష్పత్తి క్రియః" (శా అ1) అని చెప్పబడినది మరియు "నిర్దిష్టందైవ సంజ్ఞంతు కర్మయత్ పౌర్వదైహికమ్। హేతుస్తదపికాలేన రోగాణాముపలభ్యతే" (శా అ1) అనగా దైవసంజ్ఞకమైన గత శరీరమున సంబంధించిన కర్మఏదైతే గలదో అది గూడా కాలముననుసరించియే రోగములకు కారణమగునని పై శ్లోకమునకర్థము ఈ శ్లోకముననుసరించి గూడా బుద్ధి మిధ్యాయోగరూపమైన ప్రజ్ఞాపరాధమే రోగజనకమైన కర్మకు కారణము కాలవిశేషముననుసరించి గలుగు వ్యాధులు కాలమిధ్యాది యోగజన్యములైనను, అసాత్మ్యేంద్రియార్థ ప్రజ్ఞాపరాధజన్యములైనను అన్నిగూడా మొత్తము మీద కాలముననుసరించి అభివ్యక్తములగుటచే (బయల్పడుటచే) అట్టి వ్యాధులన్నియు కాలసంప్రాప్తి జన్యములుగా చెప్పబడినవి అదెట్లనగా సంతతః సతతోఽన్యేద్యుష్కతృతీయకచతుర్థకౌ। 'స్వేస్వేకాలే ప్రవర్తంతే కాలేహ్యేషాంబలాగమః' ' (శా అ1) అనగా సంతత, సతత, అన్యేద్యుష్క, తృతీయక, చతుర్థక జ్వరము ఆయా కాలములందు బలమును పొందుట వలన ఆయా కాలములందు వచ్చును అని చెప్పబడినది ఈ సంతతాది జ్వరములందు కాలముయొక్క హీనమిధ్యాతియోగములు మొదలగునవి కారణములుగా కనబడవు ఐతే అసాత్మ్యేంద్రియార్థ సంయోగము, ప్రజ్ఞాపరాధములే కారణములుగా కన్పడుచున్నవి అట్లే స్వాభావికములైన జరాది వ్యాధులందు గూడా కాలమిధ్యాదియోగములు కారణములుగా గనబడవు

అందువలన కాలమిథ్యాతియోగము మొదలగు వాటిచే జనించిన కాలజన్యములు గావని కాలముననుసరించి ఆయా కాలములందభివ్యక్తములగునవి కాలజములని ఆచార్యుని అభిప్రాయము అందు వలనే శారీరస్థానమున "సంప్రాప్తిః కాలకర్మణామ్' ' (శా అ1) అని చెప్పబడినదేగాని మిథ్యానచాతిచ అని చెప్పబడలేదు మరియు "కాలకర్మణామ్" అను వాక్యమున కాలమును చెప్పి "కర్మణాం" అని విడిగా చెప్పి కాలమునపుట్టినది కర్మజన్యమైనది, అని రెండు విడివిడిగా చెప్పబడినవి మరియు ఉన్మాద నిదానమున కర్మజన్యములైన వాటికి ప్రజ్ఞాపరాధ జన్యత్వము సాక్షాత్తుగా ఆచార్యుడు చెప్పినాడు అదేమనగా "ప్రజ్ఞా పరాధాత్ సంభూతే వ్యాధౌ కర్మజ ఆత్మనః। నాభిశంసేద్బుధోదేవాన్న పితౄన్ నచరాక్షసాన్" (ని అ7) కర్మజన్యమైన వ్యాధి ప్రజ్ఞాపరాధము వలన గలిగినపుడు జ్ఞానియైన వాడు, దేవతలను గాని, పితృలనుగాని, రాక్షసులనుగాని నిందించకూడదని శ్లోకార్థము జన పదోధ్వంసమున గూడా "తస్యమూలమధర్మః, తన్మూలంచాసత్కర్మపూర్వకృతం, తయోర్యోనిః ప్రజ్ఞాపరాధయేవ' ' అనగా దానికి మూలము (కారణము) అధర్మము, అధర్మమునకు కారణము పూర్వజన్మమున జేసిన పాపకర్మ, అధర్మమునకు, పూర్వ జన్మకృతమైన పాపకర్మ కారణము ప్రజ్ఞాపరాధమే అని యర్థము ఇట్లు కర్మపేక్షితములైన రెండు తెలుపబడినవి వీటిలో ఏది బలమైనది, బలమైనది కాదను విషయము స్వయముగా విద్వాంసులు నిర్ణయించవలసియున్నది పోతే ఇచట ఆలోచించవలసిన విషయమేమనగా స్వాభావికములైన క్షుత్పిపాసాది వ్యాధులు, అట్లే కాలసమ్యగ్యోగమున్నప్పటికిని జనించునట్టి దోష చయ ప్రకోపములు వేటిలో అంతర్భవించును అనునది ప్రశ్న? కాలసమ్యగ్యోగము వ్యాధి కారణముగాదను సిద్ధాంతముననుసరించి, ఇచట కాలసమ్యగ్యోగము చెప్పబడుటవలన కాలజన్యములైన వాటిలో అంతర్భవించదు అట్లుగానిచో కాలప్రతినియతమైన అసాత్మ్యేంద్రియార్థ సంయోగము కారణముగ నంగీకరించవలసి యుండును ఇట్లు చెప్పినప్పటికిని మిథ్యాయోగము మొ॥వాటికి గూడా అసాత్మ్యేంద్రియార్థ సంయోగము కారణమని చెప్పవలసియుండును అందువలన మాబుద్ధికి తోచునదేమనగా సహజములైన వికారములకు ప్రతిక్రియలేకుండుట వలన అవి అయోగాదువలన బుట్టినవిగా నిచట పరిగణింపబడలేదు కాలస్వభావజన్యములైన వ్యాధులు గూడా సహజములే, ఐతే కాల స్వభావజన్యములైన భవిష్యద్భావములకు చేయబడుట సత్వగుణ ద్రవ్యములు మొదలగువాటి సేవా రూపమైన ప్రతిక్రియ మరియు స్వాభావికములైన క్షుత్,

పిపాసా, జరా మొదలగు వ్యాధులకు చేయబడు కాలభోజనము, రసాయనము మొదలగు ప్రతిక్రియ చేయనపుడు కాలస్వభావ జన్యములైన వ్యాధులుత్పన్నమగును అట్టి కాలస్వభావజన్యములైన వ్యాధులు గూడా ప్రజ్ఞాపరాధజన్యములే సరియైన కాలమునచేయవలసిన క్రియలు చేయకుండుట ప్రజ్ఞాపరాధమే కతిధాపురుషీయమున ప్రజ్ఞాపరాధసంగ్రహమునందీవిధముగా చెప్పబడినది "కర్మకాలాతిపాతశ్చ మిధ్యా రంభశ్చకర్మణామ్" (శా అ1), అనగా కాలమునతిక్రమించి కర్మలనాచరించుట, కర్మలను అనుచితముగా ఆరంభించుట ప్రజ్ఞాపరాధమని అర్థము కొందరైతే క్షుత్, పిపాస, జరామొదలగు వ్యాధులు (వికారములు) మిధ్యాయోగము మొదలగునవి లేని కాలమునందుండుట వలన కాలమునందే అంతర్భవించునని కతిధాపురుషీయము నందు చెప్పబడిన అర్థముననుసరించి అభిప్రాయపడుచున్నారు "యోగోమి ధ్యానచాతిచ" అను వాక్యమునందు "నచ" అను శబ్దములందలి చకారముతో హీన యోగమును గ్రహించవలయును ఇదే విషయము "మిధ్యాతిహీనలింగేభ్యోయోవ్యాధి రుపజాయతే" (శా. అ1) అనగా మిధ్యాయోగము, అతియోగము, హీనయోగము వ్యాధికి కారణము లుగా చెప్పబడినవి హీనయోగము అయోగము యొక్క ప్రభేదమగుట వలన సాక్షాత్తుగా హీనయోగము చెప్పబడలేదు స్వల్పయోగముగూడా అయోగమే యగును ఉదా॰ ఒకమెతుకు భుజించినను భుజించని దాని క్రిందకేలెక్క

శ్లో॥ శరీరం సత్త్వసంజ్ఞంచ వ్యాధీనామాశ్రయో మతః।
తథాసుఖానాం, యోగస్తుసుఖానాం కారణం సమః॥ 55

**తాత్పర్యము** శరీరము, మనస్సు ఈ రెండును వేరువేరుగను, రెండును కలిసియు వ్యాధులకాశ్రయము (అధిష్ఠానము) అగును (అందుకుష్ఠాదిరోగములకు శరీరము, కామాది రోగములకు మనస్సు, ఉన్మాదము మున్నగు రోగములకు శరీర, మనస్సులు రెండును ఆశ్రయములగును) మరియు సుఖకరములయినపై జెప్పిన కాల-బుద్ధి - ఇంద్రియార్థముల యొక్క సమ్యగ్యోగము ఆరోగ్య రూపమైన సుఖములకు, పై జెప్పిన మనశ్శరీరములు రెండును ఆశ్రయములగును అనగా కాలబుద్ధీంద్రియార్థముల యొక్క న్యూనాతిరేకములు లేని సమయోగము సమ్యగ్యోగము అనబడును అట్టి యోగము ఆరోగ్యమునకు కారణము అట్టి ఆరోగ్యమునకు శరీరమనస్సులు ఆశ్రయమగును అందు మనస్సంబంధమైన ఆరోగ్యమునకు మనస్సును, శరీర సంబంధమైన ఆరోగ్యములకు శరీరమును, ఈ రెండింటికి సంబంధించిన యారోగ్యమునకు రెండును ఆశ్రయములగునని భావము అట్టి ఆరోగ్యమునకు

సుఖకరములయిన, కాలబుద్ధీంద్రియార్థముల యొక్క సమయోగము కారణమగునని భావము

**చ పా వ్యా ఆ అ** పూర్వశ్లోకమున శరీర మనస్సులనాశ్రయముగా చేసికొనివచ్చు వ్యాధులకు కారణము చెప్పబడినది అట్టి ద్వివిధములైన ఆశ్రయములను "శరీరం" అను శ్లోకముతో తెలుపుచున్నాడు ఈ శ్లోకమున శరీరాధికరణములైన వ్యాధులకే ఈ తంత్రమున ప్రాధాన్యతయుండుట వలన మొదట శరీరమును పేర్కొనుచున్నాడు "సత్వసంజ్ఞ" అను శబ్దముచేత మనస్సు చెప్పబడును లేక సత్వశబ్దముచేతనే మనస్సు చెప్పబడుననుకొన్నచో సంజ్ఞాశబ్దమును కలిపి చెప్పుటచేత "సత్వసంజ్ఞం" అను పదమునకు ఆత్మశరీరములతో కూడిన మనస్సు అని చెప్పబడును కారణ మేమనగా శరీర ఆత్మలతో సంబంధములేని మనస్సునకు వ్యాధ్యాశ్రయత్వముండదు మరియు సమాసము చేయనిచో శరీరము మనస్సులు విడివిడిగా వ్యాధికాశ్రయములుగా నుండునని తెలుపబడినది ఉదా కుష్ఠము మొదలగు వ్యాధులు శరీరాశ్రయములు మాత్రమే కాగా కామము మొదలగునవి మానసములు, ఉన్మాదము మొదలగునవి శరీర మనస్సులనాశ్రయించునవి అటుతరువాత "తథాసుఖానాం" అను రెండవ పాదముతో ఆరోగ్యమునకాశ్రయము - కారణమును గూడా చెప్పుచున్నాడు సుఖానాం అనగా ఆరోగ్యములకు ఇందుకు వచనము సుఖసంజ్ఞకమారోగ్యం వికారోదుఃఖమేవచ (సూ అ9) అని తథా అనగా శరీరము మనస్సు ఈ రెండింటిలో శరీర రోగాభావ రూపమైన ఆరోగ్యమునకు శరీర మాశ్రయము, మానసిక రోగాభావ రూపమైన మానసారోగ్యమునకు మనస్సు ఆశ్రయము యోగస్తుసమః = కాల, బుద్ధి ఇంద్రియార్థముల యొక్క సమ్యగ్యోగరూపమైన యోగము ఆరోగ్యములకు కారణము "సుఖానా" మను పదమునకు సుఖపదముచేత వ్యవహరింపబడు రోగాభావముల యొక్క బహుత్వము, నిషేధించబడు రోగములు అనేకములుగా నుండుటవలన రోగాభావ రూపమైన సుఖములకు గూడా బహుత్వము చెప్పబడినదని గ్రహించ వలయును నిషేధించబడు భావముల యొక్క ఈ బహుత్వమే రోగా భావరూపమైన సుఖముల యొక్క బహుత్వమగును "ఆయుర్వేదాగమోహేతుః" అని (సూ అ1) అధ్యాయార్థ సంగ్రహమును చెప్పు సందర్భమున వ్యాధ్యాశ్రయము చెప్పబడలేదుగదా కావున నిది అనార్షమా? అనునది ప్రశ్న అనార్షముకాదని సమాధానము అందుకుపపత్తిని చూపించుచున్నాడు అధ్యాయార్థ సంగ్రహమున "హేతవశ్చ" అని చెప్పబడుట చేత వ్యాధ్యాశ్రయరూపమైన హేతువుగూడా హేతువులందే అన్వయించబడి గ్రహించబడినది

మూ॥ నిర్వికారః పరస్త్వాత్మా సత్త్వభూతగుణేంద్రియైః॥
చైతన్యేకారణం నిత్యోద్రష్టాపశ్యతి హి క్రియాః॥ 56

తాత్పర్యము పరమాత్మ వికారములేనిది మిక్కిలి సూక్ష్మమును, శ్రేష్ఠమును అయినది అట్టి యాత్మ మనస్సు, పంచభూతములకు సంబంధించిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణముల సంబంధముతో ఇంద్రియాది జ్ఞానము నందు కారణమగును సకల జ్ఞానములకు ద్రష్టగా నుండు పరమాత్మనిత్యమైనది కావున అట్టి యాత్మకు ఒకప్పుడు వ్యాధులు కలుగవు కావున వ్యాధికి ఆశ్రయములుగ శరీర మనస్సులు మాత్రమే చెప్పబడినవి "సత్వమాత్మా శరీరంచ త్రయం" అనుచో సత్వాదులన్నింటిలో ప్రధానమగుటలో పరిగణింపబడినదే గాని రోగాశ్రయమని దాని కర్థముగాదు

చ పా వ్యా ఆ అ "సత్త్వమాత్మాశరీరం" అను శ్లోకమున మూడు భావములు చెప్పబడినవి వాటిలో శరీర మనస్సులు వ్యాధికాశ్రయములుగా చెప్పబడినవి ఆ రెండు పోగా మిగిలినదైన ఆత్మకు గల వ్యవస్థ ఏమి అను విషయమును "నిర్వికారః" అను శ్లోకముతో చెప్పుచున్నాడు నిర్వికారః = వికారములు లేకుండుట, ఆత్మకు రోగములు రావు అని అర్థము, పరః=సూక్ష్మమైనది (ఆత్మ) లేక శ్రేష్ఠమైనది, ఈ విశేషణము వలన సత్త్వ, శరీర, ఆత్మ సంయోగ రూపమైన ఆత్మ వేరుచేయబడినది "సంయోగపురుషస్యేష్టో విశేషోవేదనాకృతః" (శా అ1) అను వాక్యము ఇందుకు ప్రమాణము సత్త్వ, ఆత్మ, సంయోగరూపమైన పురుషుడు వేదనలకు అధిష్ఠానమని దీనియర్థము సత్త్వ, ఆత్మ, శరీర సంయోగమున గూడా మనస్సునందే వేదనకలుగును మనస్సులోగలిగిన వేదన ఆత్మకు గలుగునని చెప్పబడినది అందువలన "నిర్వ్యధేచాంతరాత్మని" (సూ అ 22) లో చెప్పిన వచనమునకు నిర్వ్యధేమనసి అను అర్థమును గ్రహించవలయును (మనస్సునందలి బాధలు ఆత్మకు అన్వయించి చెప్పబడినవి ఆత్మ నిర్వికారముగాన ఆత్మకు చెప్పబడిన వేదనలు మనోవేదనలని యర్థము) అట్లే శరీరము మొదలగు వాటియందు గూడా ఆత్మ శబ్దము ప్రయోగింపబడినది వాటి నుండి వేర్పరచుటకు "పరః" అను విశేషణము ప్రయోగింపబడినది మరియొకచోట నీవిధముగా చెప్ప బడినది "బ్రహ్మేంద్రవాయ్వగ్నిమనోధృతీనాం ధర్మస్యకీర్తి ర్యశసః శ్రియశ్చ। తథా శరీరస్య శరీరిణిశ్చ స్యాద్ద్వాదశ స్వీజ్ఞిత ఆత్మశబ్దః" అనగా బ్రహ్మ, ఇంద్రుడు, అగ్ని, వాయువు, మనస్సు, ధృతి, ధర్మము, కీర్తి, యశస్సు, లక్ష్మి, శరీరము, శరీరి (శరీరము గలవాడు) ఈ పన్నెండు ఆత్మశబ్దముతో చెప్పబడును అని చెప్పబడినది ఒకవేళ

ఆత్మనిర్వికారుడైనచో జ్ఞాన రూపమైన వికారము ఈ ఆత్మకు ఉన్నదా? లేదా? అను ప్రశ్నకు "సత్త్వభూత" అను వాక్యముతో సమాధానము చెప్పుచున్నాడు సత్త్వం అనగా మనస్సు, భూతగుణములు శబ్దస్పర్శములు మొదలగునవి ఇంద్రియములు చక్షు, శ్రోత్రములు మొదలగునవి కారణభూతములైన వీటిలో ఆత్మచైతన్యమున కారణభూతుడగును చైతన్యము ఆత్మయందు పుట్టును లేక అభివ్యక్త మగును సత్త్వము, ఇంద్రియములు, భూతగుణములు మొదలైన జ్ఞాన కరణములు అన్నింటియందుండకపోవుట వలననే ఆత్మసర్వగతుడైనప్పటికిని అన్ని ప్రదేశములందు జ్ఞానము గలుగుటలేదు మరియొక ప్రశ్న ఆత్మచైతన్యవంతుడైన ఎడల ఒకప్పుడు జ్ఞానవంతుడై, ఒకప్పుడు అజ్ఞాని అగును గదా అను ప్రశ్నకు సమాధానమును"నిత్యః" అనుదానితో చెప్పుచున్నాడు ఆత్మనిత్యుడైనప్పటికిని అతనికిగల జ్ఞానమనిత్యము ధర్మము అనిత్యమైనప్పుడు ధర్మము గలది అనిత్యముగావలసిన పనిలేదు మరియు ఆకాశగుణమైన శబ్దము అనిత్యమైనపుడు ఆకాశము అనిత్యమగుటలేదు పూర్వజన్మము నందును, పశ్చాత్ జన్మమునందును అనుభవించిన విషయములను ప్రతి సంధానము చేయుట వలన ఆత్మకు నిత్యత్వము ప్రతిపాదించబడును జ్ఞాత (ఆత్మ) అనిత్యమైనచో పూర్వజన్మమున అనుభవించిన అర్థ(విషయ)ములను ఉత్తర జన్మము ప్రతిసంధానము చేయవలెను ఉదా దేవదత్తుడు తెలుసుకొను విషయములను యజ్ఞదత్తుడు అవగతము చేసికొనలేడు కావున ఆత్మ నిత్యమైనదని భావము జ్ఞానవంతుడగు వానికి సుఖము గలిగినపుడు అనురాగ రూపమైన వికారములు, దుఃఖము గలిగినపుడు ద్వేషరూపమైన లక్షణములు గన్పడుచున్నవి గదా అట్టి తరి సుఖదుఃఖములు గల్గినపుడు ఆత్మ నిర్వికారమని ఎట్లు చెప్పవచ్చును అని సందేహము దానికి సమాధానముగా "ద్రష్టాపశ్యతి హిక్రియాః" అని చెప్పుచున్నాడు ద్రష్టా అనగా సాక్షిభూతుడు దీనిననుసరించి పరమశాంతుడైన యతి (సన్యాసి) సాక్షిభూతుడై ప్రపంచముయొక్క అన్ని క్రియలను చూచుచు రాగద్వేషములు పొందడో అట్లే ఆత్మ గూడా సుఖదుఃఖములు ప్రాప్తించినప్పటికిని రాగద్వేషములను పొందదు కనబడుచున్న రాగేద్వషము మొదలగు వికారములు మనస్సునందలి వికారములు అని ఇచ్చట ఆత్మకు సాంఖ్యదర్శనము ననుసరించి అర్థమును గ్రహించవలసియున్నది సాంఖ్య మతమున మనః శ్శబ్దముచేత బుద్ధి అంతఃకరణము గ్రహించబడును

మూ॥ వాయుః పిత్తంకఫచ్చోక్తః శారీరోదోషసంగ్రహః
మానసః పునరుద్దిష్టః రజశ్చతమఏవచ॥ 57

తాత్పర్యము వాతము, పిత్తము, కఫము అనునీమూడు సంగ్రహముగా శరీరమునకు సంబంధించిన దోషములు. రజస్సు, తమస్సు అను రెండు క్లుప్తముగా మానసిక దోషములు

చ పా వ్యా అం అ వికారములకాశ్రయములైన శరీరమనస్సులను, వికారమునకు దూరకారణములైన కాలార్థకర్మలను చెప్పి ప్రస్తుతమున ప్రత్యాసన్న కారణములైన దోషరూపకారణములను "వాయుఃపిత్తం" అను శ్లోకముతో చెప్పుచున్నాడు. దోషములలో ప్రధానమైనదగుటవలన వాయువు మొదట చెప్పబడినది శీఘ్రముగా అనేక దారుణ వికారములను గల్గించునదగుట వలన వాయువు ప్రధానమైనది ఇందుకు ప్రమాణము "ఆశుకారీముహుచ్చారీ" (సు ని అ1) అని చెప్పబడినది అట్లే వికార సంఖ్యయందు వాతజన్య వికారములు ఎనుబది (80) పిత్తజన్య వికారములు నలుబది (40), కఫజన్య వికారములు ఇరువది (20), వికార సంఖ్యలో గూడా వాతజవికారములు ఎక్కువగా (భూరి) నున్నవి, అందువలన దోషములలో వాతము ప్రధానమైనది ఇది మహా రోగాధ్యాయము (సూ అ2) న చెప్పబడినది వాతము తరువాత శరీరమునకు మూలభూతమైన అగ్ని రూపమగుట వలనను, కఫమున కంటే, ఎక్కువ వికారములను గల్గించునదగుటవలనను, కఫమునకంటే ఆశుకారి శీఘ్రకరి యగుట వలనను వాతము తరువాత పిత్తము రెండవ ప్రధానమైన దోషము తరువాత కఫము మూడు దోషములను సమానముగా చేసి చెప్పకపోవుట వలన విడివిడిగా మూడు దోషములు ఆయా వికారములను గల్గించునని తెలియజేయుటకై విడివిడిగా చెప్పబడినవి "శారీరోదోష సంగ్రహః" అను వాక్యమున శారీర దోషములు అని చెప్పుట మానసిక దోషములైన "రజస్తమస్సులు" వేర్పరచుట కొరకు "ద్వ్యుల్బణేకోల్బణైః, షట్స్యుర్హీనమధ్యాదికైశ్చషట్" (సూ అ17) అను ప్రమాణవచనమునను సరించి ద్వ్యుల్బణ దోషములు, ఏకోల్బణ దోషములు, ఈ భేదమునను సరించి ఆరు హీన, మధ్య, అధిక భేదమునను సరించి ఆరు ఇట్లు అనేక విధములుగా దోషములు విస్తరించునుగాన ఇచట సంగ్రహముగా చెప్పబడినదని భావము పోతే శోణితము గూడా దోషమగుట వలన్నిచట చెప్పబడిననీదోష సంగ్రహము సరిగాదు కారణమేమనగా వాతము మొదలగు దోషములవలె రక్తమునకు గూడా విశిష్టహేతువులు, విశిష్ట లక్షణములు, విశిష్ట వికారములు, విశిష్ట చికిత్సలు శాస్త్రముననిర్దేశించబడినవి ఉదా కాలేచానవసే

బనాత్'' (సూ అ 24 శ్లో 9) అనగా సకాలమున రక్తమోక్షణము చేయనిచో రక్త ప్రకోపముగల్గును అని విశిష్టకారణము రక్తమునకు చెప్పబడినది అట్లే లక్షణము "తపనీయేంద్రగోపాభం పద్మాలక్త సన్నిభమ్'' (సూ అ 211 శ్లో 22) కాల్చిన బంగారము, ఇంద్రగోప పురుగులు, కమలము, లత్తుగవంటి వర్ణములు లక్షణములుగా చెప్పబడినవి రక్తవికారములుగా రక్తార్శస్సు, రక్తప్రదరము, రక్తపిత్తము మొదలగునవి రక్తవిశిష్ట వికారములుగా చెప్పబడినవి చికిత్సగూడా "శ్రావణం శోణితస్యతు'' (సూ అ 24 శ్లో 18) రక్తమోక్షణము రక్త విశిష్ట చికిత్సగా చెప్పబడినది అట్లే చరకమున రక్తమునకు దోష సంజ్ఞగూడా ఒకచోట "కఫే వాతే జితప్రాయే పిత్తంశోణితమేవవా। యదికుప్యతి వాతస్య క్రియమాణే చికిత్సితే యథోల్బణస్య దోషస్య తత్ర కార్యం భిషగ్జితమ్'' (చి అ 5 శ్లో 27) అనగా కఫవాతములను జయించినపుడు పిత్తముగాని రక్తముగాని ప్రకోపించినచో వాటికి చేయవలసిన చికిత్స ఉల్బణ దోషమునాధారముగా చేసికొని చేయవలెనని యర్థము ఇచట పిత్తముతోపాటు రక్తమునకు గూడా దోషత్వము చెప్పబడినది తంత్రాంతరమున గూడా "తైరేతైః శోణిత చతుర్థైః'' (సూ సూ అ21) అని రక్తమునకు దోషత్వమును సుశ్రుత సంహిత యందు చెప్పబడినది అందువలన రక్తముగూడా దోషమేగాన దోష సంగ్రహమున రక్తమును వదలి మూడు దోషములనే చెప్పుట సరిగాదు అనునది పూర్వపక్షము ఇది సరియైనదేనని సిద్ధాంతము అదెట్లనగా స్వతంత్రముగా దూషించు స్వభావముగలవి దోషములు ప్రకోపించిన వాతాది దోషములు ఇంకొకదానినపేక్షించి ధాతువులు మొదలగు వాటిని దూషించక స్వయముగా అవే దూషించుచున్నవి శోణితమట్లుగాక, దుష్టములైన వాతాది సంసర్గమునపేక్షించి దూషించుచున్నది మరియు వాతము మొదలగు దోషముల యొక్క సంబంధము లేక వికారమును పొందదు ఎల్లప్పుడు వాతవికారములను గల్గించునవే రక్తవికారము లను గల్గించును మరియు ఎల్లప్పుడు వాతాది దుష్ట లక్షణములే రక్త దుష్టిలోగనపడును పై జెప్పబడిన రక్త విశిష్టహేతువులు మొదలగునవి వాతాది యుక్తమైన రక్తదుష్టి కారణములే అందువలన అచటగూడా వాతాది హేతువులే రక్త దుష్టికి హేతువులు రక్తము స్వప్రమాణమునకంటే అధికమైనప్పటికి అది దూష్యమే కావున దూష్యములైన వాటికి విశిష్ట హేతువులు మొదలగునవి ఉండవు ఒకవేళ విశిష్ట హేతువులున్నను అంత మాత్రమున అవి దోషములు కాజాలవు కారణమేమనగా మాంసాదులకు గూడా విశిష్టహేతువులు చెప్పబడినవి ఉదా మాంసదుష్టికారణములు మాంస వాహీనిదుష్యంతి భుక్త్వాచస్వపతాందివా(వి స్థా అ 5)అని చెప్పబడినవి అట్లే "శ్రుణుమాంస

ప్రదోషజాన్" (సూ అ 28) అని వికారములు వివిధాశితపీతీయమున చెప్పబడెను ఇవే స్రోతో విమానమున మాంసదుష్టిలక్షణములుగా స్రోతో దుష్టిలక్షణములందతి దేశముగా చెప్పబడినవి దుష్టమాంసవికారములుగా అధిమాంసము, అర్బుదము మొదలగునవి చెప్పబడినవి చికిత్సకూడా "మాంసజేనాంతు సంశుద్ధిః శస్త్రక్షారాగ్ని కర్మచ" (సూ అ 28) అని శోధనము, శస్త్ర కర్మ, అగ్ని కర్మ మాంసజన్య వ్యాధులకు చికిత్సగా చెప్పబడినది అందు దోషములచేత చేయబడిన దైనప్పటికి ఆ కార్యము దూష్యములైన రక్తాదులందుగలుగుటచేత "ఘృత దగ్ధ న్యాయముననుసరించి" అనగా ఘృతమునందాశ్రయించియున్న అగ్ని కాల్చినప్పటికిని నెయ్యికాల్చినదని చెప్పినట్లు రక్తాదిధాతువులనాశ్రయించిన దోషములు వికారములను కల్గించినప్పటికిని దోషాధారములైన రక్తాదులందు జనించుట వలన ఇది రక్త జన్యము, ఇది మాంసజన్యము అని వాడుకలోకి వచ్చినది అంతేగాక పీడను గల్గించు సామాన్య లక్షణముండుటవలన దోషముగాని వాటియందును దోషసంజ్ఞయుండును ఉదా "స్వయంప్రవృత్తంతం దోషముపేక్షేత హితాశనై" (చి అ 5 శ్లో 46) అనుచోట దోషము కానటువంటి పురీషము సైతము దోషముగా పేర్కొనబడినది సుశృత సంహితయందు మాత్రము వ్రణములందు తరచుగా రక్తదుష్టిగనబడుటవలన ఔపచారికముగా మాత్రమే రక్తమునకు దోషత్వము చెప్పబడినది ఆకారణమువలననే ఇంకొకచోట వ్రణ ప్రశ్నాధ్యాయమున వాతాదులు మూడే దోషములుగా చెప్పబడినవి "వాత పిత్తశ్లేష్మాణ ఏవదేహసంభవ హేతవోభవంతి" (సు సూ అ 21) అను మొదలగు సూత్రముల చేత మరియు ఒకవేళ రక్తము గూడా దోషమేయైనచో వాతాదులవలె అదిగూడా ప్రకృతి నారంభించునదిగాయుండును అట్లు ప్రకృతినారంభించుట రక్తమునకు లేదు అందువలన దోషములు మూడే అని సిద్ధించినది "మానసః పునరుద్దిష్టో" అను శ్లోక పాదముల ద్వారా మానసిక దోషములను చెప్పుచున్నాడు "పునః" అవధారణా (నిశ్చయ)ర్థకము అందువలన మానసదోషములను పేర్కొనుట మాత్రమే జరిగినది గాని శారీరక దోషములవలె వాటిని వివరించలేదని "పునః" అను శబ్దమునకర్థము. వివరించకపోవుటకు కారణమేమనగా కాయచికిత్సా రూపమైన ఈ తంత్రమున మానస దోషములవివరించుట అనవసరము గావున మానస దోషవివరణ చేయలేదని భావము దోషములలో మొదట రజస్సు ప్రధానమగుట వలన మొదట అదే చెప్పబడినది కారణము "నారజస్కంతమః ప్రవర్తతే" (వి స్థా అ 6) అనగా రజస్సు లేక

తమస్సు ప్రవర్తించదు అందువలన రజస్సేప్రధానమైనది "తమఏవచ" అనుచోట "ఏవ" శబ్దము సత్త్వగుణము దోషముగాదని చెప్పుటకుపయోగించబడినది అనగా రజస్తమస్సులే మానసిక దోషములని చెప్పుటవలన సత్త్వము మనోదోషముగాదని చెప్పినట్లైనది సత్త్వము వికారములు లేనిది వికారములను గలిగించనిది

మూ॥ ప్రశామ్యత్యౌషధైపూర్వోదైవయుక్తి వ్యపాశ్రయైః
మానసోజ్ఞాన విజ్ఞాన ధైర్యస్మృతి సమాదిభిః॥ 58

తాత్పర్యము పై శ్లోకమున చెప్పబడిన దోషములలో మొదటివగు వాతపిత్తకఫముల ప్రకోపము వాటివలన గలుగు రోగములు దైవవ్యపాశ్రయరూపమైన (బలిమంగళ) మొదలగు చికిత్సల ద్వారాను, యుక్తివ్యపాశ్రయరూపమైన సంశోధన, సంశమన రూపమైన చికిత్సలతోను శాంతినొందును

రెండవదైన మానసదోషములైన రజస్తమోగుణములు వాటి వలనగలుగు వ్యాధులు (కామము, ఉన్మాదము మొదలగునవి), అధ్యాత్మజ్ఞానము, విజ్ఞానము (శాస్త్రజన్య జ్ఞానము) ధైర్యము (ధీరతారూపమైన మానసికవృత్తి విశేషములు) స్మృతి (గడచిన విషయముల జ్ఞప్తికి తెచ్చుకొనుట) సమాధి (ఇంద్రియ వ్యాపారముల నుండి మనస్సును మరలించి ఆత్మయందేకాగ్రతతో చేర్చుట) అను ఉపాయములచేత శాంతినొందును

చ పా వ్యా ఆం అ "ప్రశామ్యతి" అను శ్లోకము ద్వారా ఇపుడు దోషప్రశమన కారణమును చెప్పుచున్నాడు "పూర్వః" అనగా శారీరదోషములు దోషములను గ్రహించుట వలన దోషజన్యములైన వ్యాధులు గూడా గ్రహించవలయును వికృతములైన దోషములకంటే వ్యాధులు వేరుగాకుండా యుండుటయే ఇందుకు కారణము దైవవ్యపాశ్రయమున దైవమనగా అదృష్టమైన భావము దానినాశ్రయించి చేయువ్యాధి ప్రతీకారము బలి మంగలరూపమైనది దైవవ్యపాశ్రయ చికిత్స ఇది కష్టములేకుండానే వెంటనే వ్యాధి ప్రశమమును గల్గించుటచేత మొదటగా చెప్పబడినది యుక్తివ్యపాశ్రయమున యుక్తిః అనగా శరీరము, భేషజములకు హితమైన యోగము (యోజన) దాని నాశ్రయించి చేయు చికిత్సావిధానము సంశోధన సంశమనరూపమైనది యుక్తివ్యపాశ్రయచికిత్స, జ్ఞానమ్ = అధ్యాత్మజ్ఞానము, విజ్ఞానం= శాస్త్రజ్ఞానము, ధైర్యం= ధీరతా భావము, స్మృతి ః = అనుభవించినవాటిని జ్ఞప్తికి తెచ్చుకొనుట, సమాధిః = విషయముల నుండి మనస్సును మరల్చి ఆత్మలోనియమించుట

మూ। రూక్షః శీతోలఘుః సూక్ష్మశ్చలోఽథవిశదః ఖరః।
విపరీతగుణైర్ద్రవ్యైర్మారుతః సంప్రశామ్యతి॥ 59

సస్నేహముష్ణం తీక్ష్ణంచ ద్రవమమ్లం సరం కటు।
విపరీతగుణై పిత్తం ద్రవ్యైరాశుప్రశామ్యతి॥ 60

గురుశీత మృదుస్నిగ్ధ మధుర స్థిర పిచ్ఛిలాః।
శ్లేష్మణః ప్రశమం యాంతి విపరీతగుణైర్గుణాః॥ 61

తాత్పర్యము శరీర రోగమునకు కారణములైన వాతము మొదలగు దోషముల యొక్క లక్షణములు చికిత్సపై శ్లోకములందు చెప్పబడినది వాటిలో రూక్ష, శీత,లఘు,సూక్ష్మ, చల, విశద, ఖర గుణములు వాతగుణములు ఇట్టి గుణములకు విపరీతమైన గుణములు గల ద్రవ్యములు వాతమును శమింపచేయును

స్నేహము, ఉష్ణము, తీక్ష్మము, ద్రవత్వము, అమ్లత్వము, సరము, కటురసము, ఇవి పిత్తగుణములు వీటికి విపరీతమైన గుణధర్మములు గల ద్రవ్యములు పిత్తమును శమింపజేయును

గురు, స్నిగ్ధ, మృదు, శీత, మధుర, స్థిర, పిచ్ఛిల గుణములు గలది శ్లేష్మము తద్విరుద్ధ గుణములు గల ద్రవ్యములు శ్లేష్మమును శమింపజేయును

చ పా వ్యా అం అ ఈ తంత్రము శరీర రోగములకొరకై ప్రవర్తించినదిగావున నిచట శరీర రోగజనకములైన వాతాది దోష లక్షణములను, వాటికుపయుక్తమైన భేషజమును 'రూక్షః శీతో'' అను శ్లోకముల ద్వారా చెప్పుచున్నాడు ఇందు దోషములలో ప్రధానమైనదగుట వలన వాతము యొక్కగుణములు చికిత్స మొదట చెప్పబడినది ఇచట చెప్పబడిన రూక్షము మొదలగు గుణములు అధికముగా కన్పించుటచేత రూక్షాది గుణములు చెప్పబడినవి కావున దారుణము మొదలగు గుణములు గూడా వాయువుకు గలవని తెలుసుకోవలయును వాయువు స్నేహకర్మచే సాధింపబడునదగుట వలన రూక్షత్వమందు అధికముగా గలదు ఆకారణమువలననే రూక్షత్వము మొట్టమొదట చెప్పబడినది వైశేషిక మతముననుసరించి వాయువు అనుష్ణ శీతముగా చెప్పబడినప్పటికిని ఈ శాస్త్రమున శీతగుణముతో వాతవృద్ధి, మరియు ఉష్ణగుణముతో వాత ప్రశమము గనబడుట వలనను, అట్లేకేవల వాతముచే ఉత్పన్నమైనవ్యాధియందు శీతము గనబడుచుండుట వలనను ఈ శాస్త్రముననుసరించి వాయువు శీతగుణముగలదే యగును పిత్తయుక్తమైనపుడు గలిగిన ఉష్ణత్వము వాయువు-యోగవాహియగుటచే

నేర్పడినది ఉదా పాషాణము (రాయి) శీత ఉష్ణద్రవ్యములతో దేనిలోనైతే సంయోగ మేర్పడునో అట్టి గుణములను ఎట్లు పొందునో అట్లే వాయువుగూడా ఉష్ణగుణముతో కలిసినపుడు ఉష్ణముగాను, శీతగుణముతో గలసిన శీతలముగానగును విపరీత గుణములనగా వాతాది గుణములకు విరుద్ధమైన గుణములు గుణ శబ్దమిచట ధర్మవాచకమగుట వలనరసవీర్యవిపాక ప్రభావములన్నియు గ్రహించబడును అందువలన ప్రభావమునకు విపరీతములైన ద్రవ్యములు గూడా గ్రహించవలయును కొందరైతే శ్లోకమున ఒక విపరీత శబ్దము లోపించినదిగా భావించి (అనగా రెండు విపరీత శబ్దములున్నట్లుగా భావించి) ఒక విపరీత శబ్దముతో గుణములైన రసగుణవీర్యవిపాకములు, రెండవ విపరీత శబ్దముతో ప్రభావవిపరీతములనుగ్రహించు చున్నారు ఇంతేగాక విపరీత గుణభూయిష్ఠములైన ద్రవ్యములలో గూడా వాతాది దోషములు శమించుచున్నవి గదా? అన్ని ఔషధములు వాతాదులకు పూర్తిగా విరుద్ధము లుగావు గదా! మరియు "విరుద్ధగుణ సన్నిపాతేహి భూయసాఽల్పమవజీయితే" (వి స్థా అ1) అనగా అనేక విరుద్ధగుణములు కలసియున్నపుడు వాటిలో ఉత్కటమైన గుణముచే అల్పమైన గుణము అణగద్రొక్కబడుచున్నది అను ప్రమాణముననుసరించి విపరీతగుణ భూయిష్టద్రవ్యములు గూడా వాతాదులను శమింపజేయుచున్నపుడు వాటిని ఇచట ఎందుకు గ్రహించలేదు? అని ప్రశ్న అందుకు సమాధానమేమనగా విరుద్ధ గుణభూయిష్ఠములైన ద్రవ్యములు గూడా నిచట విపరీత గుణ శబ్దముచేతనే గ్రహించబడినవి విపరీత గుణభూయిష్టములైన ద్రవ్యములందు గూడా విపరీతములు, అల్పములు, అబలములైన గుణములు ఏవి గలవో అవి తమ కార్యములను చేయక పోవుటవలన వాటిని చెప్పవలసిన అవసరమే లేదు లేదా ఎల్లప్పుడునూ విపరీత గుణముతోనే అధికమైన మరియు ప్రశస్తమైన శాంతివాతాదులకు గల్గును అందువలననే శ్లోకములందు "సం, ప్ర" శబ్దములు శీఘ్రముగాను, బాగుగాను శమింపజేయును అనుటకొరకై చేర్చబడినవి విపరీతగుణ భూయిష్ఠములైన ద్రవ్యములచేత దోషశాంతి అంతబాగుగా జరగదు అందువలన "సం, ప్ర" శబ్దములతో సాక్షాత్తుగా విపరీత గుణభూయిష్ఠద్రవ్యములు చెప్పబడలేదు ఇట్లే పిత్తశ్లేష్మములకు సంబంధించిన వివరణ తెలుసుకోవలయును సస్నేహం అనగా కొద్ది స్నేహము, అందువలన పిత్తము నందు ఘృతస్నేహమునకు ఔషధత్వము సరిపోవును పిత్తము అప్, తేజోభూతము నుండి ఆవిర్భవించినది గాన అదే అప్ తేజోభూతనిష్పన్నమైన అమ్లరసము పిత్తమున కిచట చెప్పబడినది సుశ్రుతమున మాత్రము పిత్తమునకు కటుత్వమే చెప్పబడినది

అచట అమ్లత్వము విదగ్ధ పిత్తమునకు చెప్పబడినది దీనికి వచనము "విదగ్ధంచామ్లమేవచ" (సు సూ అ 21) అని అట్లే పిత్తమునకు గల సస్నిగ్ధతా విషయమున గూడా సుశృతమున స్వారస్యము లేదు (సమంజసమైన అభిప్రాయము లేదు) మరియు నిచట పిత్తమునకు చెప్పబడిన అమ్లత్వ స్నిగ్ధత్వములు జల - అగ్ని భూతారబ్ధములగుట చేసి అవి సమంజసములుగానే యున్నవి సుశ్రుతమున మాత్రము తేజోరూపమైన పిత్తమును దృష్టిలోనుంచుకొని అమ్లత్వ స్నిగ్ధములు తొలగించబడినవి శ్లేష్మను వివరించు సందర్భమున విపరీతగుణముల ద్వారా శ్లేష్మ గుణములు శమించునని తెలుపబడినదిగాని శ్లేష్మశమించునని తెలుపబడలేదు ఇట్లు చెప్పబడుటకు కారణమేమి? అని ప్రశ్న అందుకు సమాధానమేమనగా గుణములు శమించినపుడు గుణి (గుణములుగలది) శమించును అట్లే గుణములు వృద్ధి నొందిన పుడు గుణి (గుణములుగలది) వృద్ధినొందునని తెలియజేయుటకే అట్లు తెలుపబడినది ఉదా ఉష్ణముతో శీతము శమింపజేయునపుడు శీతమునకాధారమైన ఉదక భాగము గూడా తప్పనిసరిగా శమింపజేయును

మూ। విపరీత గుణైర్దేశమాత్రాకాలోపపాదితైః
భేషజైర్వినివర్తంతే వికారాః సాధ్య సంమతాః॥ 62
సాధనం నత్వసాధ్యానాం వ్యాధీనాముపదిశ్యతే।

తాత్పర్యము పై జెప్పబడిన రీతిగ వాతాది దోషములకు విపరీతగుణములును, జాంగలాది దేశమును, రోగియొక్క బల, సాత్మ్యములు మొదలగు వాటిని అపాయములేని పరిమాణమును, వసంతాది కాలమును, బాల్యాది వయోభేదమును వీటన్నింటిని గమనించి వైద్యునిచే గల్పింపబడిన యుచితమగు ఔషధములచే, జ్ఞాన వంతులగు వైద్యులచే సాధ్యములనియంగీకరింపబడిన రోగములు నివర్తించును అరిష్టాది లక్షణములచే అసాధ్యస్థితినుండు వ్యాధులకు నివృత్తి సాధనమునుపదేశించుట లేదు

చ పా వ్యా అం అ విపరీత గుణములు గల్గియున్నప్పటికిని అవి అల్పమాత్రగలవై మరియు దేశము, కాలము మొదలగు వాటికి విపరీతములుగాని (సమానములైన) వి ఐన ద్రవ్యములతో వికార ప్రశమనము జరుగదని "విపరీత గుణైః" అను శ్లోకముతో చెప్పుచున్నాడు దేశః అనగా జాంగలాది భూదేశము మరియు ఆతురశరీర దేశము, మాత్రా = అపాయములేని పరిమాణము, కాలః = నిత్యగమైన వసంతాది కాలము అవస్థికమైన బాల్య, కౌమారము మొదలగు కాలము దేశము మొదలగు భావములను

(దేశ, కాల, మాత్ర) తెలుసుకొని తత్తదుచితముగా ప్రయోగించుట దేశమాత్రకాలోప పాదితమన బడును (ఉపపాదితైరనునది చేరాదికమైన ణిచ్ ప్రత్యయముచే నేర్పడినది) లేక దేశ కాలమాత్రలను దృష్టియందుంచుకొని వైద్యునిచే ప్రయోగింపబడిన అని అర్థము ఇచట దేశ శబ్దముతో బలము, శరీరము, ఆహారము, సాత్మ్యము, సత్త్వము, ప్రకృతి వీటిని గూడా గ్రహించవలయును కాల శబ్దముతో కాలముతో పాటు వయస్సును గ్రహించవలయును ప్రశమనము చేయునను అర్థమునిచ్చు వికారా వినివర్తంతే అనుదానిలో దోషములు చెప్పబడినవి భేషజమైతే సాక్షాత్తుగానే చెప్పబడినది ఈ విధముగా దోష భేషజ, దేశ, కాల, బల, శరీర సాత్మ్య ఆహార సాత్మ్య, సత్త్వ, ప్రకృతి, వయస్సులను పది విధములైన పరీక్ష భావములన్నియు గ్రహించబడినవి సాధ్యసంమతములనగా ప్రామాణికులైన వారిచే సాధ్యములని అంగీకరించబడినవి అని అర్థము దీనిననుసరించి అజ్ఞానులచే అజ్ఞానముచేత సాధ్యములని నిర్ణయించబడు వ్యాధులు తొలగించబడినవి ఎవరైతే సాధ్యములు అని వచనముతో యాప్యములైన వ్యాధులను యాపనము చేయుట అని అర్థము చెప్పుచున్నారో అది అంతఇంపుగా తోచదు కారణమేమనగా యాప్యములైన వాటిని యాపనము చేయుట రోగనివృత్తిగాదు "సాధనం" అను శ్లోకపాదముతో అసాధ్యములైన వ్యాధులను చికిత్సించ గూడదని చెప్పుచున్నాడు అసాధ్యములైన వ్యాధులకు చికిత్స ఇచట ఉపదేశింపబడుటలేదు అని శ్లోకార్థము ఐతే అసాధ్యములైన వ్యాధులకు కూడా సాధనము (చికిత్స) కనబడుచున్నది గదా ఉదా అరిష్ట లక్షణములు గలవాడు తప్పక మృత్యువాత బడువాడగుట వలన అట్టి వానికి వచ్చిన వ్యాధి అసాధ్యము అను విషయమును "అరిష్టంచాపితన్నాస్తి యద్వినామరణం భవేత్ మరణంచాపి తన్నాస్తి యన్నారిష్టపురః సరమ్" (ఇం అ2) అనగా మరణమును గల్గించని అరిష్టము లేదు అట్లే అరిష్టములు లేకుండా మరణమును గలుగదు అని అర్థము అరిష్టములుత్పన్నములైనపుడు చేయు చికిత్స సుశ్రుతమున "ధృవం త్వరిష్టే మరణం బ్రహ్మణైస్తత్ కిలామలైః రసాయన తపోజపృతత్పరైర్వానివార్యతే" (సు సూ అ 28) అనగా అరిష్టములు గలిగినపుడు మరణము తథ్యమేయైనను రసాయనము, తపస్సు, జపమును అనవరతము అనుష్టించు బ్రాహ్మణులు అట్టి మరణమును నివారించ గలరని చెప్పబడినది మరియు భగవంతుడైన అగస్త్యుడు గూడా "రసాయన తపోజప్యయోగ సిద్ధైర్మహాత్మాభిః కాలమృత్యు రపి ప్రాజ్ఞైర్జీయతే నాలసైర్నరైః" అనగా రసాయనము సేవించువారైన, తపస్సు, జపము, యోగములచే సిద్ధులైన మహాత్ములైన ప్రజ్ఞా

సంపన్నులు కాలమృత్యువును గూడా తొలగించుటకు సమర్థులు అలసులైన వారు తొలగించలేరని చెప్పినాడు అట్లే మరియొక చోట "జాతారిష్టోఽపి జీవతి" అనగా అరిష్టలక్షణములు జనించినప్పటికిని రోగి జీవించును అని చెప్పబడినది అందువలన కొందరు అరిష్టములను "నియతారిష్టము" అని యతారిష్టమని రెండు విధములుగా విభజించి చెప్పినారు ఆ రెండింటిలో నియతారిష్టము అసాధ్యమే అందువలననే "నత్వరిష్టస్య జాతస్యనాశోఽస్తిమరణాధృతే" (ఇం అ 2) అనగా అరిష్టములుత్పన్నములైనచో అవి మృత్యువును గలిగించక మానవు అని ఇంద్రియస్థానమున చెప్పబడినది ఈ ప్రకరణమున జాతస్య అను వచనము నియతారిష్టమునే సూచించున్నది సుశ్రుతాచార్యుడు చెప్పిన అరిష్ట నివారణ ప్రక్రియ అనియతారిష్టమునకు అన్వయించు కొన్నచో అర్థసంగతముగాగలదు చరక గ్రంధమున గూడా అనియతారిష్టమున కుదాహరణము గలదు అదేమనగా "సంశయప్రాప్తమాత్రేయో జీవితం తస్యమన్యతే" (ఇం అ 9) అనగా అరిష్ట లక్షణములుత్పన్నమైన తరువాత గూడా రోగి యొక్క జీవితము సంశయించదగినదిగా యుండునని ఆత్రేయుని అభిప్రాయము ఇది చరకము నందలి అనియతారిష్టమునకు ఉదాహరణము కొందరీవిషయము క్రింది విధముగా వివరించుచున్నారు అదేమనగా "సంశయప్రాప్త"మను పదము శబ్దభేదమేగాని వేరొకటిగాదు అందువలన రసాయనాది క్రియలు లేనప్పుడు అన్ని అరిష్టములు మరణము గలిగించునవిగానే యుండును రసాయనము తపస్సు మొదలగునవి మాత్రము అధిక ప్రభావముగలవగుట వలన ఇతరములైన క్రియలచే (చికిత్సలచే) సాధ్యములుగానివాటిని సైతము సాధించగల సామర్థ్యముగలవై యుండును ఈ విధమైన అరిష్టములను నివారించుశక్తి మహామహిమాన్వితులైన నందికేశ్వరుడు మొదలగు వారి యందే కనిపించునుగాని అందరు అరిష్టములను నివారించలేరు అందువలననే అరిష్టములుత్పన్నములైనచో వ్యాధి అసాధ్యమని తంత్రమున చెప్పబడినది అని వారి యభిప్రాయము మరికొందరు నియతాయువు తప్పనిసరిగా అరిష్ట లక్షణములు ముందుగా వచ్చి మరణము తరువాత సంభవించును అనియతాయువు అరిష్ట లక్షణములు లేకనే సంభవించునని చెప్పుచున్నారు, కాని "మరణంచాపి తన్నాస్తియన్నారిష్టపురఃసరమ్" (ఇ అ 2) అనగా అరిష్టములు లేకుండా మరణమనునది కలుగదు అనువచనము ననుసరించి అది సరిగాదు ఐతే అనియతాయుష్షు గలవారికి అరిష్టములు గలిగినప్పటికిని సరియైన చికిత్సలందించుట వలన జీవింపజేయ

వచ్చునుగదా అనియతమైన ఆయువుగలవారికి తాము చేయు అపరాధములవలననే (సమ్యక్చికిత్సా భావరూపమైన) మరణము సంభవించును సమ్యక్చికిత్స చేసినచో అపరాధముండదు గాన అరిష్టములు, మృత్యువు సంభవించదు గదా అని ప్రశ్న? అందుకు అది సరిగాదు అని సమాధానము అదెట్లనగా అనియతాయువు లన్నియు ఎల్లప్పుడు పురుషకార సాధ్యములుగావు ఐతే యథోచిత కాలమున చేయబడు స్వస్థహితములు, ఆతురహితములునైన పరిచర్య రూపములో నుండు పురుషకారముల (వైద్యుడు మొదలగువారిచే చేయబడు చికిత్సలు)తో అనియతాయువు సాధించ బడవచ్చును అందువలన యథోచిత కాలమున చేయబడు హితసేవన చేయకుండుట వలన అసాధ్యత్వమును పొందిన వ్యాధులలో అరిష్టములు గలిగినపుడు కాలము నతిక్రమించిచేసిన చికిత్స నీరు వెడలిపోయిన తరువాత నిర్మాణము చేయబడిన ఆనకట్టవలె నిష్ప్రయోజనమగును అందువలన అసాధ్యములైన వ్యాధులకిచట సాధనము (చికిత్స) ఉపదేశించబడలేదనుట సమంజసమే

మూ॥ భూయాశ్చాతో యథాద్రవ్యం గుణకర్మాణి వక్ష్యతే॥ 63

తాత్పర్యము పై జెప్పిన గుణకర్మలేగాక ఆయా ద్రవ్యముననుసరించి గుణ కర్మలను (ఏద్రవ్యముననేవిధములైన గుణకర్మలుండునో వానిని) విశేషముగ మరలనీతంత్ర కారుడు వివరించునని భావము

చ పా వ్యా అం అ పై జెప్పబడిన గుణకర్మలు అంతేనా లేక ఇంకేవైనాగలవా? అను ప్రశ్నకు "భూయశ్చాతోయథాద్రవ్యం" అను శ్లోకపాదము ద్వారా సమాధానమును చెప్పుచున్నాడు గుణకర్మలు అనగా గుణముల యొక్క కర్మలు, "యథాద్రవ్యం" అనగా ఏఏ ద్రవ్యమునందు ఏయే గుణములయొక్క కర్మలు గలవో, లేక సమూహ రూపమైన అన్నపానాదులందు ఏగుణకర్మలు గలవో వాటిని గూర్చి ఆచార్యుడు ఈ తంత్రమున ముందు ఆయాస్థలములందు చెప్పగలడు అని గ్రహించవలయును "వక్ష్యతి" అనునది "బ్రూఞ్" ధాతువునకు "వచి" ఆదేశము చేసి ప్రయోగించబడినది లేక "యథా-ద్రవ్యం" అనునది కారణమును పురస్కరించుకొని చెప్పబడినది ఉదా గురు, ఖర, కఠినములు మొదలుగా గల గుణముల కాధారమైనది పార్థివ ద్రవ్యము ఇట్టి గురు,ఖర, కఠిన గుణములు ఉపచయ, సంఘాత, గౌరవములను శరీరమునకు గలుగజేయుట వలన నివిపార్థివ ద్రవ్యముల యొక్క గుణకర్మలుఅని మరియొక అర్థము

మూ॥ రసనార్థోరసస్తస్య ద్రవ్యమాపఃక్షితిస్తథా।
నిర్వృత్తైచ విశేషేచ ప్రత్యయాః ఖాదయస్త్రయః॥ 64

**తాత్పర్యము** రసనేంద్రియము (జిహ్వాలేక నాలుక)తో గ్రహించడునది రసము, దానికి ఆధార కారణములైన ద్రవ్యములు జలము, పృధ్విమహాభూతములు ఇవే రసమునకు త్పత్తి కారణములు గూడా ఉత్పన్నమైన రసమున వివిధములైన భేదములు (మధుర, ఆమ్ల, లవణ, కటు, తిక్త, కషాయము) గలుగుటకు కారణములు ఆకాశము, వాయు, అగ్ని, మహాభూతములు అనగా రసముయొక్క ఉత్పత్తికి జల, పృధివీ భూతములు కారణములు. వివిధ రసముల యొక్క అభివ్యక్తికి అకాశ, వాయు, అగ్ని భూతములు కారణములని యర్థము

చ పా వ్యా ఆం అ దోషములింతకు పూర్వము చెప్పబడినవి వాటిని శమింపజేయుటలో ప్రధానములైన రసములను చెప్పబోవుచు రస లక్షణములతో పాటు రసోత్పత్తి క్రమమును "రసనార్థో" అను శ్లోకముద్వారా చెప్పుచున్నాడు "రస్యతే ఆస్వాద్యతే ఇతి రసః" అను వ్యుత్పత్తిననుసరించి ఆస్వాదనము చేయబడునది (రసనేంద్రియము ద్వారా తెలుసుకోదగినది) రసము "రసనార్థః" రసనేంద్రియ (జిహ్వా) విషయము లేక రసనేంద్రియము (నాలుక)చే గ్రహించబడునది ఇది అన్ని రసములకు వర్తించును, మరియు రూపము మొదలగు వాటిని వేర్పరచును (రూపాదులు రసనేంద్రియ గ్రాహ్యములుగావు గావున) గాన ఈ లక్షణములు సాధువుగా నున్నది (అతివ్యాప్తి అవ్యాప్తిదోష రహితమైన లక్షణమని యర్థము) తస్య అనగా ఆరసమునకు ద్రవ్యం= ఆధారకారణము, ద్రవ్యశబ్దము ఆధారకారణ వాచకమైయున్నది ఉదా "పంచేంద్రియ ద్రవ్యాణి" '(సూ అ8) అనుచోట ద్రవ్యములు ఆధార కారణములుగా చెప్పబడినవి "క్షితిస్తథా" అనగా జలము రసమునకెట్లు ఆధారకారణమో అట్లే పృథివి గూడా ఆధారకారణమని తెలియజేయుచున్నాడు రెండును ఆధారకారణము లేయైనపుడు "అప్క్షితీ" అని రెండింటికి సమాన ప్రతిపత్తి నివ్వవలసియుండగా "క్షితిస్తథా" భూమి గూడా ఆధారకారణము అని చెప్పుటవలన భూమికి గల ఆధారకారణత్వము అంతముఖ్యమైనదిగాదని తెలుపుచున్నాడు కారణమేమనగా జలమె స్వభావ సిద్ధముగా (నైసర్గికముగా) రసముగలది అందువలన రసమునకు జలము ప్రధానమైన ఆధారకారణము మరియు ఆత్రేయ భద్రాకాపీయమున గూడా "సౌమ్యాః ఖల్వాపః' (సూ అ 26) అను మొదలగు సూత్రములతో జలమునందే రసము అభివ్యక్తమగునని చెప్పబడినది సుశ్రుతమునగూడా "తస్మాదాప్యోరసః"

(సు సూ అ 42) రసము జలసంబంధమైనదని చెప్పబడినది ఐతే పృథివి ఎల్లప్పుడు జలము యొక్క రసముతో కూడి యుండుట వలన "రసవతి" అని చెప్పబడుచున్నది పృథివి జల ద్రవ్యములకు గల సంబంధము నిత్యమగుటయే నిందుకు కారణము ఇందుకు ప్రమాణము "విష్టం హ్యాపర పరేణ" అని (న్యా ద 3/1/60) న్యాయదర్శనమున గలదు ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథివీ భూతములలో మొదటి భూతములు తరువాతి భూతములలో (ఆకాశము వాయువునందు, ఆకాశ వాయువులు, అగ్ని యందు, ఆకాశ వాయు అగ్నులు జలమునందు, ఆకాశ, వాయు, అగ్ని జలములు పృథివి యందు) నిత్యముగా ప్రవేశించును ఈ అనుప్రవేశమువలననే ఆకాశాది భూతములలో ఉత్తరోత్తరముగా ఆకాశమునకంటే, వాయువులో, వాయువునకంటే అగ్నిలో ఇట్లే ఇతర భూతములలో గుణాధిక్యత గలుగును అటుతరువాత రసము యొక్క అభివ్యక్తిలో జల పృథివీ భూతములు కారణములా లేక రస విశేషములకు కారణములా అను విషయమును "నిర్వృత్తే" అను శ్లోకపాదముచే చెప్పుచున్నాడు "నిర్వృత్తై" అనగా అభివ్యక్తియందు (వ్యక్తమగుటయందు) దానిననుసరించి రసము జలము పృథివీ భూతములనాధారముగా చేసికొనియె అభివ్యక్తమగునని తెలియజేయుచున్నాడు "విశేషేచ" అను పదములోని చకారము వలన మధురాది రూపమైన రస విశేషాభివ్యక్తి యందుగూడా జలము, పృథివి కారణములేయని గ్రహించవలయును (జల, పృథివీ భూతములు రస సామాన్యమునకు మాత్రమే గాక రస విశేషమైన మధుర రసోత్పత్తికి గూడా కారణమని యర్థము దీనిననుసరించి "పృథ్వీ" సోమగుణాతిరేకాన్మధురః పృధివీ అగ్నిగుణాతిరేకాదమ్లః (సూ అ 26) అను మొదలగు సూత్రములవలన చెప్పబడిన జల పృథివీ భూతముల యొక్క విశేష కారణత్వము సరిపోయినది "విశేషేచ ప్రత్యయాః ఖాదయస్త్రయః" అనగా మధురాది విశేషరసములుత్పన్నము లగుటలో ఆకాశ, వాయు, అగ్నులు కారణములు అంతేగాని అవి ఆధార కారణభూతములు గావు "ఖాదయః" అను శబ్దముచేతనే జల పృథివీ భూతములు రసాభివ్యక్త ఆధార కారణములని చెప్పుట వలన "ఖాదయః" అను శబ్దముచే మిగిలినవి మూడే యైనప్పటికిని "త్రయః" అని మరల చెప్పుట వలన ఆకాశ, వాయు, అగ్ని, భూతములు విడివిడిగాను, లేక కలిసి రసాభివ్యక్తికి కారణములని చెప్పబడినట్లు అగును అందువలననే విడివిడిగా నున్న, లేక కలసి కట్టుగా ఆకాశము మొదలగు భూతముల యొక్క సంస్కర్గము వలన మధురతరము, మధురతమము మొదలగు అవాంతర భేదములు రసములకు

గల్గుచున్నవి "విశేషేచ" అను సందర్భమున గల "చ" కారము రసవిశేషాభివ్యక్తియందు ఆకాశ, వాయు, అగ్ని భూతములకు గల నిమిత్తకారణత్వమును తెలుపుటకై ప్రయోగించబడినది ఈ విషయమును ముందు "తాస్త్వంతరిక్షాద్భృష్టాశ్యమానాభ్రష్టాశ్చ పంచమహాభూత వికారగుణ సమన్వితా జంగమస్థావరాణాం భూతానాం మూర్తీరభిప్రేరణయంతి, తాసు షడ్భిర్మూర్ఛంతిరసాః" (సూ అ 26) అనగా ఆ జలములు అంతరిక్షమునుండి పడుచు, పడిన తరువాత గూడా పంచమహాభూత వికారగుణములతో కలిసి జంగమ స్థావర ప్రాణులను పోషించును అపుడు ఆయా మూర్తిమంతములైన శరీములందు ఆరురసములు అభివ్యక్తమగునని చెప్పబడును కొందరు "విశేషేచ" అను పదమునందలి చకారమును "ఖాదయః" అను పదముతో జోడించి "ఖాదయశ్చ" అని చెప్పి అట్టి చకారముతో అగ్ని, వాయు, ఆకాశముతోపాటుగా కాలమును గ్రహించి విశేషరసాభివ్యక్తియందు కాలముగూడా కారణమని చెప్పినారు కాలమును సాక్షాత్తుగా చెప్పకపోవుట వలన ఆకాశాదుల నుండి కాలమును వేరుచేసి కాలమునకు గూడా రసాభివ్యక్తియందు కారణత్వమును తెలుపుచున్నాడు (కాలము గూడా రసాభివ్యక్తికి కారణమని తెలుపు చున్నాడు) లేక మొదట చెప్పినట్లుగానే రసమునకు జలము మరియు పృథివీ ఆధార కారణములు "నిర్వృత్తేచ" అనుదానికి మరియొక అర్థము రసాభివ్యక్తిలో పృథివికారణము అంతేగాని జలముకారణము గాదు కారణమేమనగా జలము అవ్యక్తరసము పృథివీ సంబంధమువలననే రసాభివ్యక్తి గలుగుచున్నది ఇదే విషయము "జంగమ స్థావరాణాంభూతానాం మూర్తీరభిప్రీణయంతి, తాసు షడ్భిర్మూర్ఛంతి రసాః" (సూ అ 26) అని చెప్పబడినది అనగా జంగమస్థావర ప్రాణులను పోషించును ఆ మూర్తిమంతములైన శరీరములందారు రసములు అభివ్యక్తమగును అని చెప్పబడినది అందువలన పృథివీ మొదలగు ద్రవ్యముల యొక్క సంబంధమువలననే జలము నందుండు రసమభివ్యక్తమగును వేరువిధముగాగాదు "విశేషేచ" అను పదమునందలి 'చ' కారము వలన జలము, పృథివీ విశేషకారణములు జలము, పృథివి, విశేష కారణములైనప్పటికిని "సోమగుణాతిరేకాన్మధురః"(సూ అ 26) అనగా మధుర రసము "సోమగుణాధిక్యతవలన గలుగును ఇచట సోమగుణాధిక్యత మధురరస విశేషమునకు కారణమైనట్లు ఇతర రస విశేషములకు సోమవ్యతిరిక్తములైన (జలమునకంటే వేరైన) ఆకాశాదులు కారణములగును అందువలన రసాభివ్యంజనమునకు పృథివీ భూతమే కారణమైనప్పటికిని రస విశేషమునకు మాత్రము అల్పముగానున్న ఆకాశ, వాయు,

అగ్ని భూత ప్రవేశము విశేషకారణమగును ఒక్కొక్క సమయమున మధురాది విశేషరసములు లేకుండా గూడా రసాభివ్యక్తి గలగవచ్చును అట్టి సమయమున సాధారణముగా రసాభివ్యక్తికి కారణమైనవి జలము, లేక జలము పృథివి భూతములే మధురాది విశేష రసోపలబ్ధికి ఆయా ఇతర భూతములు కారణముగావచ్చును

మూ। స్వాదురమ్లోఽద లవణః కటుకస్తిక్త ఏవచ।
కాషాయశ్చేతి షట్కోఽయం రసానాం సంగ్రహః స్మృతః॥ 65

**తాత్పర్యము** మధురము (తీపి), అమ్లము (పులుపు), లవణము (ఉప్పు), కటుకము (కారము), తిక్తము (చేదు), కషాయము (వగరు) అనునవి ఆరు రసములు ఇది రసముల యొక్క సంగ్రహము

చ పా వ్యా ఆం అ ఇచట సర్వప్రాణులకిష్టమైనదిగాన మొదట మధుర రసము చెప్పబడినది అటుతరువాత తక్కిన ఆమ్లాది రసములయిదును సామాన్యముగా ప్రాణులలో కొకదానికన్న యొకటి ఇష్టమగుట వలనదాని ననుసరించి క్రమముగా నిర్దేశింప బడినవి మతాంతరములందు రస సంఖ్య ఏడుగా చెప్పబడినది దానిని నిరసించుటకై 'షట్కః' ఆరు అని సంఖ్యా నిర్దేశము చేయబడినది "సంగ్రహః" అని చెప్పుట వలన రసముల యొక్క పరస్పర సంసర్గముచే అనేక రసములుత్పన్నమగునని తెలుపు చున్నాడు

మూ। స్వాద్వమ్లలవణావాయుం, కషాయంస్వాదుతిక్తకాః।
జయంతి పిత్తం, శ్లేష్మాణం కషాయకటు తిక్తకాః॥ 66
(కట్వమ్లలవణాః పిత్తం, స్వాద్వమ్లలవణాః కఫమ్।
కటుతిక్త కషాయాశ్చ కోపయంతి సమీరణమ్॥) 67

**తాత్పర్యము** మధుర, అమ్ల, లవణ రసములు మూడును వాతమును శమింప చేయును కషాయ, మధుర, తిక్తరసములు పిత్తమును శాంతింపజేయును కషాయ, కటుతిక్త రసములు శ్లేష్మమును శాంతింపజేయును అట్లే కటు, అమ్ల, లవణ రసములు పిత్తమును వృద్ధినొందించును స్వాదు (మధుర), అమ్ల, లవణ రసములు కఫమును వృద్ధి చేయును కటుతిక్తకషాయరసములు వాతమును వృద్ధి పొందించును

చ పా వ్యా ఆం అ "స్వాద్వమ్లలవణా" అను శ్లోకముతో రసముయొక్క ఉపయోగమున గలుగు కార్యమును చెప్పుచున్నాడు ఇచట వాయువునకు రసము లేనప్పటికిని రస సహచరితములైన (రసముననుసరించియున్న) స్నిగ్ధత్వము మొదలగు విపరీత

గుణములతో వాయువు శమించునని తెలుసుకోవలయును ఇందుకుదాహరణముగా వాగ్భటాచార్యులు చెప్పిన ప్రమాణము "తత్రాద్యామారుతం ఘ్నంతి త్రయస్తిక్తాదయః కఫమ్। కషాయతిక్తమధురాః పిత్తమన్యేతుకుర్వతే॥" (వా సూ అ1) అనగా ఆద్యములైన (మొదటివైన) మధుర, అమ్ల, లవణ రసములు వాతమును శమింపజేయును తిక్తరసము మొదలుకొని (తిక్త, కటు, కషాయ రసములు) మూడు రసములు కఫమును శమింపజేయును కషాయ, తిక్త, మధుర రసములు పిత్తశమనమును గల్గించును పై జెప్పబడిన వాటికి అతిరిక్తములైన (వేరైన) రసములు ఆయా దోషములను వృద్ధినొందించును అనగా మధురామ్ల లవణ రసములు వాతమును శమింపజేయగా అవేరసములు కఫ వృద్ధిని గలుగజేయును కషాయ తిక్త, మధుర రసములు పితాశామకములుకాగా ఆమ్ల, లవణ, కటు రసములు పిత్తవృద్ధిని గలిగించును కటు, తిక్త, కషాయరసములు కఫశామకములుకాగా అవివాత వృద్ధిని గల్గించునని వాగ్భటమ్మున వివరించబడినది ఇచట రసము యొక్క కర్మలు చెప్పుటచేత గుణవీర్యవిపాకముల యొక్క కర్మలుగూడా చెప్పబడినట్లేనది ఈ కారణమువలననే ఆచార్యుడు ఆత్రేయ భద్రకా ప్యీయమను అధ్యాయమున మధురాది రసముల నాధారముగాజేసికొనియే అన్ని గుణములను, వీర్యములను, విపాకములను గూడా "తత్రస్వాదుః" (సూ అ 26) అని నిర్దేశించినాడు అట్లే "కటు తిక్తకషాయాణాం విపాకః ప్రాయశః కటుః" (సూ అ 26) అనగా కటు, తిక్త, కషాయరసములు తరచుగా కటు విపాకము జెందుననియు, "అమ్లోఽమ్లంపచ్యతే స్వాదుర్మధురం లవణస్తథా" (సూ అ 26) అనగా అమ్లరసము అమ్ల విపాకమును జెందును మధుర, లవణ రసములు మధుర విపాకమును జెందును అనియు అట్లే "తయోరమ్లం యదుష్ణంచ యచ్ఛోష్ణం కటుకంతయోః" (సూ అ 26) అమ్ల, కటు రస ద్రవ్యములు ఉష్ణ వీర్యముగలవై యుండును అని చెప్పినాడు

మూ। కించిద్దోష ప్రశమనం కించిద్ధాతు ప్రదూషణమ్।
స్వస్థవృత్తే మతం కించిత్త్రివిధం ద్రవ్యముచ్యతే॥ 67

తాత్పర్యము నానావిధ ద్రవ్యములలో కొన్ని దోషములలో ఒక్కటినైనను, రెండింటినైనను, అన్నింటినైనను శమింపజేయును కొన్ని (శరీర ధారణమునకు సాధనములగుటచే ధాతువులనబడు) వాతాదులను, మరియు రసాదిధాతువులను దూషింపజేయును మరికొన్ని స్వస్థవృత్తమునకు (ధాతువులు వికృతిజెందక సమస్థితినుండునపుడు అట్టి స్వస్థతను కాపాడుటకు) హితములైయుండును ఈ విధముగా ద్రవ్యములు దోష

ప్రశమనము, ధాతు ప్రదూషణము, స్వస్థహితము అని మూడు విధములుగ నుండును

చ పా వ్యా అం అ ద్రవ్యమును, గుణకర్మలు మొదలగునవి చెప్పిన పిమ్మట ప్రభావముచే చేయబడు ద్రవ్యకార్యములను చెప్పుటకొరకై ప్రభావభేదముచే ద్రవ్యభేదములను "కించిద్దోష ప్రశమనమ్" అను శ్లోకముతో చెప్పుచున్నాడు కించిత్ అనగా అన్ని ద్రవ్యములుగాదు అని అర్థము (కొన్ని ద్రవ్యములు), దోష ప్రశమనమ్ అనగా ఒక దోషమునైనను, రెండు దోషములనైనను, మూడు దోషములనైనను శమింప జేయుద్రవ్యములు ఇచట దోష శబ్దముచే దోషములు మాత్రమేగాక దుష్టి జెందిన రసాదిధాతువులను గూడా గ్రహించి కొన్ని ద్రవ్యములు వాతాది దోషములను దుష్టిజెందిన రసాది ధాతువులను గూడా శమింపజేయును అని గ్రహించవలెను దీని ననుసరించి ద్రవ్యమహిమలో దోషములను, దుష్టిజెందిన రసాది ధాతువులను శమింపజేయు ఆమలకి, దురాలభ మొదలగు ద్రవ్యములను దోష ప్రశమనములుగా గ్రహించవలసియుండును ఆమలకి మంగళకరమైనదిగాన త్రిదోషహరము దురాలభ గూడా వాతపిత్తశ్లేష్మహరము సుశ్రుతమున "హంతివాతం తదమ్లత్వాత్" (సు సూ అ 46) అనగా ఆమ్ల రసము గలిగినదగుట వలన అమలకి వాతమును శమింపజేయునని గుణముల ద్వారా త్రిదోషహరత్వముఆమలకి ద్రవ్యమునకు చెప్పబడినప్పటికి ఆమలకి గుణములకు గూడా ఆ త్రిదోషహరత్వము ప్రభావము ద్వారా సంక్రమించినదే అని తెలుసుకోవలయును కారణమేమనగా కేవలము గుణములనాధారము చేసికొన్నచో ఆమ్లత్వము పిత్తప్రకోపము చేయవలసియుండును కాని ఆమలకి పిత్తప్రకోపము జేయక పిత్తశమనము చేయును అందుకు ప్రభావమే కారణమగుట వలన ఆమ్లత్వాదులు ప్రభావ బృంహితములై, ఆమలకి త్రిదోషహరత్వమునకు కారణములగుచున్నవి ధాతు ప్రదూషణమనగా సమత్వము గలిగి యుండుటవలన శరీరమును ధరించునవైన వాతాదిదోషములను, అట్లే రసాది ధాతువులను దూషించు ద్రవ్యములు కొన్ని ఉదా యవకము, మందకము మొదలగునవి స్వస్థడనగా సుష్ఠు అవతిష్ఠతే నీరోగత్వేన, ఇతి స్వస్థః అనగా రోగములులేక బాగుగానుండు వాడు స్వస్థుడు అనునది స్వస్థునికి నిర్వచనము వృత్తిః = స్వస్థుడుగానుండుటకు అనుసరించవలసిన ఆచారము స్వస్థవృత్తి, దానికనుకూలమైన ఉపచారము (ద్రవ్యములు) లేక స్వాస్థ్యమును రక్షించు ద్రవ్యములు కొన్ని ఈ విధముగా ద్రవ్యంబులు మూడు విధములు సంఖ్య ననుసరించి మూడే ద్రవ్యములు చెప్పబడినప్పటికిని మరల "త్రివిధంద్రవ్యముచ్యతే" అని మూడు అని చెప్పుటవలన సంశోధనము సంశమనము మొదలగు అనేక

విధములైన ద్రవ్యాంతరములున్నప్పటికిని అవన్నియు ఈ మూడింటి యందే అంతర్భవించి మొత్తముమీద మూడే ద్రవ్యములని నియమము విధించబడినది రసాయన వాజీకరణములు మాత్రము సంశోధన సంశమనాది ద్రవ్యములందుగాక కేవలము స్వస్థవృత్తమునందు మాత్రమే అన్వయించును ఇదే విషయము "స్వస్థస్యోర్జస్కరంకించిత్‌తద్వృష్యంత ద్రసాయనం" (చ చి అ1పా1) అని చెప్పబడినది శ్లోకమును ప్రతిపాదించు సందర్భమున "కించిత్" అను పదముచేత ద్రవ్యములందు గల దోషహరత్వము, ధాతు ప్రదూషణత్వము మొదలగు కర్మలు అన్నింటియందు గాక కొన్ని కొన్ని ద్రవ్యములందు ఆయా కర్మలు ఉండునని తెలియుచున్నవి దోష ప్రశమన, ధాతుప్రదూషణ, స్వస్థవృత్తమతములైన ద్రవ్యములన్నింటికి కలిపి ఒకే "కించిత్" శబ్దమును ప్రయోగించినచో ఒకే ద్రవ్యము కొంతభాగముతో దోషహరణము, కొంత భాగముతో ధాతు ప్రదూషణము, కొంతభాగముతో స్వస్థవృత్తపరిపాలనము చేయునను అర్థమువచ్చును కాని అది సమ్మతము కాదు అందువలన మూడు చోట్ల "కించిత్" శబ్దము ప్రయోగించబడినది ఇట్లు చేయుటవలన కొన్ని ద్రవ్యములు దోషప్రశమనములు, కొన్ని ధాతు ప్రదూషణములు, కొన్ని స్వస్థవృత్తియందు హితకరములైనవి అను అర్థము వచ్చును ఇచట నొకపూర్వపక్షము (ప్రశ్న) స్వస్థవత్తియందు ఉపయోగించు రక్తశాలి, షష్టికము, యవలు మొదలగు ద్రవ్యములు దోషమును శమింపజేయుట గూడా కన్పడుచున్నది ఆ కారణమువలననే రక్తశాలి మొదలగునవి జ్వరము మొదలగు వాటియందు ప్రయోగింపబడుచున్నవి అట్లే ప్రకృతి, దేశము, మాత్ర, కాలములను దృష్టితో దోషప్రశమనములైన ద్రవ్యములు, దోషకరములుగూడా అగును ఉదా ఆమలకినధికముగా నుపయోగించిన అగ్ని మాంద్యము గలుగును ఇట్లే ఇంకను కొన్ని, ఇంతేగాక మరికొన్ని ధాతు ప్రదూషణము లైన విషము మొదలగు ఉదర దోషమును హరించుచున్నవి అట్లే దోషకరములైన మందకము మొదలగు ద్రవ్యములే దోషక్షయమున దోషవృద్ధిని గలిగించుచు దోష ప్రశమనమునే (దోషసామ్యతనే) కల్గించుచున్నవి ఇది ఒక విధమైన అవ్యవస్థాదోషము గాన "కించిద్దోష ప్రశమనమ్" అనుట సరిగాదు అని పూర్వపక్షము దీనికి సమాధాన మేమనగా స్వస్థవృత్తియందుపయుక్తములైన రక్తశాల్యాదులు దోష ప్రశమనములు గూడా గావచ్చును గాని అవిసాధారణముగా స్వస్థవృత్తియందు హితములగుట వలన స్వస్థవృత్తియందంగీకరించబడినవి ఇందుకు ప్రమాణము "స్వస్థస్యోర్జస్కరం యత్తు తద్వృష్యం తద్రసాయనమ్ ప్రాయః ప్రాయేణ రోగాణాం ద్వితీయం ప్రశమేహితమ్॥

ప్రాయః శబ్దోవిశేషార్థః ఉభయం హ్యుభయార్థకృత్'' (చి అ1) అనగా స్వస్థునికి ఊర్జ స్కరములైన చికిత్సలు రెండు అవి రసాయన, వాజీకరణములు ఇవిగాక వ్యాధిగ్రస్తునికి వ్యాధిని బోగొట్టు చికిత్స రెండవది రసాయన వాజీకరణ చిక్తిత్స ఒకటి, రోగశమన చికిత్స రెండవది ఈ రెండు రెండుకార్యములను అనగా రసాయన వాజీకరణ చికిత్సలు రసాయన వాజీకరణములను, మరియు వ్యాధి శమనమును గల్గించును, అట్లే రోగశమన చికిత్సగూడా రోగశమనముతోపాటు రసాయన వాజీకరణములను చేయును గాని ఇచట ''ప్రాయః శబ్దము ప్రయోగించబడి ప్రాయః'' అను శబ్దమునకు సాధారణముగా అనిగాక ''విశేషము''గా అని అర్థము తంత్రకారునిచే చెప్పబడినది దీని ననుసరించి రసాయనవాజేకరణములు రసాయన వాజీకరణములతోపాటు వ్యాధి శమనము గల్గించినప్పటికి విశేషముగా రసాయనవాజీకరణ చికిత్సలు రసాయనవాజీకరణములనే జేయును అట్లే వ్యాధిశమన చికిత్స విశేషముగా వ్యాధిశమనమునే చేయును అని అర్థము దోష ప్రశమనములైన ద్రవ్యములు విరుద్ధప్రకృతి మొదలగు ప్రతిబంధక భావములు లేనప్పుడు దోషపశమును తప్పక జేయును గాని ప్రతిబంధక భావములున్నప్పుడు అవిదోషప్రశమమును గల్గించవు అంతమాత్రమున అవి దోష ప్రకోపకరములు గావు ఉదా అగ్ని మంత్రము మొ॥ ప్రతిబంధకముల వలన దహించకపోయినచో అగ్నికి దాహకత్వములేదని చెప్పలేము ఇదేవిధముగా ధాతు ప్రదూషకములైన ద్రవ్యములు ఒక్కొక్కప్పుడు ఇతర కారణములవలన ధాతు ప్రశమనములు గూడా కావచ్చును అంతమాత్రమున అవిధాతు ప్రదూషణములుగాకపోవు ఉదా నీరు అగ్నితో సంబంధము గలిగినపుడు (వేడిచేయబడినపుడు) ఉష్ణముగానుండును అంత మాత్రముచేత నీటికిగల సహజమైన శీతలత్వము లేదని చెప్పలేము అందువలన ఇతరములైన వాటి అపేక్షలేకయె స్వయంసిద్ధమైన స్వరూపములతోనే ఆయా ద్రవ్యములను చెప్పుట సమంజసముగానుండును ఇంతకుముందు చెప్పబడిన మందకము మొదలగు ద్రవ్యములు క్షీణించిన దోషములను వృద్ధిపొందించుట ద్వారా దోషసామ్యతను గల్గించునప్పటికిని అట్టి సామ్యత తాత్కాలికమగుట వలనను, ఉత్తరకాలమున దోషములను గల్గించునదగుట వలనను దోషప్రశమనమని చెప్పదగదు ఈ విధముగా చెప్పినప్పటికిని (దోషప్రశమనమైనది ధాతు ప్రదూషణము గాదు, ధాతు ప్రదూషణమైనది దోషశామకము గాదు) అని చెప్పబడినప్పటికిని ఒక దోషమును శమింపజేసి మరియొక దోషమును కల్గించు ఒకే ద్రవ్యములు కొన్ని గలవు ఉదా మరిచము (ఒకేద్రవ్యము)

శ్లేష్మమును హరించి పిత్తమును గలుగజేయును ఇట్టి ద్రవ్యములనేకములు అవి వేటిలో గ్రహించబడుననునది మరియొక ప్రశ్న? ఈ విషయమున కొందరి యభిప్రాయమేమనగా కొన్ని ద్రవ్యములు భయాత్మకములగుట వలన దోషశమనము, దోషకరములుగా గూడా నుండును అంతమాత్రమున (ఒకే ద్రవ్యము దోషహరమై, దోషకరములగుట వలన) ద్రవ్యములుమూడు అను సంఖ్యా నియమమునకు హానిలేదు కారణమేమనగా వాతాదిదోషములతో సంసర్గము వలన (రెండు దోషముల వలన) వ్యాధులుద్భవించుచున్నప్పటికి ఏకదోషజన్యములైన (వాత, పిత్తకఫముల) వ్యాధులు గలుగవని నియమములేదు (అనగా ద్వంద్వ దోష జన్యములు చెప్పబడినప్పటికిని వ్యాధులు వాతజన్యములు, పిత్తజన్యములు, కఫ జన్యములు అని ఆయా దోషజన్యవ్యాధులు సంఖ్యా పూర్వకముగా చెప్పబడియె యున్నవి ఉదా వాతజన్యములు 80, పిత్తజన్యములు 40, కఫజన్యములు 20) అని లేక మరియయొక విధముగాగూడా చెప్పవచ్చును అదేమనగా మరిచము మొదలగు ద్రవ్యములకుగల ఉభయకర్తృత్వము (దోషశమనము, దోషకరము) ద్రవ్య ప్రభావముచే గలిగినది గాదు పోతే అది రసము మొదలగు గుణములచే కలిగినది అందువలన పైజెప్పబడిన సందర్భము ద్రవ్యముయొక్క ప్రభావమునకు సంబంధించినదిగాన ఈ సందర్భముననది ఉదహరించదగదు మరియ నింతేగాక కొన్ని ద్రవ్యములు ప్రభావము వలననే కొన్ని దోషములనుశమింపజేసి మరికొన్నింటిని వృద్ధినొందించును ప్రభావము దోషశమనము దోషప్రకోపము ఒకేసారి గలిగించకూడదు అను నియమము లేదు అను యుక్తిబాగుగానున్నది శ్లోకమున కించిద్దోష ప్రశమనం, కించిద్ధాతు ప్రదూషణం అని గాక కించిద్దోషప్రశమనం, కించిద్దోష ప్రకోపణం అనగా కొన్ని ద్రవ్యములు దోష శమనమును, కొన్ని దోషదుష్టిని గలిగించును లేక కొన్ని ధాతుదుష్టిని కొన్ని ధాతు శమనమును గలిగించును అని చెప్పవచ్చును గదా అనునది మరియొక్క ప్రశ్న? కాని అట్లు చెప్పగూడదు అని సమాధానము ఆ విధముగా చెప్పినచో దోషశబ్దము వాతాదులందే ముఖ్యంముగా చెప్పబడుట వలనను, ధాతుశబ్దము రసాది ధాతువులందే ముఖ్యముగా చెప్పబడుటవలనను, ఒకేసారి రెండు (దోషధాతు) గ్రహించబడవు దోష ప్రశమనం, ధాతు ప్రదూషణం అను రెండు పదములను చెప్పుటవలన చాకచక్యము గల తంత్రకారుడు దోషప్రశమనం అను పదముతో దూషణత్వ ధారణత్వములు గల రసాదిధాతువులను గ్రహించి వివిధాశితపీతీయమున చెప్పబడిన దుష్టములైన రసాది ధాతువులను చేయుచికిత్సను (ద్రవ్యములను), అట్లే "ధాతు ప్రదూషణం" అను

దానితో వాతాదిదోషములను దూషించు నిదానము (కారణములను) ఈ రెండింటిని గ్రహించును అనగా ప్రశమన శబ్దముచేత దోష ప్రశమనము, దుష్టధాతు ప్రశమనమును, అట్లే "ధాతుప్రదూషణం" అను శబ్దముచేత వాతాదుల యొక్క ప్రదూషణము రసాది ధాతు ప్రదూషణ ద్రవ్యములను గ్రహించును ప్రదూషణం అను పదమున "ప్ర" శబ్దము ప్రకార వాచకము అందువలన ప్రశమనం అనగా శమన భేదములైన (సామ్యతను గల్గించు సంశోధన, సంశమన చికిత్సలు, "ప్రదూషణం" అనగా "ప్రశబ్దమునకు ప్రకారములు అని అర్థము చెప్పి దూషణ ప్రకారములు (భేదములు) ఐన మృదు, మధ్య మొదలగు దూషణ భేదములు గ్రహించవలయును లేక ధాతువు యొక్క ఉత్కృష్టార్థమునందే ఈ 'ప్ర' శబ్దములు ప్రయోగించబడినవి ఉదా "పరిధావతి" అను శబ్దమునకు ధావతి = పరుగెత్తుచున్నాడనియే అర్థము ఈ శాస్త్రమున దోష ప్రశమనమే ప్రధానముగావున మొదట దోష ప్రశమన ద్రవ్యము చెప్పబడినది స్వస్థవృత్తియందు హితమైన (చికిత్స) ద్రవ్యముగూడా ముందుగలుగబోవు దోషమును హరించునదిగాన అదిగూడా దోష ప్రశమనమెగదా అని అన్నచో అది సరిగాదు కారణమేమనగా స్వాస్థ్యమును గలిగించుట ద్వారా దోషములను అడ్డుకొనునది దోషశామకము గాదు పోతే సమానములుగా నున్న ధాతువులను వృద్ధినొందించక, క్షీణింపజేయక, రసాది ధాతువుల స్రోతస్సులకు అనుగుణముగా నుండుటవలన అది స్వస్థవృత్తియందుహితమైనది మాత్రమె ఇందుకు ప్రమాణముగా "పద్యం పథోఽనపేతం యత్" (సూ అ 25) అనగా "పధ్యం" అనగా స్వాస్థ్యమార్గమునుండి తప్పనిది అని అర్థము

జంగమాది త్రివిధ ద్రవ్యములు

మూ॥ తత్పునస్త్రి విధం ప్రోక్తం జంగమౌమాద్భిద పార్థివమ్।
మధూని గోరసాః పిత్తం వసామజ్జాఽ సృగా మిషమ్॥ 68

విణ్మూత్రచర్మరేతో స్థిస్నాయు శృంగనఖాః ఖురాః।
జంగమేభ్యః ప్రయుజ్యంతే కేశాలోమాని రోచనాః॥ 69

సువర్ణం సమలాఃపంచ లోహాః ససికతాః సుధా।
మనః శిలాలేమణయో లవణం గైరికాంజనే॥ 70

భౌమమౌషధముద్దిష్ట మౌద్భిదంతు చతుర్విధమ్।
వనస్పతిస్తధా వీరు ద్వానస్పత్యస్తధౌషధీః॥ 71

ఫలైర్వనస్పతిః పుష్పైర్వానస్పత్యాః ఫలైరపి।
ఔషధ్యః ఫలపాకాంతాః ప్రతానైర్వీరుదః స్మృతాః॥ 72

మూలత్వక్ సారనిర్యాస నాల(డ) స్వరసపల్లవాః।
క్షారాః క్షీరం ఫలం పుష్పం భస్మతైలాని కంటకాః॥ 73
పత్రాణి శుఙ్గాః కందాశ్చ ప్రరోహాశ్చౌ ద్భిదో గణః।

**తాత్పర్యము** పై జెప్పిన మూడు విధములైన ద్రవ్యములు జాంగమములు, ఔద్భిదములు, పార్థివములు అని మూడు విధములు గచ్ఛతిపునః పునః ఇతిజఙ్గమః తత్సంబంధిజాంగమం అనువ్యుత్పత్తిచేత పలు విధములుగ సంచరించు స్వభావము గల విజంగమములు వాటికి సంబంధించిన గోరసముమున్నగునవి జాంగమ ద్రవ్యములు "ఉద్భిద్య పృధివీం జాయత ఇతి ఔద్భిదం" అను వ్యుత్పత్తిచేత భూమిని ఛేదించుకొని పుట్టు స్వభావముగల వనస్పత్యాదులు, వృక్షాదుల, ఔద్భిదములు ఈ రెండింటికంటే వేరైనవి పృధివీ సంబంధమైనవి పార్థివములు, సువర్ణము మొదలగునవి

వాటిలో తేనె, పాలు, నెయ్యి మొదలగు గోరసములు, కస్తూరి మున్నగు పిత్తములు, వస, మజ్జ(క్రొవ్వు), రక్తము, మాంసము, మలము, మూత్రము, చర్మము, రేతస్సు (శుక్రము), అస్థులు (ఎముకలు), స్నాయువులు, కొమ్ములు, గోళ్ళు, గిట్టలు, వెండ్రుకలు, రోమములు, రోచనము (గోరోచనము), ఇవన్నియు జంగమముల నుండి గ్రహించబడును

బంగారము, పంచలోహములు, వాని మలములు (చిట్టెము), ఇసుక, సున్నము, మణిశిల, తాళకము (హరిదళము), మణులు, ఉప్పు, గైరికము (కావిరాయి), అంజనము (సౌవీరాంజనము మొదలగునవి) ఇవన్నియు భూమికి సంబంధించిన ఔషధములు భౌమములని చెప్పబడును

ఇచట జాంగమములను చెప్పిన పిదప ఔద్భిదము క్రమానుసారముగ చెప్ప వలసియున్నను ఔద్భిదముకన్న పార్థివముస్వల్పమైనదగుట వలన సూచీకటాహ న్యాయముననుసరించి పార్థివము చెప్పబడినది పంచలోహములు అనగా తామ్రము (రాగి), రజతము (వెండి), త్రపు (తుత్తినాగము), సీసము, కృష్ణలోహము (ఇనుము) అను నీయైదు పంచలోహములనబడును 'సమలాః' అను పదముచేత శిలాజతు పంచలోహముల యొక్క మలములను గ్రహించవలయును

ఔద్భిద ద్రవ్యములు నాల్గు విధములు అవి వనస్పతులు, వీరుధులు, వానస్పతులు, ఔషధులు వాటిలో పూవులు లేక కాయలు కాచునట్టి మఱ్ఱి, అత్తి

మొదలగునవి వనస్పతులనబడును పూవులు మొదట పూచి పిదప ఫలించునట్టివి వానస్పతులు, ఫలించిన వెంటనే నశించునవి పైరు, నువ్వులు, మినుములు మొదలగునవి ఓషధులు. తీగలు బారి నాల్గుదెసల నల్లకొను స్వభావము గలవి వీరుధులు గుల్మములు గూడా వీరుధులే

మూలము (వేరు), త్వక్ (పట్ట) సారము (చేవ), నిర్యాసము (బంక) స్వరసము (రసము), నాలము (కాడ), పల్లవము (చిగురు) క్షారములు, పాలు, ఫలములు పుష్పములు, భస్మము, తైలములు, ముండ్లు ఆకులు, ఊడలు, దుంపలు మొలకలు ఇవన్నియు ఔద్భిదగణములో చేరినవి

చ పా వ్యా అ అ "తత్పునః' అను శ్లోకములచేత ద్రవ్యముల యొక్క మరికొన్ని భేదములను చెప్పుచున్నాడు తత్ అనగా ఆ ద్రవ్యము తిరిగి జాంగమములు, ఔద్భిదములు, పార్ధివములని మూడు విధములు "గచ్ఛతీతి జంగమం" పలు విధములుగ నడమనది జంగమము తత్సంబంధమైనవి జాంగమములు "ఉద్భిద్య పృథివీం జాయత ఇతి ఔద్భిదం" భూమిని భేదించుకొని పుట్టునవి ఔద్భిదము వృక్షములు మొదలగునవి ఈ రెండింటికి వేరైన పృథివీ వికారములు పార్థివములు ఇవిగాక స్వేద జన్యములైన క్రిములు జంగమ ద్రవ్యములందు అంతర్భవించును కుక్కుటాండములు (కోడిగ్రుడ్లు) మొదలగునవి ఔద్భిదములందంతర్భవించును ఇచట ద్రవ్యశబ్దముచేత పార్థివ ద్రవ్యములే గ్రహించబడును గాన జలము, అగ్ని, వాయువు మొదలగునవి గ్రహించబడకపోవుటవలన గలుగు అవ్యాప్తి లేదు అని భావము జంగమ శబ్దముచేత జంగమములనుండి పుట్టిన గోరసములు, తేనె మొదలగునవి గూడా గ్రహించబడును ఇట్లే ఔద్భిద, పార్థివములనగా వాటి నుండి ఉద్భవించిన ద్రవ్యములను గూడా గ్రహించవలయును రోచనా అనగా గోరొచనము ఇచట చెప్పబడిన తేనె మొదలగునవి కొన్ని అవితరఃుగ ఉపయోగించబడుటవలనను, వాటికి గల ప్రాధాన్యతననుసరించియు కొన్ని ఉదాహరణ రూపముగా తెలుపబడినవి అందువలన ఇవేగాక అండములు వస్తిమున్నగునవి గూడా గ్రహించవలసి యుండును ఇచట జంగమ ద్రవ్యములను చెప్పిన పిదప క్రమముననుసరించి ఔద్భిదములను చెప్ప వలసినయున్నను ఔద్భిదములకన్న పార్థివములు స్వల్పములుగా నుండుట వలన జంగమముల తరువాత పార్థివములు చెప్పవబడినవి అటుతరువాత విస్తారముగా చెప్పవలసిన ఔద్భిదములు చెప్పబడినవి సువర్ణము మొదలగువాటిలో సువర్ణము అనగా బంగారము, పంచలోహములనగా తామ్రము (రాగి), రజతము (వెండి), త్రపు

(తుత్తినాగము), సీసము, కృష్ణలోహము (ఇనుము) మొదలగువాటిని గ్రహించ వలయును "సమలా" అనుచోట మల శబ్దముచే పంచలోహముల యొక్క మలములైన శిలాజతు రూపములను గ్రహించవలయును సుశ్రుత దర్శనముననుసరించి సువర్ణము, రజతము మొదలగు వాటి నుండి బుట్టి ఆరువిధములైన శిలాజతునే గ్రహించ వలయును సుశ్రుతమున ఆరువిధములైన శిలాజతు మాత్రమే చెప్పబడినది ఈ గ్రంథమున నాల్గు విధములైన శిలాజతు రసాయన ప్రకరణమున "చతుర్భ్యోధాతు భ్యస్తస్య సంభవః" అనగా నాల్గు ధాతువుల నుండి శిలాజతు పుట్టునని చెప్పబడినది అవి హేమ్నోఽథరజతాత్తామ్రా ద్వరం కృష్ణాయసాదపి (చి అ 1) అనగా బంగారము నుండి, రజతము నుండి, తామ్రము నుండి, కృష్ణ లోహమునుండి నాల్గు విధములైన శిలాజతు ఉద్భవించునని అర్థము. ఈ వాక్యము నాల్గు విధములైన శిలాజతునకు గల రసాయనమునందధికారమును తెలుపుచున్నది (రసాయనమునందుపయుక్తముగా నుండుటను తెల్పుచున్నదని భావము) అంతేగాని సుశ్రుతుడు చెప్పిన ఆరువిధములైన శిలాజతు అనుదానికి విరోధముగాదు లేక సువర్ణము (బంగారము) మల రహితమైనది మిగిలిన రజత, తామ్ర, త్రపు, సీస, లోహములు మలయుక్తములైనవి పంచలోహములు అని గూడా మరియొక అర్థము శిలాజతు, పాషాణము, పంకము మొదలగునవి ఉచ్ఛిష్టం అను శబ్దముతో సూచించబడినవి సుధా (సున్నము), ఆలం = హరితాలము, అంజనం = సౌవీరాంజనము, ఫలైర్వనస్పతి : అనగా పువ్వులు పూయకుండానే ఫలించునవి వనస్పతులు ఉదా మఱ్ఱి, మేడి మొదలగునవి. ఈ విషయమ హారీత సంహితయందు "తేషామపుష్పాః ఫలినో వనస్పతయ ఇతి స్మృతాః" అనగా పుష్పములు లేక ఫలించునవి వనస్పతులుగా చెప్పబడును అని చెప్పబడినది వానస్పత్యములనగా పుష్పించి ఫలించునవి ఫలించిన వెంటనే నశించు తిలలు, ముద్గములు మొదలగునవి ఓషధులు కొందరు "పాకాంతాశ్చౌషధ్యః" అని ఫలించకపనే పాకము నొంది నశించు దూర్వా (గరిక) మొదలగు వాటిని గూడా ఓషధులని చెప్పుచున్నారు ప్రతానములు అనగా లతలు (తీగలు) గుల్మములు (గుబురుగా పెరుగువాటిని) అని గ్రహించ వలసియున్నది హారీతుడు గూడా "లతాగుల్మాశ్చ వీరుధః" అనగా లతలు గుల్మములు వీరుధులని చెప్పినాడు మూలత్వక్ మొదలగునవి చెప్పిన సందర్భమున "నిర్యాసము' ' చెప్పబడినది నిర్యాసమనగా లొద్దుగ, సర్జరసము (మైనము)మొదలగునవి ఔద్భిద గణమనగా భూమిని భేదించుకొని ఉద్భవించు సమూహము

త్రివిధ ద్రవ్యములలో ప్రశస్తములు, శోధనోపయుక్తములు

మూ॥ మూలిన్యః షోడశైకోనా ఫలిన్యః వింశతిః స్మృతాః॥ 74
మహాస్నేహాశ్చ చత్వారః పంచైవలవణానిచ।
అష్టౌమూత్రాణి సంఖ్యాతాన్యష్టావేవ పయాంసిచ॥ 75
శోధనార్థాశ్చషడ్వృక్షాః పునర్వసునిదర్శితాః
య ఏతాన్ వేత్తి సంయోక్తుం వికారేషు సవేదవిత్॥ 76

తాత్పర్యము ప్రశస్తములైన వేళ్ళు గలిగినవి మూలినులనబడును అవి పదునారు ఫలిన్యః (ప్రశస్తములైన ఫలములుగలవి) పందొమ్మిది, మహాస్నేహములు నాలుగు, లవణములు ఐదు, మూత్రములు ఎనిమిది విధములు,క్షీరములు ఎనిమిది విధములు, శోధన రూపమైన చికిత్స చేయుటకు ప్రశస్తములైన వృక్షములు ఆరు, ఇవి పునర్వసుచే నిర్దేశించబడినవి ఇట్టివానిని చికిత్సయందు యథోచితముగ చేర్చుటకెవడు చక్కగ తెలుసుకొని ఆయా రోగములందుపయోగించునో వాడు ఆయుర్వేదమును చక్కగా నెరిగిన వాడగును

చ పా వ్యా ఆం అ పై జెప్పబడిన జంగమాది త్రివిధ ద్రవ్యములలోనేవి ప్రశస్తమైనవో అట్టి ద్రవ్యములను "మూలిన్యః" అను శ్లోకములలో చెప్పుచున్నాడు మూలిన్యః అనగా ప్రశస్తములైన వేళ్ళుగలవి, ఇట్లే ప్రశస్తములైన ఫలములు గలవి "ఫలిన్యః" అనబడును వాటిలో మూలద్రవ్యములు పదునారు, ఫలద్రవ్యములు పందొమ్మిది, ఇచట మహాస్నేహములు నాలుగు అని చెప్పబడినది స్నేహాధ్యాయమున క్షీరము, మాంసము మొదలగునవి గూడా స్నేహములని చెప్పుటవలన వాటిలో స్నేహాధిక్యత గలవి ఘృతము, తైలము, వసా, మజ్జా అను నాల్గు ద్రవ్యములే గాన వాటి వైశిష్ట్యమును తెలుపుటకు ఇచట మహాస్నేహములు నాలుగు అని చెప్పబడినది అట్లే విమాన స్థానమున (అ8) అనేక లవణములు చెప్పబడియుండుట వలన వాటిటన్నింటిలో ఐదు విధములైన లవణములే ప్రశస్తములని తెలియజేయుటకిచట లవణములైదు అని చెప్పబడినది ఇట్లే మూత్రాదులందుగూడా సజాతీయములైన వాటియందు నిచ్చట చెప్పబడినవి ప్రశస్తములని గ్రహించవలయును వేదవిత్ అనగా ఆయు ర్వేదమును నెరిగినవాడు

మూలినీ వివరణము, వాని ప్రత్యేక ప్రయోజనములు

మూ॥ హస్తిదంతీహైమవతీ శ్యామా త్రివృదధోగుడా।
సప్తలాశ్వేతనామాచ ప్రత్యక్శ్రేణీ గవాక్ష్యపి॥ 77

జ్యోతిష్మతీచ బింబీచ శణపుష్పీ విషాణికా।
అజగంధా ద్రవంతీచ క్షీరిణీ చాత్రషోడశా॥ 78
శణపుష్పీచ బింబీచ ఛర్దనే హైమవత్యపి।
శ్వేతా జ్యోతిష్మతీచైవ యోజ్యేశీర్ష విరేచనే॥ 79
ఏకాదశావశిష్టాయాః ప్రయోజ్యాస్తా విరేచనే।
ఇత్యుక్తా నామ కర్మభ్యాం మూలిన్యః,

తాత్పర్యము కొండాముదపుచెట్టు, వస, నల్లతెగడ, తెల్లతెగడ, వృద్ధదారు, సంబరేణు, తెల్లదింటెన, నల్లదింటెన, చేదుపుచ్చ, మాల్కంగిని, దొండ, శణపుష్పి, విషాణిక (పిన్నపాల), వాయింట, ద్రవంతి (ఎలుకచెవి), పాలచెట్టు ఈ పదునారు మూలినీ (వేళ్ళు) ద్రవ్యములు, (మూలములు గల్గిన జాతి చెట్లలో ప్రశస్తములు) ఈ పదునారు ద్రవ్యములలో శణపుష్పి, దొండ, వస ఈ మూడు వమన క్రియకు (వాంతిచేయించుటకు) మిక్కిలి ప్రశస్తములు తెల్లతెగడ, మాల్కంగిని శిరోవిరేచనము చేయుంచుటకుపయోగించదగినవి మిగిలిన పదునొకండు ద్రవ్యములు విరేచనమునకై యుపయోగింపదగును. ఈ విధముగా మూలినీ ద్రవ్యముల యొక్క పేర్లు వాని విశేషకృత్యములు వివరించబడినవి

చ పా వ్యా అం అ హస్తిదంతీ = కొండాముదముచెట్టు, దీనినే కొందరు నాగదంతీ అని చెప్పుదురు హైమవతీ = వజ(స), శ్యామా = నల్ల తెగడ, అధోగుడా = వృద్ధదారు, సప్తలా = సంబరేణు, శ్వేతనామా = తెల్లదింటెన, ప్రత్యక్‌శ్రేణీ = దంతి (నల్లదింటెన), గవాక్షీ = చేదుపుచ్చ, బింబీ = దొండ, శణపుష్పీ = శణపుష్పి, విషాణికా = పిన్నపాల, అజగంధా = వాయింట, ద్రవంతీ = ఎలుక చెవికూర, క్షీరిణీ = పాలచెట్టు, వీటిలో శణపుష్పి, దొండ, వస, వమనమునందుపయోగించదగినవి తెల్లతెగడ, మాల్కంగిని శిరోవిరేచనమునకుపయుక్తములైనవి తక్కిన పదకొండు విరేచనమునందు పయుక్తము

మూ। ఫలినీః శృణు॥ 80

శంఖిన్యథ విడంగాని త్రపుషంమదనానిచ।
ధామార్గవమథేక్ష్వాకు జీమూతం కృతవేధనమ్॥
ఆనూపంస్థలజం చైవ క్లీతకం ద్వివిధం స్మృతమ్॥ 81
ప్రకీర్యాచోదకీర్యాచ ప్రత్యక్పుష్పాతథాఽభయా।
అంతః కోటరపుష్పీచ హస్తి పర్ణ్యాశ్చశారదమ్॥ 82

కంపిల్లకారగ్వధయోః ఫలంయత్కుట జస్యచ।
ధామార్గవమథేక్ష్వాకు జీమూతంకృతవేధనమ్॥ 83

మదనం కుటజంచైవ త్రపుషం హస్తిపర్ణినీ।
ఏతాని వమనేచైవ యోజ్యాన్యాస్థాపనేషుచ॥ 84

నస్తః ప్రచ్ఛర్దనే చైవ ప్రత్యక్పుష్పావిధీయతే।
దశయాన్యవశిష్టాని తాన్యుక్తాని విరేచనే॥ 85
నామకర్మభిరుక్తాని ఫలాన్యేకోన వింశతిః।

తాత్పర్యము తెల్లదింటెన, వాయువిడంగములు, కీరదోస, మ్రంగ, నీల బుట్టిన యష్టిమధుకము, మెట్టభూమియందు బుట్టిన యష్టిమధుకము, నెమలియడుగు చెట్టు, కానుగచెట్టు, ఉత్తరేణి, కరక, నల్లదింటెన, మోరట ఫలము (దీనిని శరత్కాలమున గాచిన ఫలమును గ్రహించవలయును), కంపిల్లకము, పెద్దరేల, కొడిశపాల, చేదుపుచ్చ, వెఱ్ఱిసొర, దేవదాళి, చేదుబీర అనునీ పందొమ్మిది ప్రశస్తములైన ఫలములు గల ద్రవ్యములు వీనిలో చేదుపుచ్చకాయ, చేదుసొర, దేవదారు, చేదుబీర, మ్రంగకాయ, కొడిసెపాల, కీరదోస, మోరటఫలము వీనిని వమనమునకును ఆస్థాపనమునకును ఉపయోగింపదగును ఉత్తరేణిని నశ్యకర్మకుపయోగింపదగును తక్కిన పది విరేచనమునకుపయోగపడును ఈ విధముగా ఫలినీద్రవ్యములనామభేదములు, వాని నుపయోగింపదగిన కర్మలు వివరించబడినవి (ఇచట "హస్తిపర్ణ్యాశారదమ్" అనుటచేత హస్తిపర్ణిని శరత్కాలమున బుట్టిన దానిని గ్రహించవలయును)

చ పా వ్యా అం అ శంఖినీ = తెల్లదింటెన, క్లీతకం = అతిమధురము, అతిమధురము సుశ్రుతముననుసరించి మూలము ప్రధానమగుట మూలినీ ద్రవ్యములలో పరిగణించ బడినప్పటికిని విరేచన విషయమున మాత్రము రెండు విధములైన అతిమధురముల యొక్క ఫలములు మాత్రమే ప్రశస్తములుగా నుండును ధామార్గవః = చేదుపుచ్చ, ఇక్ష్వాకు = చేదుసొర, జీమూతః= దేవదాళి, కృతవేధనం = చేదుబీర, ప్రకీర్యా = నెమిలి యడుగుచెట్టు, ఉదకీర్యా= కానుగచెట్టు, ప్రత్యక్పుష్పా = ఉత్తరేణి, అంతః కోటరపుష్పీ = నల్లదింటెన, హస్తిపర్ణీ = మోరటఫలము (దీనిని శరత్కాలమున కాచిన ఫలమును గ్రహించవలయును) అందువలననే 'హస్తిపర్ణ్యాశ్చ శారదమ్" అని చెప్పబడినది కంపిల్లకం= కంపిల్లకము, ఆరగ్వధః = రేల, (సుశ్రుతమున అరగ్వధ పత్రమునకు

ప్రాధాన్యత నివ్వబడినప్పటికిని ఇచట మాత్రము ఫలము ప్రశస్తమైనదిగాన ఫలినీ ద్రవ్యములందు పరిగణించబడినది అనగా ఫలములను (గ్రహించవలయును) పై వాటిలో ధామార్గవము, ఇక్ష్వాకు, జీమూతము, కృతవేధనము, మదనము, కుటజము, త్రపుషము, హస్తిపర్ణినీ ఈ ద్రవ్యములు వమనమునకు, ఆస్థాపనమునకుపయోగించ వలయును. నస్యకర్మకు ప్రచ్ఛర్దనమునకు (శిరోవిరేచనము) ఉత్తరేణి ఉపయోగించ వలయును మిగిలిన పది ద్రవ్యములు విరేచనమునకు ఉపయోగించవలయును

చతుర్విధ మహాస్నేహములు వాని కృత్యములు

మూ। సర్పిస్తైలంవసా మజ్జా స్నేహోదిష్టశ్చతుర్విధః॥ 86
పానాభ్యంజనవస్త్యర్థం నస్యార్థంచైవ యోగతః।
స్నేహనా జీవనా వర్ణ్యా బలోపచయవర్ధనాః॥ 87
స్నేహాహ్యేతేచ విహితా వాత పిత్తక ఫాపహాః।

**తాత్పర్యము** నెయ్యి, నువ్వులనూనె, వస (మాంసస్నేహము), మజ్జ (క్రొవ్వు) ఈ నాల్గును మహాస్నేహములనబడును ఇవి పానమునకు, అభ్యంగనమునకు నస్యము చేయుటకు ఉపయుక్తములుగా నుండును మరియు పై జెప్పిన స్నేహములు నాల్గును ఆయువును వృద్ధిచేయును శరీరమునకు వర్ణమును గలిగించును బలమును వృద్ధినొందించును శరీరమునకు పుష్టిని గలిగించును వాత, పిత్త, కఫములను హరించును

చ పా అం అ మహాస్నేహములందు ఘృతము ప్రధానమైనదిగాన అన్నింటికంటే నది ముందుగా చెప్పబడినది ఘృతప్రాధాన్యతలీవిధముగా చెప్పబడినది "నాన్యః స్నేహస్తథా కశ్చిత్ సంస్కారమనువర్తతే। యధాసర్పిరతః సర్పిః సర్వస్నేహోత్తమం మతం" అనగా స్నేహద్రవ్యములన్నింటిలోపస్నేహము ఘృతమువలె సంస్కారానువర్తనము జెందదు (సంస్కారముననుసరించి తన గుణములను మార్చుకొనుట సంస్కారానువర్తనమందురు) ఘృతమొక్కటేసంస్కారాను వర్తనగుణము గలది గాన అన్ని స్నేహములలో ఘృతము ఉత్తమమైనదిగా అంగీకరించబడినది (ని అ1) అని చెప్పబడినది

## పంచలవణములు, వాని గుణములు

మూ। సౌవర్చలం సైంధవంచ విడమౌద్భిదమేవచ॥ 88
సాముద్రేణ సహైతాని పంచస్యుర్లవణానిచ।

స్నిగ్ధాన్యుష్ణాని తీక్ష్ణాని దీపనీయతమానిచ॥ 89
ఆలేపనార్థేయుజ్యంతే స్నేహస్వేద విధేతథా।
అధోభాగోర్ధ్వభాగేషు నిరూహేష్వనువాసనే॥ 90

అభ్యంజనే భోజనార్థే శిరసశ్చ విరేచనే।
శస్త్రకర్మణి వర్త్యర్థమంజనోత్సాదనేషుచ ॥ 91
అజీర్ణానాహయోర్వాతే గుల్మేశూలే త థోదరే।
ఉక్తాని లవణా(ని) -

**తాత్పర్యము** సౌవర్చలవణము (నల్లఉప్పు), సైంధవలవణము (ఇందుప్పు), బిడాలవణము (ఎఱ్ఱఉప్పు), ఔద్భిదలవణము (నేలఉప్పు), సాముద్రలవణము (దక్షిణ సముద్రమున పుట్టిన ఉప్పు) ఈ ఐదును పంచలవణములనబడును ఇవి స్నిగ్ధ గుణము కల్గి ఉష్ణవీర్యము లైతీక్ష్ణములుగా నుండును ఆకలి బుట్టించు ద్రవ్యములలోనివి ముఖ్యమైనవి ఆలేపనము (పైన పట్టువేయుటకును), స్నేహ విధియందును, స్వేదవిధియందును, ఉపయోగింపదగినవిగాయుండును శరీర అధోబాగమునందును, ఊర్ధ్వభాగమునందును, నిరూహవస్తియందును, అనువాసనవస్తి యందును, అభ్యంజనముకును నుపయోగింపదగును భోజన పదార్థములందు చేర్చదగినవిగాయుండును శిరోవిరేచనమునకు, నశ్యకర్మకును, శస్త్రచికిత్సయందును, ఫలవర్తిచేయుటకును, అంజనకర్మకు ఉపయోగింపబడును అజీర్ణము, కడుపుబ్బరము, గుల్మము, శూల, ఉదరము అనునీవ్యాధులయందు విశేషముగ నుపయోగింప దగును ఈ విధముగా పంచలవణములు వాని గుణాదులు చెప్పబడినవి

"సైంధవం లవణానామ్" అను వాక్యముననుసరించి (సూ అ 25)

**చ పా వ్యా ఆం అ** లవణములందు సైంధవలవణము ప్రధానమైనదైనప్పటికిని రుచికరముగా నుండుట వల్లను, సైంధవము తరువాత సావర్చలవలణమే ప్రధానమని చెప్పుటకుగాను అన్నింటికంటే ముందుగా సౌవర్చలవణము చెప్పబడినది ఔద్భిద లవణమనగా నేల ఉప్పు (కొందరు శాంభరీలవణమును ఔద్భిదలవణమని చెప్పినారు) సాముద్రం అనగా దక్షిణ సముద్రమున బుట్టిన లవణము, అభ్యంజనే అనగా స్నేహాభ్యంగమున, వర్త్యర్థం ఫలవర్తికొరకై అని అర్థము,

## మూత్ర వివరణము

మూ। న్యూ(ఊ)ర్ధ్వం మూత్రాణ్యష్టేనిబోధమే॥ 92

ముఖ్యానియాని దిష్టాని సర్వాణ్యాత్రేయశాసనే।

అవిమూత్రమజామూత్రంగోమూత్రం మహిషంచయత్॥ 93

హస్తిమూత్రమథోఽష్ట్రస్య హయస్య చ ఖరస్యచ।

ఉష్ణంతీక్ష్ణమథోఽరూక్షం కటుకం లవణాన్వితమ్॥ 94

మూత్రముత్సాదనేయుక్తం యుక్తమాలేపనేషుచ।

యుక్తమాస్థాపనే మూత్రం యుక్తంచాపివిరేచనే॥ 95

స్వేదేష్వపిచతద్యుక్త మానాహేష్వగదేషుచ।

ఉదరేష్వథచార్శఃసు గుల్మికుష్ఠికిలాసిషు ॥ 96

తద్యుక్తముపనాహేషు పరిషేకే త థైవచ।

దీపనీయం విషఘ్నంచ క్రిమిఘ్నంచోపదిశ్యతే॥ 97

పాండురోగోపసృష్టానా ముత్తమం శర్మచోచ్యతే।

శ్లేషాణంశమయేత్ పీతం మారుతంచానులోమయేత్॥ 98

కర్షేత్పిత్తమథోబాగమిత్యస్మిన్ గుణ సంగ్రహః।

సామాన్యేనమయోక్తస్తు పృథక్త్వేన ప్రవక్ష్యతే॥ 99

అవిమూత్రం సతిక్తంస్యాత్ స్నిగ్ధం పిత్తావిరోధిచ।

ఆజంకషాయ మధురం పథ్యం దోషాన్నిహంతిచ॥ 100

గవ్యం సమధురంకిచిద్దోషఘ్నం క్రిమికుష్ఠనుత్।

కండూంచశమయేత్పీతం సమ్యగ్దోషోదరేహితమ్॥ 101

అర్శః శోఫోదరఘ్నంతు సక్షారం మాహిషం సరమ్।

హాస్తికం లవణం మూత్రం హితంతుక్రిమికుష్ఠినామ్॥ 102

ప్రశస్తం బద్ధవిణ్మూత్ర విషశ్లేష్మామయార్శసామ్।

సతిక్తంశ్వాసకాసఘ్నమర్శోఘ్నం చేష్ట్రముచ్యతే॥ 103

వాజినాంతిక్తకటుకం కుష్ఠవ్రణ విషాపహమ్।

ఖరమూత్రమపస్మారోన్మాద గ్రహవినాశనమ్॥ 104

ఇతీహోక్తాని మూత్రాణి యథాసామర్థ్య యోగతః।

తాత్పర్యము గొఱ్ఱెల మూత్రము, మేక మూత్రము, గోమూత్రము, గేదెమూత్రము, ఏనుగు మూత్రము, ఒంటెమూత్రము, గుఱ్ఱపుమూత్రము, గాడిద మూత్రము ఈ ఎనిమిది అష్టమూత్రములు అనబడును తక్కినజంతువుల మూత్రములకన్న ఇవి గుణోత్తమములగుట వలన ముఖ్యములని ఆత్రేయమహర్షి శాసించియున్నాడు

ఇచట స్త్రీజాతి జంతువుల అంగోపాంగములు లఘువుగానుండుట వలన వాని మూత్రములును లఘువుగానుండును అందువలన పైజెప్పిన మూత్రములను ఆడజంతువుల నుండియే గ్రహించవలయును ఈ విషయమునే "లాఘవంజాతి సామాన్యే స్త్రీణాం పుంసాంచగౌరవం" అనగా సమాన జాతులందలి ద్రవ్యములలో స్త్రీజాతి ద్రవ్యములు లఘువుగాను, పురుషజాతి ద్రవ్యములు గురువుగాను యుండునని తంత్రాతరమున చెప్పబడినది

## మూత్ర సామాన్య గుణములు

ఉష్ణం తీక్ష్ణ పృథక్త్వేన ప్రచక్ష్యతే। 92 నుండి 98

పై జెప్పిన మూత్రములు ఎనిమిదియు ఉష్ణము, తీక్ష్ణము, రూక్షము, కటు, లవణ రసములను గల్గియుండును మర్దనమునకు, లేపనమునకు, ఆస్థాపనవస్తి విరేచనమునకు ఉపయుక్తమైనవి చెమటదీయుటకు, ఆనాహము (కడుపుబ్బరము)నకు, విషచికిత్సకును, ఉదర వ్యాధియందును, అర్శోరోగములందును, గుల్మవ్యాధులందును, కుష్ఠములందును, కిలాసము (సిబ్బెము) అను క్షుద్ర కుష్ఠమునందును చికిత్సకై విశేషముగ నుపయోగింపదగును మరియు ఉపనాహమున (కట్టుగట్టుట)కును, వ్రణాదులందు సేచనము చేయుటకును విశేషముగ నుపయోగించును మరియు జఠరాగ్నిని దీపింపజేయును విషముల హరించును క్రిములను బోగొట్టును, పాండువు, కామల, నంజు అను రోగములందు వీని నుపయోగించిన మిక్కిలి సుఖముగల్గును మూత్రమును త్రాగిన కఫమును హరించును వాతమును అనులోమముగ సంచరింపజేయును పిత్తమును క్రిందికినాకర్షించి వెడలించును ఇవన్నియు పైజెప్పిన మూత్రములకు సామాన్యముగనుండు గుణములు ఇది సామాన్యగుణకథనము గావున పై జెప్పిన మూత్రములకెనిమిదిటికిని ప్రత్యేక గుణములు ఈ క్రింద వివరింపబడును అవి ఏవనగా

"అవిమూత్రం యధాసామర్థ్య యోగతః॥ 99 నుండి 104

గొఱ్ఱెలమూత్రము చేదుగను, స్నిగ్ధముగను (జిడ్డుగలదిగ) నుండును పిత్తమునకు విరోధము చేయదు

మేకల మూత్రము వగరు, తీపియు గల్గి పథ్యముగనుండును త్రిదోషములను హరించును

ఆవుల మూత్రము కొంచెము తీపిగల్గి దోషములను హరించును క్రిములను కుష్ఠములను హరించును పానముచేసిన ఎడల దురదను పోగొట్టును వాతాది ప్రకోపమున జనించిన ఉదరవ్యాధియందు మిక్కిలి హితకరము

ఎనుముల మూత్రము - ఇది అరోగములను, శోఫ రోగమును హరించును కారముగ నుండును శరీరమున శీఘ్రముగ వ్యాపించు స్వభావముగలది

ఏనుగుల మూత్రము - ఉప్పగ నుండును క్రిమిరోగమునందును, కుష్ఠ రోగమునందును మిక్కిలి హితకరము మలమూత్రములు బంధించినపుడు, విషమునందును, కఫ రోగములందును, అరోగములందును మిక్కిలి హితముగ నుండును

ఒంటెల మూత్రము చేదుగ నుండును శ్వాసకాసముల హరించును అర్శోరోగములను హరించును

గుఱ్ఱముల మూత్రము చేదును, కారమును కల్గియుండును కుష్ఠములను, వ్రణములను విషములను హరించును

గాడిదల మూత్రము అపస్మారమును, ఉన్మాదములను, గ్రహములను హరించును

ఈ విధముగ ఎనిమిది విధములైన మూత్రములకు జేరిన గుణాదులు వేర్వేరుగ వివరింపబడినవి

చ పా వ్యా ఆం అ పైజెప్పబడిన అవి మూత్రము, అజామూత్రము మొదలగు మూత్రములలో స్త్రీ మూత్రమే ప్రశస్తమైనదని లింగపరిగ్రహణముచేత తెలుపుచున్నాడు స్త్రీ పురుష జాతి భేదముననుసరించి పురుషజాతి జంతువులలో అంగములు గురువులుగా నుండుట వలన పురుషజాతి జంతువుల మూత్రము గురువుగానుండును స్త్రీజాతి జంతువులలో పురుషజాతి జంతువుల కన్నా "అంగములన్నియు లఘువుగా నుండును అందువలన (స్త్రీజాతి జంతువుల యొక్క అంగములు లఘువుగా నుండుటవలన ఇందుకు ప్రమాణము "లాఘవంజాతి సామాన్యే స్త్రీణాం పుంసాంచ గౌరవం" (సూ అ27)) స్త్రీజాతి జంతువుల మూత్రముగూడా లఘువుగా నుండును అందువలన లఘుత్వముననుసరించి స్త్రీ మూత్రము ప్రశస్తమైనది పురుషుల మూత్రము శుక్రముతో సంబంధము గల్గియుండుట వలన గురువుగా నుండునని చెప్పుట సరికాదు కారణమేమనగా స్త్రీలకు గూడా శుక్రము గలదని చెప్పబడినది ఇందుకు దాహరణము "యదానారీహి నార్యాతు మైధునాయోపపద్యతే। ముంచతః శుక్రమన్యోన్యమన

స్థిస్తత్రజాయతే" అనగా ఒక స్త్రీ మరొక స్త్రీతో సంభోగించినపుడు శుక్రము విడిచినచో దానివలన గలుగు సంతానము అస్థివిహీనముగా నుండును ఇచట స్త్రీగూడా శుక్రవిసర్జనముచేయునని చెప్పబడుటచేత స్త్రీకి గూడా శుక్రముండు నని తత్సంబంధముచేత స్త్రీ మూత్రము గూడా గురువుగా నుండవలయునని శుక్ర సంబంధమువలన మూత్రగౌరవముగలుగునని చెప్పినచో చెప్పవలసియుండును అందువలన శుక్రసంబంధము వలన మూత్ర గురుత్వము గలుగునని చెప్పుట సరిగాదు అంగలాఘమే సరియైన సమాధానము నపుంసక మూత్రము అమంగల కరమైనదిగాన అది గ్రహించకూడదు అగదేషు అనగా విష సమానములైన లేక విషజన్యవ్యాధులందు, విషఘ్నమనగా విషమును హరించునవి అని రెండర్థములందు విషహర శబ్దము ప్రయోగించుట వలన పునరుక్తి దోషముగానేరదు శర్మచోచ్యతే అనగా ఆరోగ్యరూపమైన సుఖమును గలిగించును సుఖకరము అని అర్థము "అధోభాగం పిత్తంకర్షేత్" అనగా అధోమార్గమునుండి పిత్తమును వెడలింపజేయునని ఒక అర్థము అధోమార్గముననున్న పిత్తమును మాత్రమే వెడలించునుగాని ఊర్ధ్వ భాగముననున్న పిత్తమును వెడలించదని మరియొక అర్థము యధాసామర్థ్యయోగతః అనగా వాటివాటి యొక్క శక్తిననుసరించి పైజెప్పబడిన మూత్రములు ఆయా పనులను చేయునని అర్థము

## క్షీర భేదములు, క్షీర సామాన్య గుణాదులు

మూ। అతః క్షీరాణి వక్ష్యంతే కర్మచైషాం గుణాశ్చయే। 105
అవిక్షీరమజాక్షీరం గోక్షీరం మాహిషంచయత్
ఉష్ట్రీణామదనాగీనాం వడవాయాస్త్రీయస్తథా॥ 106
ప్రాయశోమధురం స్నిగ్ధం శీతంస్తన్యం పయోమతం।
ప్రీణనంబృంహణం వృష్యంమేధ్యం బల్యంమనస్కరమ్॥ 107
జీవనీయంశ్రమహరం శ్వాసకాసనిబర్హణమ్।
హంతిశోణితపిత్తంచ సంధానం విహతస్యచ॥ 108
సర్వప్రాణభృతాం సాత్మ్యంశమనం శోదనంతథా।
తృష్ణాఘ్నం దీపనీయంచ శ్రేష్ఠం క్షీణక్ష తేషుచ॥ 109
పాండురోగేఽమ్లపిత్తేచ శోషేగుల్మేతదోదరే।

అతీసారేజ్వరేదాహేశ్వయథేచ విశేష తః॥ 110
యోనిశుక్రప్రదోషేషు మూత్రేష్వ ప్రచురేషుచ।
పురీషేగ్రథితే పథ్యం వాతపిత్తవికారిణామ్॥ 111
నస్యాలేపావగాహేషు వమనాస్థాపనేషుచ।
విరేచనే స్నేహనేచ పయః సర్వత్రయుజ్యతే॥ 112
యథాక్రమం క్షీరగుణానేకైకస్య పృథక్ పృథక్।
అన్నపానాదికేఽధ్యాయే భూయోవక్ష్యామ్యశేషతః॥ 113

తాత్పర్యము క్షీరభేదములు పిమ్మట నుద్దేశప్రకారము క్రమప్రాప్తమైన ఎనిమిది విధములైన క్షీరములను వాటి గుణకర్మలు చెప్పబడును గొఱ్ఱెపాలు, మేకపాలు, ఆవుపాలు, ఎనుముపాలు, ఒంటెపాలు, ఏనుగుపాలు, గుఱ్ఱముపాలు, ఆడువారి చనుబాలు ఈ ఎనిమిది అష్టవిధక్షీరములు

క్షీరసామాన్య గుణాదులు క్షీరములన్నియు ప్రాయికముగ మధురరసము ప్రధానముగ గల్గియుండును (ప్రధానమనుటచేత ఒంటెపాలయందు లవణరసము మేకపాలయందు వగరు అనురసములుగా అప్రధానములైయుండునని భావము) మరియు స్నిగ్ధగుణము (జిడ్డుగల్గినవియు) శీతమును, శీతవీర్యమును గల్గి యుండును స్తనములను వృద్ధినొందించును ప్రీతిని (చక్షురాది ఇంద్రియములకు ఆప్యాయము) గల్గించును శరీరమును బలిపించును ఇంద్రియ పుష్టిని గల్గించి సంభోగేచ్ఛనువృద్ధినొందించును మేధస్సుకు మిక్కిలి హితకరము బలమును గల్గించును మనసుసనువృద్ధినొందించి మనశ్శక్తిని స్థిరపరచును ప్రాణములకు బలమునిచ్చును వ్యాయామాదులచే గల్గిన శ్రమను పోగొట్టును శ్వాసకాసములను, రక్తపిత్తమును హరించును విరిగిన సంధి బంధములను అతికించును మానవులకందరకు మిక్కిలి సాత్మ్యముగ నుండును క్రిమిదోషముల శమింపజేయునదియు, శోధించునదియు అగును దప్పినిబోగొట్టును మందగించిన జఠరాగ్నిని దీపింపజేయును ధాతువులు క్షీణించిన వారికిని గాయములు తగిలినవారికిని మిక్కిలి శ్రేష్ఠమైనది మరియు పాండు రోగము, ఆమ్ల పిత్తము, శోష (క్షయరోగము), గుల్మము, ఉదరరోగము, అతిసారము, జ్వరము, తాపము (మంట), వాపు, యోనిరోగములు, శుక్రరోగములు, మూత్రకృచ్ఛ్రాది మూత్రరోగములు, రక్తప్రదరము, మలబంధము అనునీ వ్యాధులందు మిక్కిలి పథ్యముగ నుండును వాత వ్యాధి గలవారికిని, పిత్తవ్యాధి పీడితులకును మిక్కిలి హితకరము మరియు

నశ్యమునకును, పూయుటకును (ఆలేపము), స్నానమునకును, వమనౌషధములకును, ఆస్థాపన వస్తికిని, విరేచనమునకును, స్నేహకర్మకు ఈ కర్మలన్నిటికి క్షీరము ముఖ్యముగా నుపయోగింపదగినది ఇవి పాలయొక్క సామాన్య గుణకర్మలు మరియు పైజెప్పిన క్షీరభేదములలో నొక్కొక్కదానికి వేరు వేరు గుణకర్మాదులు అన్నపానాదికాధ్యాయమున వివరింపబడును

చ పా వ్యా ఆం అ ఈ శ్లోకములలో "ప్రాయఃమధురం" అనగా ప్రాయశః అను శబ్దమునకు ప్రధానముగామధురము అని అర్థము దీనిననుసరించి ఒంటెపాలు కొంచెము ఉప్పుగాను, మేకపాలు కొంచెము వగరుగానున్నప్పటికిని అవి అప్రధానములని తెలుపుచున్నాడు మరియు "ప్రాయశః" అను శబ్దము, బృంహణము, స్నిగ్ధము, శీతము అను శబ్దములతో అన్వయించి సాధారణముగా బృంహణ, స్నిగ్ధశీతగుణములు పాలకుండును అని అర్థమునిచ్చును అందువలన ఒంటెపాలకు చెప్పబడిన రూక్ష, ఉష్ణత్వాది గుణములకిది విరోధముగాదు (సాధారణ పాలగుణములు స్నిగ్ధశీతలత్వాదులు) విశేషముగా ఒంటెపాలు రూక్షగుణము ఉష్ణగుణము గలవి అనుటలో తప్పులేదు ఒంటెపాలలో రూక్ష, ఉష్ణగుణములు విశేషములు స్తన్యం అనగా స్తనములవృద్ధినొందించునవి "మనస్కరం" అనగా ప్రభావము వలనను, ఓజస్సునువృద్ధినొందించుటవలనను మనస్సును వృద్ధినొందించును ఓజస్సును వృద్ధి నొందించుటవలన దానిననుసరించు మనస్సును గూడా తన కార్యములను చేయుట యందు సమర్థముగా జేయును ఓజస్సే మనస్సుయొక్క ప్రకర్ష, బుద్ధియొక్క ఉత్కర్ష మొదలగువాటికి అసాధారణ కారణము అందువలన ఓజస్సును వృద్ధినొందించుట ద్వారా క్షీరము మనఃప్రకర్షకు బుద్ధి ప్రకర్షకు అసాధారణ కారణము (కరణము) అగును హంతిశోణిత పిత్తం అనగా అవస్థా విశేషమును పొందిన రక్తపిత్తమును హరించును అవస్థా విశేషమును పొందిన రక్తపిత్తమేదనగా "కషాయయోగైర్వివిధైర్యథోక్తైః దీప్తేఽనలే శ్లేష్మణి నిర్జితేచ। యద్రక్తపిత్తం ప్రశమంనయాతి తత్రానిలః సాద్యను, తత్రకార్యం॥ ఛాగంపయః స్యాత్ పరమం ప్రయోగే గవ్యంశృతంపంచగుణే జలేవా॥ (చి అ4) అను ప్రమాణముననుసరించి శాస్త్రమున చెప్పబడిన రీతిగా వివిధ కషాయ యోగములుపయోగించుట వలన అగ్నిదీప్తిగల, కఫము నశించినను, రక్తపిత్తము శమించదో అట్టి రక్తపిత్తమున వాతాధిక్యతయుండును అట్టి అవస్థావిశేషమున మేకపాలు మిక్కిలి హితముగా నుండును లేక ఆవుపాలు 5 రెట్లు నీటిలోగాచి ఇవ్వవలయును అని చెప్పబడినది ఇట్టి రక్తపిత్త అవస్థా విశేషమును క్షీరము హితకరముగా

నుండును పై వివరణముననుసరించి అధోగతమైన రక్తపిత్తమున క్షీరము సరగుణము గలదగుట వలన ఉపయోగించకూడదు అట్లే ఊర్ధ్వగత రక్త పిత్తమున క్షీరము శ్లేష్మకం మగుట వలన ఉపయోగించగూడదు అను అభిప్రాయము ఖండించబడినది "సర్వప్రాణ భృతాం సాత్మ్యం" అను వాక్యమునందలి సర్వశబ్దము చికిత్సార్హులైన అందరు మానవులకు అని అర్థమునిచ్చుచు మానవులందరికి సాత్మ్యముఅని అర్థమును బోధించుచున్నది దీనిననుసరించి స్వేదజన్యము మొదలగు ప్రాణికోటికి సాత్మ్యముగాదు అని అర్థమును గ్రహించరాదు అన్ని ప్రాణులకూ సాత్మ్యమే అని అర్థము లేక ఇచట నివ్వబడిన సర్వశబ్దము మానవమాత్రులకే గాక సర్వప్రాణికోటికి అను విశాలమైన అర్థమున ప్రయోగింపబడినదని గ్రహించవలయును

మూ। అథాపరేత్రయో వృక్షాః పృదగ్యే ఫలమూలిభిః।
స్నుహ్యర్కాశ్మంతకాస్తేషా మిదం కర్మ పృథక్ పృథక్॥ 114
వమనేఽశ్మంతకం విద్యాత్ స్నుహీక్షీరం విరేచనే।
క్షీరమర్కస్య విజేయా వమనే సవిరేచనే॥ 115

తాత్పర్యము ఫలిని, మూలిని అని చెప్పి పైన వివరించిన వానికన్న నితరములయినవి యారు వృక్షములు శోధనార్థముపయోగింపదగినవి అందు జెముడు, జిల్లేడు, అశ్మంతకం అనునవి మూడు, ఆ మూటికి వేరు వేరు కృత్యములు చెప్పబడుచున్నవి ఆ మూడింటిలో ఆశంతకము వమన కర్మకుపయోగించును విరేచనమునకు జెముడు పాలు ఉపయోగింపదగును జిల్లేడుపాలు వమనమునకు విరేచనమునకు (రెంటింటికి) ఉపయోగింపదగును

**చ పా వ్యా అం అ** ఇచ్చట ఫలమూలిభిః అను శబ్దము పృధక్ అను శబ్దముతో కలిసి యుచ్చరించబడుట వలన ఆపాదానే తృతీయా అని తృతీయావిభక్తిలో చెప్పబడినది ఇచ్చట అశ్మంతకమనునది మాలుయసదృశపత్రో వృక్షః అని వ్రాసియున్నాడు ఆరె చెట్టనికొన్ని నిఘంటుకారులు వ్రాసియున్నారు కాని ఆరెచెట్టు వమనకారి గాదు కావున ప్రకృతమున దానిని గ్రహించుట సమంజసముగా లేదు

## మూడు శోధన వృక్షములు, వాని గుణకర్మలు

మూ। ఇమాంస్త్రీన పరాన్ వృక్షానా హుర్యేషాం హితాస్త్వచః।
పూతీకః కృష్ణగంధాచ తిల్వకశ్చ తదా తరుః॥ 116

విరేచనే ప్రయోక్తవ్యః పూతీకస్తిల్వక స్తథా।
కృష్ణగంధా పరీసర్పే శోథేష్వర్శః సుచోచ్యతే॥ 117

దద్రు విద్రధి గండేషు కుష్ఠేష్వప్యల జేషుచ।
షడ్వృక్షాన్ఛోదనా నేతానపి విద్యాద్విచక్షణః॥ 118

ఇత్యుక్తాః ఫలమూలిన్యః స్నేహాశ్చలవణానిచ।
మూత్రం క్షీరాణి వృక్షాశ్చ షడ్యే దిష్టపయస్త్వచః॥ 119

**తాత్పర్యము** పైజెప్పినవి మూడుగాక ఇతరములైనవి మూడు వృక్షములు గలవు వాని పట్టనుపయోగించుట చాలహితము అవియేవన నెమిలిడుగుచెట్టు (కానుగలో నొకభేదము), మునగచెట్టు, లొద్దుగచెట్టు అనునవి మూడు వృక్షములు అందు కానుగచెట్టు, పట్టయు, లొద్దుగచెట్టు పట్టయు విరేచనమునకుపయోగింప దగును మునగచెట్టు పట్టవిసర్పమునందును, శోథ (వాపు) యందును, ఆర్శోరోగము నందును, దద్దురులుగనుండు కుష్ఠ విశేషమునందును, విద్రధులందును, గండమాలయందును కుష్ఠములయందును, అలజియను మాంసమును తినునట్టి వ్రణములయందును విశేషముగ నుపయోగింపదగును పైజెప్పబడిన మూడు వృక్షములును, ఇచట చెప్పబడిన మూడు వృక్షములును జేరి ఆరు వృక్షములు శోధనమునకుపయోగింపదగినవి యని ఎరుంగవలయును

ఇచటలోధ్రము (లొద్దుగ) అనునది పట్టికాలోధ్రము, శాబర లోధ్రము అని రెండు విధములు అందుపట్టికాలోధ్రము ఆకృతిచే చిన్నది, రెండవది గొప్పది వృక్షజాతిలో చేరినది ఈ వృక్షజాతిలో జేరిన శాబరలోధ్రమునే గ్రహించవలయునని తెలుపుటకై "తరుః" అని విశేషముగ చెప్పబడినది

మరియు మునగచెట్టు శోధనములో జెప్పినందున ఇది విరేచనాది రూపముగ శోధనము చేయకున్నను పట్టువేయుటచే శరీరముపైనున్న దోషములను శోధించును గావున శోధనమని జెప్పుటసమంజసము

ఈ విధముగ ఫలిని, మూలిని, స్నేహములు, లవణములు, మూత్రములు, క్షీరములు, ఆరువృక్షములు (అందుపాలునుపయోగింపదగినవి మూడు, పట్టనుప యోగింపదగినవి మూడు) అనునవి "మూలిన్యఃనిదర్శితాః" అను గ్రంథమున నిర్దేశించిన ప్రకారము వానియవాంతర భేదములను, వాని గుణకర్మాదులును వివరింపబడినవని భావము

చ పా వ్యా ఆం అ  పూతీకః = నెమిలియడుగుచెట్టు, తిల్వకః = లోధ్రము (లొద్దుగ) దీనికి తరుః అను విశేషణము చెప్పుటచేత చిన్నదైన పట్టికాలోధ్రమును తొలగించి పెద్దదైన తరు(వృక్ష) జాతిలోచేరిన శాబరలోధ్రమును గ్రహింపవలయునని తెలుపు చున్నాడు లేక తరు అను విశేషణముతో చిన్నదైన లొద్దుగను తొలగించు చున్నాడు ఆరువృక్షములు శోధనములుగా పేర్కొను సందర్భమున మునగచెట్టు విరేచనాది రూపముగ శోధనము చేయకున్నను బాహ్యాలేపనము చేయుటచేత శరీరముపైనున్న దోషములను శోధించునుగావున శోధనమని చెప్పుట సమంజసము లేక అపిశబ్దమును పయోగించుట వలన మునగచెట్టు శోధనముగాదని సూచించుచున్నాడు

## ఓషధుల యోగజ్ఞానావశ్యకత

మూ॥ ఓషధీర్నామరూపాభ్యాం జానతేహ్యజపావనే।
అవిపాశ్చైవగోపాశ్చ యేచాన్యే వనవాసినః॥ 120
ననామజ్ఞానమాత్రేణ రూపజ్ఞానేనవాపునః।
ఓషధీనాంపరాంప్రాప్తి కశ్చిద్వేదితుమర్హ తి॥ 121
యోగవిత్త్వప్యరూపజ్ఞ స్తాసాంతత్త్వవిదుచ్యతే।
కింపునర్యోవిజానీయా దోషధీః సర్వదాభిషక్॥ 122
యోగమాసాంతుయోవిద్యాద్దేశకాలోప పాదితమ్।
పురుషం పురుషంవీక్ష్య సజ్ఞేయోభిషగుత్తమః॥ 123

**తాత్పర్యము** మేకలను, గొఱ్ఱెలను, పశువులను మేపువారు అడవులయందు విశేషముగ సంచరింతురు కావున వారికిని అడవులయందు నివసించియుండు ఇతర అడవి జాతి వారికిని ఓషధుల నామభేదములు, రూపభేదములు చక్కగా తెలిసియుండును అట్టివారు ఓషధుల నామరూపములు దెలిసినమాత్రముననే ఓషధుల పూర్ణజ్ఞానము గలవారు కానేరరు కావున ఓషధులను నామరూప భేదములచే తొలుత చక్కగ గమనించి, పరస్పర సంయోజనా పద్ధతినెరింగి, ఔషధ నిర్మాణము చక్కగా తెలిసికొని వాని గుణాదులను చక్కగ గమనించి, తత్తదనుసారముగ ఒకదానితో నొకటి జేర్చుట నెవడు తెలుసుకొనునో అట్టివాడు ఓషధిజ్ఞానవంతుడని చెప్పబడును ఎవడు ఓషధులను పూర్తిగ నామరూపములచే దెలిసికొని పిదప వాని గుణకర్మాదులను గమనించి, దేశకాలాద్యనుసారముగ నాయాపురుషుల ప్రకృత్యాదులను పలుమార్లు పరీక్షించి చికిత్సచేయునో వాడు వైద్యవరుడని చెప్పబడును

చ పా వ్యా అం అ  పైన చెప్పబడిన ఓషధుల యొక్క యోగజ్ఞాన ప్రాధాన్యతను "ఓషధీర్నామ" అనుశ్లోకములతో తెలుపుచున్నాడు పరాంప్రాప్తిం అనగా వ్యాధికి, వ్యాధి గ్రస్తమైన శరీరము మొదలగువాటికి అనుకూలమైన ఉత్కృష్టమైన సమ్యగ్యోగము యోగమనగా వ్యాధి శరీరములకుపయుక్తమగు ఓషధకల్పన సర్వథా అనగా ఎవడైతే ఓషధులను నామ, రూప, యోగముల విశేషములతో తెలుసుకొనుచున్నాడో అట్టివానిని గూర్చి చెప్పవలసినదేమున్నది? అతడు గొప్పవైద్యుడని అర్థము అటుతరువాత "యోగమాసాంతు" అను శ్లోకముతో యోగజ్ఞానమునగల వైశిష్ట్యమును తెలుపుచున్నాడు దేశకాలోపపాదితమ్ అనగా దేశము, కాలములను దృష్టియందుంచుకొని కల్పించబడిన యోగము ఒక్కొక్క పురుషుని బాగుగా పరీక్షించి అట్టివాని ప్రకృతి మొదలగునవి పరీక్షించి ఆయా ప్రకృతి మొదలగు వాటి కనుగుణమైన యోగమును ప్రయోగించినచో అట్టివాడు (వైద్యుడు) ఉత్తముడైన వైద్యుడుగా చెప్పబడును "పురుష" అనుచోట పురుషశబ్దమునకు సంయోగ పురుషుడు (పంచమహాభూత శరీరి సమవాయః పురుషః) గ్రహించవలయును

## ఔషధజ్ఞానావశ్యతకు దృష్టాంతనిరూపణము

మూ। యథావిషంయథా శస్త్రం యథాగ్ని రశనిర్యథా।
తథౌషధమవిజ్ఞాతం విజ్ఞాతమమృతం యథా॥ 124

ఔషదం హ్యనభిజ్ఞాతం నామరూపగుణైస్త్రిభిః।
విజ్ఞాతం చాపి దుర్యుక్త మనర్థాయోపపద్యతే॥ 125

**తాత్పర్యము** యోగమనగా వ్యాధిని శరీర తత్త్వాదులను చక్కగ గమనించి తత్తదను గుణముగ ఔషధమును చక్కగ నిర్మించుట యోగము అట్టి యోగము ఓషధులను నామరూపగుణముల జక్కగ సవిశేషముగ నెరిగిననేగాని చేయవీలుపడదు ఔషధముల నామరూపగుణాదుల నెరుగక చేయునౌషధయోగము మహానర్థదాయ కమని దృష్టాంతములనేకముల జూపుచు ఔషధ జ్ఞానావశ్యకత ఈ విధముగా నిర్ణయించ బడుచున్నది

నామరూపగుణములచే నోషధులను జక్కగ నెరుగక తనకిష్టము వచ్చినట్లు సిద్ధముచేయబడిన యౌషధము విషమువలె ప్రజ్ఞను నశింపజేసి మానవుని జంపును కొన్ని యౌషధములు శస్త్రములవలె మర్మస్థానమును ఛేదించి చంపును మరికొన్ని అగ్నివలె స్ఫోటకములు గల్గించి చంపును కొన్ని పిడుగులవలె అప్పుడే అతిశీఘ్రముగ

ప్రాణములను వెడలించును (కావున ఔషధమును నామరూపగుణాదులను జక్కగా నెరింగి దేశకాలాదులనురోగియొక్క దోషదూష్యాదులును చక్కగా గమనించి తత్తదను గుణముగా ఔషధమును కల్గింపవలెనని భావము) మరియు నామరూప గుణాదుల గమనించి జేయబడిన యౌషధము అమృతమువలె ఆరోగ్యభాగ్యములొనగూర్చి రోగిని ఆయుష్మంతునిగ జేసికాపాడును

మరియు నామరూప గుణాదులచే చక్కగ తెలియబడని యౌషధము, ఒకవేళ అట్టి జ్ఞానముచే చక్కగ గమనింపబడినను, వ్యాధి శరీర ప్రకృతులు మున్నగు వానిని గమనించక సిద్ధముచేయబడిన ఔషధము పైజెప్పిన విధముగా విషశస్త్రాదులవలె అనర్థదాయకమగును

చ పా వ్యా ఆం అ వ్యాధిని, శరీర తత్త్వాదులను చక్కగ గమనించి తత్తదనుగుణముగ ఔషధమును చక్కగ నిర్మించుట యోగము అది ఔషధజ్ఞానములేనిదే చేయుటకు వీలుకాదు ఔషధనామ రూపగుణాదులను నెరుంగక చేయు నౌషధ యోగము మహానర్థదాయకమని అనేక దృష్టాంతములతో "యథావిషం" అని చెప్పుచున్నాడు విషము మొదలగు అనేక దృష్టాంతములిచ్చుట చేత కొన్ని ద్రవ్యములు విషము వలె సంజ్ఞను బోగొట్టిచంపును మరికొన్ని శస్త్రమువలె మర్మను ఛేదించి చంపును మరికొన్ని అగ్నివలె బొబ్బలు గలిగించి చంపును ఇంకొన్ని పిడుగువలె వెంటనే జంపునని తెలుపు చున్నాడు "నామరూపగుణైః" అనుచోట మూడు చెప్పబడినవి ఐనప్పటికి "త్రిభిః" అనగా మూడింటిచే అని మరల చెప్పుటవలన "నామ,రూప,గుణములు" ఒక్కొక్క దానితోగాక మూడింటి జ్ఞానము (కలిసి) కలిగి ప్రయోగించబడిన ఔషధములు ప్రశస్తమని తెలియజేయబడినది

## యుక్తిదూరమైన ఓషధ నిరసనము

మూ॥ యోగాదపి విషంతీక్ష్ణముత్తమం భేషజం భవేత్।
భేషజంచాపి దుర్యుక్తం తీక్ష్ణంసంపద్యతే విషమ్॥ 126

తస్మాన్నభిషజాయుక్తం యుక్తి బాహ్యేనభేషజమ్।
ధీమతాంకించిదాదేయం జీవితారోగ్యకాంక్షిణా॥ 127

కుర్యాన్నిపతితో మూర్ధ్ని సశేషం వాసవాశనిః।
సశేషమాతురం కుర్యాన్నత్వజ్ఞమత మౌషధమ్॥ 128

దుఃఖితాయశయానామ శ్రద్ధధానాయ రోగిణే।
యోబేషజమవిజ్ఞాయ ప్రాజ్ఞమానీప్రయచ్ఛతి॥ 129
త్యక్తధర్మస్య పాపస్య మృత్యుభూతస్య దుర్మతేః।
నరోనరకపాతీస్యాత్తస్య సంభాషణాదపి॥ 130
వరమాశీ విష విషం క్వదితంతామ్రమేవవా।
పీతమత్యగ్ని సంతప్తాం భక్షితావాప్యయోగుడాః॥ 131
నతుశృతవతాం వేశం బిభ్రతా శరణాగతాత్।
గృహీతమన్నం పానంవా వితంవా రోగపీడితాత్॥ 132
భిషగ్బుభూషుర్మతి మానతః స్వగుణ సంపది
పరం ప్రయత్నమాతిష్ఠేత్ ప్రాణదః సాద్యద్యదాన్నృణామ్॥ 133

తాత్పర్యము విషము మిక్కిలి తీవ్రమై ప్రాణహరమైనది అయినను దానిని పైజెప్పి దేశకాలదోషదూష్యములకు అనుగుణముగ “విషస్యతుతిలందద్యాత్” అని చెప్పిన ప్రకారము తిలప్రమాణము కల్పించి యుపయోగించినచో మిక్కిలి క్రూరమగు వ్యాధులని వర్తింపజేయు ఉత్తమమైన ఔషధముగ నగును దుర్యుక్తమైన (దేశకాలాదుల గమనింపక కల్పింపబడిన) యౌషధము మిక్కిలి తీవ్రతరమైన విషమై క్షణమాత్రమున రోగిని చంపును కావున యుక్తిబాహ్యముగ తనకిష్టము వచ్చినట్లు గల్పింపబడిన యౌషధమును, రోగియొక్క జీవితమును ఆరోగ్యమును మనఃపూర్వకముగ గోరువైద్యుడు ఎప్పుడు రోగికి ఉపయోగింపగూడదు

మరియు ఇంద్రునిచేత నుండు వజ్రాయుధమును మనుజునితలపై బడ వేసినను ఆ వజ్రాయుధము చంపక వదలిపెట్టునేమోగాని ఔషధజ్ఞానములేక యుక్తిదూరముగ గల్పింపబడిన యౌషధము మాత్రము రోగిని సశేషముగనుంచదు (వజ్రాయుధముచేతనైనను చావును తప్పించుకొనవచ్చునుగాని దుర్యుక్తమైన యౌషధమునుండి చావు తప్పించుకొనలేమని భావము) కావున పైజెప్పబడిన యౌషధ జ్ఞానము ఆవశ్యకము

126 నుండి 128 వరకు

దుఃఖితాయ సంభాషణాదపి ॥ 129 - 130

ఔషధముల యొక్క గుణాదులను వాని సమ్యక్ప్రయోగమును చక్కగ తెలియకున్నను తాను వైద్యుడని పేరు పెట్టుకొని విఱ్ఱవీగుచు గర్వపడుచుండు ఏ

వైద్యుడు, రోగబాధలచే కష్టపడుచు పడకపై పరుండి ఈ వైద్యునిచే మనకు రోగ విముక్తి గలుగునని నమ్మియుండు రోగికి ఔషధమునిచ్చునో, ధర్మము వదలిన వాడును, మహాపాపియు, ఆరోగిపాలిటి మృత్యుదేవతయు, దుర్బుద్ధియున ఆ వైద్యునితో సంభాషించినను అట్టి మనుజుడు నరకమునకు పోవును (కావున అట్టి కుత్సితుడైన వైద్యాధముని కడకు చేరకూడదని భావము)

"వరమాశీవిషం . నృణామ్"॥ 131-133

వైద్యశాస్త్ర పరిజ్ఞానమేమీ లేకున్నను చక్కగ తెలిసినవానివలె వేషము ధరించి వైద్యవృత్తినవలంభించి, తనను రోగవిముక్తినిచేసికాపాడుమని శరణు జొచ్చిన రోగి దగ్గరినుండి యన్న పానాదులను జేసి వాని వలన పొందబడిన ధనముతో జీవించుటకంటే, సర్పవిషమునైనను, బాగుగ కరిగించబడిన తామ్రమునైనను, అగ్నిచే బాగుగా కాల్చబడిన ఇనుపగుండ్లనైనను మ్రింగి జీవించుట మేలు కావున తాను వైద్యుడుగా నుండదలచిన మానవుడు "శృతౌపర్యవదాతత్వం" అను వాక్యమున జెప్పిన వైద్యునికుండదగిన గుణములన్నింటిని సంపాదించి రోగుల ప్రాణములను కాపాడుటకు మిక్కిలి ప్రయత్నము జేయవలెను శాస్త్రజ్ఞానమును సంపాదించి నామరూపగుణాదులచే నౌషధముల చక్కగా తెలుసుకొని వాని సంయోగాది కల్పనా భేదముల గుర్తించి రోగులకాపాడుటకై మిక్కిలి ప్రయత్నము చేయవలెనని భావము)

చ పా వ్యా అం అ యోగాదపి అను శ్లోకముల ద్వారా యుక్తిని ప్రశంసించు చున్నాడు "తిలందద్యాద్విషస్యతు" (చి అ 1) అను మొదలగు వాచనములననుసరించి విషము గూడా బాగుగా తెలిసి ప్రయోగించినచో ఔషధముగా పనిచేయును (బాధను పోగొట్టును) మరియు రోగియె వైద్యుడుగాని వ్యక్తినుండి చికిత్స పొందకూడదు అని మాత్రమే గాక వైద్యుడుగూడా సంపూర్ణముగా శాస్త్రమును తెలిసికొనక రోగికి ఔషధము నివ్వగూడదని 'దుఃఖితాయ" అను శ్లోకముల ద్వారా చెప్పుచున్నాడు ఆ శ్లోకముల అర్థముపైన తాత్పర్యముననివ్వబడినది

## యుక్తియుక్త ఔషధ లక్షణము, సద్వైద్యలక్షణము

మూ॥ తదేవయుక్తం భేషజ్యం యదారోగ్యాయకల్పతే।
సచెవ భిషజాంశ్రేష్ఠః రోగేభ్యోయః ప్రమోచయేత్॥ 134

తాత్పర్యము ఏ యౌషధము రోగిని రోగములనుండి విముక్తుని జేసి ఆరోగ్యమును గలిగించ సామర్థ్యము గల్గియుండునో అదియె యుక్తియుక్తమైన ఔషధమనబడును

ఏ వైద్యుడు రోగిని రోగవిముక్తునిజేయునో అతడే వైద్యులలో శ్రేష్ఠుడు

**చ పా వ్యా అం అ** యుక్తియుక్తమైన ఔషధ లక్షణమును, సద్వైద్యుని లక్షణమును "తదేవయుక్తం" అను శ్లోకముతో చెప్పుచున్నాడు రోగేభ్యాయః ప్రమోచయేత్ అనగా ఎవడు రోగిని రోగవిముక్తునిచేయువాడో సద్వైద్యుడని యర్థము ఇచట శాస్త్రజ్ఞానము గలిగి ఔషధ ప్రయోగము చేయుట ద్వారా రోగిని రోగవిముక్తుని చేసినవాడే సద్వైద్యుడుగాని యాదృచ్ఛికముగా (తనకు తెలియకయే) కువైద్యులుగూడా ఒకసారి ఏమీ తెలియకపోయినను కొన్ని ఔషధములిచ్చినచోఒక్కొక్కరోగికి బాధ తగ్గును అంతమాత్రమున అట్టి వైద్యుడు కువైద్యుడేగాని సద్వైద్యుడు కానేరడు ఎందుకనగా అట్టి యాదృచ్ఛికమైన రోగవిముక్తికి వైద్యుడు కారణముగాదు ఘుణాక్షరన్యాయ మునను సరించి దైవానుకూలమున గలిగిన ఔషధ సమ్యగ్యోగము యాదృచ్ఛిక వ్యాధి విముక్తియందు కారణము మిగిలిన భావము తాత్పర్యమునననుసరించి తెలుసుకో వలయును

## సమ్యక్ప్రయోగ వైద్యోత్తమ లక్షణములు

మూ॥ సమ్యక్ప్రయోగం సర్వేషాం సిద్ధిరాఖ్యాతి కర్మణామ్।
సిద్ధిరాఖ్యాతి సర్వైశ్చ గుణైర్యుక్తం భిషక్తమమ్॥ 135

**తాత్పర్యము** పలువిధములైన చికిత్సా విధానములు ఫలవంతములై ఆరోగ్య రూపమైన కార్యసిద్ధి గల్గినచో అపుడుచికిత్సచే చక్కగజేబడినదని ఎరుంగునది వైద్యుని కుండవలసిన శాస్త్రజ్ఞానాది గుణములన్నియు గల్గివాడు చేయు చికిత్స వలన రోగికి ఆరోగ్యము గల్గినచో అట్టి వైద్యుడు మిక్కిలి శ్రేష్ఠమైనవాడని తెలియదగును

**చ పా వ్యా అం అ** రోగ్యమువలన భేషజము యొక్క సమ్యగ్యోగమెట్లు తెలుసుకోబడు నని "సమ్యక్ప్రయోగో" అను శ్లోకముతో చెప్పుచున్నాడు శ్లోకమునందలి "సర్వేషాం' ' అను పదముచేత చికిత్సాకర్మలేకాక వాటితోపాటు ఇతరములైన కర్మలన్నియు సమ్య గ్యోగముననే సిద్ధించునని చెప్పుచున్నాడు కారణములు బాగుగా లేనప్పుడు అట్టి కారణజన్యమైన కార్యము బాగుగానుండదు ఇచట సిద్ధియనగా ప్రతి నియతమైన సిద్ధియేగాని యాదృచ్ఛికమైన సిద్ధిగాదని భావము అనగా చికిత్సారూపమైన కర్మ సిద్ధించవలెనన్నచో దానికి కారణమైన (సాధనములైన) వైద్యుడు, ఔషధములు మొదలగునవి వాటివాటికి చెప్పబడిన గుణసంపన్నము లైనప్పుడు మాత్రమే రోగికి రోగముక్తి రూపమైన కార్యము సిద్ధించును ఇట్టి రోగవిముక్తి రూపమైన కార్యసిద్ధి

సమ్యక్ప్రయోగమును సూచించును అంతేగాని యాదృచ్ఛికమైన సిద్ధి సమక్ప్రయోగమును సూచించదు సమ్యక్ప్రయోగ సిద్ధి సాధనములు వాటి గుణములు "శృతే పర్యవదాతత్వం" అను మొదలగు (సూ అ10) ఖుడ్డాకచతుష్టాదాధ్యాయమున చెప్పబడును

## అధ్యాయ విషయసంగ్రహము

మూ॥ తత్రశ్లోకాః

ఆయుర్వేదాగమో హేతురాగమస్య ప్రవర్తనమ్।
సూత్రణస్యాభ్యనుజ్ఞానమాయుర్వేదస్య నిర్ణయః॥ 136
సంపూర్ణం కారణం కార్యమాయుర్వేద ప్రయోజనమ్।
హేతవశ్చైవదోషాశ్చ భేషజం సంగ్రహేణచ॥ 137
రసాః సప్రత్యయద్రవ్యాస్త్రివిధోద్రవ్యసంగ్రహః।
మూలిన్యశ్చ పలిన్యశ్చ స్నేహాశ్చలవణానిచ॥ 138
మూత్రం క్షీరాణివృక్షాశ్చ షడ్యేక్షీరత్వగాశ్రయాః।
కర్మాణిచైషాం సర్వేషాం యోగాయోగగుణా గుణాః॥ 139
వైద్యాపవాదోయత్రస్థాః సర్వేచభిషజాం గుణాః।
సర్వమేతత్ సమాఖ్యాతం పూర్వాధ్యామే మహర్షిణా ॥ 140

ఇత్యగ్నివేశకృతే తంత్రే చరక ప్రతి సంస్కృతే సూత్రస్థానే దీర్ఘం జీవితీయోనామ ప్రథమోఽధ్యాయః ॥ 1 ॥

**తాత్పర్యము** · ఆయుర్వేదోత్పత్తి, దాని కారణము, ఆయుర్వేదావతరణము, ఆయుర్వేద సూత్రణానుజ్ఞ, ఆయుర్వేద నిర్ణయము, సంపూర్ణమగు ఆయుర్వేదకారణము కార్యము, ఆయుర్వేద ప్రయోజనము, వ్యాధిహేతువులు, వ్యాధులు, వాని చికిత్సా సంగ్రహము, మధురాది రసములు, రసోత్పత్తి కారణము, రసాశ్రయు ద్రవ్యములు, త్రివిధద్రవ్యసంగ్రహము, మూలినీద్రవ్యములు, ఫలినీద్రవ్యములు, స్నేహములు, లవణములు, మూత్రభేదములు, క్షీరభేదములు, క్షీరమునకు చర్మమునకును ఆశ్రయములైన ఆరువృక్షములు, పైజెప్పిన మూలినీ, మొదలగు వాటి కార్యములు యోగగుణములు, యోగదోషములు ఇవన్నియు ప్రథమాధ్యాయమున అగ్నివేశ

మహర్షిచే చెప్పబడినవి

ఈ విధముగా అగ్నివేశకృతమై చరకునిచే సంస్కరింపబడినదియు నగు చరక సంహితయను ఆయుర్వేదతంత్రమున సూత్రస్థానమున దీర్ఘంజీవితీయమను మొదటి అధ్యాయము సమాప్తము

చ పా వ్యా అం అ "తత్ర శ్లోకాః" అనునది తంత్రకారునియొక్క రీతి చెప్పబడిన విషయమధికముగా నున్నప్పుడు వాటిని సంగ్రహముగా చెప్పదలచినచో "తత్ర శ్లోకాః" అను దానిలో చెప్పును చెప్పబడిన విషయమునకెక్కువ తక్కువగాకుండా చెప్పదలచినచో "భవతిచాత్ర" అని చెప్పును ఇది తంత్రముయొక్క ధర్మముగాన నిష్ప్రయోజనముగాదు "ఆయుర్వేదాగమో" అను శ్లోకముల ద్వారా అధ్యాయమున చెప్పబడిన విషయమును అధ్యాయాంతమున చెప్పుచున్నాడు సంగ్రహముగా చెప్పుట ఎందుకనగా పూర్వమున చెప్పబడిన విషయములను సంగ్రహరూపముగా గ్రహించుట కొరకు మరియు మిక్కిలి కష్టపడక విషయములను తెలుసుకొనుటకు లేక కఠినమైన విషయములను సులభముగా తెలుసుకొనుటకు ఎట్లనగా ఏదైనా ఒక విషయము అవగతముగానిచో ఇచట చెప్పబడిన సంగ్రహరూపమైన విషయమునుండి తెలుసుకొన వచ్చును ఇదేవిషయము "గద్యోక్తోయఃపునః శ్లోకైరర్థః సమనుగీయతే। తద్వ్యక్తి వ్యవసాయార్థం ద్విరుక్తిః సానగర్హ్యతే"॥ (ని అ1) అనగా గద్యమునందు చెప్పబడిన విషయము మరల శ్లోకములలో చెప్పుట ఆ విషయమును తేటతెల్లపరచుటకు అందువలన అట్టిది ద్విరుక్తి దోషముగానేరదు అని అర్థము ఈ శ్లోకమున గద్యోక్తము అనగా విస్తారముగా చెప్పబడినది అనుదానికుపలక్షణము దానిననుసరించి ఆరగ్వధీయము మొదలగు అధ్యాయములలో శ్లోకములలో చెప్పిన విషయములు గూడా తిరిగి శ్లోకరూపమున సంగ్రహముగా చెప్పబడవచ్చును శ్లోకమున "వ్యక్తిః" అన స్పష్టత వ్యవసాయః అనగా అవధారణ వ్యక్తివ్యవహారార్థం అనగా స్పష్టముగా తెలియపరచుటకు రెండవసారి శ్లోకమున సంగ్రహించబడును అని అర్థము ఆగమః అనగా ఆయుర్వేద ఆగమము (దీర్ఘం జీవితమన్విచ్ఛన్) అను శ్లోకములలో తెలుప బడినది ఆయుర్వేదాగమమునకు కారణము ఇది 'విఘ్నభూతాయదారోగాః' అను మొదలగు శ్లోకములలో తెలుపబడినది లేక "దీర్ఘం జీవితమన్విచ్ఛన్" అను శ్లోకముచేత ఆయుర్వేద అగమము, ఆగమహేతువులు తెలుపబడినవి "బ్రహ్మణాహి" అను శ్లోకముద్వారా ఆయుర్వేదాగమము చెప్పబడినది "విఘ్నభూతాయదారోగాః" అనగా ఆయుర్వేదాగమమునకు హేతు ప్రతిపాదితమైన శ్లోకము ఆయుర్వేదాగమ ప్రవర్తనములు ఇంద్రునినుండి భరద్వాజుడు గొనితెచ్చి మర్త్యలోకమున ప్రవర్తింపజేయు

# ద్వితీయాధ్యాయము

మూ। అథాతోఽపామార్గతండులీయ మధ్యాయం వ్యాఖ్యాస్యామః॥ 1

ఇతి హస్మాహ భగవానాత్రేయః॥ 2

అపామార్గస్య బీజాని పిప్పలీర్మరిచానిచ।
విడంగాన్యథశిగ్రూణి సర్షపాం స్తుంబురాణిచ॥ 3

అజాజీంచాజ గంధాంచ పీలూన్యేలాం హరేణుకామ్।
పృథ్వీకాంసుర సాం శ్వేతాం కురేరక ఫణిజ్ఝకా॥ 4

శిరీష బీజం లశునం హరిద్రేలవణద్వయమ్।
జ్యోతిష్మతీం నాగరంచదద్యాచ్ఛీర్ష విరేచనే॥ 5

గౌరవే శిరసః శూలే పీనసేఽర్థావభేదకే।
క్రిమివ్యాధావపస్మారే ఘ్రాణనాశేప్రమోహకే॥ 6

తాత్పర్యము దీర్ఘం జీవితీయమను అధ్యాయమును వివరించిన తరువాత "అపామార్గ తండులీయ"మను అధ్యాయమును భగవంతుడైన ఆత్రేయ మహర్షి చెప్పిన విధముగా వివరించుచున్నాము

శీర్షవిరేచన ద్రవ్యములు వాటి ఉపయోగము అపామార్గ (ఉత్తరేణి) బీజములు,పిప్పళ్లు, మిరియాలు, వాయువిడంగాలు, వావిలివిత్తులు, ఆవాలు, తుంబురు విత్తులు, జీలకఱ్ఱ, వాము, పీలువృక్ష బీజములు, పెద్ద ఏలకులు, రేణుకలు,నల్లజీలకఱ్ఱ, తులసి, తెల్లదింటెన, తెల్లగగ్గెర, మరువము, దిరిసెనపు విత్తులు, వెల్లుల్లి, పసుపు, మ్రానిపసుపు, సైంధవ లవణము, సౌవర్చ లవణము, మాల్కంగిని, శుంఠి ఇవి శిరోవిరేచనముందివ్వదగిన ఓషధులు శిరస్సు బరువుగనుండుట, శిరఃశూల, పీనసము, అర్థావభేదకము (పార్శ్వపునొప్పి) క్రిమివ్యాధి, అపస్మారము, ఘ్రాణేంద్రియశక్తి నశించుట, అధికమగు మోహము ఈ వ్యాధులందు నశ్యకర్మచేయించవలయును

వరకు ఆయుర్వేదాగమ ప్రవర్తనములు చెప్పబడినవి సూత్రణమనగా సూత్రబద్ధముచేయుట నిది అగ్నివేశాదులచే చేయబడినది "అభ్యనుజ్ఞ" అనునది అచ్చటచ్చట చెప్పబడి "తానిచ అనుమతాని" అని చెప్పబడిన సూత్రములు మిగతా విషయములు సుగమములే

ఈ విధముగా చక్రపాణి దత్తవిరచితమైన ఆయుర్వేద దీపికాయను చరకతాత్పర్యటీకా అను వ్యాఖ్యానమునకు వైద్యశాస్త్రుల మాణిక్యశర్మచే వ్రాయబడిన ఆంధ్రానువాదమున సూత్రస్థానమున దీర్ఘంజీవితీయాధ్యాయమను మొదటి అధ్యాయము ముగిసినది

చ పా వ్యా ఆం అ దీర్ఘం జీవితీయాధ్యాయమున పంచకర్మకు అంగభూతములైన మూలినీ ఓషధులు, ఫలినీ ఓషధులను గూర్చి చెప్పబడినది ఇవేగాక పంచకర్మ సాధనములైన పిప్పలి మరిచాది ద్రవ్యములు గూడా మరికొన్ని గలవు మరియు పంచకర్మ మొదలగు విషయములు అచ్చట చెప్పబడలేదు అందువలన మిగిలిన పంచకర్మోపయుక్తములైన ద్రవ్యములు, పంచకర్మ ప్రవృత్తి విషయమకమగు విషయమును తెలియజేయు అపామార్గతండులీయము ఈ రెండవ అధ్యాయమున చెప్పబడుచున్నది అపామార్గము మొదటి అధ్యాయమున చెప్పబడినవైనప్పటికిని తిరిగి ఈ అధ్యాయమున చెప్పినవాటిని ఆచార్యుడు అధ్యాయాంతమున "పూర్వంమూలఫలాదినా" అను రెండు శ్లోకములలో సమాధానమివ్వగలడు అపామార్గబీజీయమను పేరిడుట సమంజస మైనప్పటికిని పొట్టును తీసివేసిన అపామార్గ బీజములను గ్రహించుటకొరకు అపామార్గతండు లీయమను సంజ్ఞ చేయబడినది అధ్యాయమునకు తండులీయమని పేరిడి విషయ ప్రారంభమున "అపామార్గస్య బీజాని" అని బీజశబ్దమునుచ్చరించుట వలన అంకుర జననసమర్థములైన అపామార్గ బీజములను గ్రహించవలయునని తెలుసుకొన వలయును సామాన్యన్యాయముననుసరించి పంచకర్మలు వమనముతో ప్రారంభ మగును ఉదా "సాధారణేష్వృతుషు వనాదీనాం ప్రవృతిర్భవతి" అనగా సాధారణ ఋతువులందు వమనము మొదలగునవి చేయవలయును అని విమాన స్థానమున చెప్పబడినది అట్లే సుశ్రుతమున గూడా "అవాంతస్యహి సమ్యగ్విరిక్తస్యాప్యధః స్రస్థః శ్లేష్మాగ్రహణీయాచ్ఛాదయతి" అనగా వమనము చేయకయే సమ్యగ్విరేచనము చేయించినప్పటికిని శ్లేష్మక్రిందికి జారి గ్రహణిని కప్పివేయునని చెప్పబడినది అనగా వమనము చేయించిన తరువాతనే విరేచనము చేయించవలయునని యర్థము ఇట్లు పంచకర్మలు ఒక అనుపూర్విననునసరించి వమనము, విరేచనము మిగిలిన కర్మలు ఒకదాని తరువాత మరొకటి చేయించుట సామాన్యవిధి ఐనప్పటికిని ఒక్కొక్కప్పుడు దోషప్రాబల్యముననుసరించి క్రమముమారవచ్చును ఉదా శరత్కాలమున పిత్తముద్రిక్తమైనప్పుడు విరేచనము మొదలగునవి అట్లే ప్రావృట్కాలమున వాత ప్రాబల్యమున వస్తి మొదలగునవి క్రమమునతిక్రమించి చేయవచ్చునని చెప్పుటకై ఇచట అన్నింటికంటే మొదలు శిరోవిరేచనము చెప్పబడినది లేక శరీరము శిరస్సు ప్రధానాంగముగావున ప్రధానాంగ శోధనమగుటచే శిరోవిరేచనము మొదట చెప్పబడినదని గూడా గ్రహించవలయును "యదుత్తమాంగమంగానాం శిరస్తదభిధీయతే" (చ సూ అ17) అని శిరస్సు ఉత్తమాంగముగా చరకసంహితయందు చెప్పబడినది

శాలాక్యమున గూడా అనామయే యథామూలే వృక్షః సమ్యక్ ప్రవర్ధతే। అనామయే శిరస్యేవం దేహః సమ్యక్ ప్రవర్ధతే॥ అనగా మూలమున వికృతి లేనిచో వృక్షమేవిధముగా బాగుగా వృద్ధినొందునో అదే విధముగా శిరస్సు వికృతి రహితమైనపుడు దేహము బాగుగా వృద్ధినొందునని చెప్పబడినది శిరోవిరేచనములందు అపామార్గము ప్రధానమైనదగుటచే అపామార్గము మొదట చెప్పబడినది అపామార్గ ప్రాధాన్యత సూత్రస్థానమునందలి 25వ అధ్యాయమున "ప్రత్యాక్పుష్పా శిరోవిరేచనానామ్" అనగా శిరోవిరేచన ద్రవ్యములలో ప్రత్యక్పుష్పా = ఉత్తరేణి శ్రేష్ఠమైనదని చెప్పబడినది అజగంధా = అజమోదము, పీలు = పీలువృక్ష బీజము, లవణద్వయం = లవణవర్గమున చెప్పబడిన సైంధవ, సౌవర్చ లవణములు, శిరోవిరేచనమునకుగాను పై చెప్పబడిన ఈ ద్రవ్యములు సమూహముగా చెప్పబడినవి ఇది గణముగాన అవసరమునుబట్టి వేరువేరుగాగాని కలిసిగాని ఉపయోగించవలయును ఇందుకు ప్రమాణము "పరి సంఖ్యాతమపియద్ద్రవ్యమయౌగికంమన్యేత తదపహరేత్" (చ వి. అ 8) అనగా ద్రవ్యములను సంఖ్యతో నిర్దేశించినప్పటికిని యోగమున అవసరము లేదని వైద్యుడు భావించినచో దానిని యోగమునుండి తొలగించవలెనని విమానస్థానమున చెప్పబడినది ఇంకొకచోట గూడా సుశ్రుతమున "సమస్తంవర్గమర్ధంవాయథా లాభమథాపివా" (సు సూ అ 37) అనగా అవసరమునుసరించి సౌలభ్యమునుసరించి (లభ్యత ననుసరించి) వర్గములోని అన్ని ద్రవ్యములను గాని వాటిలో సగముగాని లేక దొరికినన్ని ద్రవ్యములుగాని ఉపయోగించవలయునని చెప్పబడినది "శిరసః" అను పదము గౌరవము శూల అను రెండింటితో అన్వయించి శిరోగౌరవము, శిరశ్శూల అను అర్థమునిచ్చును క్రిమివ్యాధి యనగా నిచట శిరోగతములైన క్రిమివ్యాధియనియే గ్రహించవలయును కారణమేమనగా శిరోవిరేచనము శిరోగతములైన క్రిములను మాత్రమే నశింపజేయు సామర్థ్యముగలది ప్రమోహకము అనగా మూర్ఛ, లేక ఇంద్రియ పటుత్వము తగ్గుట యగును (1-6)

మూ। మదనం మధుకంనింబం జీమూతం కృతవేధనమ్।
పిప్పలీకుటజేక్ష్వాకూణ్యేలాంధామార్గవాణిచ॥ 7
ఉపస్థితేశ్లేష్మ పిత్తేవ్యాధావామాశయాశ్రయే।
వమనార్థం ప్రయుంజీత భిషగ్దేహమదూషయన్॥ 8

తాత్పర్యము మ్రంగ, యష్టిమధుకము, వేప, దేవదాళి, చిన్నచేదు బీర, పిప్పళ్ళు,

కొడిశపాల, చేదుసొర, ఏలకులు, పెద్దచేదుబీర వీనిని శ్లేష్మపిత్త పిత్తములతో కూడి యుండి ఆమాశయమునాశ్రయించియుండు వ్యాధియందు శరీరమునకు బాధ కలుగకుండునట్లు వైద్యుడు వమనము నిమిత్తముపయోగించవలయును

చ పా వ్యా ఆం అ వమన ద్రవ్యములందు ప్రాధాన్యతగలదగుటవలన పై శ్లోకములందు మొదట మదనఫలము (మ్రంగకాయ) చెప్పబడినది మదనఫలశ్రేష్ఠత్వము "వమనద్రవ్యేషుమదన ఫలాని శ్రేష్ఠతమాన్యాచక్షతే ఒనపాయిత్వాత్" అని (చ క స్థా అ1) చెప్పబడినది అనగా మదన ఫలము ఏ విధమైన అపాయమును కలిగించక పోవుటవలన వమన ద్రవ్యములందు శ్రేష్ఠమైనిగా చెప్పబడినది అని అర్థము "ఉపస్థితే శ్లేష్మపిత్తే వ్యాధావామాశయాశ్రయే" అనుచోట ఆ మాశయోర్ధ్వభాగమైన శ్లేష్మస్థానము ను పొంది కఫపిత్తములు ఉత్క్లేశమును పొందినపుడు అని అర్థము ఇచ్చట పిత్తము సాక్షాత్తుగా వమన విషయముగాక పోయినను శ్లేష్మస్థానమును పొందుట వలన శ్లేష్మ సంబంధముతో వమనము చేయించదగినదిగాయుండును ఇందుకు ప్రమాణము "దోషస్థానగతం దోషం స్థానివత్సముపాచరేత్" అనగా ఇంకొక దోషస్థానమును పొందిన దోషమును స్థానికమైన దోషమువలె చికిత్సించవలయునని అర్థము దానిని బట్టి శ్లేష్మ స్థానమైన ఊర్ధ్వామాశయమును పిత్తము పొందినచో పిత్త చికిత్సయైన విరేచనమును చేయించక శ్లేష్మసంబంధమైన దిగాన శ్లేష్మ చికిత్సయైన వమనము చేయించవలయునని గ్రహించవలయును దేహమును బాధింపక అనునది వమన విషయమున చెప్పబడినప్పటికని విరేచనాదులందు గూడా ఈ నియమమును పాటించవలసియుండును కారణమేమనగా వమనము నందువలెనే విరేచనాదులందుగూడా అతియోగ, అయోగ, మిథ్యాయోగముల వలన దేహదుష్టి గలుగు అవకాశము వమనముతో సమానముగానేయుండును ఇదే విషయమును న్యాయకోవిదులీవిధముగా చెప్పినారు "సమానేష్వర్థేష్వేకత్రాభిహితో విధిరన్యత్రాప్య నుషంజనీయః" అనగా సమానములైన విషయములో ఒకచోట నొక విధి చెప్పిన అది మాటిమాటికి చెప్పనసరము లేదు ఒకచోట చెప్పబడిన విధి ఇతర విషయములందు గూడా అన్వయించుననిది అర్థము (7, 8)

మూ। త్రివృతాం త్రిఫలాందంతీం నీలినీం సప్తలాంవచామ్।
కంపిల్లకం గవాక్షీంచ క్షీరిణీముదకీర్యకామ్॥ 9

పీలూన్యారగ్వదం ద్రాక్షా ద్రవంతీం నిచులానిచ।
పక్వాశయగతే దోషే విరేకార్థం ప్రయోజయేత్॥ 10

తాత్పర్యము దోషము పక్వాశయమునాశ్రయించినపుడు తెగడ, త్రిఫలములు, దంతి, వృద్ధదారు, సంబరేణు, వస, కంపిల్లకము, చేదుపుచ్చ, పిన్నపాల, క్రానుగ, వరగోగు, రేల, ద్రాక్ష, పెద్దదంతి, నీటిప్రబ్బలి వీనిని విరేచనమునిమిత్తము ఉపయోగించవలయును

చ పా వ్యా అం.అ వమనము తరువాత విరేచనము చెప్పుట, శిరస్సు మొదలుకొని దేహ శోధనము చెప్పుచు క్రమముగా ఆమాశయోర్ధ్వభాగశోధనమైన వమనమును చెప్పి, ఆమాశయ అధోభాగమునందున్న పిత్తమును శోధించుటకుపయుక్తమగు విరేచనము గూర్చి చెప్పబడుచున్నది ఇదే విధముగా క్రమముననుసరించి వస్తిని చెప్పునపుడు గూడా తెలుసుకోవలయును "త్రివృత్ సుఖ విరేచనానామ్" అని (సూ అ 25) చెప్పబడుటచే విరేచన ద్రవ్యములందు త్రివృత్ సుఖవిరేచనమును గలిగించు ఔషధములలో శ్రేష్ఠమైనదిగాన ఇచట విరేచనౌషధములలో త్రివృత్ మొదట చెప్పబడినది నీలికా = వృద్ధదారు, క్షీరిణీ = ప్పిపాల, ద్రవంతీ = పెద్దదంతి, నిచులం = నీటి ప్రబ్బలి పక్వాశయ గతేదోషే అనగా దోషము పక్వమై ఆశయగతమైనపుడు విరేచనము చేయించవలయును అనగా దోషము పక్వమై పిత్తాశయముననున్నపుడు మాత్రమే విరేచనము చేయవలెనుగాని పక్వాశయగతమైనపుడు విరేచనము చేయరాదని యర్థము శ్లోకమున చెప్పబడిన దోషశబ్దముతో నిచట విరేచన కర్మచే నిర్హరించబడునట్టి పిత్తమును గాని లేక కఫపిత్తములను గాని గ్రహించవలయును ఇదే విషయము "పిత్తంవా కఫపిత్తంవా పిత్తాశయగతం హరేత్। స్రంసనం, త్రీన్ మలాన్ వస్తిర్హరేత్ పక్వాశయస్థితాన్" అని (చి అ3) న చెప్పబడినది పిత్తాశయమునందున్న పిత్తమునుగాని, కఫ పిత్తములను గాని స్రంసనకర్మ హరించును పక్వాశయమునందున్న త్రిదోషములను వస్తిహరించునని పై శ్లోకమునకర్థము లేక పక్వాశయసమీపముననుట వలన అధోమార్గముననుసరించి ప్రవర్తించు దోషము పక్వాశయగతమనియు చెప్పవచ్చును

ఉదా గంగాయాం ఘోషః, గంగలో గొల్లపల్లెయనునట్లు (9, 10)

నిరూహానువాసన వస్తువుల నిమిత్తము పయోగించు ద్రవ్యములు

మూ। పాటలాంచాగ్ని మంథంచ బిల్వంశ్యోనాకమేవచ।
కాశ్మర్యం శాలిపర్ణీచ పృశ్ని పర్ణీంనిధిగ్ధికామ్॥ 11
బలాంశ్వదంష్ట్రాం బృహతీయేరండం సపునర్నవమ్।
యవాన్ కులుత్థాన్ కోలాని గుడూచీంమదనానిచ॥ 12

పలాశంకత్తృణంచైవ స్నేహాంశ్చలవణానిచ।
ఉదావర్తే విబంధేషు యుంజ్యాదాస్థాపనేషుచ॥ 13
అత ఎవౌషధగణాత్ సంకల్ప్యమనువాసనమ్।
మారుతఘ్నమితిప్రోక్తః సంగ్రహః పాంచకర్మికః॥ 14

**తాత్పర్యము** కలిగొట్టు, నెల్లి, మారేడు, దుందిలము, గుమ్ముడుటేకు ముయ్యాకుపొన్న కోలపొన్న, వాకుడు, ముత్తవపులగము, సల్లేరు, నేలములగ, ఆముదపువేళ్ళు, గలిజేరు, యవలు, ఉలవలు, రేగుపండ్లు తిప్పతీగ, మంగకాయ, నాదుగ, కామంచిపూరి (గడ్డి), స్నేహములు లవణములు ఇవి ఉదావర్తమునందును మలమూత్ర బంధము నందును ఆస్థాపనవస్తినిమిత్తము ప్రయోగింపదగినవిగ నుండును పైన చెప్పబడిన ఓషధి సమూహమువలననే వాతమును హరించునట్టి అనువాసనవస్తిని కల్పించుకొన వచ్చును ఈ విధముగ పంచకర్మలయొక్క సంగ్రహము చెప్పబడినది

**చ పా వ్యా అం** అ దోషనిర్హరణమున ప్రధానమైన దగుటవలన "పాటలాం" అను శ్లోకములతో అనువాసనవస్తికి పూర్వము నిరూహవస్తిని చెప్పుచున్నాడు కత్తృణం = కామంచిగడ్డి, స్నేహాః = సర్పి, తైలము, వస, మజ్జలు లవణాని = రోగభిషగ్జితీయమున (వి స్థా అ8) న చెప్పబడిన సైంధవలవణము మొదలగులవణములు, ఇవి (వి స్థా అ8) యందు వస్తికొరకు ముఖ్యములైనవి ఒక గణముగా చెప్పబడినవి అఏవ = అనగా నిరూహవస్తికి చెప్పబడిన పాటలా మొదలగు గణములనుండే సంకల్ప్యమను వాసనం = అనువాసనవస్తి ప్రకల్పన చేయవలయునని స్నేహవస్తి సాధనమును చెప్పుచున్నాడు అనువాసనము స్నేహమునందేగలుగును అనువాసనము కొరకు స్నేహసాధన ద్రవ్యములు వేరుగా చెప్పబడలేదు నిరూహమునకు చెప్పబడిన ఔషధ గణములతోనే అనువాసనము సిద్ధించును "మారుతఘ్నం" అనుదానిలో అనువాసన మును చెప్పుచున్నాడు అనగా వాతమును నశింపజేయుటకు అనువాసనమును చేయవలయునని యర్థము లేక వాతహరములైన పాటలా మొదలగు ద్రవ్యములలో వాతహరమైన అనువాసనమును చేయవలయునని మరియొక అర్థము ఇంకొకచోట పిత్తహర ద్రవ్యములలో పిత్తమును నశింపజేయు స్నేహము, కఫ హరద్రవ్యములలో కఫహర స్నేహమును చేయవలయునని సూచించు చున్నాడు సంగ్రహముగా చెప్పబడినదని ఇచట చెప్పుటచే (వి సా8) రోగభిషగ్జితీయము అను అధ్యాయమున విస్తారముగ చెప్పబోవు దానినిచట సంగ్రహముగా చెప్పినానని సూచించుచున్నాడు (11 14)

## పంచకర్మలనాచరించవలసిన విధి

మూ॥ తాన్యుపస్థితదోషాణాం స్నేహస్వేదోపపాదనైః
పంచకర్మాణి కుర్వీత మాత్రా కాలౌవిచారయన్॥ 5

**తాత్పర్యము** స్నేహస్వేదములచే దోషములు కోష్ఠమును పొందిన పిమ్మట పరిమాణమును కాలమును ఆలోచించి పంచకర్మలను చేయింపవలయును

**చ పా వ్యా ఆం అ** తాని అను శ్లోకములతో పంచకర్మలనేవిధముగా చేయవలెనో ఆ విధానమును తెలుపుచున్నాడు తాని = పూర్వము చెప్పబడిన (వమనాది పంచకర్మలు) "స్నేహస్వేదోపపాదనైః" అనుచోట బహువచనము అనేక విధములైన స్వేహస్వేదము లను తెలియజేయుటకొరకై ప్రయోగించబడినది ఉపస్థితదోషాణాం అనగా శాఖలను వదలి కోష్ఠగమనోన్ముఖములైన మరియు లీనత్వమును వదలుటచేత ప్రధానావస్థను పొందినదోషములకు పంచకర్మల ప్రవృత్తియందు ఉపస్థిత దోషత్వమే కారణము అట్టి ఉపస్థిత దోషత్వము ఒకవేళ స్నేహ స్వేదోపపాదనము లేకయే కలిగిన ఎడల ఉదా కఫప్రధానాన్లుత్క్లిష్టాన్ దోషానామాశయస్థితాన్॥ బుద్ధ్వా జ్వరకరాన్ కాలేవమ్యానాం వనైర్హరేత్॥ (చి అ 3) అనగా కఫ ప్రధానములైన దోషములు ఆమాశయ స్థితములై ఉత్క్లిష్టములైన చోవాటిని ఉత్క్లిష్టములైనవని తెలిసినపుడు వమనయోగ్యములుగా నున్నవమన ద్రవ్యముతో నిర్హరణ చేయవలయునని యర్థము ఇచట స్నేహస్వేదములు లేకనే వమన ప్రవృత్తి కలుగు చున్నది అందువలన నిచట చెప్పబడిన స్నేహ స్వేదోపపాదనము సామాన్య న్యాయము ననుసరించి చెప్పబడినది మరియు ఇతరములైన కారణములచేత దోషములుపస్థితములైనప్పుడును పంచకర్మల నాచరించుట వలన కలిగిన క్షోభము వలన నేర్పడిన స్వల్ప ప్రమాణమున వృద్ధినొందిన వాతమును జయించుటకు కూడా స్నేహస్వేదములు ఉపయుక్తముతలుగా నుండును అని స్నేహ స్వేదములు చెప్పబడినవి మాత్రాకాలములను విచారించియనునది వాటికి గలప్రాధాన్యతననుసరించి చెప్పబడినది దానితో దోషము, భేషజము మొదలగునవి గూడా విచారించి ఉపయోగించ వలయునని గ్రహించవలయును లేక కాలమును విచారించవలయునను దానిలోనే దోషభేషజములను గ్రహించి అవి కూడా విచారించి ఉపయోగించవలయునని తెలిసికొన వలయును "తాని" అను శబ్దముచేత పంచకర్మలు గ్రహించబడినప్పటికిని తిరిగి "పంచకర్మాణి" అనుచోట పంచకర్మలు తిరిగి చెప్పుట పంచకర్మలన్నిటికి గూడా దోషములుపస్థితములుగా

నుస్నప్పుడే ప్రవృత్తిగలుగునని చెప్పుట కొరకు ఈ ప్రకరణమున వమనాదులందుగల ౯్మ లక్షణములు "బహ్వాతి కర్తవ్యతాయోగిదోష నిర్హరణ శక్తి జ్యేయసత్త్వమ్" అనగా బహువిధములైన క్రియాకలాపములుగలిగి అధికముగా దోష నిర్హరణము చేయగల శక్తిగలది కర్మగా అని ఈ ప్రకరణమున కర్మలక్షణము దీనితో తంత్రాంతరమున స్నేహస్వేదములను కలిపి 7 కర్మలు అని చెప్పుట సరియైనది గాదు కారణమేమనగా స్నేహస్వేదములు దోషములను బహిర్ని: సరణము చేయవు కేవలము దోషశమనమును మాత్రమే చేయును పంచకర్మాంగములుగా చెప్పబడిన స్నేహస్వేదములు దోషములుపస్థితములగుటకు మాత్రమే ఉపయోగించునుగాని దోష నిర్హరణములైన వమనాదులందలి ఉపయోగించవు మరియు అనువాసన వస్తి వమనాదులవలె అధిక దోషనిర్హరణమును చేయనప్పటికిని పురీషమును, పక్వాశయగతవాతమును బహిర్ని: సరణము చేయుటచే కర్మలక్షణమును పొందు చున్నది నిష్ఠీవనము, నేత్రాంజనము మొదలగు వాటియందు స్నేహ స్వేదాదులందు వలె బహువిధములైన క్రియాకలాపముగాని, వమనాదులందువలె బహుదోష నిర్హరణత్వముగాని లేవు అందువలన అవి కర్మశబ్దవాచ్యములుగావు స్నేహ రూపమైన నిరూహవస్తియగు ఉత్తర వస్తి స్నేహవస్తిలోనే యంతర్భవించును లేక వమనాదులైన పంచకర్మలందు పంచశబ్దము "యోగరూఢి" సంజ్ఞలలో చెప్పబడుట వలన (పంకజ) శబ్దమువలె స్నేహస్వేదనిష్ఠీవనములు మొదలగువాటియందు అన్వయించదు

మూ॥ మాత్రాకాలాశ్రయా యుక్తిః, సిద్ధిర్యుక్తే ప్రతిష్ఠితా।
తిష్ఠత్యుపరియుక్తిజ్ఞో ద్రవ్యజ్ఞానవతాం సదా॥ 7

తాత్పర్యము యుక్తి పరిమాణమును కాలమును ఆశ్రయించియుండును అట్టి యుక్తిసిద్ధి ఆశ్రయించియుండును అందువలన యుక్తిని తెలిసినవాడు ద్రవ్యజ్ఞానము కలవారి కంటె అధికుడుగా నుండును

చ పా వ్యా ఆం అ మాత్రాకాలాశ్రయా అను శ్లోకముతో మాత్రాకాలములను విచారించుటయందు కల ప్రయోజనమును చెప్పుచున్నాడు యుక్తిః =దేహము దోషములను దృష్టియందుంచుకొని చేయబడు ఔషధ యోజన, సిద్ధి అను మొదలగు పదములతో యుక్తి ప్రశంసను తెలుపుచున్నాడు సిద్ధియనగా నిచట సాధ్యమైన వికార ప్రశమనమును గల్గించుట

## పంచకర్మలయందు యవాగ్వాది ప్రయోగము

మూ॥ అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి యవాగూర్వివిధౌషధాః।

వివిధానాం వికారాణాం తత్సాధ్యానాం నివృత్తయే॥ 7

**తాత్పర్యము** అనేక విధములగు ఔషధములతో తయారు చేయబడు యవాగువులను, వానిచే సాధింపతగినట్టియు అనేక విధములైనట్టియు వ్యాధుల యొక్క శాంతి కొరకు ఇటుపిమ్మట చెప్పుచున్నాము

చ పా వ్యా ఆం అ "అతతూర్ధ్వం' అను శ్లోకములో వమనము మొదలగు కర్మల వలన మందగించిన జఠరాగ్నిని సంధుక్షణము చేయుటకొరకు మరియు వమనాదులను ప్రయోగించుసపుడు ప్రమాదవశమున గలిగిన శూలమొదలగు దుర్లక్షణములను శమింప జేయుటకు ప్రతిజ్ఞాపూర్వకముగా యవాగువులను చెప్పుచున్నాడు శాస్త్రమున నీవిధముగా చెప్పబడినది "యథాణురగ్ని స్తృణ గోమయాద్యైః సంధుక్ష్యమాణోభవతి క్రమేణ। మహాన్ స్థిరః సర్వపచస్తథైవ శుద్ధస్యపేయాది భిరంతరగ్నిః" (సి అ1) అనగా అణు ప్రమాణముననున్న కొద్దిపాటి అగ్ని గడ్డిపరకలు, పిడకచూరు మొదలగువాటతో మెల్లమెల్లగా ప్రజ్వలింపజేయబడినదై పెరిగి గొప్పదై స్థిరమై అన్నింటిని ఎట్లు దహించునోఅట్లే వమనాదులచే శుద్ధుడైన రోగి జఠరాగ్ని పేయామొదలగు వాటతో క్రమముగా దీప్తమైవృద్ధి నొందునని యర్థము పిప్పలీ మొదలగు యవాగువులను చెప్పు సందర్భమున "ఉపసాధిత" అను వచనము ప్రయోగించబడినది ఔషధము, పానీయములు తండులములు మొదలగు ప్రాకృతిక ద్రవ్యములను ఉచిత ప్రమాణమున గ్రహించవలెనని "ఉపసాధిత" అను పదమునకర్థము అందుకొరకే "ఉపసాధిత" అను పదము ప్రయోగింపబడినది అనగా ఔషధము పానీయ రూపమున ప్రయోగించుటకు అందుపయోగించు తండులాది ద్రవ్యములు (ప్రాకృతికమైనవి) ఉచిత ప్రమాణమున గ్రహించవలెనని దీనికర్థము జఠరాగ్ని మొదలగునవి ప్రతి వ్యక్తియందు భిన్నములుగానుండుటచే భేషజము, పానీయము తండులములు మొదలగు వాటియొక్క ప్రమాణము ఇచట సాక్షాత్తుగా చెప్పబడలేదు శాస్త్రమున నీ విధముగా చెప్పబడినది మాత్రాయానాస్త్యవస్థానం దోషమగ్నిం బలంవయః। వ్యాధిం ద్రవ్యం చ కోష్ఠంచ వీక్ష్యమాత్రాం ప్రయోజయేత్॥ అనగా మాత్రకు అవస్థితత్వము లేదు (ఒక నిర్దిష్ట ప్రమాణము లేదు) దోషము, అగ్ని, బలము, వయస్సు, వ్యాధి, ద్రవ్యము, కోష్ఠము వీనిని దృష్టియందుంచుకొని మాత్రా ప్రమాణమును

ప్రయోగించవలెను (నిర్ధారించవలెను) అని శ్లోకమునకర్థము మాత్రా నిర్ధారణ మీవిధముగా చేయవలసియున్నప్పటికిని పరిభాషా దృష్టితో మరియు వృద్ధవైద్య వ్యవహారమునునుసరించి చేయు విధమునీవిధముగా చెప్పుచున్నాడు యవాగూసాధన ద్రవ్యములు రెండు విధములు అవి వీర్య ప్రధానమైనది ఔషధ ద్రవ్యము, రసప్రధానమైనది ఆహార ద్రవ్యము వాటిలో గూడా ఔషధ ద్రవ్యము వీర్యభేదమునునుసరించి తిరిగి మూడు విధములు అవి తీక్ష్ణద్రవ్యములు ఉదా శుంఠి మొదలగునవి మధ్యవీర్య ద్రవ్యములు ఉదా బిల్వము, అగ్ని మంథము, మొదలగునవి మృదు వీర్య ద్రవ్యములు ఆమలికి మొదలగునవి వాటిలో తీక్ష్ణ వీర్య ద్రవ్యమాత్రా ప్రమాణము ఒక కర్షము ( 1 తు) మధ్య వీర్య ద్రవ్యములు అర్థ పలము (2 తు) మృదు వీర్య ద్రవ్యములు 1 పలము ( 4 తులములు) అగ్నివేశునితో నీ విధముగా చెప్పబడినది ఎమన 'కర్షార్థం వాకణాశుంఠ్యోః కల్కద్రవ్యస్య వాపలమ్। వినీయ అచయేద్యుక్త్యావారిప్రస్థేన చాపరామ్॥ అనగా పిప్పలీ శుంఠి ద్రవ్యముల యొక్క కల్కమును తీక్ష్ణవీర్య ద్రవ్యములు గాన కర్షార్థ ప్రమాణము గ్రహించవలయును మృదువీర్యద్రవ్యములను పలప్రమాణము గ్రహించవలయును తీక్ష్ణ వీర్యద్రవ్యములకు తగినంత నీటిని (యుక్తియుక్తముగా గ్రహించి) మృదువీర్యద్రవ్యములకు ఒక ప్రస్థమునీటిని గ్రహించి వండవలెనని చెప్పబడినది ఇచట మధ్యవీర్య ద్రవ్యప్రమాణము చెప్పబడలేదు కావున మధ్య వీర్య ద్రవ్యముల యొక్క మాత్రతీక్ష్ణ మృదువీర్య ద్రవ్యముల యొక్క మధ్యమాత్రా ప్రమాణము గ్రహించవలయును మరియు "జీవంత్యజాజీశటీపుష్కరాహ్వైః" (చ చి అ12) మొదలగు పేయయందు కోలప్రమాణమునను తొమ్మిది ద్రవ్యములతో కలిపి పలప్రమాణమదూరాంతరమగుచున్నది అట్టి ప్రమాణము మృదువీర్యములైన ద్రవ్యములను దృష్టియందుంచుకొని చెప్పబడినది 'కాథ్యద్రవ్యంజలిం క్షుణ్ణం శ్రపయిత్వాజలాఢకే అర్ధశృతేన తేనాథయవాగ్వాద్యుప కల్పయేత్' అనగా క్వాథము చేయవలసిన ద్రవ్యములనంజలి ప్రమాణము గ్రహించి దంచి ఒక అఢక ప్రమాణము గల జలమున కాచి సగము తగ్గునట్లుగా మరిగించి అట్టి కషాయముతో యవాగు మొదలగు వాటిని నిర్మాణముచేయవలయును ఇచట నాల్గు పలముల ద్రవ్యమును రస ప్రధానములైన ద్రవ్యములను దృష్టియంచుకొని చెప్పబడినది అందువలన "సిద్ధావరాహ నిర్యూహే యవాగూర్బృంహణీమతా" వరాహనిర్యూహమున సిద్ధము చేయబడిన యవాగు బృంహణముగా చెప్పబడును అను మొదలగు వాటియందీ (పై విధముగా చెప్పబడిన) పరిభాషను గ్రహించవలయును

షడంగ సాధన పరిభాషయందు "యదప్సుశృత శీతాసుషడంగాది ప్రయుజ్యతే। కర్షమాత్రం తతో ద్రవ్యం సాధయేత్ ప్రాస్థికేఽ బ్భసి అర్ధశృతం ప్రయోక్తంవ్యం పానేపీయాది సంవిధౌ షడంగాది (ముస్తాపర్పాటకము, ఉశీరము, చందన, సుగంధము, శుంఠి) శృతశీత జలమున ద్రవ్యములుపయోగించునపుడు ద్రవ్యము కర్షమాత్ర జలము ప్రస్థప్రమాణము గ్రహించవలయును అట్టిదానిని అర్ధశృతముగా చేసి పానమునకు, పేయాదులు సిద్ధముచేయుటకు జలమునుపయోగించవలయునని శ్లోకతాత్పర్యము ఇచట పేయాను తయారు చేయుటకు చెప్పబడిన కర్షద్రవ్య ప్రమాణము షడంగ ద్రవ్యములు మధ్యవీర్యములైనప్పటికిని మందాగ్నిగల పురుషుని దృష్టియందుంచు కొని చెప్పబడినవి షడంగార్ధ పరిభాషయందు జల ప్రమాణము మాత్రము కర్ష ద్రవ్యమున ఒక ప్రస్థము జలము చెప్పబడినది దానిననుసరించి ఇరత స్థలములందు గూడా జలప్రాధాన్యతను తెలుసుకోవలయును కల్కసాధ్యమైన యవాగు సిద్ధముచేయ వలసివచ్చినచో పాకశాస్త్రమున చెప్పబడిన పరిమాణముతో జలమును గ్రహించ వలయును దానికి ప్రమాణము మరియు ఉదాహరణముఈ విధముగా చెప్పబడినది "అన్నంపంచగుణే సాధ్యం, విలేపీచ చతుర్గుణే। మండశ్చ తుర్దశగుణే యవాగూష్షడ్గు ణేంభసి" అనగా అన్నమును స్థిముచేయుటకు జలము ఐదురెట్లు, విలేపీయందు నాల్గురెట్లు మండమునకు 14 రెట్లు యవాగుపునకారు (6) రెట్లు జలమును గ్రహించ వలయును ఇచ్చట చెప్పబడిన ఐదురెట్లు మొదలగు జలప్రమాణము తండులము (బియ్యము) ద్రవ్యములు వీటిసముదాయమునకు అనుపాతముగా తెలుసుకొన వలయును యవాగువునకు ప్రకృతి భూతమైన తండుల ప్రమాణము సుశ్రుతుని వచనము ద్వారా తెలుసుకోవలయును సుశ్రుతునివచనమీవిధముగా నున్నది విలేపే ముచితాద్భక్తాచ్చ తుర్భాగకృతాంభిషక్" (సు చి అ 39) విలేపిని సిద్ధము చేయుటకు ద్రవ్యమునకన్న నాల్గురెట్లు జలమును గ్రహించి సిద్ధము చేయవలయును అని అర్థము అట్లే "యవాగూః స్వల్పతండూలా" యవాగువులో తండులములు అతి తక్కువగా నుండవలయునని అర్థము (17)

మూ। పిప్పలీపిప్పలీమూల చవ్యచిత్రకనాగరైః।
యవాగూర్దీపనీయా స్యాచ్ఛూల ఘ్నీచోపసాధితా॥ 8

దధిత్థ బిల్వచాంగేరీ తక్రదాడిమ సాధితా।
పాచనీగ్రాహిణే, పేయా సవాతే పాంచమూలికీ॥ 9

శాలిపర్ణీ బలాబిల్వైః పృశ్నిపర్ణ్యాచ సాధితా।

దాడిమామ్లాహితాపేయా పిత్తశ్లేష్మాతిసారిణామ్॥ 20

పయస్యర్ధోదకేచ్ఛాగే హ్రీవేరోత్పల నాగరైః।
పేయారక్తాతి సారఘ్నీ పృశ్నిపర్ణ్యాచ సాధితా॥ 21

దద్యాత్ సాతివిషాం పేయాం సామేసామ్లా సనాగరామ్।
శ్వదంష్ట్రా కంటకారీభ్యాం మూత్రకృచ్ఛ్రేసపాణితామ్॥ 22

విడంగపిప్పలీమూల శిగ్రుభిర్మరిచేనచ।
తక్రసిద్ధాయవాగూస్స్యాత్ క్రిమిఘ్నీససువర్చికా॥ 23

మృద్వీకా సారివా లా జపిప్పలీమధునాగరైః।
పిపాసాగ్నీ, విషఘ్నీచ సోమరాజీ విపాచితా॥ 24

సిద్ధావరాహ నిర్యూహేయవాగూర్బృంహణీమతా।
గవేడుకానాం భృష్టానాం కర్శనీయా సమాక్షికా॥ 25

సర్పిష్మతీబహుతిలా స్నేహనీలవణాన్వితా।
కుశామలక నిర్యూహేశ్యామకానాం విరూక్షణీ॥ 26

దశమూలీశృతా కాసహిక్కాశ్వాస కఫాపహా।
యమకే మదిరా సిద్ధా పక్వాశయరుజాపహా॥ 27

శాకైర్మాంసైస్తిలైర్మాషైః సిద్ధావర్చోనిరస్యతి।
జంబ్వామ్రాస్థి దధిత్థామ్ల బిల్వైః సాంగ్రాహికీమతా॥ 28

క్షారచిత్రక హింగ్వమ్లవేతసైర్భేదినీ మతా।
అభయాపిప్పలీ మూల విశ్వైర్వాతానులోమనీ॥ 29

తక్రసిద్ధాయ వాగూస్యా ఘృతవ్యాపత్తి నాశినీ।
తైలవ్యాపదిశస్తా స్యాత్తక్రపిణ్యాకసాధితా॥ 30

గవ్యమాంసరసైః సామ్లా విషమజ్వరనాశినీ।
కంఠ్యాయవానాం యమకే పిప్పల్యామలకైః శృతా॥ 31

తామ్రచూడరసే సిద్ధారేతోమార్గారుజాపహా।
సమాషవిదలా వృష్యాఘృతక్షీరోపసాధితా॥ 32

ఉపోదికా దధిభ్యాంతు సిద్ధామదవినాశినీ।
క్షుధం హన్యాదపామార్గ క్షీరగోధారసైః శృతా॥ 33

తాత్పర్యము పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము, శుంఠి వీనిని చేర్చి సాధింప బడిన యవాగువు అగ్నిదీపనముచేయును శూలలను హరించును (18)

పంచమూలికయవాగువు

వెలగ, మారేడు పులిచింతాకు, మజ్జిగ, దానిమ్మ ఈ ఐదింటిని చేర్చి పక్వము చేయబడినది పంచమూలికయవాగువనబడును ఇది ఆహారమును పచింప చేసి మలాదులధికముగా వెడలుచున్నప్పుడు వానినాపుచేయును (19)

శాలిపర్ణ్యాదియవాగువు

ముయ్యాకుపొన్న, చిట్టాముట్టి, మారేడు, కోలపొన్న వీని అన్నింటిని చేర్చి పక్వముచేయబడిన యవాగువునందు పుల్లదానిమ్మ పులుసును చేర్చి యుపయోగించిన పిత్తకఫములచే కల్గిన అతిసారములయందు మిక్కిలి హితకరమగును (20)

హ్రీబేరాది యవాగువు

మేకపాలకు సగము పాలు నీళ్ళు కలిపి అందు కురువేరును, కలువగడ్డలను, తుంగగడ్డలను, కోలపొన్నను కలిపి పక్వముచేయబడిన యవాగువునందు యధోచితముగ పుల్లదానిమ్మ పులుపుచేర్చి త్రాగించినచో రక్తాతిసారమును హరించును.

"రక్తాతిసారేఽజాజీక్షీరక్రోష్టి ఘనజలోత్పలైః" అను జతూకర్ణతంత్రమున చెప్పబదిన వాక్యమునను సరించి ఇచట నాగర శబ్దమునకు తుంగగడ్డలని యర్థము చెప్పబడినది (21)

అమాతిసారమూత్రకృచ్ఛ్రములకు యవాగువులు

అతివస, శుంఠి ఈ రెండింటిని చేర్చి కాచబడిన యవాగువునందు దానిమ్మ పులుసునుయధోచితముగ చేర్చి, ఆమాతిసారమున త్రాగవలయును మరియు పల్లేరు వాకుడును చేర్చి పక్వము చేయబడిన యవాగువునందు చక్కెర పాకమును కలిపి మూత్రకృచ్ఛమునందు త్రాగవలయును (22)

విడంగాదియవాగువు

వాయువిడంగములు, మోడి, మునగపట్టు, మిరియాలు వీనిని మజ్జిగలో కలిపి పక్వముచేయబడిన యవాగువునందు మితముగ సర్జక్షీరమును గలిపి త్రాగిన క్రిములు నశించును (23)

పిపాసా విషహరయవాగువులు

ద్రాక్షపండు, సుగంధిపాలవేరు, వరిపేలాలు, పిప్పళ్ళు, శుంఠి వీనిని చేర్చి పక్వముచేయబడిన యవాగువునందు తేనె కలిపిత్రాగిన దప్పిని పోగొట్టును వావంచ విత్తులను చేర్చికాచబడిన యవాగువు విషమును హరించును (24)

బృంహణ కర్షణయవాగువులు

అడవిపంది మాంసరసమును చేర్చి పక్వముచేయబడిన యవాగువు శరీర పుష్టిని గల్గించును అడవి గొధుమల బియ్యమును వేయించి యవాగువును పక్వము చేసి అందుతేనెను గలిపి త్రాగిన స్థూలముగ నుండు శరీరమును కృశింపజెయును (25)

స్నేహనయవాగువు

యవాగువునందు నేతిని నువ్వులను ఉప్పునుచేర్చి త్రాగిన శరీరమున జిడ్డు గలుగును కుశ దర్భలవేళ్ళును, ఉసిరి కాయలను చేర్చి కషాయము కాచి అందు చామలను గూర్చి పక్వము చేయబడిన యవాగువు శరీరమును రూక్షముగా చేయును (26)

దశమూలాదియవాగువు

దశమూలములను చేర్చి పక్వము చేయబడిన యవాగువు కాసను ఎక్కిళ్ళను శ్వాసమును, కఫమును హరించును మరియు యమకస్నేహమున (నూనె, నెయ్యి) మద్యమును చేర్చి పక్వముచేయబడిన యవాగువు పక్వాశయమున కల్గిన బాధలను పోగొట్టును (కోలపొన్న, నేలపొన్న, చిన్నములక, పెద్దములక, పల్లేరు, మారేడు వ్రేళ్ళు, కూరనెల్లి, దుంతిలపు వేళ్ళు, పాదిలివేళ్ళు. అడవిగుమ్మొడు వేళ్ళు ఇవి దశమూలములు)శాకవర్గములోని యుక్తమయినవానిని, మాంసములను నువ్వులను మినుములను జేర్చి పక్వముచేసిన యవాగువులుపయోగించిన మలమును ధారాళముగ వెడలించును మరియు నేరేడు మామిడి విత్తులను వెలగపులుపు, బిల్వఫలము చేర్చి పక్వముచేసిన యవాగువునుపయోగించిన మలమును బంధించును (28)

భేదినీవాతానులోమనీయవాగువులు

యవక్షారము, చిత్రమూలము, ఇంగువ, అమ్లవేతసము ఈ నాల్గింటిని గూర్చి పక్వము చేయబడిన యవాగువు కఠినముగ నుండు మలమును విడదీయును మరియు కరక్కాయలు పిప్పలీమూలము (మోడి) శుంఠి ఈ మూడింటిని చేర్చి

సిద్ధముచేయబడిన యవాగువు ప్రతిలోమముగ నుండు వాతాదులను అనులోమ ములుగ జేయును (29) మజ్జిగను చేర్చి పక్వము చేయబడిన యవాగువు నేతివలనగలిగిన వ్యాధులను హరించును మజ్జిగను, నువ్వుల గానుగ పిండిచేర్చి సిద్ధము చేయడిన యవాగువు తైలముజేగలుగు వ్యాపత్తులను హరించును (30)

**విషమజ్వరహరకంఠ్యయవాగువు**

అవుపాలు, మాంసరసము, దానిమ్మ పులుపును జేర్చి పక్వము చేయబడిన యవాగువు విషమ జ్వరములను హరించును మరియు యవలు, పిప్పళ్ళు, ఉసిరిక కాయలు ఈ మూడింటిని యమకస్నేహమున (నెయ్యి, నూనె రెండు జేరిన యమక స్నేహము) చేర్చి పక్వము చేయబడిన యవాగువు కంఠ సంబంధములగు వ్యాధులను హితకరముగ నుండును (31)

**రేతోమార్గరోగహర శుక్రవృద్ధికరయవాగువులు**

కోడిమాంసపు రసముతోచేయబడిన యవాగువు శుక్రము వెడలు మార్గమున బుట్టువ్యాధులను హరించును ఉద్ది పప్పును, నెయ్యిని, పాలను జేర్చి కాచబడిన యవాగువు శుక్రమును వృద్ధిచేయును (32)

**మదహర - క్షుధాహరయవాగువులు**

బచ్చలియాకు, పెరుగు ఈ రెండింటిని చేర్చి సిద్ధముచేయబడిన యవాగువు విషము, మద్యము మున్నగువానిచే గలిగిన వికారమును హరించును మరియు ఉత్తరేణి బియ్యము, ఆవుపాలు, ఉడుము మాంసము ఈ మూడింటినిజేర్చి కాచబడిన యవాగువు ఆకలిని బోగొట్టును (33)

**చ పా వ్యా ఆం అ** యవాగువలను చెప్పు సందర్భమున పంచకర్మలను చేయునపుడు అగ్నిక్షీణించుట వలన అట్టి జఠరాగ్నిని వృద్ధినొందించు పంచకోలములలో సాధింపబడు యవాగువు "పిప్పలీ పిప్పలీమూల" అను శ్లోకముతో మొదట చెప్పబడినది దధిత్థః అనగా వెలగకాయ ఈయవాగువునందు తక్రము జలమునకు బదులుగా చెప్పబడినది ఇది ఆమపాచనము చేయును గ్రాహి వాతవికారంములతో గూడియున్నపుడు అనగా వాతాతి సారమున పంచమూలికాయువాగువును త్రాగించవలయును ఇచట పంచమూలములనగా స్థిరాదిపంచ మూలములు గ్రహించవలయును జతూకర్ణ సంహితయందు గూడా "ధృవాద్యైర్వ్యాయ్యతీసారే" అని చెప్పబడినది ధృవాదులనగా విదారి గంధా మొదలగునవివాటితోచేయబడిన యవాగువు వాతాతి సారమున

ఉపయోగించవలయునని యర్థము పృశ్నిపర్ణీ = కోలపొన్న, దాడిమామ్లా అను పదముతో ఎంతప్రమాణము దాడిమను కలిపిన అమ్లత్వముగలుగునో అంత దాడిమ ప్రమాణమును గ్రహించవలయుననని చెప్పుచున్నాడు "పయస్యర్థోదకే" అను శ్లోకమున చెప్పబడిన "నాగరము" అను శబ్దమునకు శుంఠియనిగాక తుంగముస్తలు అని జతూకర్ణతంత్రమున చెప్పబడిన "రక్తాతిసారే஽జాక్షీరజలే ఘనజలోత్పలైః" అను శ్లోకముతో తెలుసుకొనవలయును 'పృశ్నిపర్ణిరక్తాతి సారయవాగువునందే ఉపయోగించవలయును సామ్లాం = అనగా దాడిమామ్లముతో గూడిన, శ్వదంష్ట్రా = పల్లేరుతో సిద్ధముచేయబడు యవాగువును గూర్చి జతకర్ణ తంత్రమున 'పృశ్నిగోకంటక గుడైః మూత్రార్తిర్వస్తిశూలనూత్' అని చెప్పబడినది

సువర్చికా = సర్జక్షారము పిపాసాఘ్నీతిభేదః అనగా రూక్ష, సారివలాజ పిప్పలీమధు, నాగరములతో సిద్ధముచేయబడిన యవాగువు తృష్ణను నశింపజేయును సోమరాజీ = బావంచాలు, గవేధుకః = గోధుమలు, గోధుమల బియ్యమునకు బదులుపయోగించవలయును శ్యామకః = చామలు, యమకః = ఘృతము, తైలము, యమకయవాగువునందు మాదిరి ద్రవమునకు బదులుగా చెప్పబడినది శాకాదులతో సిద్ధముచేయబడు యవాగువునందు మాంసము, తిలలు, మాషలు ఇవి శాకములతో సమానములుగా నుండవలయును ఈ యవాగువునందు దధిత్థామ్లమని చెప్పుటచేత అపక్వావస్థలో నున్న కపిత్థమునే (వెలగకాయ) గ్రహించవలయును క్షారచిత్రకాది యవాగువునందు క్షారమనగా యవక్షారము తక్రమునచేయబడు యవాగువునందు తక్రజలమునుపయోగించవలయును పిణ్యాకః = నువ్వుల పిండి, యమకే అనగా తైలఘృతములందు వేయించిన యవలు అని తెలుపుచున్నాడు "సమాషవిదలా" అనుయవాగువునందు ఉద్దిపప్పును బియ్యముతో సమానముగా నుండవలయును మరియు క్షీరము జలమునకు బదులుగా నుపయోగించ వలయును ఘృతము వేపుడుకుపయోగించవలయును లేక నిదిమాష ప్రకృతియే మదశబ్దముతో విషజన్య, రుధిరజన్య, మద్యజన్యములైన మూడు విధములైన మదములు గ్రహించ వలయును "క్షుధం హన్యాద్" అనుచోట ఆయవాగువునందు బియ్యమునకు బదులు అపామార్గతండులములు, జలమునకు బదులుగా క్షీరము గోధామాంసరసము ఉపయోగించవలయును

మూ॥ తత్రశ్లోకః =

అష్టావింశతి రిత్యేతాయవాగ్వః పరికీర్తితాః।

పంచకర్మాణి చాశ్రిత్యాప్రోక్తో భేషజ్య సంగ్రహః॥ 34

ప్రకరణోపసంహారము

తాత్పర్యము ఈ విధముగా ఇరువది ఎనిమిది విధములైన యవాగువులు పంచ ర్మలనాశ్రయించిన ఔషధములును సంగ్రహముగా చెప్పబడినవి

చ పా వ్యా ఆం అ అష్టావింశతి అను శ్లోకములో ప్రతిలోమతంత్రయుక్తి ననుసరించి అధ్యాయ సంగ్రహమును చెప్పుచున్నాడు

మూ॥ పూర్వమూల ఫలజ్ఞాన హేతోరుక్తం యవౌషధమ్।

పంచకర్మాశ్రయజ్ఞాన హేతోస్తత్కీర్తితం పునః॥ 35

తాత్పర్యము పూర్వాధ్యాయమున మూలములు, ఫలములు తెలియుటకై నిర్దేశింప బడిన ద్రవ్యములు ఈ అధ్యాయమున పంచకర్మాశ్రయ జ్ఞానమునకై మరల వివరింప బడినవి

చ పా వ్యా.ఆం అ దీర్ఘం జీవితీయాధ్యాయమున చెప్పబడిన మూలినీ ఫలినీ గణ ద్రవ్యములను తిరిగి చెప్పుటలో ఉపపత్తిని (కారణమును) ''పూర్వం'' అను శ్లోకముతో తెలుపుచున్నాడు మూలఫల జ్ఞానము కొరకు అనగా ఇది మూలమనబడును, ఇది ఫలమనబడును (మూలమనగా దానిని, ఫలమనగా దీనిని గ్రహించవలయును)అని తెలుపుటకు। పంచకర్మాశ్రయములనగా పంచకర్మలకాశ్రయములు ఇచట ఆశ్రయ శబ్దము భావ ప్రధానమైనది అందువలన పంచకర్మలకాశ్రయములైన ఫలమూలాది జ్ఞానము అని అర్థము। మూలినీ ఫలినీ ఓషధులు దీర్ఘంజీవితీయమునగూడా శంఖపుష్పీ, బింబీ అను మొదలగు పేర్లతొ పంచకర్మాశ్రయములుగా చెప్పబడినప్పటికిని ఈ అధ్యాయమున ముఖ్యముగా చెప్పబడు పంచకర్మాశ్రయ ద్రవ్యగణమున చెప్పబడ కుండుట వలన అపామార్గము మొదలగు ద్రవ్యములకు పంచకర్మాశ్రయత్వమున ప్రాధాన్యత లేదను శంకకలుగును ఆ శంకను తొలగించుటకై ఈ శ్లోకమున పంచకర్మాశ్రయములని తెలుసుకొనుటకుగాను చెప్పబడినది అని మరల చెప్పబడినది (35)

**మూ॥ స్మృతిమాన్ హేతుయుక్తి జ్ఞాతితాత్మాప్రతిపత్తిమాన్।**
**భిషగౌషధ సంయోగైశ్చికిత్సాంకర్తుం మర్హతి॥ 36**

ఇత్యగ్నివేశకృతేతంత్రే చరక ప్రతి సంస్కృతేశ్లోకస్థానేః పామార్గతండులీయోనామ ద్వితీయో ధ్యాయః॥ 21

తాత్పర్యము జ్ఞానవంతుడును, హేతువ్యాధులకు దగిన ప్రతిక్రియల తెలిసిన వాడును,జితేంద్రియుడును శీఘ్రకారియగు వైద్యుడు పై జెప్పిన పంచకర్మల చేరిన యౌషధములను యుక్తియుక్తముగ గల్పించి చికిత్సచేయనగును

చ పా వ్యా అం ఆ ఈ అధ్యాయమున ప్రతిపాదించబడిన పంచకర్మ ప్రవృత్తి దుర్వ్యేధ్యమగుటచే ఎట్టి వైద్యుడీ చికిత్సను చేయవలెనో అతనిని 'స్మృతిమాన్' అను శ్లోకముతో చెప్పుచున్నాడు ప్రతిపత్తిః = ఆపదగలిగినపుడు వెంటనే తగుచర్య తీసుకొను జ్ఞానము, అట్టివాడు ప్రతిపత్తిమాన్ అనబడును

ఈ విధముగా అగ్నివేశకృతమై చరకప్రతి సంస్కృతమైన చరకసంహిత యందలి సూత్రస్థానమున రెండవదైన అపామార్గతండులీయమను అధ్యాయమునకు చక్రపాణి విరచితమైన చరకతాత్పర్యటీకా అను వ్యాఖ్యానమునకు వైద్యశాస్త్రుల మాణిక్య శర్మచే చేయబడిన ఆంధ్రానువాదమున రెండవ అధ్యాయము ముగిసినది



# తృతీయాధ్యాయము

అధాత ఆరగ్వధీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః॥ ౧

ఇతి హస్మాహ భగవానాత్రేయః ౨

**తాత్పర్యము** అటు తరువాత ఆరగ్వధీయమను అధ్యాయమును వివరించు చున్నాము అని భగవంతుడైన అత్రేయుడు పలికెను

**చ పా వ్యా ఆం అ** భేషజము, అంతః పరిమార్జనము, బహిః పరిమార్జనము అని రెండు విధములు వాటిలో పంచకర్మలు, యవాగూవుల రూపమైన అంతః పరిమార్జనము అపామార్గతండులీయమున చెప్పబడినది మిగిలిన బహిః పరిమార్జన రూపమైన ప్రలేపాదుల ఆరగ్వధీయాధ్యాయమున చెప్పబడుచున్నవి కుష్ఠ చికిత్స విడిగా చికిత్సా స్థానమున చెప్పబడియధావసరముగా ఈ ఆరగ్వధాదులు అక్కడ చెప్పవలసియున్నప్పటికి ఇచ్చుట విడిగా కుష్ఠయోగములను చెప్పుట వలన కుష్ఠమున కుశల అనుబంధిత్వము మహారోగత్వము సూచించ బడుతున్నది ఈ కుష్ఠ చికిత్స అనాగతా వేక్షణమును తంత్రయుక్తితో నిదానస్థానమున హేతులక్షణాదులలో చెప్పబడిన కుష్ఠమునుద్దేశించి చెప్పబడినది అందువలన అలక్షితమైన దానికి చెప్పబడిన చికిత్స అజ్ఞాత విషయమగుటచేత భోధపడదనుట సరిగాదు రాజయక్ష్మ మొదలగు మహా రోగములున్నప్పటికీ అవి కుష్ఠమువలె భూరి బహిః పరిమార్జన విషయములు గావు అందువలన కుష్ఠవిషయములైన బహిః పరిమార్జనములు చెప్పబడినవి కుష్ఠహరములైన బహిః పరిమార్జన ఉపోద్ఘాతముతో వాతహరములైన "కోలం కులత్థా" కోలకుత్థాదులు చెప్పబడినవి మరియు కుష్ఠహరములైన బహిః పరిమార్జన ప్రయోగముల పరిశోధనానంతరము ఉపయోగించిన సిద్ధించు స్వభావములు కలవి ఇందుకు

వచనము ' యెలేపాః కుష్ఠానాం ప్రయుజ్యంతే నిర్హృతాస్ర దోషాణాం। సం[illegible] యానాం సద్యః సిద్ధిర్భవేత్తేషామ్॥ అనగా కుష్ఠములకు ప్రయోగింప బడు లేపనములు రక్తమోక్షణము ఆశయశోధనము చేసిన వారికైతే సద్యః ఫలము కలుగుజేయునని భావము అకారణము వలన పూర్వాధ్యాయమున సంశోధనము చెప్పి అవసర ప్రాప్తములైన కుష్ఠ ప్రయోగముల నీయధ్యాయమున చెప్పి ఆచార్యుడు

' ఖదిరః కుష్టహరాణాం" (సూ అ 25) అను వచనముచే కుష్ఠ హరౌషధములలో ఖదిరము ప్రధానమైనదైనప్పటికిని ఖదిరమునందలి ఆరగ్వధమును చెప్పుటకుష్ఠహర ములైన బహిః పరిమార్జనములలో ఆరగ్వధయొక్క ప్రాధాన్యతను సూచించుట కొరకే

మూ। ఆరగ్వధః సైడగజః కరఞ్జోవాసా గుడూచీ మదనం హరిద్రే।
శ్రాహ్వః సురాహ్వః ఖదిరోధవశ్చ నిమ్బోవిడఙ్గం కరవీరకత్వక్॥ 3

గ్రన్థిశ్చ బౌర్జోలశునః శిరీషః సలోమశో గుగ్గులు కృష్ణగన్ధే।
ఫణిజ్జకో వత్సక సప్తపర్ణో పీలూని కుష్ఠం సుమనః ప్రవాలాః॥ 4

వచా హరేణుస్త్రివృతా నికుంభో భల్లాతకంగైరిక మఞ్జనంచ।
మనః శిలాలే గృహదూమ ఏలాకాసీస ముస్తార్జున లోధ్రసర్జాః॥ 5

ఇత్యర్థ రూపైర్విహితాషడేతే గోపిత్త పీతాః పునరేవ పిష్టాః।
సిద్ధాః పరం సర్షపతైల యుక్తాశ్చూర్ణ ప్రదేహాభిషజా ప్రయోజ్యాః॥ 6

కుష్ఠాని కృచ్ఛ్రాణి నవంకిలాసం సురేశలుప్తం కిటిబం సదద్రు।
భగన్దరార్శాంస్యపచీం సపామాంహన్యుః ప్రయుక్తాస్త్వచిరాన్నరాణామ్॥ 7

కుష్ఠం హరిద్రే సురసం పటోలం నిమ్బాశ్వగన్ధే సురదారు శిగ్రూ।
ససర్షపం తుమ్బురుదాన్యవన్యం చణ్డాంచ చూర్ణానిసమానికుర్యాత్॥ 8

తైస్తక్రపిష్టైఃప్రదమం శరీరం తైలాక్త ముద్వర్తయితుం యతేత।
తేనాస్యకణ్డూః పిడకాః సకోరాః కుష్ఠాని శోథాశ్చ శమంవ్రజన్తి॥ 9

కుష్ఠామృతా సఙ్గక టఙ్కటేరీ కాసీస కమ్పిల్ల కలోధ్రముస్తా।
సౌగన్ధికం సర్జరసో విడఙ్గమనః శిలాలే కరవీరకత్వక్॥ 10

తైలాక్తగాత్రస్య కృతాని చూర్ణాన్యేతాని దద్యాదవచూర్ణనార్థమ్।
దద్రు సకణ్డూః కిటిభాని పామావిచర్చికా చైవతథైతి శాన్తిమ్॥ 11

మనః శిలాలే మరిచాని తైల మార్కంపయః కుష్ఠహరః ప్రదేహః।
తుత్థం విడఙ్గం మరిచాని కుష్ఠం లోద్రంచ తద్వత్సమనః శిలం స్యాత్॥ 12

రసాఞ్జనం సప్రపునాడబీజం యుక్తం కపిత్థస్యరసేన లేపః।
కరఞ్జబీజైడగజం సకుష్ఠం గోమూత్రపిష్టంచ సరః ప్రదేహః॥ 13

ఉభేహరిద్రే కుటజస్య బీజం కరఞ్జబీజం సుమనః ప్రవాలమ్।
త్వచం సమధ్యాం హయ మారకస్య లేపం తిలక్షారయుతం విదధ్యాత్॥ 14

మనః శిలాత్వక్కుటజాత్స కుష్ఠాత్ సలోమశః సైడగజః కరఞ్జః।
గ్రన్థిశ్చ భౌర్జః కరవీరమూలం చూర్ణాని సాధ్యాని తుషోదకేన॥ 15

పలాశ నిర్దాహరసేనచాపి కర్షో ద్భృతానాఢకసంమితేన।
దర్వీప్రలేపం ప్రవదన్తి లేపమేతత్పరం కుష్ఠనిసూదనాయ॥ 16

పర్ణాని పిష్ట్వా చదురఙ్గలస్య తక్రేణ పర్ణాన్యథ కాకమాచ్యాః।
తైలాక్తగాత్రస్య నరస్య కుష్ఠాన్యుద్వర్త యేదశ్వహనస్యచ్ఛదైశ్చ॥ 17

తాత్పర్యము రేల, తగిరి సవిత్తులు కానుగ అర్ధసరము, తిప్పతీగే మ్రంగ పసుపు, మ్రాని పసుపు వీనిని, కుందురుష్కము దేవాదారు చంద్రధన వృక్షము వేప,వాయు విడంగములు గన్నేరుపట్టవీనిని భుజపత్రి చెట్టు యొక్క కణుపులు వెల్లుల్లి దిరిసెన కాసీసము గుగ్గులు మునగ వీనిని, నల్లతులసికొడిసెపాల ఏడాకుల అరటి వరగోగు చెంగల్వ కోష్ఠుజాజి చిగుళ్ళు వీనిని వస, రేణుకలు తెగడదంతి నల్లజీడిగింజలు గైరికము రసాంజనము వీనిని, మణిశిల, తాళకము కరిధూపము ఏలకులు, కాసీసము తుంగముస్తలు మద్దిలొద్దుగ, సర్జరసము వీనిని చూర్ణించి గోపిత్తముతో భావనచేసి మరల నూరి బాగుగ తయారుచేసి ఆవనూనెలో కలిపి లేపనము చేసినచో ఈ ఆరు లేపనములను కృచ్ఛసాధ్యములగు కుష్ఠములను నూతనముగా జనించిన బొల్లిని ఇంద్రలుప్తమును కిటిభకుష్ఠమును దద్రుకుష్ఠమును భగందరమును అర్శస్సులను అపచిని గజ్జిని వెంటనే నశింపజేయును

చెంగల్వకోష్ఠు పసుపు, మ్రాని పసుపు తులసి, చేదుపొట వేప పెన్నేరు దేవదారు మునగ ఆవాలు తుంబుర్లు ధనియాలు కైవర్తముస్తలు కడిలచెట్టు వీనిని సమభాగములుగా గ్రహించి చూర్ణింపవలయును తొలుత శరీరమునందు తైలమును పూసి ఆ చూర్ణమును మజ్జిగతో కలిపినలుగు పెట్టినచో దురదలు, పిటికలు, దద్దుర్లు, కుష్ఠము, శోఫ వీనిని నశింపజేయును చెంగల్వకోష్ఠు మైలుతుత్తము మ్రాని పసుపు

కాసీసము కంపిల్లకము లొద్దుగ తుంగగడ్డలు గంధకము సర్జరసము వాయు విడంగములు మణిశిల తాళకము మిరియాలు తైలము, జిల్లేడుపాలు, వీనితో చేయబడిన లేపము కుష్ఠమును నశింపజేయును మైలుతుత్తము వాయు విడంగములు మిరియాలు చెంగల్వకోష్ఠు లొద్దుగ మణిశిల వీనితోచేయబడిన లేపము కుష్ఠమును నశింపజేయును రసాంజనము తగిరి విత్తులు వీనిని వెలగ కాయరసములో నూరి చేయబడు లేపము కుష్ఠమును పోగొట్టును కానుగవిత్తులు తగిరిస విత్తులు చెంగల్వ కోష్ఠు వీనిని గోమూత్రముతో నూరి లేపనము చేసినచో కుష్ఠమునశించును పసుపు మ్రానిపసుపు కొడిసెపాల విత్తులు కానుగ విత్తులు జాజి చిగుళ్ళు గన్నేరు పట్ట గన్నేరు యొక్క లోపలి చెక్క నువ్వుల క్షారము వీనితో చేయబడు లేపము కుష్ఠమును నశింపజేయును మణిశిల కొడిసెపాలపట్ట చెంగల్వకోష్ఠు కాసీసము తగిరిస విత్తులు కానుగ భుజపత్ర చెట్టు యొక్క కణుపులు గన్నేరువేళ్ళు వీనిని ఒక్కొక్కకర్షము చొప్పున గ్రహించి చూర్ణించి అందు తుషోదకమును ఒక ఆఢకముగను, మోదుగ చెట్టుని కాల్చితీసిన రసమును ఒక ఆఢకముగను చేర్చి గరిటెకు అంటుకొనునట్లు కాచి దానితో చేయబడులేపము కుష్ఠమును నశింప చేయుటయందు శ్రేష్ఠమైనదిగ నుండును రేల ఆకులు కామంచిఆకులు గన్నేరు ఆకులు వీనిని మజ్జిగలో నూరి తైలముచే పూయబడిన శరీరమునందు లేపనము చేసినచో కుష్ఠము నశించును

చ పా వ్యా అం అ అకుష్ఠ హరయోగములను చెప్పుచున్నాడు అరగ్వధ అను మొదలగు శ్లోకములతో శ్రాహ్వః నవనీతకోటి అను ప్రసిద్ధిమైనది గ్రంథిశ్చ భౌర్జ అనగా భూర్జ పత్రగ్రంథి సలోమశః = ధాతుకాశీసము ఫణిర్ఝ్ఝకః పర్ణాసభేదము సుమనః ప్రవాలజాత పల్లవములు, నికుంభః = దంతీ, ఆలం = హరితాలము, అర్ధరూపైః= అర్ధశ్లోకములతో, గోపిత్తపీతాః = పసుపు పచ్చ గోపిత్తములు లేక గోపిత్తభావనలో పీతవర్ణములైనవి పరం= మిక్కిలి సిద్ధించినవి, మహర్షి ప్రణీతములైన యోగములన్నియు స్వవిషయమున సిద్ధించునవైనప్పటికిని దుశ్చికిత్స్యములైన అనేక రోగములను త్వరితముగా తగ్గించునవగుట వలన మిక్కిలి సిద్ధించునవని చెప్పబడినది చూర్ణ ప్రదేహములనగా చూర్ణములు ప్రదేహములని అర్థము లేక చూర్ణములుగా చేయబడిన ప్రదేహములు అని గూడా అర్థము ప్రదేహమనగా లేపము కుష్ఠహర గోమూత్ర పిత్తాదులతో ఈ యోగములకు, ఈ యోగములకు గల ప్రదేహతాకారణము తెలుసుకో బడుచున్నది సురేశలుప్తమ్ = ఇంద్రలుప్తమ్, కుష్ఠ శబ్దముచేతనే కిటిభ, దద్రు పామాది వ్యాధులు గ్రహించబడినప్పటికి వానిని విడిగా చెప్పుటవలన ఆ వ్యాధులను పోగొట్టి శక్తి

విశేషముగా పై యోగములకు గలదని చెప్పుటకొరకు, తుంబురు = ఆ పేరుతో ప్రసిద్ధమైనది వన్యం = కైవర్త ముస్తకము, చండా = చోరపుష్పీ, ప్రధమం = అనగా తెలాక్తం అను దానితో జోడింపబడి, కుష్ఠ ప్రకరణమున తైలమనగా సర్ష పతైలమని గ్రహింపవలయును అమృతాసంగః = తుత్థకము, కటంకటేరీ = దారు హరిద్రా, సౌగంధికం = గంధతృణం లేక గంధకము, అర్కపయః = అర్కక్షీరము, తద్వత్ = కుష్ఠహర ప్రదేశము, ప్రపున్నాడః = ఏడగజః, హయమారకః = కరవీరము, కరవీరముయొక్క త్వక్ గ్రహించాలి తుషోదకం పొట్టుతో గూడిన యవలతో సంధాన విశేషముతో చేసిన కాంజికము, పలాశ నిర్దాహరసః = మోదుగను కాల్చకుండా తీసిన రసము ఇది మోదుగ చెట్టు తల్లివేరును నరికి దాని క్రిందకుండ నుంచి పైన వృక్షమును కాల్చినచో దానినుండి స్రవించిన స్వరసము పలాశ నిర్దాహరసము అనబడును. చతురంగులః = స్వర్గ హలి, అశ్వహనః = కరవీరము, చతురంగుల, కాకమాచి, అశ్వహనచ్ఛేదములతో ఒక ప్రయోగము, ఇవి విడిగా చెప్పినచో చెప్పబడిన 32 సంఖ్య పొసగదు

> కోలంకులత్థాః సురదారు రాస్నా మాషాతసీతైల ఫలాని కుష్ఠమ్।
> వచా శతాహ్వా యవచూర్ణ మమ్ల ముష్ణాని వాతామయినాం ప్రదేహః॥ 18
> అనూపమత్స్యామిషవేసవారైరుష్ణైః ప్రదేహః పవనాపః స్యాత్।
> స్నేహైశ్చతుర్భిర్దశ మూలమిశ్రైర్గన్ధౌషధైశ్చా నిలజిత్ప్రదేహః॥ 19
> తక్రేణ యుక్తం యవచూర్ణముష్ణం సక్షార మార్తిం జఠరే నిహన్యాత్।
> కుష్ఠంశతాహ్వాం సవచాం యవానా చూర్ణం సతైలామ్ల ముశన్తివాతే॥ 20
> ఉభేశతాహ్వే మధుకం మదూకం బలాంప్రియాలం చ కశేరుకంచ।
> ఘృతం విదారీం చ సితోపలాం చ కుర్యాత్ప్రదేహం పవనే సరక్తే॥ 21
> రాస్నా గుడూచీ మధుకం బలేద్వేస జీవకం సర్షభకం పయశ్చ।
> ఘృతంచ సిద్ధం మధుశేషయుక్తం రక్తానిలార్తిం ప్రణుదేత్ప్రదేహః।
> వాతే సరక్తే సఘృతం ప్రదేహో గోధూమ చూర్ణం ఛగలీపయశ్చ॥ 22

తాత్పర్యము రేగు, ఉలవలు, దేవదారు, సన్నరాస్నము మినుములు, అవిసె తైలము కలగింజలు చెంగల్వకోష్ఠు వసనదాప యవలచూర్ణము వీనిని కాంజికమునందు చేర్చి ఉడికించి వేడిగనున్న దానితో చేయబడు లేపము వాత వ్యాధులయందు హితకరముగా నుండును అనూపదేశమునందు సంచరించు జంతువుల యొక్క మాంసము చేపల

మాంసము వేసవార ద్రవ్యములు వీనిని ఉడికించి వెచ్చగనున్నదానితో లేపము చేసినచో వాతము నశించును దశమూలములు గంధద్రవ్యములు వీనితో తయారుచేయబడిన నాలుగు విధములగు స్నేహములతో లేపమును చేసిన యెడల వాతము నశించును యవలయొక్క చూర్ణమును యవక్షారమును మజ్జిగ యందు చేర్చిఉడికించి వేడిగనున్న దానితో లేపము చేసిన యెడల ఉదరము నందలి బాధను నశింపజేయును చెంగల్వకోష్ఠు సదాపవస యవల చూర్ణము తైలము కాంజికము వీనిని చేర్చి చేయబడు లేపము వాతమునందు హితకరముగా నుండును

పెద్ద సదాప చిన్నసదాప యష్టి మధుకము ఇప్పముత్తవ పులగము సార నమ్మ దుంప ఘృతము నేలగుమ్మడిదుంప పటికబెల్లము వీనిని చేర్చి చేయబడు లేపము వాతరక్తమును నశింపజేయును సన్నరాష్నము తిప్పతీగ యష్టిమధుకము పెద్ద ముత్తవ పులగము జీవకము ఋషభకము పాలునెయ్యి మైనము వీనిని చేర్చి తయారు చేసి దానితో_చేయడు లేపము వాతరక్తమును నశింపజేయును ఘృతము గోధుమ చూర్ణము మేకపాలు వీనితో చేయబడు లేపము వాతరక్తమును నశింపచేయును

చ పా వ్యా అం అ తైలయోని ఫలములనగా బరండ ఫలములు తిలలు మొదలగు నవి అమ్లము కాంజికము మొదలగు వాటి వలన పులిసినది అ నూపములైన మత్స్యములు మొదలగు వాటి యొక్క మాంసము వేసవారము

"నిరస్థిపిశితం పిష్టం స్విన్నం గుడ ఘృతాన్వితం
కృష్ణామరిచ సంయుక్తం వేసవార ఇతి స్మృతః॥

అస్థులు లేకుండా పిసికిన మాంసములో బెల్లము, నెయ్యివేసి కాచి మిరియాలు పిప్పళ్ళు కలిపిన దానిని వేసవారమందురు గంధ ప్రధానములైన ఓషధులు గంధౌషధములు అవి జ్వరాధ్యాయమున చెప్పబడిన అగురు మొదలగునవి గంధౌషధములచే సాధింపబడినవని గ్రహించవలయును దీనితో దశమూల, గంధౌషధములతో స్నేహములను సాధించవలయును (లేక గంధౌషధములతో దశమూలములతో సాధించిన స్నేహ ప్రకృన ప్రదేశమని అర్థము ఉశంతి = చెప్పు చున్నాడు

విదారీ = విదారికందము, సితోపలా = పటిక బెల్లము, మదుశేషః = సిక్థకము, సిద్ధమనగా ఘృతదగ్ధమై కొద్దిపాటి అగ్నిలో సాధింపబడినదని అర్థము

మూ నతోత్పలం చందన కుష్ఠయుక్తం శిరోరుజాయాం సఘృతం ప్రదేహః 23

ప్రపౌండరీకం సురదారు కుష్ఠం యష్ట్యాహ్వమేలాకమలోత్పలేచ।
శిరోరుజాయాం సఘృతః ప్రదేహో లోహైరకాపద్మకచోరకైశ్చ 24

రాస్నా హరిద్రేనలదం శతాహ్వే ద్వేదేవదారూణీ సితోపలాచ।
జీవన్తిమూలం నఘృతం సతైల మాలేపనం పార్శ్వరుజాసు కోష్ణమ్॥ 25

శైవాల పద్మోత్పల వేత్రతుంజ్గం ప్రపౌండరీకాణ్య మృణాలలోధ్రమ్॥
ప్రియఙ్గు కాలేయక చన్దనాని నిర్వాపణః స్యాత్ సఘృతః ప్రదేహః॥ 26

సితాలతావేతస పద్మకాని యష్ట్యాహ్వమేంద్ర నలినాది దూర్వా।
యవాసమూలం కుషకాషయోశ్చ నిర్వాపణః స్యాజ్జలమేరకాచ॥ 27

శైలేయ మేలాగురుణీకుష్ఠే చణ్డానతం త్వక్ సురదారురాస్నా।
శీతం నిహన్యాద చిరాత్ ప్రదేహో విషం శిరీషస్తు ససింధువారః॥ 28

శిరీషలామజ్జక హేమలోధ్రైస్త్వగ్దోశ సంస్వేదహరః ప్రఘర్షః।
పత్రాంబులోధ్రాభయచందనాని శరీర దౌర్గన హరః ప్రదేహః॥ 29

తాత్పర్యము. గ్రంథితగరము నల్లకలువ చందనము చెంగల్వ కోష్ఠ ఘృతము వీనితో చేయబడిన లేపము శిరశ్శూలను నశింపజేయును ప్రపౌండరీకము దేవదారు చెంగల్వ కోష్ఠ యష్ఠిమధుకము ఏలకులు పద్మము నల్లకలువ ఘృతము అగురు ఏరకమనెడి తృణ విశేషము పద్మకము కచ్చూరములు వీనితో చేయబడు లేపము శిరశ్శూలను నశింపజేయును సన్నరాస్నము పసుపు మ్రాని పసుపు జటమాంసి పెద్ద సదాప, చిన్న సదాప, దేవదారు పటికబెల్లము మనుబాలవేళ్ళు ఘృతము తైలము వీటిని ఉడికించి గోరువెచ్చగ నున్నదానిలో లేపనమును చేసిన యెడల పార్శ్వశూల నశించును నాచు పద్మము నల్లకలువ పేము సురపొన్న ప్రపౌండరీకము వట్టివేళ్ళు లొద్దుగ ప్రేంఖణము మ్రాని పసుపుచందనము వీనితో లేపనము చేసిన యెడల తాపము నశించును నేల గుమ్మడుదుంప మంజిష్ట ప్రబ్బలి పద్మకము యష్టిమధుకము ఏటిపుచ్చ తామరపువ్వు గరికె దూలగొండి వేళ్ళు తెల్లు వేళ్ళు కురువేరం ఏరకమనెడు తృణ విశేషము వీనితో లేపనమును చేసిన యెడల తాపము నశించును రాతిపువ్వు ఏలకులు అగురు చెంగల్వకోష్ఠ అజామోదము గ్రంధితగరము దాల్చిన చెక్క దేవదారు సన్నరాస్నము వీనితో చేయబడు లేపము శీతమును వెంటనే పోగొట్టును దిరిసెన వావిలి వీనితో చేయబడు లేపము విషమును హరింపజేయును దిరిసెన వట్టివేళ్ళు నాగకేసరములు లొద్దుగవీని యొక్క చూర్ణముతో రుద్దిన యెడల చర్మదోషమును అధికమగు చెమట

నశించును ఆకుపత్రి కురువేరు లొద్దుగ వట్టివేళ్ళు చందనము వీనితో చేయబడు లేపము శరీరము యొక్క దౌర్గంధ్యమును నశింపజేయును

చ పా వ్యా ఆం అ నతా = గ్రంధితరగము, ప్రపౌండరీకః = ?, లోహమ్ = లోహము, ఏరకా = ఏరకమనెడి తృణవిశేషము, ప్రపౌండరీకము మొదలు చోరకము వరకు ఒకటే యోగము, చోరకః = కచ్చూరములు, నలదం = జటామాంసి, శతాహ్వా = పెద్దసదాప, చిన్నసదాప, తుంగః = సురపొన్న, అమృణాలమ్ = వట్టివేళ్ళు, కాలేయకం = లొద్దుగ, లతా = మంజిష్ఠా, ఐంద్రీ = ఏటిపుచ్చ, నలినం = కమలము, యవాస మూలం = దూలగొండి వేళ్ళు, కుశకాశమూలం = తెల్లు వేళ్ళు, కురువేరు, సితాది మొదలు మేరకావరకు ఒక యోగము, జలం = నీరు, సింధువారం: = వావిలి, విషము మొదలు మరో ప్రయోగము, లామజ్జకం = వట్టివేళ్ళు, హేమ = నాగకేసరములు, అభయం = వట్టివేళ్ళు

తత్ర శ్లోక :

ఇహాత్రిజః సిద్ధతమానువాచ ద్వాత్రింశంతం సిద్ధమహర్షి పూజ్యః।
చూర్ణప్రదేహాన్వివిధామయ ఘ్నా నారగ్వధీమే జగతోహితార్థమ్॥ 30

ఇత్యగ్ని వేశకృతే తన్త్రే చరక ప్రతి సంస్కృతే శ్లోకస్థానే ఆరగ్వధీయోనామ తృతీయోధ్యాయః।

సిద్ధులచేతను మహర్షుల చేతను పూజింపతగిన ఆత్రేయుడు సిద్ధతమ ములైనట్టియు అనేక విధములైన వ్యాధులను నశింపజేయునట్టియు ముప్పదిరెండు విధములగు చూర్ణ ప్రదేహములను జగత్తుయొక్క మేలుకొరకు ఈ అరగ్వధీయాధ్యాయ మునందు చెప్పెను

అధ్యాయార్థ సంగ్రహము ఇహి త్రిజః మొ॥

చూర్ణప్రదేహములనగా మొదట చెప్పిన విధముగా 32 అని సంఖ్యను నిర్దేశించుట వలన న్యూనాధిక సంఖ్యల వలన కలుగు దుర్బోధత్యమును పోగొట్టబడుచున్నది

చక్రపాణిదత్త విరచితమైన చరక తాత్పర్య టీకాయందలి ఆయుర్వేద దీపికా వ్యాఖ్యానమునందు సూత్రస్థానమున మొదటి భేషజచతుష్కమున అరగ్వధీయమునకు ఆంధ్రానువాదము

# చతుర్ధాధ్యాయము

మూ॥ అథాతః షడ్విరేచనశతాశ్రితీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః॥

మూ॥ ఇతి హస్మాహభగవానాత్రేయః (2)

అటుతరువాత షడ్విరేచన శతాశ్రితీయమను అధ్యాయమును వివరించు చున్నాను అని భగవంతుడైన ఆత్రేయుడు పలికెను

మూ॥ ఇహఖలు షడ్విరేచన శతాని భవంతి, షడ్విరేచనాశ్రయాః

పంచకషాయమోనయః, పంచవిధ కషాయకల్పనం, పంచాశన్మహా కషాయాః, పంచకషాయా శతాని, ఇతి సంగ్రహః॥ 3

సంక్షిప్తముగా చెప్పవలెనన్న అధ్యాయమున 600 విరేచన(ద్రవ్య)ములుఆరు విరేచనాశ్రయములు, 5(ఐదు) కషాయయోనులు, 5 (ఐదు) విధములైన కషాయ కల్పనలు, 5 (ఐదు) మహాకషాయములు, 500 కషాయములు చెప్పబడుచున్నవి

చ పా వ్యా ఆం అ అపామార్గ తండులీయము అను అధ్యాయమున అంతఃపరిమార్జనము చెప్పబడినది ఆరగ్వధీయమున బహిః పరిమార్జనము చెప్పడినది ఇపుడు పూర్వమున రెండధ్యాయములందు ప్రతిపాదింపబడిన, భేషజచతుష్కమున అవశ్యముగా చెప్పబడు మిగిలిన ఉభయ పరిమార్జన భేషజమును చెప్పుటకు "షడ్విరేచన శతాశ్రితీయము" చెప్పబడుచున్నది ఆశ్రయించియుండు ప్రదేశము ఆశ్రయము అనబడును 6వ సంఖ్యతో విభజించబడిన విరేచన "శతములు" అనగా నూరు విరేచనములను గూర్చి చెప్పబడు అధ్యాయము షడ్విరేచనశతాశ్రితీయము దీనిననుసరించి ఈ అధ్యాయమున చెప్పబడు విషయములు (600) ఆరు వదంల విరేచనౌషధములు, ఆరు విరేచనాశ్రయములు ఈ రెండింటినాధారముగా చేసికొని ఈ అధ్యాయమునకీపేరు

చెప్పబడినదని తలచవచ్చును అధ్యాయారంభమున "ఇహఖలు" అను పదము న్నప్పటికిని అది అప్రధానమగుటచే అధ్యాయ సంజ్ఞా ప్రణయమున అది ఉచ్చరింపబడలేదు "ఇహ" అనగా అనతివిస్తారమై ఈ అగ్నివేశ తంత్రమున అని యర్థము దీనితో చెప్పబోవు ఆరువందల (600) విరేచనములు, (50) ఏబది మహాకషాయములు, (500) ఐదువందల కషాయములను వివరించునపుడు కల్పనను సరించి కొన్ని అధికముగావచ్చునని సూచించబడుచున్నది అందువలననే కల్పమున "ఉద్దేశమాత్రమేతావద్రుష్టవ్యమిహషట్కృతమ్। స్వబుద్ధ్యైవం సహస్రాణి కోటిర్వాపం ప్రకల్పయేత్ (చక అ113) అనగా మచ్చునకిచట కొన్ని (600) చెప్పబడినవి తమ తమ బుద్ధికుశలతతో వేలు, కోటి సంఖ్యాకములైన యోగములను సమకూర్చుకోవచ్చునని చెప్పబడినది మరియు ఈ అధ్యాయముననే "నహివిస్తరస్య ప్రమాణమస్తి" అనగా విస్తారమునకు అవధిలేదని చెప్పబడినది ఇచట "ఖలు" అను శబ్దము ప్రకాశ నార్థకము విరేచన శబ్దముతోనిచట వమన, విరేచనములు రెండు గ్రహింపబడినవి కల్పస్థానమున నీవిధముగా చెప్పబడినది "ఉభయంవాదోషమల విరేచనాద్విరేచనశబ్దం లభతే॥" చ క అ (1) అనగా దోషములను, మలములను బహిర్నిస్సరణము చేయుటచే వమన విరేచనములు రెండు విరేచనములని చెప్పబడును దోషమల విరేచన శబ్దార్థముతో రెండింటికిని విరేచన సంజ్ఞ చెప్పినపుడు వస్తి, శిరోవిరేచనములు గూడా దోషములను మలములను నిర్హరణ చేయుట వలన అవి కూడా విరేచన సంజ్ఞకములు గా వచ్చును కాని తంత్రకారులచే నిర్దేశింపబడుట వలన విరేచన శబ్దము వమన విరేచనములకు మాత్రమే సీమితముగాని, పాచకము అను శబ్దమువలె యోగమాత్ర ప్రవృత్తమైనది గాదు తంత్రకారుడు గూడా వమన విచేచనములకు మాత్రమే యోగ రూఢమైన సంజ్ఞనిచ్చి ఇతరములైన వస్తి శిరోవిరేచనములందు ఇవ్వలేదు అందువలన వస్త్యాదులయందు ఆ శబ్ద ప్రసక్తిలేదు "షడ్విరేచన శతములని స్వయముగా ఆచార్యుడే వ్యాఖ్యానించుచున్నాడు పంచకషాయశతములను చోట కషాయ శబ్దముతో లవణ రసముగాక మిగిలిన మధురాది ఐదురసములకాశ్రయములైన ఔషధ ద్రవ్యములని గ్రహించవలయును "కషాయయోను" లనగా కషాయజాతులు, "కషాయ కల్పన" అనగా చెప్పబడన ద్రవ్యములకు చేయు ఉపయోగానుకూలమైన సంస్కారము మహాకషాయములనగా ఒకే కార్యమును చేయుటకై లెక్కించబడిన పది పది ద్రవ్యముల గణము (సమూహము) ఇవే "దశేమాని జీవనీయాని" అని మొదలగా గలవిగా చెప్పబడినవి

మూ॥ షడ్విరేచన శతాని, ఇతియదుక్తం తదిహసంగ్రహేణోదాహృత్య విస్తరేణ కల్పోపనిషది వ్యాఖ్యాస్యామః (తత్ర) త్రయరస్త్రింశద్యోగశతం ప్రణీతం ఫలేషు, ఏకోనచత్వారింశజ్జీమూతకేషు యోగాః, పంచ చత్వారింశ దిక్ష్వాకుషు, ధామార్గవః షష్టిధాభవతి యోగయుక్తకుట జస్త్వ ష్టాదశ యోగమేతి, కృతవేధనం షష్టిధాభవతి యోగయుక్తం, శ్యామత్రివృద్యోగశతం ప్రణీతం దశాపరేచాత్ర భవంతి యోగాః చతురంగులో ద్వాదశధాయోగమేతి, లోధ్రం విధౌషోడశయోగయుక్తం, మహావృక్షోభవతి వింశతి యోగయుక్తః, ఏకోనచత్వారింశత్ నప్తలాశంఖన్యోర్యోగాః అష్టచత్వారింశద్దంతీద్రవంత్యోః ఇతి షడ్విరేచనశతాని॥ 4

(ఇంతకుముందు) పైన 600 విరేచనములు (ఔషధముల కల్పనలు) అని పేర్కొనబడిన వాటిని క్లుప్తముగా నీ అధ్యాయమునసుదహరించి కల్పస్థానమున విస్తారముగా చెప్పగలము

| | | |
|---|---|---|
| మంగకాయలతో (ఫల) | 133 | యోగములు |
| దేవదాళితో (జీమూత) | 39 | యోగములు |
| చేదుసొరతో (ఇక్ష్వాకు) | 45 | యోగములు |
| పెద్దజేదుబీరతో (ధామార్గవ) | 60 | యోగములు |
| కొడిశపాలతో (కుటజ) | 18 | యోగములు |
| చిన్నచేదుబీరతో (కృతవేధనం) | 60 | యోగములు |
| నల్లతెగడ, తెల్లతెగడ (శ్యామ, త్రివృత్) | 110 | యోగములు |
| రేలతో (చతురంగుల) | 12 | యోగములు |
| లొద్దుగతో (లోధ్ర) | 16 | యోగములు |
| జెముడుతో (మహావృక్ష) | 20 | యోగములు |
| సంబరేణు ఈశ్వరి (వీనితో) (సప్తలా, శంఖినీ) | 39 | యోగములు |
| దంతి, పెద్దదంతి (దంతీ, ద్రవంతీ) | 48 | యోగములు |
| | 600 | |

ఈ విధముగా (600) ఆరువందల (వమన) విరేచన యోగములు చెప్పబడినవి.

చ పా వ్యా ఆం అ  సంగ్రహేణ = క్లుప్తముగా కల్పోనిషత్ అనగా కల్పస్థానోపనిషత్ వేదమున ఉపనిషత్తనగా అత్యుపయుక్తములైన రహస్య విద్యలనుపదేశించు స్థానము అని చెప్పబడును అట్లే ఈ గ్రంథమున గూడా అత్యుపయుక్తములైన, మిక్కిలి రహస్యములైన వమన విరేచన ప్రయోగములుపదేశింపబడుట వలన ఈ గ్రంథము యొక్క కల్పస్థానముగూడా ఉపనిషద్వాచ్యమగుచున్నది అందువలననే 'కల్పోపనిషది' అనగా కల్పోపనిషత్తునందు చెప్పబడును అని చెప్పబడినది సంగ్రహముగా నిచట షడ్విరేచన శతములు చెప్పబడి కల్పోపనిషత్తునందు అవి వివరించబడును ఇచట నొక ప్రశ్న? విస్తారముగా కల్పోపనిషత్తు చెప్పబడినపుడు ఇచట ఆ ప్రసక్తి ఎందులకని? అది సరికాదు. కారణమేమనగా చెప్పవలసిన విషయములను సూత్రరూముగా మొదట చెప్పి తరువాత వివరించుట తంత్రధర్మము న్యాయవిదులుగూడా "తే వై విషయాశ్చ సుసంగృహీతాభవంతి ఏషాం సమాసతో వ్యాసతశ్చ" అనగా మొదట సంగ్రహముగా చెప్పి తరువాత వివరించబడిన విషయములే చక్కగా గ్రహించబడునని చెప్పెదరు అందువలన నీ యధ్యాయమున వాటిని సంగ్రహముగా చెప్పి కల్పోపనిషత్తులో వాటికి వివరణ ఇవ్వబడినది త్రయస్త్రింశద్యోగశతమనగా 133 యోగములని యర్థము కృతవేధనయోగము వరకుండు యోగములు వమన యోగములు. తక్కినవి విరేచన యోగములు శ్యామాత్రివృద్యోగములు (100) నూరు. వాటిలోనే మరి 10 యోగములు గలవు శ్యామాయనగా నల్లతెగడ త్రివృత్ అనగా ఎఱ్ఱని వేరుగల తెగడ

మూ  షడ్విరేచనాశ్రయా ఇతి క్షీరమూలత్వక్ పత్రపుష్ప ఫలానీతి॥ 15

షడ్విరేచనాశ్రయములనగా పాలు, వేళ్ళు, పట్ట, ఆకులు, పువ్వులు, కాయలు అను ఆరును వమన విరేచనాశ్రయములుగ నుండును

చ.పా వ్యా ఆం అ  విరేచనాధికరణములు ఆరు మాత్రమే వీటిలో తీక్ష్ణ విరేచనమగుట వలన క్షీరము మొదట చెప్పబడినది ఇదే గ్రంథమున సూత్రస్థానమున 25వ అధ్యాయమున "స్నుక్పయః తీక్ష్ణవిరేచనానాం" అనగా తీక్ష్ణవిరేచనములలో జెముడు పాలు ప్రధానమైనవని గూడా చెప్పబడినది త్వక్ అనగా ఈ ప్రకరణమున లోధ్రత్వక్‌ను గ్రహించవలయును పత్రమనగా ఇక్ష్వాకు (చేదుసొర) మొదలగు పత్రములు గ్రహించ వలయును. కల్పస్థానమున "అపుష్పస్య ప్రవాలానాం ముష్టిం ప్రాదేశ సంమితమ్ క్షీరప్రస్థేశృతం దద్యాత్ పిత్తోద్రిక్తేకఫజ్వరే" చ క స్థా అ 3 అనగా ప్రాదేశ మాత్ర ప్రమాణము (చేతిబొటనవేలు, చూపుడువేలును చాచినచో ఏర్పడు ప్రదేశ ప్రమాణము)

గల చేదుసొరచిగుళ్ళను ఒక ముష్ఠి (పిడికెడు) గ్రహించి ఒక ప్రస్థము క్షీరమున కాచి పిత్తోద్రిక్తమైన కఫజ్వరమున నివ్వవలయునని చెప్పబడినది క్షీరాదులకు మాత్రమే గాక ఏరండతైలము, తామ్ర పారదములు మొదలగు వాటికి గూడా విరేచనా శ్రయత్వమున్నప్పటికిని ఈ తంత్రమున వాటికి విరేచననాశ్రయత్వము చెప్పబడక పోవుటవలన అధ్యాయారంభమున ప్రతిపాదింపబడిన ఇహ(ఇక్కడ) అను శబ్దము విరుద్ధముగాక విరేచనాశ్రయములీతంత్రము ననుసరించి ఆరు మాత్రమే యని అర్థమునిచ్చును

మూ॥ పంచకషాయయోనయ ఇతి మధురకషాయోఽమ్ల కషాయః కటుకషాయ స్తిక్తకషాయః కషాయకషాయచ్చేతి తంత్రే సంజ్ఞా॥ 6

కషాయ యోనులనగా మధురరసము, అమ్లరసము, కటు రసము, కషాయ రసము, తిక్తరసము అను ఐదు రసములు కషాయ యోనులుగ నుండును

చ పా వ్యా ఆం అ పంచకషాయ శతములు (500 కషాయములు) మహాకషాయ వ్యాఖ్యతో వివరించ తగినవై యున్నవి అందువలన వానిని వదలి ఐదు కషాయ యోనులు చెప్పబడుచున్నవి మధురద్రవ్యములచే చేయడిన కషాయము మధుర కషాయము ఇట్లే మిగిలినవి గూడా, అన అమ్ల, కటు, తిక్త, కషాయ రసద్రవ్యములచేత చేయబడిన కషాయములు వరుసగా అమ్ల, కటు, తిక్త, కషాయ కషాయములని చెప్ప బడును "తంత్రేసంజ్ఞా" అనగా తంత్రమున పేర్కొనబడినవని చెప్పుటచేత లవణ రసమును వదలి తక్కిన మధురాది రసములు కషాయములని వ్యవహరింపబడునని తన నిర్ణయమును సూచించుచున్నది ఇచట పరతంత్ర వ్యవహారములేదని సూచించు చున్నాడు అనగా నిది చరకాచార్యుల స్వాభిప్రాయమని యర్థము కషాయసంజ్ఞను విధించునపుడు, మధురాది రసములకు చెప్పబడినట్లుగా లవణ రసమునకు గూడా గుణములు చెప్పబడి "చిత్రక గుటికా" మొదలగు ప్రయోగములందు గూడా "ద్వేక్షారౌలవణానిచ"(చ చి అ 15) లవణ ప్రయోగము చెప్పబడినది 'రోగ భిషగ్జితీయ' మున (చ వి స్థా అ 8) గూడా స్కంధములుగా చెప్పబడిన ఆయా రసాధికారములందు గూడా లవణము చెప్పబడినది ఐనప్పటికిని అట్టి లవణము కషాయ కల్పనలో ఎందుకు పరిత్యజింపబడినది అను సందేహమునకు సమాధానము చెప్పుచున్నాడు అది ఏమనగా ఇచట చెప్పబడిన కషాయ సంజ్ఞను ఔషధముగా పరిగణింపబడు రసములందు ఆచార్యుడు పరిగణించినాడు మరియు నిచట మధురాది రసములకు వలె కేవలన లవణ ప్రయోగమూ లేదు లవణము ద్రవ్యాంతర సంయోగముతో

మాత్రమే ఉపయోగించ వీలున్నది మరియు మధురాదులయందు స్వరసాది లక్షణమైన కల్పన చేయవచ్చును లవణమన స్వరసాది కల్పన సాధ్యముగాదు కారణమేమనగా లవణమనకు స్వరసము లేదు కల్కముగూడా ద్రవ్యమును ద్రవముతో కలిపినూరి చేయబడును లవణమును ద్రవముతో కలిపి నూరినచో పూర్తిగా విలయనమై కల్క నిర్మాణము జరుగదు ఒకవేళ చూర్ణము కల్కభేదమే గావున చూర్ణమును కల్కముగా గ్రహించి కల్క కల్పన లవణమునకు చేయవచ్చునుగదా అనినచో చూర్ణ కల్పనా నిర్మితమైన లవణమునకు, చూర్ణ రూపమున లేని లవణమునకంటే గుణమున గాని కర్మలోగాని విశిష్టత ఏమీ లేదు కాగా కల్పన యనునది శక్తి విశేషమును కల్పించుటకై చేయబడు ప్రక్రియ అను విషయము ముందు ప్రతిపాదించబడును అందువలన చూర్ణత్వము గూడా లవణమునకు కల్పనమువంటిదే శృత, శీత, ఫాంట, కషాయము లైతే మొత్తము ద్రవ్యములో అనుపయుక్తములైన వాటిని తీసివేసి ఉపయుక్తములైన అవయవములను మాత్రమే గ్రహించుటకై అయా సంస్కారముల ద్వారా ద్రవ్యముల యొక్క కొన్ని కొన్ని అంశములను ద్రవమునందు సంక్రమింపజేయుటకై చేయు సంస్కారములు ఇట్టి ప్రక్రియ లవణమునకు సంభవించదు ఎందులకనగా లవణము ద్రవసంయోగమున పూర్తిగా ద్రవమగును అందువలన లవణమునకు పృథక్ ప్రయోగము లేకుండుటవలనను, కల్పనలకసాధ్యముగుట వలనను కషాయ సంజ్ఞా ప్రకరణమున లవణము గ్రహించబడలేదు అందువలన నిచట ఆచార్యుని నిర్ణయము సరియైనదే

మూ॥ పంచవిధం కషాయ కల్పనమితి తద్యథా - స్వరసః, కల్కః
శృతః, శీతః, ఫాంటః, కషాయ ఇతి
(యంత్రనిష్పీడితాద్ద్రవ్యాత్ రసః స్వరస ఉచ్యతే।
యః పిండో రసపిష్టానాం సకల్కః పరికీర్తితః॥
వహ్నౌతుక్వథి ద్రవ్యం శృతమాహుః చికిత్సకాః॥
ద్రవ్యాదాపోత్థితాత్తోమే ప్రతప్తే నిశి సంస్థితాత్॥
కషాయో యోఽభినిర్యాతి సశీతః సముదాహృతః।
క్షిప్త్వోష్ణతోయే మృదితం తత్ఫాంటం పరికీర్తితమ్॥)

తేషాంయథా పూర్వం బలాధిక్యం, అతః కషాయ కల్పనా వ్యాధ్యాతుర బలాపేక్షిణీ, నత్వేవంఖలు సర్వాణి సర్వత్రోపయోగీని భవంతి॥ 7

**తాత్పర్యము** ఐదు విధములైన కషాయ కల్పనలను తెలుపుచున్నాడు స్వరసము, కల్కము, శృతము, శీతము, కషాయము అని కషాయ కల్పనలు ఐదు విధములు స్వరసము . యంత్రమునవేసి బాగుగా నూరగా (పిండగా) వచ్చిన రసము స్వరసమన బడును.

**కల్కము** ద్రవ్యములను నూరి (మెత్తగా) అంచలి రసముతో పాటు ద్రవ్యమును గూడా ముద్దగా చేసి గ్రహించిన అది కల్కమనబడును

**శృతకషాయము** ద్రవ్యము స్థూలముగా దంచి నీటిలో వైచి అగ్నిపైనుంచి కాచి వడగట్టుకొని గ్రహించిన కషాయము శృత కషాయమనబడును

**శీతకషాయము** కాచి చల్లార్చిన నీటియందు ఒకరాత్రి ఉంచబడిన ద్రవ్యమునుండి తీయబడిన కషాయము శీతకషాయమనబడును

**ఫాంటకషాయము** ద్రవ్యమును నలగగొట్టి వేడినీటియందు వేసి పిసికినచో వచ్చు నట్టికషాయము పాంటకషాయమనబడును.

పై చెప్పబడిన స్వరసాది ఐదు కషాయములలో చివరినుండి మొదటికి ఒకదానికంటె నొకటి బలాధిక్యత కలిగియండును. అందువలన కషాయ కల్పన గూడా వ్యాధిగ్రస్తుని, వ్యాధి బలమును దృష్టియందుంచుకొని చేసుకొనవలసి యుండును అంతేగాక అన్ని అన్ని చోట్ల ఉపయుక్తములు గావు

**చ.పా వ్యా ఆం.అ** ద్రవ్యమునుపయోగించుట కనువైనదానినిగా చేయు క్రియా కలాపము కల్పన, ప్రకల్పన, సంస్కారము అని చెప్పబడును

**స్వరపాది లక్షణములు** స్వోరసః స్వరసః ప్రోక్తః, కల్కోదృషదిపేషితః। క్వధితస్తు శృతః, శీతః శర్వరీముషితో మతః॥ క్షిప్తోష్ణ తోమే ఫాంట ఇత్యభిదీయతే” - ఇతి। అనగా ద్రవ్యమున నుండు తనదైన రసము స్వరసము (ద్రవభాగము), రోటిలో వేసి నూరినది కల్కము, కాచినది శృతము, రాత్రినీటిలోవేసి పిండగావచ్చినది శీతము వేడినీటిలో వేసి పిసకగా వచ్చినది ఫాంటము అనబడును ఈ విషయమున శౌనకుని యభిప్రాయమీవిధముగా నున్నది

“ద్రవ్యాదాపోత్థితాత్తోమే ప్రతప్తే నిశి సంస్థితాత్।
కషాయో యోఽభినిర్యాతి సశీతః సముదాహృతః॥

అనగా ద్రవ్యమును కాచి చల్లార్చిన నీటిలో వేసి ఒకరాత్రియుంచి పిండగా వచ్చిన కషాయము శీత కషాయమని శౌనకుని యభిప్రాయము “ఫాంటః కషాయః’

అనుచోట కషాయ శబ్దము స్వరసాదులతో విడివిడిగా అన్వయించును అందువలన స్వరసకషాయము, కల్కకషాయము అని చెప్పుకొనవలయును స్వరసాదులలో ప్రతి లోమముగా ఒకదానికంటె నొకటి బలాధిక్యము గలవి అనగా ఫాంటమునకంటే శీతము గురువు, శీతమునకంటె శృతకషాయము గురువు ఇట్లే తక్కినవిగూడా ఒకదానికంటె ఒకటి పూర్వమైనది గురువుగావుననే ఈ కల్పనలు వ్యాధిబలమును రోగి బలమును అపేక్షించుచున్నవి "నత్వేవం" అనుదానితో ఈ విషయమున ఉపపత్తిని చెప్పుచున్నాడు వ్యక్తి బలవంతుడై వ్యాధి బలవంతముగా నున్నపుడు ద్రవ్యసారభాగమైన దగుటచే మిక్కిలి గురువైన స్వరసము ఎక్కువ ఉపయోగకారిగా యుండును. ఇది అల్పబలుడైన రోగియందు రోగముయొక్క బలము తక్కువగానున్నపుడు ఉపయుక్తముగాదు ఇట్టి అవస్థయందు స్వరసము బలభ్రంశము, ఔషధాతియోగము మొదలగు దోషములను గలుగజేయునదగునని భావము ఇట్లే మిగిలిన వాటిని గూడా తెలుసుకోవలయును మరియు స్వరసాదులన్నియు అందరికీ యోగ్యములు గావు కారణమేమనగా కొందరు స్వరసమును ద్వేషించువారును మరి కొందరు స్వరసము నిష్టపడువారుగను ఉందురు ఇట్లే మరి కొందరు ఇతర కల్పనలను ద్వేషించు వారుగను, ఇష్టపడువారుగను ఉందురు మరియును తక్షణముననే వమనము, అరుచిని కలిగించు మిక్కిలి అయిష్టములైన భేషజములను ఉపయోగించుటగూడా పనికిరాదు అందుకే వివిధ కల్పనలు చెప్పబడినవి మరియును నిచట కషాయ కల్పనా సందర్భమున చెప్పబడిన "వ్యాధ్యాతురబలాపేక్షిణీ" అనునది ఉదాహరణ మాత్రమే, దీనిననుసరించి వ్యాధ్యాతుర బలాపేక్షయేగాక ద్రవ్యమును గూడా అపేక్షించునదని తెలుసుకోవలయును. అందువలననే ముందు చెప్పబోవు రసాయన ప్రకరణమున "మండూక పర్ణ్యాః స్వరసః ప్రయోజ్యః, క్షీరేణ యష్టీమధుకస్యచూర్ణం। రసోగుడూచ్యాస్తు సమూలపుష్ప్యాః కల్కః ప్రయోజ్యః ఖలుశంఖ పుష్ప్యాః" (చ చి అ1) అని ద్రవ్యములనాధారముగా చేసికొని కల్పనలు విధించబడినవి ఇచట చూర్ణము కల్కమున అంతర్భవింప జేయబడినది కల్కము సద్రవకల్కము, అద్రవ కల్కము అని రెండు విధములు అందువలన చికిత్సస్థానమునందు చెప్పబడిన "నిశిస్థితావా స్వరసీ కృతావా కల్కీ కృతా చూర్ణమధోశృతావా" (చ చి అ4) అను మొదలగు సందర్భములలో చెప్పబడిన చూర్ణము కల్కమునకంటే వేరైనదిగాదని తెలుసుకోవలెను

మూ। "పంచాశన్మహాకషాయా" ఇతి యదుక్తం తదనువ్యాఖ్యాస్యామః, తద్యథా జీవనీయో బృంహణీయో లేఖనీయోభేదనీయః సంధానీయోదీపనీయ ఇతి షట్కః కషాయ వర్గః, బల్యోవర్ణ్యః కంఠ్యోహృద్య ఇతి చతుష్కః కషాయవర్గః, తృప్తిఘ్నోఽర్శోఘ్నః కుష్ఠఘ్నః కండూఘ్నః క్రిమిఘ్నో విషఘ్నో ఇతి షట్కః కషాయవర్గః, స్తన్యజననః స్తన్యశోధనః, శుక్రజననః శుక్రశోధన ఇతి చతుష్కః కషాయవర్గః, స్నేహోపగః స్వేదోపగోవమనోపగో విరేచనోపగ ఆస్థాపనోపగోఽనువాసనోపగః శిరోవిరేచనోపగ ఇతి సప్తకః కషాయవర్గః, ఛర్ది నిగ్రహణ స్తృష్ణా నిగ్రహణో హిక్కానిగ్రహణ ఇతి త్రికః కషాయ వర్గః, పురీష సంగ్రహణీయః పురీష విరజనీయో మూత్రసంగ్రహణీయో మూత్రవిరజనీయో మూత్రవిరేచనీయ ఇతి పంచకః కషాయవర్గః, కాసహరః శ్వాహరః శోధహరో జ్వరహరః శ్రమహర ఇతి పంచకః కషాయ వర్గః, దాహప్రశమనః శీతప్రశమన ఉదర్దప్రశమనోఽఙ్గమర్ద ప్రశమనః శూలప్రశమన ఇతి పంచకః కషాయవర్గః, శోణితాస్థాపన వేదనాస్థాపనః సంజ్ఞాస్థాపనః, ప్రజాస్థాపకో వయస్థాపన ఇతి పంచకః కషాయవర్గః, ఇతి పంచాశన్మహాకషాయా మహతాంచ కషాయాణాం లక్షణోదాహరణార్థం వ్యాఖ్యాతా భవంతి తేషామేకైకస్మిన్ మహాకషాయే దశ దశావయవికాన్ కషాయాననువ్యాఖ్యాస్యామః, తాన్యేవ పంచకషాయ శతాని భవంతి॥ 8

తాత్పర్యము ఇంతకుముందు ఏబది మహాకషాయములని తెలుపబడినది అట్టి ఏబది మహాకషాయములను వివరించుచున్నాము అవి జీవనీయము, బృంహణీయము, లేఖనీయము, భేదనీయము సంధానీయము దీపనీయములనునవి ఆరు కషాయములు బల్యము, వర్ణ్యము, కంఠ్యము, హృద్యములనునవి నాల్గు కషాయములు తృప్తిఘ్నము, అరోఘ్నము, కుష్ఠఘ్నము, కండూఘ్నము, క్రిమిఘ్నము, విషఘ్నము ఆరు కషాయములు స్తన్యజననము, స్తన్యశోధనము, శుక్రజననము, శుక్రశోధనము అనునది 4 కషాయములు స్నేహోపగము, స్వేదోపగము, వమనోపగము, విరేచనోపగము, ఆస్థాపనోపగము అనువాసనోపగము, శిరోవిరేచనోపగము అనునవి ఏడు కషాయములు ఛర్ది నిగ్రహణము తృష్ణా నిగ్రహణము, హిక్కా నిగ్రహణములని మూడు కషాయములు పురీష సంగ్రహణీయము, పురీష విరజనీయము, మూత్ర సంగ్రహణీయము, మూత్రవిరజనీయము, మూత్రవిరేచనీయము అనునవి ఐదు కషాయములు కాసహరము, శ్వాసహరము, శోధహరము, జ్వరహరము, శ్రమ హరము అనునవి ఐదు కషాయములు దాహ ప్రశమనము, శీత ప్రశమనము, ఉదర్ద ప్రశమనము అంగమర్దప్రశమనము, శూల ప్రశమనము అనునవి ఐదు కషాయములు

శోణితాస్థాపనము, వేదనాస్థాపనము, సంజ్ఞా స్థాపనము, ప్రజాస్థాపనము, వయః స్థాపనము అనునవి ఐదు కషాయములు ఈ విధముగా ఏబది మహాకషాయములు ఉదాహరణ నిమిత్తమై చెప్పబడినవి పైజెప్పిన మహాకషాయములలో ఒక్కొక్కదాని యందు అవయవములైన పదేసి కషాయముల (50×10=500) చెప్పుచున్నాము అవియే ఐదు వందల కషాయములగును

చ పా వ్యా ఆం అ పంచాశత్ అను దానితో మహాకషాయములనుదహరించు చున్నాడు జీవమునకు హితమైనది జీవనీయము ఇట్లేమిగిలిన వాటిని తెలుసుకోవలయును షట్కమనగా ఆరింటితో నిర్మాణము చేయునది ఇట్లే చతుష్కము మొదలగు వాటిని గ్రహించవలయును ఇచట నిర్దేశింపబడిన షట్కాది మహాకషాయములు ఏదో ఒక విశిష్టార్థమును సూచించునవైయున్నవి. ఉదా జీవనీయము మొదలగు వాటి "ఈయాం" తత్వము, బల్యము మొదలగువాటియందు "య" ప్రత్యయాంతత్త్వము, తృప్తిఘ్నము మొదలగు వాటియందు 'ఘ్నాం' తత్వము స్తన్యజననము మొదలగు వాటియందు స్తన్యశుక్రాది విషయత్వము మొదలగునవి ఊహించుకోవలయును ఇట్లు 'ఈయ' ప్రత్యయం తత్వము మొదలగు వాటివలన అనేక భేదములను విచిత్రముగా చెప్పుట గ్రంధమునకు "పుష్కలాభిధానతను కల్గించుట కొరకుద్దేశింప బడినది ఇది శాస్త్రమున అవశ్యముగా చేయవలసియున్నది శాస్త్ర గుణములను చెప్పుసందర్భమున "పుష్కలాభిధాన"మీవిధముగా చెప్పబడినది అనవపతితశబ్దమ— కష్టశబ్దం పుష్కలాభిధానమ్" (చ వి 8) అనగా మంచి శబ్దములు గల్గి ఉచ్ఛరించుట యందు కష్టముగాని శబ్దములు "పుష్కలమ"నబడును ఇచట జీవనీయ మనుశబ్దము చేత ఆయుష్యత్వము తెలుపబడినది ఉదా మధుర రసగుణములును చెప్పు సందర్భమున "ఆయుష్యో, జీవనీయః" (చ సూ అ 26) అని మధురరసము ఆయుష్యము జీవనీయము అని చెప్పబడినది అచట మూర్ఛితుడైన వానికి సంజ్ఞను గల్గించునదగుటచే జీవనీయత్వము చెప్పబడినదని గ్రహించవలయును తృప్తి = శ్లేష్మవికారము దీనితో వ్యక్తితాను తృప్తి చెందినవాడుగా భావించును ఆ తృప్తిని నశింపజేయునది "తృప్తిఘ్నము, స్నేహోపగములనగా స్నేహములైన ఘృతము మొదలగువాటి స్నేహన క్రియయందు సహకారము గల్గించుచు వాటిననుసరించి సమీపించునవి స్నేహోపగములుమృద్వీకా(ద్రాక్ష) మొ॥ స్నేహోపగములతో గూడిన ఘృతాదులకు స్నేహనము చేయుటయందు ఉత్కృష్టమైన శక్తికలుగునని భావము అట్లే వమనోపగములను చోట మదన ఫలము మొ॥ వమన ద్రవ్యములకు మధ

మధుకము మొదలగు ద్రవ్యములు సహాయ ద్రవ్యములగును ఇట్లే స్వేదోపగములు మొదలగు వాటిని తెలుసుకోవలయును శిరోవిరేచనోపగములనుచోట మాత్రము శిరోవిరేచన ప్రధానములైన ద్రవ్యములనియె తెలుసుకోవలయును పురీష విరజనీయములనగా పురీషమునకు దోష సంబంధమును తొలగించునది ఇట్లే మూత్రవిరజనీయము గూడా మూత్రమును వెడలించునది మూత్రవిరేచనీయము ఉదర్ధమనగా కందిరీగ కుట్టినపుడు గలుగు వాపువంటి వాపు దానిని శమింపజేయునది ఉదర్ధప్రశమనము అంతేగాని మహారోగాధ్యాయమున చెప్పబడిన వాత వికారమునిచట ఉదర్ధముగా గ్రహించరాదు కారణమేమనగా ఇచట చెప్పబడిన ఉదర్ధ ప్రశమనములైన తిందుకము మొదలగు ద్రవ్యములు వాత ప్రశమనమును గల్గించవు అవివాతమును వృద్ధినొందించును దుష్టి చెందిన శోణితము నందలి దుష్టినిపోగొట్టుట ద్వారా దాని ప్రాకృతావస్థలో నుంచునవి శోణితాస్థాపనములు వేదన కల్గినపుడు దానిని శమింప జేసి శరీరమును ప్రాకృతావస్థలో నుంచునవి వేదనాస్థాపనములు సంజ్ఞను (జ్ఞానమును) స్థిరముగా నుంచునది సంజ్ఞాస్థాపనము సంతాన దోషమును పోగొట్టి సంతానమును గల్గించునది ప్రజాస్థాపనము యౌవనమును స్థిరముగా నుండునట్లుచేయునది వయః స్థాపనము ఇతి అను పదముతో ఇంతవరకు చెప్పినదానినుపసంహరించు చున్నాడు పైజెప్పబడిన ఐదువందల (500) మహాకషాయములు అత్యుత్కృష్టములైనవి వాటి స్వరూపము జీవనీయము మొదలగు వాటిని వివరించుటకై ఈ అధ్యాయము నిర్దేశింపబడినదని యర్థము. లేక అనేక కషాయములు గలిపి జీవనీయాది ఒకే ప్రయోజనము గలుగజేసినచో అదే మహాకషాయమని తెలియజేయుటకుగాను ఉదాహరణార్థము ఈ అధ్యాయమున పంచాశన్మహా కషాయములు (500) మహా కషాయములు చెప్పబడినవి దానితో వాతప్రశమన పిత్తప్రశమనములైన ఇతర కషాయములు వాత ప్రశమన, పిత్తప్రశమనములను ఒక్కొక్క కార్యము నెరవేర్చునవే యైనప్పటికిని అవి అనేక ద్రవ్యమయములని సూచించుచున్నాడు "మహతాంచ" అనుచోట గల 'చ' కారమును, "ఉదాహరణార్థం" అనుపదముతో గలిపి "ఉదాహరణార్థంచ" అని చదివినచో అల్పబుద్ధిగలవారు ఉపయోగించుటకు గూడా వివరించబడినవను అర్థము వచ్చును ఇది ముందు వివరించబడును "మహతాంచ కషాయాణా లక్షణోదహరణార్థం వ్యాఖ్యాతాభవంతి" అనగా ఉత్కృష్టములైన మహా కషాయము లక్షణములు, వాటి స్వరూపము ఉదాహరణ రూపముగా చెప్పబడినవి "మహతాంచ కషాయాణాం లక్షణోదాహరణార్థం వ్యాఖ్యాతాభవంతి" యను వాక్యము

మరొకసారి ముందు చెప్పబడును ఆ సందర్భమున చెప్పబడిన "వ్యాఖ్యాతా" అను పదము పై విషయ ప్రతిపాదనమున "తద్యథా" అను పదముచే వివరింపబడు కషాయ వివరణ సందర్భములోనిదిగా గ్రహించి ముందు చెప్పబోవు 'వ్యాఖ్యాతా' అను పదమునకు చెప్పిన వాటిని స్మరించుకొనుటకై గ్రహించవలయును లేక ఈ వాక్యములందుగల "వ్యాఖ్యాతా" అను శబ్దము మహాకషాయ సంజ్ఞనుబోధించు చునదిగాను ముందుచెప్పబోవు "వ్యాఖ్యాతా" అను పదము ఒక్కొక్క జీవనీయాది ద్రవ్యములను బోధించునదిగానున్నది అందువలన "వ్యాఖ్యాతా" అను పదమునకు పునరుక్తి దోషము లేదు అవయవములే అవయవికలు పై చెప్పబడిన పంచాశన్మహా కషాయములే (50) ఒక్కొక్కటైన 10 ద్రవ్యములతో గుణించబడి పంచాశన్మహాణి కషాయములు (500) మహాకషాయములగుచున్నవి

మూ॥ తద్యథా . జీవకర్షభకౌ మేదా మహామేదా కాకోలీక్షీరకాకోలీ ముద్గపర్ణీ మాషపర్ణ్యౌ జీవంతీ మధుకమితి దశేమాని జీవనీయాని భవంతి (1) క్షీరిణీ రాజకవకా శ్వగంధా కాకోలీ క్షీరకాకోలీ వాట్యాయనీ భద్రౌదనీ భారద్వాజేపయస్యర్శ్యగంధా ఇతి దశేమాని బృంహణీయాని భవంతి (2) ముస్తకుష్ఠ హరిద్రాదారుహరిద్రా వచాతి విషా కటురోహిణీ చిత్రకచిరబిల్వ హైమవత్య ఇతి దశేమాని లేఖనీయాని భవంతి (3) సువహార్కోరుబుకాగ్ని ముఖీ చిత్రాచిత్రక చిరబిల్వశంఖినీ శకులాదనీ స్వర్ణ క్షీరిణ్య ఇతి దశేమాని భేదనీయాని భవంతి (4) మధుకమధుపర్ణీ పృశ్నిర్ణ్యంబష్ఠకీ సమంగా మోచరస ధాతకీ లోధ్రప్రియంగు కట్ఫలానీతి దశేమాని సంధానీయాని భవంతి (5) పిప్పలీ పిప్పలీమూల చవ్యచిత్రక శృంగవేరామ్లవేత సమరిచాజమోదా భల్లాతకాస్థి హింగునిర్యాసా ఇతి దశేమాని దీపనీయాని భవంతి (6) ఇతి షట్కః కషాయవర్గః॥ 9

తాత్పర్యము - జీవకము, ఋషభకము, మేద, మహామేద, కాకోళి, క్షీరకాకోళి, కారుపెసర, కారుమినుములు, మనుబాల, యష్టిమధుకము ఈ పదియును జీవనీయములుగా (ఆయువునువృద్ధిజేయునవిగ నుండును చల్లగుమ్ముడు, పిన్నపాల ముత్తవపులగము కాకోళి క్షీరకాకోళి తెల్లముత్తవపులగము, పచ్చముత్తవపుగలము అడవి ప్రత్తి నేలగుమ్ముడు పాలగుమ్ముడు ఈ పదియును బృంహణీయములుగ (శరీరమునకు బలుపును గలిగించునవిగ) నుండును తుంగముస్తలు చెంగల్వకోష్టు పసుపు (మానిపసుపు వస అతివిషకటుకరోహిణి చిత్రమూలము కానుగతెల్ల వస ఈ పదియును లేఖనీయములుగా (మలాదులను గీకివేయునవిగ) నుండును తెగడ జిల్లేడు ఆముదపుచెట్టు చిన్నచర్లగడ్డ దంతి చిత్రమూలము కానుగ తెల్లదింటెన కటుక

రోహిణి బ్రహ్మదండి ఈ పదియును భేదనీయములుగ (మలాదులను భేదించునవిగ) యుండును అతిమధురము తిప్పతీగ కోలపొన్న విషబొద్ది అత్తపత్రి బూరుగబంక ఆరెపువ్వు లొద్దుగ ప్రేంఖణము గుమ్మటేకు ఈ పదియు సంధానీయములుగ (విడిపోయిన అవయవాదులను కూర్చునవిగ) యుండును పిప్పళ్ళు మోడి చవ్యము చిత్రమూలము శుంఠి ప్లలప్రబ్బలి మిరియాలు ఓమము జీడిగింజలు ఇంగువ ఈ పదియు దీపనీయములుగా (జఠరాగ్నిని వృద్ధిచేయునవిగ) నుండును ఇట్లు జీవనీయాది కషాయములు ఆరును చెప్పబడినవి

**చ పా వ్యా ఆం అ** జీవన హితమైనదందరికామోదయోగ్యమైనదగుట వలన జీవనీయమును మొదట చెప్పుచున్నాడు ముద్గము మాషపర్ణి వరకు తెలిసిన ద్రవ్యములే జీవంతీ = బంగారు వర్ణము గల్గి ఆ పేరుతోనే ప్రసిద్ధమైన ద్రవ్యము పాలకూర మధుకం = యష్టిమదు (అతిమధురము) క్షీరిణీ = చల్లగుమ్ముడు (పాలతీగ) రాజక్షవకః = చిరుబాల (పిన్నపాల) వాట్యాయనీ = తెల్లముత్తవ పులగము (శ్వేతబలా) తెల్ల చిట్టాముట్టి, భద్రౌదనీ = పీతబలా (పచ్చని చిట్టాముట్టి) భారద్వాజీ = అడవి ప్రత్తి పయస్యా = తెల్లనేలగుమ్ముడు ఋష్యగంధా = పాలగుమ్ముడు కటుకా = కటుక రోహిణీ చిరచిల్వ = క్రానుగ హైమవతీ = శ్వేతవచా (తెల్లనివజ), చిత్రో = దంతి శంఖినీ = తెల్లదింటెన, శకులాదనీ = కటుకరోహిణీ, స్వర్ణక్షీరిణీ = బ్రహ్మదండి, అంబష్ఠకీ = చిరుబొద్ది, సమంగా = మణుగుదామర, కట్ఫల = కాయఫలము, సంధానీయః = సామన్యముగా కూర్చునది యని అర్థము, భిన్నమలమును సంగ్రహణముచేయునది పురీష సంగ్రహణము శృంగవేరః = శుంఠి, హింగునిర్యాసః = ఇంగువ

**మూలము** ఐంద్ర్యృషభ్యతి రసర్వ్యప్రోక్తా పయస్యాశ్వగంధా స్థిరారోహిణీ బలాతిబలా ఇతి దశేమాని బల్యాని భవంతి (7) చందన తుంగపద్మకోశీర మధుర మంజిష్ఠా సారివా పయస్యాసితాలత్నాఇతి దశేమాని వర్ణ్యాని భవంతి (8) సారివేక్షుమూల మధుక పిప్పలీ ద్రాక్షవిదారీ కైటర్యహంసపాదీ బృహతీ కంటకారికా ఇతి దశేమాని కంఠ్యాని భవంతి (9) ఆమ్రామ్రాతక లికుచకర మర్దవృక్షామ్లామ్లవేతస కువల బదర దాడిమ మాతులుంగానీతి దశేమాని హృద్యాని భవంతి (10) ఇతి చతుష్కః కషాయవర్గః ॥ (10)

**తాత్పర్యము** ఋడమ పెద్ద దూలగొండి పిల్లిపీచర కారుమినుము నేలగుమ్ముడు పెన్నేరు ముయ్యాకుపొన్న చల్లాగుమ్మడు ముత్తవపులగము పచ్చముత్తవ పులగము ఈ పదియును బల్యములుగ (బలమును గలిగించునవిగ) యుండును మంచి గంధము, సురపొన్న, పద్మకము, వట్టివేళ్ళు, అతిమధురము, మంజిష్ఠ, సుగంధిపాల,

క్షీరకాకోళి, తెల్లగరిక, నల్లగరిక ఈ పదియు వర్ణ్యములు (శరీరమునకు కాంతిని గలిగించునవి) గయుండును సుగంధిపాల చెరుకువేరు యష్టిమధుకము పిప్పళ్ళు ద్రాక్ష, నేలగుమ్ముడు, కాయఫలము, హంసపాది వాకుడు, నేలములక ఈ పదియును కంఠ్యములు (కంఠ్యమునకు మేలుచేయునవి) గ నుండును. మామిడి, అంబాళము, నిమ్మ, వాకచింతపండు, పుల్లప్రబ్బలి, పెద్దరేగు, చిన్నరేగు, దానిమ్మ, మాదీఫలము ఈ పదియు హృద్యములుగ (హృదయమునకు మేలుచేయునవిగ) యుండును ఇట్లు బల్యాది కషాయములు నాల్గును చెప్పబడినవి

**చ పా వ్యా అం అ** ఐంద్రీ = పాపరబుడమ, అతిరసా = పిల్లిపీచరలేక (బుద్ధి), అతిబలా = పచ్చబొట్లబెండ, తుంజ్గః = సురపొన్న, లతా = నల్లగరిక, సారిబా = సుగంధిపాల, విదారీ = నేలగుమ్ముడు, హంసపాది = హంసపాది, వృక్షామ్ల = చింతపండు, ఋషభీ = దూలగొండి, ఋష్యప్రోక్తా = కారుమినుము, పయస్యా = పాలగుమ్ముడు లేక కాకోలీ, సితా = తెల్లగరిక, ఇక్షుమూలం = చెరుకువేరు, కైటర్యం = కట్ఫలము, అమ్రాతకః = కొండమామిడి

**మూలము** నాగర చవ్య చిత్రక విడఙ్గ మూర్వాగుడూచీ వచాముస్త పిప్పలీ పటోలానీతి దశేమాని తృప్తి ఘ్నానిభవంతి (11) కుటజ బిల్వచిత్రక నాగరాతి విషాభయా ధన్వయాసక దారుహరిద్రావచా చవ్యానీతి దశేమాన్యర్శోఘ్నాని భవంతి (12) ఖదిరా భయామలక హరిద్రారుష్కరసప్త పర్ణారగ్వధ కరవీర విడఙ్గ జాతీప్రవాలా ఇతి దశేమాని కుష్ఠఘ్నాని భవంతి (13) చందననలదకృతమాల నక్తమాల నింబకుటజ సర్షప మదుక దారుహరిద్రా ముస్తానీతి దశేమానికండూఘ్నాని భవంతి (14) అక్షీవ మరిచ గండీర కేబుక విడంఙ్గ నిర్గుండీకిణిహేశ్వదంష్ట్రా వృషపర్ణికా ఖుపర్ణకా ఇతి దశేమాని క్రిమిఘ్నాని భవంతి (15) హరిద్రామంజిష్ఠా సువహాసుక్ష్మైలా పాలిందీచందన కతక శిరీష సింధువార శ్లేష్మాతకా ఇతి దశేమాని విషఘ్నాని భవంతి (16) ఇతి షట్కఃకషాయ వర్గః (11)

**తాత్పర్యము** శుంఠి చిత్రమూలము చవ్యము, వాయువిడంగములు చాగతిప్పతీగ వస తుంగముస్తలు పిప్పళ్ళు చేదుపొట్ల ఈ పదియు తృప్తిఘ్నములు (శ్లేష్మ వికారమును పోగొట్టునవి) గ నుండును కొడిసెపాల మారేడు చిత్రమూలము శుంఠి అతివస కరక్కాయ దూలగొండి మ్రానిపసుపు వసచవ్యము ఈ పదియును అర్శోఘ్నములుగ (మూలవ్యాధిని బోగొట్టునవిగ) యుండును చంద్ర కరక్కాయ ఉసిరికాయ, పసుపు, జీడిగింజలు, ఏడాకుల అరటి రేల గన్నేరు, వాయు విడంగములు జాజి చిగుళ్ళు ఈ పదియు కుష్ఠఘ్నములుగ (కుష్ఠమును బోగొట్టునవిగ) నుండును చందనము

జటామాంసి రేల క్రానుగ వేప కొడిశపాల ఆవాలు అతిమధురము మ్రాని పసుపు తంగముస్తలు ఈ పదియు కండూఘ్నములుగ (దురదను బోగొట్టునవి)గ నుండును మునగ, మిరియాలు, గుంజకూర, గోబీదుంప, వాయువిడంగాలు, వావిలిగినియ పల్లేరు, గంటుభారంగి, ఎలుక చెవికూర ఈ పదియు కృమిఘ్నములు (క్రిములను నశింపజేయునవి) గ నుండును పసుపు, మంజిష్ఠ, సన్నరాష్ట్రము, సన్న ఏలకులు, నల్లతెగడ, చందనము, చిల్లగింజ, దిరిసెన, వావిలి, విరిగి ఈ పదియును విషఘ్నములు (విషమును నశింపజేయునవి)గ యుండును ఇట్లు తృప్తిఘ్నము మొదలగు ఆరు కషాయములు చెప్పబడినవి

**చ పా వ్యా అం అ** తృపిఘ్నః = తృప్తిని పోగొట్టునది (11), ధన్వయాసః = దూలగొండి (12), నలదం = వట్టివేరు, నక్తమాలః = క్రానుగ, గండీర = గుంజకూర గురిజకూర, కిణిహీ = ఉత్తరేణి, వృషపర్ణీ = గంటుభారంగి, పాలిందీ = నల్లతెగడ, అరుష్కరః = జీడి(గింజ) (13) కృతమాలః = రేల, అక్షీవః = మునగ, నిర్గుండీ = నల్లవావిలి, ఆఖుపర్ణీ = ఎలుక చెవిఆకు, సువహా = దుంపరాష్ట్రము, శ్లేష్మాతకః = విరిగి

మూ॥ వీరణశాలిషష్టికేక్షు వాలికా దర్భకుశగుస్త్రేత్కట కతృణమూలానీతి దశేమాని స్తన్యజననాని భవంతి (17) పారామహౌషధసురదారు ముస్తమూర్వాగుడూచీ వత్సకఫల కిరాతతిక్తకకటుకరోహిణీ సారివా ఇతి దశేమాని స్తన్యశోధనాని భవంతి (18) జీవకర్షక బకకాకోలీ క్షీరకాకోలీ ముద్గపర్ణీ మాషపర్ణీ మేదావృద్ధరుహా జటిలాకులింగా ఇతిద శేమాని శుక్రజననాని భవంతి (19) కుష్ఠైల వాలుక కట్ఫల సముద్ర ఫేన కదంబ నిర్యాసేక్షు కాండేక్ష్విక్షురక వసుకోశీరాణీతి దశేమాని శుక్రశోధనాని భవంతి (20) ఇతి చతుష్కః కషాయవర్గః॥ (21)

**తాత్పర్యము** నల్లవట్టివేళ్ళు, వరివేళ్ళు, షష్టిక ధాన్యపువేళ్ళు, చెరుకువేళ్ళు, దర్భ వేళ్ళు, కుశదర్భవేళ్ళు, కాశదర్భవేళ్ళు, పెద్దరెల్లువేళ్ళు, నీటిరెల్లువేళ్ళు కామంచి వేళ్ళు ఈ పదియు స్తన్యజననములుగ (చనుబాలను కలిగించునవిగ) నుండును చిరుబొద్ది శుంఠిదేవదారు తుంగముస్తలు చాగ తిప్పతీగ కొడిశపాల విత్తులు నేల వేము కటుకరోహిణి సుగంధిపాల ఈ పదియు స్తన్యశోధకములుగ (చనుబాలను శుద్ధి నొందించునవిగ) యుండును జీవకము ఋషభకము కాకోళి క్షీరకాకోళి కారుపెసర కారుమినుము మేద పిల్లిపీచర జటామాంసి కర్కాటకశృంగి ఈ పదియు శుక్ర జనములుగ శుక్రమును పుట్టించునవిగ) నుండును చెంగల్వకోష్టు కూతురుబుడమ గుమ్మడిబేకు సముద్రపునురుగు కడిమిబంక చెరుకుగొలిమిడి విత్తులు నీరు గొబ్బి

విత్తులు పెద్ద పొగడ వట్టివేళ్ళు ఈ పదియుశుక్రశోధనములుగ (శుక్రమును శుద్ధి నొందించునవిగ) యుండును ఇట్లు స్తన్యజననములు మొదలగు కషాయములు చెప్పబడినవి

చ పా వ్యా ఆం అ ఇక్షువాలికా = చెరుకువేళ్ళు, దర్భ = దర్భవేళ్ళు, గుంద్రా = కాకి వెదురువేళ్ళు (17) స్తన్యశోధనః = స్తన్యమును చనుబాలను శుద్ధిచేయును (18) వృద్ధరుహా = పిల్లపీచర, వృక్షరుహా అని చెప్పనచో బందాకము, జటిలా = జటామాంసి, కులింగా కర్కాటకశృంగి (19) కదంబః = కడిమి నిర్యాసము, ఇక్షురకః = నీరుగొబ్బి విత్తులు, వసుకః = పెద్దపొగడ,

ఈ సందర్భమున ఏలవాలుకమును (కూతురు బుడమను) కట్ఫలము కాయ ఫలము)నకు బదులుగా చెప్పినాడు (20) 12

సూ। మృద్వీకా మధుక మధుపర్ణీ మేధా, విదారి కాకోళిక్షీర కాకోళి, జీవక, జీవంతీ శాలిపర్ణ్య దశేమాని స్నేహోపగాని భవంతి (21) శోబాంజన కైరండార్క వృశ్చీరా పునర్నవా యవ తిల కులత్థ మాష బదరాణితీ దశేమాని స్వేదోపగాని భవంతి ॥ (22), మధుమధుక కోవిదార కర్బుదార నీప విదుల బింబీ శణపుష్పీ సదాపుష్పా ప్రత్యక్పుష్పా ఇతి దశేమాని వమనోపగాని భవంతి (23), ద్రాక్షా కాశ్మర్య పరుషకా భయామలక విభీతకా కువల బదరా కర్కంధు పీలూనీతి దశేమానీ విరేచనోపగాని భవంతి ॥ (24) త్రివృత్ బిల్వ పిప్పలీ కుష్ఠ సర్షప వచా వత్సక ఫల శతపుష్పా మధుక, మదనఫలాని ఇతి దశేమాన్యా స్థాపనోపగాని భవంతి (25), రాస్నా సురదారు బిల్వ మధన శతపుష్పా వృశ్చీర పునర్నవా శ్వదంష్ట్రాగ్ని మంధశ్యోనాకా ఇతి దశేమాన్యానువాసనోపగాని భవంతి॥ (27),జ్యోతిష్మతి క్షవక మరిచ పిప్పలీ విడంగ శిగ్రు సర్షపాపామార్గ తండులశ్వేతా మహాశ్వేతా ఇతి దశేమాని శిరోవిరేచనోపగాని భవంతి ॥ (27) ఇతి సప్తకః కషాయ వర్గః 13

తాత్పర్యము ద్రాక్షా, అతిమధురం, తిప్పతీగ, మేధా, నేలగుమ్మడు, కాకోలి, క్షీరకాకోలి, జీవకము, పాలకూర, ముయ్యాకుపొన్న ఈ పదియును స్నేహోపగములుగా (స్నేహ కర్మయందు ఉపయోగించునవిగా)యుండును మునగ, ఆముదపువేళ్ళు, జిల్లేడు, తెల్లగలిజేరు, ఎర్రగలిజేరు, యవలు (జవ్వలు), నువ్వులు, ఉలవలు, మినుములు, రేగుపండ్లు ఈ పదియు స్వేదోపగములుగా (స్వేదకర్మయందు ఉపయోగింపదగినవిగా) యుండును తేనె, అతిమధురం, ఎర్రదేవకాంచనం, తెల్లదేవ కాంచనం, కడిమి, నీటిప్రబ్బలి, కాకిదొండ, గిలిగిరింత, జిల్లేడు, ఉత్తరేణి ఈ పదియు వమనోపగములుగా

కుశదర్భవేళ్ళు రెల్లువేళ్ళు, పెద్దరెల్లు వేళ్ళు ఓకవేళ్ళు ఈ పదియు మూత్ర విరేచనీయములుగా (మూత్రమును ప్రవర్తింపజేయునవిగా) నుండును ఇట్లు పురీష సంగ్రహణీయము మొదలగు అయిదు కషాయములును చెప్పబడినవి

31) అనంతా = సుగంధిపాలవేరు, కట్వంగః = దుందిలము, మోచరసః = బూరుగు బంక, పద్మా = భారంగి

32) శల్లకీత్వక్ = అందుగపట్టు, కచ్ఛురా = దూలగొండి, శాల్మలీ = బూరుగు, శ్రీవేష్టకం = ధూపద్రవ్య విశేషము

33) కపీతనః = కొండమామిడి, అశ్మంతకః = ఆరెపువ్వు, సోమవల్కః = చంద్ర పద్మభేదములు నాలుగు, పెద్ద తామర, నల్లకలువ, నళినము, తెల్లకలువ

34) సౌగంధికం = కొంచెమెఱ్ఱగా అధికపరిమళముగల చెంగల్వ

35) వృక్షాదనీ = బదనిక, వశిరః = ప్రొద్దుతిరుగుడు

మూ॥ ద్రాక్షాభయామలక పిప్పలీ దురాల భాశృఙ్గీ కణకారికావృశ్చీర పునర్న వాటామలక్య ఇతి దశేమాని కాసహరాణి భవన్తి ॥36, శఠీపుష్కర మూలామ్ల వేతసై లాహిఙ్గ్వ గురుసుర పాతామలకే జీవన్తీ చండా ఇతి దశేమాని శ్వాసహరాణి భవన్తి ॥ 37, పాటలాగ్ని మన్థబిల్వశ్యోనాక కాశ్మర్య కంటకారీకాబృహతీ శాలిపర్ణీ పృశ్నిపర్ణీ గోక్షురకా ఇతి దశేమాని శోథహరాణి భవన్తి॥ (38), సారివాశర్కరా పాఠా మంజిష్ఠా ద్రాక్షా పీలుపరూషకాభయామలక విభీత కానీతి దశేమాని జ్వరహరాణి భవన్తి॥ (39) ద్రాక్షా ఖర్జూర ప్రియాల బదర దాడిమ ఫల్గు పరుషకేక్షుయవ షష్టికా ఇతి దశేమాని శ్రమహరాణి భవన్తి ॥ (40) ఇతి పంచకః కషాయవర్గః॥ (16)

ద్రాక్షా, కరక్కాయ, ఉసిరికకాయ, పిప్పళ్ళు, దూలగొండి, కర్కాటక శృంగి, వాకుడు, తెల్లగలిజేరు, ఎర్రగలిజేరు, నేల ఉసిరిక ఈ పదియు కాసహరములు (దగ్గను పోగొట్టునవిగా) ఉండును కచోరములు పుష్కరమూలము పుల్లప్రబ్బలి ఏలకులు ఇంగువ అగుగు తులసి నేల ఉసరిక మనుబాల కడిలచెట్టు ఈ పదియు శ్వాసహరములుగా (శ్వాసను పోగొట్టునవిగా) ఉండును కలిగోట్టు కూరనెల్లి మారేడు పెదమాను, పెగ్గుమ్ముడు, పెద్దవాకుడు, చిన్నవాకుడు కోలపొన్న ముయ్యాకు పొన్న పల్లేరు ఈ పదియు శోధహరములుగా (వాపును పోగొట్టునవిగా) ఉండును సుగంధి పాలు, పంచదార చిరుబొద్ది మంజిష్ఠి ద్రాక్ష వరగోగు చిట్టీత కరాక్కయ ఉసిరిక కాయ తానికాయ ఈ పదియు జ్వరహరములుగా (జ్వరమును పోగొట్టునవిగా) ఉండును

ద్రాక్ష, ఖర్జూరము, సారపప్పు, రేగు, దానిమ్మ, బ్రహ్మమేడి, చిట్టీత చెఱకు, యవలు అతిమధురము ఈ పదియు శ్రమహరములుగా (బడలికను పోగొట్టునవిగా) ఉండును ఇట్లు కాసహరము మొదలగు అయిదు కషాయములు చెప్పబడినవి

చ పా వ్యా అం అ (36) తామలకీ = నేల ఉసిరి, (37) చండా = కట్లేచెట్టు, (38) శ్వయధు హరాణి = శోధను (వాపును) శమింపజేయునవి, (39) జ్వరహరాణి = జ్వరమును నశింపజేయునది, (40) ఫల్గుః = బ్రహ్మమేడి

మూ॥ లాజాచన్దన కాశ్మర్య ఫలమధూక శర్కరానీలోత్పలో క్షీరసారీవా గుడూచీ హ్రీబేరాణీతి దశేమాని దాహ ప్రశమనాని భవన్తి॥ (41) తగర గురుధాన్యక శృంగవేర భూతీక వచుకంటకార్యగ్ని మంధశ్యోనాక పిప్పల్య ఇతి దశేమాని శీతప్రశమనాని భవన్తి (42) తిందుక ప్రియాల బదర ఖదిర కదర సప్త పర్ణాశ్వకర్ణార్జునా సనారిమేదా ఇతి దశేమాన్యుదర్ద ప్రశమనాని భవన్తి (43) విదారీ గంధాపృశ్నిపర్ణీ బృహతీ కంటకారీ కైరండ కాకోలీ చందనో శీరైలా మధుకానీతి దశేమాన్యంగ మర్ధ ప్రశమనాని భవిన్తి॥ (44), పిప్పలీ పిప్పలీ మూల చవ్య చిత్రకశృంగ వేర మరిచా జమోదా జగంధా జాజీ గండీదాణీలు దశేమాని శూరాప్రశమనాని భవన్తి ॥ (45) ఇతి పంచకః కషాయ వర్గః॥ (17)

తాత్పర్యము పేలాలు చందనము పెగ్గుమ్మడు అతిమధురము పంచదార నల్లకలువ వట్టివేళ్ళు సుగంధిపాల తిప్పతీగె కురువేరు ఈ పదియును దాహ ప్రశమనములుగా (తాపమును పోగొట్టునవిగా) ఉండును గ్రంధి తగరము అగరు ధనియాలు శుంఠిఓమము వసవాకుడు నెల్లి పెద్దమాను పిప్పళ్ళు ఈ పదియు శీత ప్రశమనములుగా (శీతమును పోగొట్టునవిగా) ఉండును తుమికి సారపప్పు రేగు చంద్ర నల్లచంద్ర ఏడాకుల అరటి ఏపి మద్ది వేగిస తెల్ల చంద్ర ఈ పదియు ఉదర్థ ప్రశమనములుగా (ఉదర్ధమును హరించునవిగా) ఉండును ముయ్యాకు పొన్న కోలపొన్న చిన్నవాకుడు పెద్దవాకుడు ఆముదపు వేళ్ళు కాకోళిచందనము వట్టివేళ్ళు ఏలకులు అతి మధురము ఈ పదియు అంగమర్ధ ప్రశమనములుగా (ఒడలు నొప్పులను పోగొట్టునవిగా) ఉండును పిప్పళ్ళు మోడిచవ్యము చిత్రమూలము శుంఠి మిరియములు అజామోదము వావింట జీలకర్ర గురిజకూర ఈ పదియు శూల ప్రశమనములుగా (శూలమును పోగొట్టునవిగా) ఉండును ఇట్లు దాహ ప్రశమనము మొదలగు అయిదు కషాయములును చెప్పబడినవి

చ పా వ్యా ఆం అ  లాజ మొదలగు వాటి యందు జతూ కర్ణుని పారముననుసరించి గుడూచి స్థానములో పద్మకః లేక "అర్కాగురు గుడూచీనాం తిక్తానాం చేష్య మిష్యతే" అనగా అర్క (జిల్లేడు) అగురు గుడూచీ (తిప్పతీగె) ఇవి తిక్తములుగా ఉండి ఉష్ణమును కలుగజేయును (సూ అ 26) అనువచనము ననుసరించి గుడూచి ఉష్ణమైన దైనప్పటికిని ప్రభావము వలన దాహ ప్రశమన గుణము కల్గియుండునని తెలుసుకో వలయును (41), (42) భూతీకః = ఓమ, (43) తిందుకః = తుమికి పండు, కదరః = వేలిచంద్ర, అరిమోదః = వల్లతుమ్మ చంద్రభేదము (44), అంగమర్ధప్రశమనాని = ఒళుళనొప్పులు శమింపజేయును, (45) అజగంధా = వావింట (45) ॥ 174

మూ॥ మధు మధుకరుధిర మోచక సమృత్కపాలలోధ్ర గైరికప్రియఙ్గు శర్కరా లాజా ఇతి దశేమాని శోణిత స్థాపనాని భవన్తి ॥ (46) శాల కట్ఫల పద్మకదంబ మోచరస శిరీష వఞ్జలైల వాలుకాశోకా ఇతి దశేమాని భవన్తి ॥ (47) హింగుకైటర్యాది మేదవచాచోరక వయస్థాగోలోమీ జటిలా పలఙ్క షా శోక రోహిణ్య ఇతి దశేమాని సంజ్ఞాస్థాపనాని భవన్తి ॥ (48) ఐంద్రీ బ్రాహ్మీ శతవీర్యా సహస్రవీర్యా మోఘావ్యథా శివారిష్టా వాట్యపుష్పీ విశ్వక్సేన కాంతా ఇతి దశేమాని ప్రజాస్థాపనాని భవన్తి ॥ (49) అమృతా భయాధాత్రీ ముక్తా శ్వేతా జీవన్త్య తిరసా మండూకపర్ణీ స్థిరా పునర్నవా ఇతి దశేమాని వయః స్థాపనాని భవన్తి ॥ (50) ఇతి పంచకః కషాయవర్గః ॥ (18)

**తాత్పర్యము** తేనె అతిమధురము కుంకుమపువ్వు బూరుగబంక చిల్లపెంకు లొద్దుగ కావిరాయి ప్రేంఖణము పంచదార పేలాలు ఈ పదియు శోణిత స్థాపనములుగా (రక్తమును ఆపునవిగా) ఉండును ఏపి గుమ్మడి రేకు కడిమి పద్మకము సురపొన్న బూరుగబంక దిరిసెన ప్రబ్బలి కూతురు బుడమ అశోకము ఈ పదియు వేదనా స్థాపనములుగా (వేదనములను అరికట్టునవిగా) ఉండును ఇంగువ పెద్దవేప తెల్ల చంద్ర వస కడిలిచెట్టు సరస్వతి అకు నల్లగరిక జటామాంసి గుగ్గులు కటుకరోహిణి ఈ పదియు సంజ్ఞా స్థాపనములుగా (సంజ్ఞను కలిగించునవిగా) ఉండును ఏలకులు సరస్వతి అకు గరిక తెల్లగరిక కలిగొట్టు తిప్పతీగె కరక్కాయి కటుక రోహిణి ముత్తవ పులగము ప్రేంఖణము ఈ పదియు ప్రజాస్థాపనములుగా (సంతానమును కలిగించు నవిగా) ఉండును తిప్పతీగె కరక్కాయ ఉసిరికాయ సన్న రాస్నము, చల్ల గుమ్ముడు సునుబాల పిల్లపీచర మండూక బ్రహ్మీ ముయ్యాకుపొన్న గలిజేరు ఈ పదియు వయః స్థాపనములుగా (వయస్సును నిలుపునవిగా) ఉండును ఇట్లు శోణిత స్థాపనము మొదలగు ఐదు కషాయములు చెప్పబడినవి ।

**చ పా వ్యా ఆం అ** (46) రుధిరం = కుంకుమపూవు, (47) వంజులః = నీటి బ్రబ్బలి, (48) కైటర్యః = కాయఫలము, వయస్థా = బ్రాహ్మి, గోలోమి = తెల్లని గరిక, పలంకషా = గుగ్గులు, (49) శతవీర్య, సహస్రవీర్యా ఈ రెండు గరిక భేదములు, అమోఘా = లక్ష్మణపండు లేక ఉసిరిక, అవ్యథా = అరటి లేక తిప్పతీగ లేక కరక, అరిష్టా = కటురోహిణీ, విష్వక్సేన కాంతా = ప్రియంగు, (50) ముక్తా = రాస్నాః, శ్వేతా అను స్థానమున కొందరు శ్రేయసీ అని చెప్పినారు

**మూ॥ ఇతి పంచకషాయ శతాన్యాభి సమస్య పంచాశన్మహా కషాయా**
**మహతాం చ కషాయాణాం లక్షణోదాహరణార్థం వ్యాఖ్యాతా భవన్తి॥ 19**

**తాత్పర్యము** ఈ విధముగా అయిదు వందల కషాయములను సంగ్రహముగా చేయబడినవి ఏబది మహాకషాయములుగా చెప్పబడినవి ఈ మహాకషాయముల యొక్క స్వరూపము ఉదాహరణ నిమిత్తము చెప్పబడినవి

**చ పా వ్యా ఆం అ** ఇచటపైన ప్రత్యేకముగా ఒక్కొక్క ద్రవ్యగణననుసరించి జీవకాదులలో ఐదు వందల కషాయములగును పదింటితో కలిపి లెక్కించినచో 50 మహాకషాయములు అని శృంగగ్రాహిక న్యాయముననుసరించి అగునని ఇతి అను దానితో ఉపసంహారము చేయుచున్నాడు అభిసమస్య అనగా పదింటిని కలిపి ఒక సంఖ్యగా వర్గీకరించి లక్షణోదాహరణార్థం అనగా మొదటి జీవనీయము మొదలగు పేర్లు లక్షణముననుసరించి చెప్పబడినవి తరువాత చెప్పబడిన జీవక ఋషభకములు మొదలగునవి పైన చెప్పబడిన లక్షణములకు ఉదాహరణములుగా చెప్పబడినవి అందువలననే జీవకాది పది ద్రవ్యములతో కలిపి తెలుపబడినది జీవనీయ మహాకషాయమని తెలుసుకోవలయును మహాతాంచ అనుచోట చకారమును చెప్పుట వలన 500 కషాయములు గూడా లక్షణములకు ఉదాహరముకొరకై చెప్పబడవచ్చునని అభిప్రాయమును తెలియజేసినాడు వాటిలో జీవకాదులు ఒక్కొక్కటి ఒక ద్రవ్యములో చేయబడిన ఐదు వందల కషాయములకు లక్షణ స్వరూపములుగానున్నవి లేక లక్షణములుగాను ఉదాహరణములుగాను ఉన్నవని అర్థము. ఇవి మందబుద్ధి గలవారికి లక్షణము చెప్పుటకు ఉద్దేశించబడినవి అనగా పంచ కషాయ శతములు పంచాశన్మహా కషాయములను తెలుపుటకై ఉద్దేశింపబడినవని అర్థము బుద్ధిమంతులకు ఉదాహరణముగా చెప్పబడినవి

మూ॥ నహి విస్తరస్య ప్రమాణమస్తి, నచాప్యతి సంక్షేపోల్పబుద్ధినాం సామర్థ్యాయోప కల్పతే, తస్మాదనతి సంక్షేపేణానతి విస్తరేణా చోపదిష్టాః ఏతావన్తో హ్యల

మల్పబుద్ధీనాం వ్యవహారాయ, బుద్ధిమతాంచ స్వాలక్షణ్యానుమాన యుక్తి కుశలానా మనుక్తార్థ జ్ఞానాయేతి॥ 20

**తాత్పర్యము** విస్తారమునకు ఇంతయని ప్రమాణము లేదు మిక్కిలి సంక్షేపముగా చెప్పినచో అల్పబుద్ధి కలవారలకు జ్ఞానమును కలిగించుటకు సమర్థమైనది కాజాలదు కావున మిక్కిలి సంక్షేపముగ కాకుండగను మిక్కిలి విస్తారము కాకుండగను చెప్ప బడినవి ఇవి అల్పబుద్ధి కలవారి యొక్క వ్యవహారము కొరకు చాలును లక్షణముల యొక్క ఊహచే యుక్తియందు నేర్పరులైన బుద్ధిమంతులకు చెప్పబడని విషయముల యొక్క జ్ఞానము నిమిత్తము ఉపయోగించును

**చ పా వ్యా అం అ** నహి అను పై వాక్యముల ద్వారా కషాయ ద్రవ్యములెన్ని గలవో అన్నింటిని చెప్పక దృష్టాంతములుగా రెండు మూడు మాత్రమే చెప్పి అతి విస్తారముగా కాక అతి సంక్షిప్తముగాగాక చెప్పుట ఎందులకను విషయము వివరించుచున్నాడు విస్తారముగా చెప్పవలెనన్న విస్తారమున కింతయను ప్రమాణము లేదు అందువలన విస్తారము సాధ్యపడదు అతి సంక్షిప్తముగా చెప్పవలెనన్న కేవలము రెండు మూడు మాత్రమే చెప్పినచో అల్పబుద్ధికలిగి అనుమాన ప్రమాణము నెరుగని వారికి చికిత్సా వ్యవహారమున అది ఉపయోగపడకుండును అందువలన ఎక్కువ విస్తారముగా కాక మిక్కిలి సంక్షిప్తముగా అనగా రెండు మూడు మాత్రమే గాక కొన్నింటిని వివరించుట జరిగినది ఏతావంతః = పైన చెప్పబడినవి, అలం=జ్ఞానము కల్గించుటకు చాలినవిగా నుండును వ్యవహారాయ అనగా చికిత్స కర్మను నెరవేర్చుటకు స్వాలక్షణ్యం = దానికి గల లక్షణ భావము ఆ భారము ద్వారా అనుమానము రెండింటియందు నైపుణ్యము గలవారు అని అర్థము అదెట్లనగా బుద్ధిమంతులైన వారు స్నిగ్ధ, శీత, మధుర కృష్యములు మొదలగు గుణములు కల్గిన జీవకము మొదలగు ద్రవ్యములు ఆ గుణములు కల్గియుండుటచే జీవనమును గల్గించునని అనేక పర్యాయములు చూచి ఆ గుణములు గల్గిన ద్రాక్ష, పాలు, విదారి మొదలగునవి గూడా తజ్జాతీయములు గాన అవిగూడా జీవనీయములగుననవి తెలుసుకొందురు ఉదా జీవకాదులు జీవన కార్యమును గల్గించుట వలన వాటికి మహాకషాయత్వము అట్లే పారాసమంగా మొదలగు అతీసార హర మహాకషాయత్వముండునని అనుమాన ప్రమాణముతో అన్ని విధములైన కషాయములను బుద్ధిమంతులు తెలిసికొందురని భావము

మూ॥ ఏవం వాదినం భగవన్త మాత్రేయమగ్నివేశ ఉవాచ - నైతాని భగవన్ పంచ కషాయశతాని పూర్యన్తే తాని తాని హ్యేవాంగాని సంప్లవన్తే తేషు మహాకషాయేష్వతి

తమువాచ భగవానాత్రేయః - నైతదేవం బుద్ధిమతా ద్రష్టవ్యమగ్నివేశ। ఏకోపి హ్యనేకం సంజ్ఞాలభతే కార్యాన్తరాణి కుర్వన్॥ తద్యథా - పురుషో బహూనాం కర్మణాం కరణే సమర్థో భవతి, సయద్యత్కర్మకరోతి తస్యతస్య కర్మణః కర్తృకరణ కార్య సంప్రయుక్తం తత్తద్గౌణం నామ విశేషం ప్రాప్నోతి, తద్వదౌషధ ద్రవ్యమపి ద్రష్టవ్యమ్। యది చైకమేవ కించద్రవ్య మాసాదయామస్తథా గుణయుక్తం యత్సర్వ కర్వణాం కరణే సమర్థం స్యాత్ కస్తతోఽన్యది చ్ఛేదుపధారయితు ముపదేష్టుం వాశిశ్యేభ్యయతి ॥22॥

తాత్పర్యము ఇట్లు చెప్పిన ఆత్రేయని అగ్నివేశుడు క్రింది విధమున అడిగెను ఆయా ద్రవ్యములు ఆయా మహాకషాయములందు మరల మరల చెప్పబడినవి కావున ఇవి అయిదువందల కషాయములు ఎట్లగును? అని అడిగిన అగ్నివేశుని గూర్చి ఆత్రేయుడు క్రింది విధముగా చెప్పెను ఓ అగ్నివేశుడా! బుద్ధిమంతుడు దీనిని ఈ విధముగా తలంపకూడదు ఒకటియే అనేక కార్యములను చేయుచు అనేక సంజ్ఞలను పొందును ఎటుల ననగా అనేక కర్మములను చేయుట యందు సమర్థుడగు పురుషుడు ఏయే కర్మలను అనుసరించి ఆయా నామవిశేషములను పొందు విధముగ ఔషధ ద్రవ్యములు కూడా ఆయా సంజ్ఞావిశేషములను పొందును సమస్త కార్యములను చేయుటయందు సమర్థమైన ద్రవ్యమెకటి యుండగ ఆ ద్రవ్యముకంటె భిన్నమగు మరియొక ద్రవ్యమును గ్రహించుటకుగాని శిష్యులకు ఉపదేశించుటకుగాని ఎవడును ఇచ్ఛగింపడు

చ పా వ్యా ఆం అ ఏవం అను వాక్యములో నొక పూర్వపక్షము చేయుచున్నాడు జీవనీయాది కషాయములలో జీవక ఋషభకాది ద్రవ్యములు ఒక్కొక్కటి అనేక కషాయములందు చెప్పబడుటచే ఒకే ద్రవ్యము అనేక కషాయములలో వచ్చుట వలన ఆ సంఖ్య ఐదువందలుగాదు అని పూర్వపక్షము దానిని "నైతదేవం" అను దానితో సిద్ధాంత పక్షమున చెప్పుచున్నాడు ఒకే విషయముననేక మార్లు చెప్పుటకు ఉదాహరణమును చెప్పుచున్నాడు అది ఏమనగా ఒకే పురుషుడు వంట వండుట, కుండలు చేయుట, భూమిని త్రవ్వుట మొదలగు పనులుచేయునపుడు ఆయా కార్యములను నిర్వర్తించు సమయమున వంటవాడు, కుమ్మరివాడు అను మొదలగు వివిధములైన పేర్లతో పిలువబడుచున్నాడో అదే విధముగ ఓషధ ద్రవ్యముగా గూడ ఆయా కార్యములను నిర్వర్తించునపుడు ఆయా ఉదాహరణకు క్షీరకాకోలి, ద్రవ్యము జీవనీయ, బృంహణీయ, శుక్రజననాది గుణములతో కూడి యుండుట వలన జీవనీయ, బృంహణీయాది పేర్లతో చెప్పబడి ఆయా గుణములలో చెప్పబడినప్పటికి వైవిధ్యముగలదిగానే యుండును అని భావము ఇచ్చట మరియొక సందేహము అది

ఎట్టిదనగా జీవనీయాది ఒక్కొక్క గుణముగల ద్రవ్యములనేకములుండగా విడివిడిగా అట్టి గుణములుగల ఒక్కొక్క ద్రవ్యమును గ్రహించక జీవనీయాది అనేక గుణములు గల ఒక్క ద్రవ్యమునే ఎందుకు చెప్పవలసి వచ్చినదని సందేహము, ఒక్కొక్క గుణముల గల ద్రవ్యములనెందులకు చెప్పలేదను సందేహము అందుకు సమాధానము "యాదిచైకమేవ" అను దానితో చెప్పుచున్నాడు జీవనీయాది ఒక్కొక్క గుణము గల ద్రవ్యములనేకములున్నవి అట్లే జీవనీయాది అనేక గుణములు గల ఒక్కొక్క ద్రవ్యములు గలవు వాటిలో ఒక్కొక్క గుణములు గల అనేక ద్రవ్యములు ఉపదేశించుట, పొందుట కన్న అనేక గుణములు గల ఒక ద్రవ్యమును పొందుట, ఉపదేశించుట, సులభము మరియు చికిత్సా కార్యమున సౌకర్యముగా నుండును అందువలన అనేక గుణములు గల ఒక్క ద్రవ్యమును అనేక పర్యాయములు పఠించుట జరిగినదని భావము తథాగుణయుక్తం = అనగా అనేకములైన జీవనీయాది కార్యములను చేయు సామర్థ్యము గలది అట్టి గుణయుక్తత్వమునే వివరించుచున్నాడు ఒక ద్రవ్యము అనేక కర్మలను చేయసామర్థ్యమును కల్గియున్నప్పుడు దానిని వదలి ఒకే కార్యమును చేయు ద్రవ్యమును గ్రహించుటకెవరు ఇష్టపడుదురు? ఎవరు ఇష్ట పడరని అర్థము ఉపధారయితుం = వరుస క్రమమున జ్ఞాపకముంచుకొనుట కస్తత అనుదానికి మొదట తదా అని చేర్చుకొనవలయును

మూ॥ యతోయావన్తి యైర్ద్రవ్యైర్విరేచన శతాని షట్। ఉక్తాని సంగ్రహేణేశ తద్వైషాం షడాశ్రయాః॥ రసాలవణ వర్జ్యాష్చ కషాయ ఇతి సంజ్ఞాతాః। తస్మా త్పంచ విధాయోనిః కషాయాణాం దాహృతా॥ తథా కల్పన మప్యేషా ముక్తం పంచవిధం పునః। మహతాం చకషాయాణాం పంచాశత్పరికీర్తితాః॥ పంచచాపి కషాయాణాం శతాన్యుక్తాని భాగశః। లక్షణార్థం ప్రమాణం హివిస్తరస్య నవిద్యతే॥ నచాలమతి సంక్షేపః సమర్థ్యా యోపకల్పతే । అల్పబుద్ధేరయం తస్మాన్నాతి సుక్షేపవిస్తరః॥ మన్దానాం వ్యవహారాయ బుధానాం బుద్ధివృద్ధయే। పంచాశత్కోహ్యయం వర్గః కషాయాణా ముదాహృతాః॥ తేషాం కర్మసు బాహ్యేషు యోగ మాభ్యన్తరేషుచ। సంయోగంచ ప్రయోగంచ యోవేద సభిషగ్వరః॥

చ పా వ్యా ఆం అ ఈ అధ్యాయమునందు - ఏ ద్రవ్యమునుండి ఎన్ని వమన యోగములును ఏ ద్రవ్యమునుండి ఎన్ని విరేచన యోగములును కలుగునో ఏ ద్రవ్యములలో ఆరువందల వమన విరేచన యోగములు కలుగునో ఆ విషయమును, వమన విరేచనముల యొక్క ఆరువిధములగు ఆశ్రయములును చెప్పబడినవి

మరియు లవణము కాక మిగిలిన రసములు కషాయమని చెప్పబడినవి మరియు అయిదు విధములగు కషాయ కల్పనములు చెప్పబడినవి ఏబది విధములగు మహాకషాయములును విభాగముచే అయిదు వందల విధములగు కషాయములను లక్షణము నిమిత్తము చెప్పబడినవి విస్తారమున కెంతయని ప్రమా ణము లేదనియు మిక్కిలి సంక్షేపముగా చెప్పినచో అల్పబుద్ధి వారలకు జ్ఞానము కలిగించుటకు సమర్థమైనది కాజాలదనియు కావున మిక్కిలి సంక్షేపముకాకుండగను, మిక్కిలి విస్తారముగ కాకుండగను చెప్పబడినవనియు ఇవి అల్పబుద్ధి కలవారల యొక్క వ్యవహారము కొరకు చాలుననియు బుద్ధిమంతులకు చెప్పబడని విషయముల యొక్క జ్ఞానము నిమిత్తము ఉపయోగించుననియు చెప్పబడినది ఇట్లు ఏబది విధములగు కషాయ వర్గములు చెప్పబడినవి వీనిని సంయోగము చేయుటకు బాహ్య కర్మలయందును అభ్యంతర కర్మలయందును ప్రయోగించుటకు ఎవరు సమర్థుడుగ నుండునో వాడు వైద్యశ్రేష్ఠుడుగా నుండును

యత అనుదానితో అధ్యాయార్థ సంగ్రహమును చెప్పుచున్నాడు యుతః = మదన ఫలము మొదలగు వాటి నుండి యావంతి = 3300 యోగములు యైర్ద్వైర్వి చేనశతాని పక్ష ఇతి మదన ఫలము మొదలగు వానిలో కలిపి చెప్పబడిన ఆరు వందల కషాయములు అని లక్షణార్థము అను మొదలగు వాక్యములలో అనతి సంక్షేప విస్తరముగా చెప్పబడిన ఏబది (50) మహాకషాయములు సంగ్రహముగా చెప్పబడినవి అలం అనగా సామర్థ్యము కల్గియున్నది అల్పబుద్ధేః అనుచోట చెప్పబడిని అయం అను శబ్దము అతి సంక్షేపః అనుదానితో అన్వయించును ఇచ్చట అతి సంక్షేపము నిజమునకు లేకపోయినప్పటికిని కనీసము వీటినైనా జ్ఞాపకముంచుకొన వలయును అని చెప్పుచున్నాడు పంచాశత్కోహ్యాయం అనుచోట అయ అను శబ్దము సమంజసము గనే యున్నది బాహ్యేషు = ప్రలేపము మొదలగు వాటియందు అభ్యంతరేషు = వమనము, పాచనము మొదలగు వాటియందు, సంయోగం= తగినంతగా ద్రవ్యములను కలుపుట, ప్రయోగం = కాలము, ప్రవృత్తి మొదలగు వాటిననుసరించి ఓషధ యోజన

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే సూత్రస్థానే

బేషజ చతుష్కే షడ్విరేచన శతాశ్రితయోనామ చతుర్థోఽధ్యాయః

చక్రపాణి దత్త విరచితమైన చరక తాత్పర్యమను ఆయుర్వేద దీపికా అను వ్యాఖ్యానమునందు సూత్రస్థానమను మొదటి స్థానమున భేషజ చతుష్కమున షడ్విరేచన శతాశ్రితీయమను 4వ అధ్యాయమునకు ఆంధ్ర అనువాదము

# ఐదవ అధ్యాయము

మూ॥ అథాఽతో మాత్రాశితీయ మధ్యాయం వ్యాఖ్యాస్యామః॥

ఇతి హస్మాహ భగవానాత్రేయః 2

**తాత్పర్యము** అటు తరువాత 'మాత్రాశితీయము'' అను అధ్యాయమును చెప్పుచున్నాము (1) అని భగవంతుడైన ఆత్రేయుడు చెప్పెను

**చ పా వ్య ఆం అ** అయుర్వేద శాస్త్రమునకు గల రెండు ప్రయోజనములు "స్వస్థాఽతుర పరాయణమ్'' (చ సూ అ1) అని వ్యాధి గ్రస్తునికి వ్యాధి మోక్షము, స్వస్థునికి స్వాస్థ్య రక్షణము అని రెండు విధములుగా చెప్పబడినది దీనిననుసరించి ఉత్పన్నవ్యాధి ప్రతీకారముతో ఆతుర (రోగి) రక్షణ రూపమైన భేషజ చతుష్కమును చెప్పి స్వస్థ చతుష్కము చెప్పవలసియున్నది అస్వస్థవృత్త ప్రకరణమున ఆరోగ్య రక్షణను కలిగించువాటిలో మాత్రాయుక్తమైన అన్నము ప్రధానమైనది ఇదే విషయమును "ప్రాణి నాంపునర్మూలమాహారోబలవర్ణౌజసాంచ'' (సు షూ అ1) అనగా ప్రాణుల యొక్క బలము వర్ణము, ఓజస్సులకు ఆహారమె మూలమని సుశ్రుతమున చెప్పబడినది అందు వలన మాత్రాయుక్తమైన అన్నమును తెలుపుటకై "మాత్రాశితీయము'' చెప్పబడుచున్నది మాత్రాశనము అనగా (మాత్రతోకూడుకున్న) ఆహారము (అశనమును) ఆధారముగా చేసికొని చెప్పబడినది మాత్రాశితీయము

అధ్యాయ ప్రారంభమున ''మాత్రాశీ'' అను పదముండుట వలన "మాత్రాశీయాధ్యాయము'' అను పేరిడుట సమంజసమైనప్పటికిని ఆ శబ్దమును చ్చరించుట కష్టమని ఎంచి ఆ అర్ధమునే సూచించు మాత్రాశితీయమను నామ కరణము చేయబడినది ఉదా "నవేగాంధారణీయము'' మొదలగునవి గూడా ఇట్లే పేర్కొనబడినవి

## ఆహార పరిమాణము

మూ॥ మాత్రాశీస్యాత్ । ఆహారమాత్రాపునరగ్ని బలాపేక్షిణీ 3

**తాత్పర్యము** ఆహారమాత్ర ఎల్లప్పుడు అగ్ని బలమునపేక్షించియున్నదగుట వలన ఆహారమును మాత్రాప్రమాణముననుసరించి తీసుకొనవలయును

**చ పా వ్యా ఆం అ** సరియగు మాత్రననుసరించి ఆహారమును తీసుకొను అలవాటు కలవానిని 'మాత్రాశీ' అందురు ఇటచ మాత్ర అనగా అనపాయకరమైన పరిమాణము ఈ ప్రకరణమున అశి శబ్దము సంపూర్ణముగా ఖాద్య, లేహ్య, ప్రాశ్య, పేయా మొదలగు వాటియందన్వయించును కావున మాత్రాశీయనుచోట ఖాద్యప్రాశ్య,లేహ్యాపేయా మొదలగు వాటిని మాత్రాప్రమాణముగా తీసుకొనవలయుననని చెప్పలేదను సందేహము తొలగించబడినది అశి శబ్దము ఖాద్యము మొదలగు వాటియందు పయోగింపబడుట శాస్త్రమున గూడా గనబడుచున్నది ఉదా దశమూల హరీతకీ యందు "ఏకాం భయాం ప్రాశ్యతతశ్చలేహాద్భుక్తిం నిహంతిశ్వయథుం ప్రవృద్ధం (చ చి అ 12 1) అని చెప్పబడినది మరియు "క్షీరాశీతత్ ప్రయోజయేత్" (చ చి అ1) క్షీరాశనము చేయువాడు అని చెప్పబడినది దానివలన అశి శబ్దము అన్ని విధములైన ఆహారములందుప యుక్తమని తెలియుచున్నది అందువలన రెండవ వాక్యము "ఆహార మాత్రాపునః" అని ఆహార మాత్ర అనుపదముతో చెప్పబడినది గాని అశిత మాత్ర అని చెప్పబడలేదు అనగా అశిత శబ్దము అన్ని విధములైన ఆహారములను బోధించునదని అర్థము మాత్రను ఆహార మాత్రా అను వాటితో వ్యాఖ్యానించుచున్నాడు

అగ్ని యొక్క అల్ప, మధ్య, ఉత్కృష్టతలననుసరించి ఆహార మాత్ర అల్ప, మధ్య, ఉత్కృష్టములుగా నుండు ననదని దీని "ఆహారామాత్రాపునరగ్నిబలాపేక్షిణీ" అనువాక్యమున కర్థము పునః శబ్దము భేషజాదుల మాత్రను మరియు వ్యాయామ మాత్రను తెలుపునదై యున్నది అందు వలన మాత్రాప్రమాణము కేవలము అగ్ని బలాపేక్షితము మాత్రమే కాదు ఎట్లనగా భేషజమాత్ర వ్యాధ్యాతుర బలాపేక్షితమై యుండగా వ్యాయామము యొక్క మాత్ర దోషక్షయము అగ్నివృద్ధి మొదలగు వాటిని కలిగించుచు శ్రమము, క్లమము మొదలగు వాటిని కలిగించకుండా యుండును లేక "పునః" శబ్దమునకు పౌనఃపున్యమని మరి యొక అర్థము దానితో ఆహారమాత్ర "పునః పునః" అనగా మాటిమాటికి అగ్ని బలమునపేక్షించునని యర్థము ఉదా ఒక వ్యక్తియందు ఒకప్పుడు నియమితమైన మాత్ర సర్వకాలమున కనుకూలించదు ఋతుభేదము వయో భేదములతో అదే అగ్ని ఒకప్పుడు వివృద్ధమై మరియొకప్పుడు

మందగించును ఉదా హేమంత ఋుతువున యౌవనమున వృద్ధిపొంది, వర్షఋుతువున వార్ధక్యమున, కొంతకాలము పాటు అదే మాత్రాప్రమాణము వ్యవహరింపబడును మాత్రా ప్రమాణం = ఇంతమాత్ర, మాత్రా ప్రమాణమనగా నిచట మాత్రా ప్రమాణముగలది అని తెలుసుకోవలయును సకాలమున జీర్ణమగు ఆహారము మాత్రాదోషముతో వికారమునుకలిగించనప్పటికిని ద్రవ్య స్వభావము సంస్కారాది దోషముల వలన వికారములను గల్గించును కావున "ప్రకృతి మనుపహత్య" అనగా ప్రకృతిని చెరచక అను విశేషణము సరిగాదు ఉదా మందక లకుచాదులు నిర్దిష్టకాలమున జీర్ణమైనప్పటికిని దోష జనకములగుచున్నవి అచ్చట మాత్రాదోషమేదీ లేదు "త్రివిధకుక్షీయమున గూడా నచకేవలం మాత్రావత్త్వాదేవాహా రస్యకృత్స్న మాహార ఫలసౌష్ఠవమవాప్తుం శక్యం ప్రకృత్యాదీనామష్టానామాహార విధి విశేషాయతనానాం భిన్న ఫలత్వాత్॥ (చ వి అ 21) అనగా కేవలము మాత్రా ప్రమాణము చేతనే ఆహారము యొక్క సంపూర్ణ ఫలమును పొందుట అసాధ్యము ప్రకృత్యాది ఆహార విధి విశేషాయతనములు గూడా ఆహార ఫలమును మార్చి వేయుట కవకాశమున్నది అని తెలుపబడినది అందువలన మాత్రాయుక్తమైన ఆహారము మాత్రమే ప్రకృతిని చెరచదని చెప్పుటకవకాశము లేదు కాని ఇది సరికాదు కారణమే మనగా ఆహార మాత్ర రెండు విధములుగా విమానస్థానమున చెప్పబడును అందు ఒకటి సర్వగ్రహరూపమాత్రకాగా రెండవది పరిగ్రహ రూపమాత్ర ఈ రెండింటిలో సమూహరూపమైన ఆహార పరిమాణము సర్వగ్రహము, మధురామ్లాది ఆహారావయవ ముల యొక్క ప్రత్యేకప్రమాణముగ గ్రహించుట పరిగ్రహము అందువలన అగ్ని బలభేదముతో ఆహారమాత్రకూడా ఒకే వ్యక్తియందు ఒకే విధముగా యుండక తత్కాలమునందలి అగ్ని బలమునపేక్షించి మాత్రకూడా విభిన్నముగా నుండునని భావము

> మూ॥ యావద్ధ్యస్యాశనమను పహత్య ప్రకృతిం యథాకాలం జరాంగచ్ఛతి
> తావదస్య మాత్రా ప్రమాణం వేదితవ్యం భవతి॥ 4

తాత్పర్యము ఎవనికి ఎంత ఆహారము తీసుకున్న అది ప్రకృతిని చెరచక సరియైన కాలమున జీర్ణమగునో అది అతనికి సరియైన ఆహార మాత్రా ప్రమాణము

చ.పా.వ్యా అం అ అగ్నిబలాపేక్షిత్వమును వివరించు చున్నాడు "యావత్ హి" అని యావత్ = ఎంత పరిమాణము, హిశబ్దము = కారణముగా చెప్పబడినది అస్య = భుజించువానికి అశనం = అశిత ఖాదిత, లీఢ పేయాది చతుర్విధ ఆహారము, ప్రకృతి = వాతాది దోషములు, రసాదిధాతువుల యొక్క సామ్యావస్థను అనుపహత్య =

చెరచక; యధాకాలం = రాత్రి **అంతమున, తావత్** = అంతమాత్ర అని అర్థము మూలమున అస్య అను పదము **చెప్పబడుటచే** ఆపదము ఆ వ్యక్తికియని చెప్పుట కొరకు అనగా ప్రతివ్యక్తి యందు అగ్ని **బలము భిన్నము**గా నుండును గావున ఏ మాత్ర ఎవనికి వికారములను గలిగించదో అది ఆ వ్యక్తికి మాత్రమే మాత్రాప్రమాణము గాని ఇతరులకది మాత్రాప్రమాణము గాదని భావము ఒక పురుషునియందు కూడా కాలాది భేదముతో అగ్ని బలభేదమున్నప్పటికి అగ్ని బలభేద కారణాభావమున్నంత వరకు ప్రమాణములు పరిగ్రహమనబడును ఈ రెండింటిలో సముదాయ రూపమైన పరిమాణము ఉచిత ప్రమాణమున గ్రహించినప్పటికిని ఆహారావయవములైన మధురాది రసములు స్వభావహితములైనప్పటికిని అధిక ప్రమాణముతో గ్రహించిన ఎడల ఆహారావయవమాత్రావైషమ్యము వలన ధాతువైషమ్యము తప్పనిసరిగా గలుగును. మరియు నిర్దిష్ట కాలమున జీర్ణముగూడా కాదు అందువలననే "ప్రకృతి మనుపహత్య" అను విశేషణము జోడింపబడినది కొందరీ వాక్యమున అస్య అని, అశనం అని, అశితం అని విడగొట్టి మూడింటి అర్థములను విడివిడిగా అనగా అస్య అను పదమునకు "భోక్త" అని "**అశనం**" అను పదమునకు ప్రకృతికరణ సంయోగ దేశ కాలాదులకు విరుద్ధముగాని ప్రశస్తాహారమని, "అశితమను పదమునకు విధి విధానముతో గూడిన భోజనమని చెప్పి ఇట్టి సర్వగుణ సంపన్నమైన ఆహారము మాత్రమే "మాత్రావత్" అను శబ్ద వాచ్యమగునని వ్యాఖ్యానించినారు

మూ॥ తత్రశాలి షష్టిక ముద్గలావకపింజలైణ శశ శరభశంబరాదీన్యాహార ద్రవ్యాణి ప్రకృతి లఘూన్యపి మాత్రాపేక్షీణి భవంతి। తథా పిష్టేక్షు క్షీర వికృతి తిల మాషానూ పౌదక పిశితాదీన్యాహార ద్రవ్యాణి ప్రకృతి గురూణ్యపి మాత్రామేవాపేక్షంతే॥ 5॥

**తాత్పర్యము** ఆహార ద్రవ్యములలో శాలిధాన్యము షష్టికధాన్యము పెసలు లావకపిట్ట తెల్లతిత్తిరి పక్షి, కృష్ణసారమృగము, కుందేలు, దుప్పి శంబరమను హరిణ విశేషము మొదలగునవి స్వభావసిద్ధములుగా లఘు ద్రవ్యములేయైనప్పటికిని మాత్రన పేక్షించియె లఘువుగానుండును అట్లే పిండి పదార్థములు, చెరుకు, క్షీరవికారములు (పాలు, పెరుగు, నెయ్యి, జున్ను) మొదలగునవి నువ్వులు, మినుములు, జలచరములైన మరియు జల ప్రదేశమునందలి జంతువుల మాంసము మొదలగు ఆహార ద్రవ్యములు ప్రకృతి సిద్ధముగా గురుద్రవ్యములైనప్పటికిని ఇవి గూడా మాత్రనపేక్షించియే యుండును

**చ పా వ్యా ఆం అ** మాత్రాలక్షణమునుపదేశించి వ్యవహారోపయుక్తమైనట్టి ద్రవ్య భేదముతో మాత్రాభేదమును "తత్రశాలి" అను సూత్రముతో తెలియజేయుచున్నాడు లఘు ద్రవ్యములు పథ్యతమములగుట వలన మొదట చెప్పబడినవి పథ్యతమమైన వాటిలో గూడా ఆహార ద్రవ్యములందు రక్తశాలి ధాన్యము ప్రధానమైనదగుట వలన మొట్టమొదట చెప్పబడినది

కపింజలము = తెల్లతిత్తిరి, ఏణః = నల్లజింక, శరభః = పెద్ద కొమ్ములు గల దుప్పి, శంబరః = హరిణ విశేషము

అన్నపాన విధి అధ్యాయమున "శీతః స్నిగ్ధోఽగురుః స్వాదుః" అను చెప్పు సందర్భమున షష్టిక గుణములను చెప్పునపుడు "అగురుః" అను అకార ప్రశ్లేషను గ్రహించవలయును

**మూ॥** నచైవ ముక్తే ద్రవ్యే గురులాఘవ మకారణం మన్యేత! లఘూని ద్రవ్యాణి వాయ్వగ్ని గుణ బహులాని భవన్తి, పృథివీ సోమగుణ బహులానీ తరాణీ, తస్మాత్స్వ గుణాదపి లఘూన్యగ్ని సంధుక్షణ స్వభావాన్యల్పదోషాణి చోచ్యన్తేఽపి సౌహిత్యోప యుక్తాని గురూణి పునర్నాగ్ని సంధుక్షణ స్వభావాన్య సామాన్యదతశ్చాతి మాత్రం దోషవన్తి సౌహిత్యోప యుక్తాన్యన్యత్ర వ్యాయామాగ్ని బలాత్, సైషా భవత్యగ్ని బలాపేక్షిణీ మాత్రా॥ 6

**తాత్పర్యము** పై విధమున చెప్పుటచే ద్రవ్యమునందలి గురులాఘవముల యొక్క నిరూపణము వలన ప్రయోజనము లేదని తలంపకూడదు లఘు గుణము కల ద్రవ్యములు వాయువు యొక్కయ అగ్ని యొక్కయు గుణములను అధికముగ కలిగి యుండును. గురుగుణము కల ద్రవ్యములు పృథివీ గుణములను సోమ గుణములను అధికముగ కలిగి యుండును తమ యందలి గుణముల వలన జాఠరాగ్నిని వృద్ధి నొందించు స్వభావముకల లఘుగుణ ద్రవ్యములను అధికముగా భుజించినను స్వల్ప దోషమును మాత్రమే కలిగించును జఠరాగ్నితో సమానమైన గుణములు లేని వగుట వలన జఠరాగ్నిని వృద్ధినొందించు స్వభావము లేని గురుగుణ ద్రవ్యములను అధికంగా భుజించినచో అధికమగు దోషములను కలిగించును వ్యాయామముచే జఠరాగ్ని బలము కలవారికి దోషములను కలిగింపనేరవు ఇట్లు ఆహార పరిమాణము జఠరాగ్ని బలము ననుసరించి యుండును

**చ పా వ్యా ఆం అ** హితకరములైన లఘు ద్రవ్యములు గూడా తమ కార్యమైన హితములను చేయుటలో మాత్రనపేక్షించి అహితములైన గురు ద్రవ్యములు గూడా

మాత్రతో తీసుకొన్నప్పుడు హితకరములైనప్పుడు,గౌరవ లాఘవ ద్రవ్యములనుపదేశించుట వలన ప్రయోజనమేమి? ఆ సందేహమును ఈ సూత్రముతో నివారించుచున్నాడు లఘు ద్రవ్యములు, ఆకాశ, వాయు, అగ్ని గుణములవైనప్పటికిని వాటిలో ఆకాశ భూతమునకు అగ్ని దీపన సామర్థ్యమంతగా లేదు వాయు, అగ్ని భూతములు మాత్రము అగ్ని దీపక సామర్థ్యము కల్గియుండుట వలన వాయ్వగ్నిగుణ బహుళము లని లఘుద్రవ్యములుచెప్పబడినవి ఆ కారణము వలన లఘు ద్రవ్యములు మాత్రా ప్రమాణముచేత మాత్రమే అగ్నిదీపనము కలిగించును వాయ్వగ్ని గుణ బహుల ద్రవ్యములు స్వగుణములచేత గూడా అగ్ని సంధుక్షణ స్వభావమును గల్గి యుండును లఘుగురు ద్రవ్యముల విషయములో మాత్రా విరోధము సమానమే యైనప్పటికి ఆ రెండింటిలో లఘు ద్రవ్యములకు గల వైశిష్ట్యమును "అల్పదోషాణి" అను సూత్రముతో వివరించుచున్నాడు లఘు ద్రవ్యములు మాత్రనతి క్రమించి భుజించినచో దోషములను కల్గించునవైనప్పటికి కొద్దిపాటి దోష ప్రకోపమును మాత్రమే కల్గించును "సౌహిత్యమనగా మాత్రాతిక్రమణము వలన కల్గిన తృప్తియని అర్థము గురూణి అనుచోట "పునః శబ్దము వ్యావృత్యర్థకము అనగా మరియొక విధముగా చెప్పుట అని అర్థము గురుద్రవ్యములు అగ్నికి విరుద్ధములైన పృథ్వి, జలగుణబహులము అందు వలన మాత్రాతిక్రమణమును గురుద్రవ్యములు దోషాధికములై యున్నవి సూత్రమున అతశ్చ అను సూత్రముతో గురుద్రవ్యములకు దోషాధిక ప్రకోపకత్వము చెప్పబడినది. లోకమున కష్టించి పనిచేయు కొందరు మానవులు గురు ద్రవ్యములను అధిక మాత్రలో భుజించి గూడా దోషరహితులుగా యుండుట కనపడుచున్నది కావున గురు ద్రవ్యములు అధిక దోషకరములెట్లగును అను సందేహమును "అన్యత్రవ్యాయామాగ్ని బలాత్" అను వాక్యముచే నివారించు చున్నాడు వ్యాయామాగ్ని బలమనగా వ్యాయామము వలన కలిగిన అగ్నిబలమని అర్థము సూ '6' వ అధ్యాయమున 'పక్తా భవతి హేమంతే మాత్రా ద్రవ్య గురుక్షమః" అను సూత్ర ప్రకారము హేమంత ఋతువునందు జఠరాగ్ని బలముగా యుండి మాత్రా గురుత్వమును ద్రవ్య గురుత్వమును గూడా సహించు సామర్థ్యమును కల్గియుండునని చెప్పబడినది దానిననుసరించి కాలానుగుణముగా హేమంత ఋతువున అగ్ని బలము చెప్పబడినప్పటికిని ఇచ్చట మాత్రము వ్యాయామము వలన పెంపొందిన అగ్నియే మిక్కిలి బలవంతముగా నుండునను అభిప్రాయముతో వ్యాయామాగ్ని బలమే ప్రధానమైనదిగా పేర్కొనబడినది వ్యాయామాగ్ని బలాత్ అను పదమును విడదీసి వ్యాయామము వలన, అగ్ని బలము

వలన దోషజనకములు కావని అర్థము చెప్పినచో భోజన మాత్రా వ్యాయామపేక్షిత మైన ప్రకరణ విరుద్ధముగా గోచరించును

ప్రతిజ్ఞా వాక్యములో ప్రారంభించినమాత్రా ప్రమాణమును న్యాయ సమ్మతముగా అట్టి మాత్ర అగ్ని బలాపేక్షితమై యున్నదని "సైషాభవత్యాగ్ని బలాపేక్షిణీ మాత్రా" అను ఉపసంహరించుచున్నాడు

**మూ॥ నచనాపేక్షతే ద్రవ్యమ్ ॥ ద్రవ్యాపేక్ష యాచ త్రిభాగ సౌహిత్య మర్థ సౌహిత్యం వాగురూణాముపదిశ్యతే, లఘునా మపిచనాతి - సౌహిత్య మగ్నేర్యుక్త్యర్థమ్। 7**

**తాత్పర్యము** - పరిమాణము ద్రవ్యములను కూడా అపేక్షించి యుండును ఎటులనగా - గురుగుణము కల ద్రవ్యములను మూడు వంతుల తృప్తిగా గాని భుజింప వలయును లఘు గుణముకల ద్రవ్యములనైనను మిక్కిలి తృప్తిగా భుజింపకూడదు ఈ విధముగా ఆచరించినచో జఠరాగ్ని సరిగ నుండగలదు

**చ పా వ్యా అం అ** మాత్ర అగ్నిబలాపేక్షితమైనపుడు ఒకే విధమైన అగ్నియందు లఘు ద్రవ్యముల మాత్ర అధికముగాను గురు ద్రవ్యముల మాత్ర త్రిభాగోచితముగాను లేక అర్థభాగాత్మకమైనదిగా **ఏల చెప్పవలెనను** దానిని "నచనాపేక్షతే ద్రవ్యం" అను సూత్రమున వివరించుచున్నాడు. **అపేక్షించునది** ద్రవ్యమని అర్థము కొద్దిపాటి గురు ద్రవ్యములు ప్రభాగ **సౌహిత్యములుగా భుజింపవలయును** ఇటే గురుత్వ ప్రకర్ష ననుసరించి ఇతర ద్రవ్యములను గూడా తెలుసుకొని గ్రహించవలయును లఘు ద్రవ్యముల విషయమున గూడ నాతి సౌహిత్యమనగా సాహిత్య శబ్దము తృప్తిమాత్ర బోధకమై లఘు ద్రవ్యములు గూడ తృప్తినతిక్రమించి భుజించ కూడదని బోధించుచున్నది ఈ విధముగ భుజించిన మాత్రాతి క్రమణము గాదు "అగ్నేర్యుక్త్యర్థం' ' అనగా జఠరాగ్నిని స్వ ప్రమాణములో యుంచుట కొరకని యర్థము. గురు ద్రవ్యములు అగ్నికి సమానములు గావు కావున గురు ద్రవ్యముల **అతిమాత్ర** సేవనము నిషేధింపవలెనే గాని అగ్నికి సమానములైన లఘు ద్రవ్యములు అగ్ని మాంద్యమునెట్లు కలుగజేయును? వాటియొక్క అతిమాత్రోపయోగము గూడ "లఘు నామపి నాతి సాహిత్య మగ్నేర్యుక్త్యర్థం" అని ఎందుకు నిషేధింపబడినది అను సందేహమును నివారించుచు లఘు ద్రవ్యములు సామాన్య మాత్రకాక అతి మాత్రత్వము మాత్రమే అగ్ని మాంద్యమును కలుగజేయును ఉదా తేజోభూతాత్మకమైన నేత్రము తేజోభూత సహకారమువలననే రూపగ్రహణము చేయునప్పటికిని తేజస్సు యొక్క అతి యోగమునశించును

అట్లే పాషాణ నిర్మితమైన శస్త్రము పాషాణ సంయోగముతో వాడియై పాషాణ ముపైన నేమిధ్యాయోగమున కొట్టబడి మొక్కవోవును

ఇదే విషయము శాలాక్యమున గూడ "యత్తేజో జ్యోతిషాం దీప్తం శరీరం ప్రాణినాంచయత్ సంయుక్తం తేజసా తేజవృద్ధి రూపాణి పశ్యతి తదేవచక్షు స్త్వన్యేవ జ్యోతింష్యతి తుపశ్యంతిః వికరంభజలే ఽత్యర్థమధవా పివినస్యతి ॥ శాస్త్ర స్యాశ్మాయథా యోనిర్నిశితంచ తదాశ్మాని తీక్ష్ణం భవత్యతి యోగాత్తత్రైవ ప్రతిహన్యతే" అని చెప్పబడినది

మూ॥ మాత్రావద్ధ్యశన మశిత మనుపహత్య ప్రకృతిం బలవర్ణ సుఖాయుషా యోజయ త్యుపయోక్తార మవశ్యమితి"

తాత్పర్యము ఆహారమును పరిమితిగ భుజించినచో ప్రకృతికి చెడుగును కలిగింపక బలమును వర్ణమును సుఖమును ఆయువును నిశ్చయముగా కలిగించును

చ ప వ్యా అం అ ఈ విధముగా అగ్ని బలాపేక్షితమైనదిగా మాత్రా నిర్ధారణము గావించబడి మాత్రాన్వితమైన భోజనము చేయవలయునని చెప్పబడినది మాత్ర శితము వలన కలుగు గుణములను గూర్చి "మాత్రావద్ధి" అను సూత్రమున వివరించు చున్నాడు ఈ సూత్రమున "అవశ్యం" అను నియమము విరోధికారణాంతరములు లేనప్పుడు అన్వయించునని తెలుసుకోవలయును కారణమేమనగా ఇంతకు ముందు చెప్పబడిన, అశన, అశిత, ఉపయోక్తులు ప్రశస్తములై ప్రకృతి కరణాది గుణ సంపన్నములైనప్పటికిని కాలవిపర్యాయ ప్రజ్ఞాపరాధ అసాత్మ్య శబ్దస్పర్శ రూపరస గంధ వికరణముల వలన ఆహార జన్యబలాది విరోధకములుగా పరిణమించును సూ 28 అధ్యాయమున గూడా ఇదే విషయము "సంతిహిబ్రుతేఽప్యహితాహార జన్యారోగ ప్రకృతయః" అని చెప్పబడినది అందువలన ప్రకృత్యాది గుణయుక్తమై మాత్రాప్రమాణమున గ్రహించబడిన ఆహారము అవశ్యముగా బలాది హేతుకమగు నని మాత్రావత్యాహారమును ప్రశంసించుటకు అవశ్యమను పదము చెప్పబడినది

సుఖాయువనగా సుఖయుక్తమైన ఆయువని అర్థము లేక సుఖము ఆయువు అని కూడా చెప్పవచ్చును

(భవంతి చాత్ర)

మూ॥ గురుపిష్టమయం తస్మాత్తణ్డులాన్ పృథుకానపి। నజాతు భుక్తవాన్ ఖాదేన్మాత్రాం ఖాదేద్బుభుక్షితః॥ 9

తాత్పర్యము భుజించి వెంటనే, గురుగుణము గల గోధుమ పిండితో చేయబడిన

పదార్థములు బియ్యపుపిండితో చేయబడిన పదార్థములు, అటుకులు వీనిని ఎప్పుడును సేవింపకూడదు ఆకలి కలిగినపుడు మాత్రము దీనిని తగు పరిమితిగా సేవింప వచ్చును

**చ పా వ్యా ఆం అ** : తంత్రకారుల యొక్క పద్ధతి ఏమనగా మొదట చెప్పబడిన విషయమును సంక్షిప్తముగా శ్లోకరూపమున చెప్పదలచినపుడు భవంతి చాత్ర అని చెప్పెదరు పిండితో చేయబడిన వాటిని పిష్టమయములందురు తస్మాత్ అనగా గురువులగుట వలన అని అర్థము పృథుకములనగా అటుకులు, నజాతు అనగా ఎప్పుడు అని అర్థము మాత్రం ఖాదేత్ అనగా అనపాయకరమైన పరిమాణము దానిని తీసుకొనెను

మూ॥ వల్లూరం శుష్కశాకాని శాలూకాని బిసానిచ। నాభ్యసేద్గౌరవాన్మాం సం కృశం నైవోపజయేత్॥ కూర్చికాంశ్చ కిలాటాశ్చ శౌకరం గవ్యమాహిషే। మత్స్యాన్దధి చ మాషాంశ్చ యవకాంశ్చ నశీలయేత్॥ 10-11

తాత్పర్యము ఎండింపబడిన మాంసము, ఎండింపబడిన కూరలు తామర దుంప,తామర తూండ్లు ఇవి గురుగుణము కలవగుటవలన వీనిని అభ్యసింపకూడదు మరియు కృశించియుండు వాని యొక్క మాంసము కూర్చికము కిలాటము పంది మాంసము గోమాంసము గేదెమాంసము చేపలు పెరుగు మినుములు యవకమనెడి శూక ధాన్యము వీనిని అభ్యసింపకూడదు

చ పా.వ్యా ఆం అ వల్లూరం = శుష్కమాంసము వరుసగా ఉపయోగించ కూడదు వాడకూడదనుటకు కారణమును చెప్పుచున్నాడు "గౌరవాత్" అనగా గురు గుణములగుట వలన అనుదానితో చెప్పుచున్నాడు మాంసంకృశమ్ అనగా రోగాదుల వలన కృశించిన జంతువుల మాంసము అని అర్థము ఇది అపథ్యమగుట వలననే నిషేధింపబడినది గాని గురుత్వ గుణము వలన కాదు కూర్చికః పాలతో సమభాగమైన పెరుగు, లేక పక్వమైన మజ్జిగ కిలాటిః = జున్ను, శౌకరం = పంది మాంసము శౌకరముతో కలిపిచెప్పబడుట వలన గవ్యమహిషములు గూడా మాంసములనియే తెలుసుకోవలయును యవకః = శూకధాన్య విశేషము వీటినే "యవకః శూకధాన్యానామపథ్యతమత్వే ప్రకృష్ట తమో భవతి" అనగా శూకధాన్యములందు యవకము అపథ్యతమమైన వాటిలో ఉత్కృష్టమైనదని ఒక అధ్యాయములో చెప్పబడినది

మూ॥ షష్టికాన్‌శాలి ముద్గాంశ్చ సైన్ధవామలకే యవాన్।
ఆన్తరీక్షం పయః సర్పిర్జాఙ్గలం మధు చాభ్యసేత్॥ 12

తాత్పర్యము షష్టికధాన్యము శాలిధాన్యము పెసలు సైంధవ లవణము ఉసిరి కాయలు, యవలు, ఆకాశోదకము పాలు నెయ్యి జాంగల మాంసము తేనె వీనిని అభ్యసింపవలయును

చ పా వ్యా అం అ షష్టికాన్ అనుసూత్రముతో అభ్యసించదగిన వానిని తెలుపు చున్నాడు రక్తశాలి ధాన్యము తరువాత ప్రధానమైనదగుటచేత షష్ఠికము మొదట చెప్పడినది అంతరిక్షం అంతరిక్ష జలం, పయః = పాలు, జాంగలం జాంగలదేశ జన్యమృగాదుల మాంసము ఈ సూత్రమున సైంధవము నభ్యసించవలెనని చెప్ప డినది అనగా అన్న సంస్కారము కొరకు మాత్రమే తగిన మాత్రలో సైంధవాభ్యాసము చెయ్యవలెనని భావము అందువలననే "త్రీణి ద్రవ్యాణి నాత్యుపయుంజేత పిప్పలీ లవణం క్షారః॥ అనగా పిప్పళ్ళు, లవణము, క్షారము ఈ మూడింటిని ఎక్కువగా ఉపయోగించకూడదు అని వి స్థా 1 వ అధ్యాయమున చెప్పబడిన దానికి విరుద్ధము కాదు అచ్చటి లవణము యొక్క అతి మాత్ర నిషేధించబడినది

మూ॥ తచ్చనిత్యం ప్రయుఞ్జీత స్వాస్థ్యం యేనానువర్తతే।
అజాతానాం వికారాణా మనుత్పత్తికరం చయత్॥ 13

తాత్పర్యము వేనిని సేవించినచో ఆరోగ్యము చెడిపోకుండునో వ్యాధులు కలుగ కుండునో అట్టివానిని ఎల్లప్పుడు సేవింపవలయును

చ పా వ్యా అం అ మాత్రాశీ మొదలగు వాటివలన స్వస్థపరిపాలనోపాయము చెప్ప డినది స్వస్థపరిపాలనా తంత్రమున విపులముగా చెప్పవలసియుండును ఐతే మిక్కిలి వివరణ వలన గ్రంధము అతి విస్తారమగును అసలే చెప్పని ఎడల న్యూనత్వ దోషము కలుగును అందువలన ఈ రెండు విధములైన దోషములను పరిహరించుట కొరకు తచ్చ అను సూత్రముతో స్వస్థపరిపాలనము సూత్ర రూపముగా చెప్పుచున్నాడు

సుష్ఠు నిర్వికారత్వే నావతి తిష్ఠత ఇతి స్వస్థః = అనగా ఏ విధములైన వికారములు లేక బాగుగా నున్నవాడు స్వస్థుడనబడును స్వస్థ భావమును స్వాస్థ మందురు ఉద్వేజకములైన ధాతు వైషమ్యము ధాతు సామ్యత స్వాస్థ్య మనబడును ఇట్టి స్వాస్థ్యమును పరిరక్షించుకొను ఉపాయములు రెండు 1) ఎల్లప్పుడు క్షీణించు శరీరమును విశుద్ధములైన ఆహార ఆచారముల సేవన 2) శరీరహానికారకములను

విడిచిపెట్టుట ఉదా నూనెను పోయుట ద్వారా దీపము పోషింపడి రక్షింపబడును అట్లే దీపమునకు హాని కల్గించు మిడతలను గాని తొలగించుట వలన కూడా దీప రక్షణ జరుగును శరీర హానికారక కారణములు రెండు విధములు అవి 1) బుద్ధిదోషము వలన చేయు వాతాది దోష కారణములైన విషమ శరీర న్యాసము మొదలగునవి రెండవది దుష్పరిహారమైన హేమంతాది కఫభయాదులను గల్గించు కాల విశేషము ఈ రెండింటిలో స్వాస్థ్యపోషకమును పూర్వార్థములోను ఉత్తరార్థమున "అజాతానాం" అను దానితో స్వాస్థ్య విఘాత హేతు పరిహారమును చెప్పినాడు పుట్టని వికారములకు పుట్టక లేకుండుట స్వభావసిద్ధమైయున్నది వికారములు అదివరకు పుట్టియున్న ఎడల అనుత్పత్తికర చికిత్స అనుత్పత్తికరమును ముఖ్యార్థము నివ్వదు ఐనప్పటికి వికారహేతు పరిహారము దుష్పరిహారములైన కాల విశేషజన్యములైన దోష హరణములు రెండు వికారానుత్పత్తికి ముఖ్య కారణములు అందువలననే "మాధవ ప్రథమేమాసి నభస్య ప్రథమోపునః సహస్య ప్రథమే చైవ హారయేద్దోషసంచయమ్" అని సూ అ '7' న చెప్పబడినది మరియు కారణాంతముల అపేక్ష లేకుండ పుట్టునటువంటి చక్షుః శ్లేష్మను హరించుటకు ఉపయోగించు అంజనము మొదలగునవి కూడా అజాత వికారములకు అనువృత్తి కరములు

మూ॥ అత ఊర్ధ్వం శరీరస్య కార్యమక్ష్యఞ్జనాదికమ్ ।
స్వస్థ వృత్తమభి ప్రేత్య గుణతః సంప్రవక్ష్యతే॥ 14

తాత్పర్యము ఆరోగ్యమును రక్షించు నిమిత్తము శరీరమునకు హితకరమైన నేత్రాంజనము మొదలగునవి గుణములతో చెప్పబడుచున్నవి

చ పా వ్యా ఆం అ అత ఊర్ధ్వ అతః స్వాస్థ్యానువృత్తి కారణములను చెప్పిన పిదప,కార్యం అవశ్యముగా చేయదగిన కార్యము స్వస్థా చరణమునుద్దేశించి స్వస్థ వృత్తానుష్ఠానమున అక్ష్యంజనాదులు తప్పనిసరిగా చేయవలెనని అర్థము అంజన శబ్దము అభ్యంగమును గూడా బోధించును గాన అక్ష్యంజనమని చెప్పబడినది "చక్షుః ప్రధానాం సర్వేషామింద్రియాణాం విదుర్బుధాః। ఘననీహారయుక్తానాం జ్యోతిషామివ భాస్కరః" అనగా నక్షత్రములలో సూర్యుడివలె ఇంద్రియములన్నింటిలో నేత్రము ప్రధానమైనదిన చెప్పబడును కావున ప్రధానమైన నేత్రరక్షణకు ఉపయోగించు అంజనము మొదట చెప్పబడినది లేక స్వస్థవృత్త ప్రకరణమున అంజనము చెప్పబడినదని అర్థము రోగములందు చెప్పబడు అంజనము ఆయా రోగ చికిత్సలలో చెప్పబడును అంజనము రోగహరమైనదైనప్పటికిని సాధారణముగా స్వస్థవృత్తమునకు

సంబంధించినది గాన స్వస్థాచరణమున చెప్పబడినది

మూ। సౌవీర మఞ్జనం నిత్యం హిత మక్ష్ణోః ప్రయోజయేత్।

పఞ్చరాత్రేష్ట రాత్రే వా స్రావణార్థే రసాఞ్జనమ్॥ 15

తాత్పర్యము సౌవీరాంజనమునేత్రములకు హితకరమైనదిగ యుండును అందువలన దానిని ప్రతిదినమును నేత్రముల యందు ప్రయోగింపవలయును నేత్రముల యందలి దుష్టజలము స్రవించిపోవుటకు అయిదు దినములకొకమారు గాని ఎనిమిది దినముల కొకమారుగాని రసాంజనమును నేత్రములయందు ప్రయోగింపవలెను

చ పా వ్యా ఆం అ సౌవీరం = సువీరానది నుండి పుట్టినది, నిత్యం ప్రతిరోజు, అక్ష్ణో అని ద్వివచన ప్రయోగము వలన రెండు కండ్లయందు అంజనము నుపయోగించుట చెప్పబడినది పంచరాత్ర అష్టరాత్రములను గ్రహించుట వలన మిక్కిలి ఎక్కువ తక్కువ కాలము గాకుండా ఉపయోగించవలెనని తెలుసుకోవలయును అందు వలన దోషకాలములను దృష్టియందుంచుకొని ఎక్కువ తక్కువగా స్రావణాంజనమును ఉపయోగించవలెనని అర్థము

మూ॥ చక్షుస్తేజో మయం తస్య విశేషాచ్ఛ్లేష్మలో భయమ్।

తతః శ్లేష్మహరం కర్మ హితం దృష్టే ప్రసాదనమ్॥ 16

దివాతన్న ప్రయోక్తవ్యం నేత్రయోస్తీక్ష్ణ మఞ్జనమ్।

విరేకదుర్బలా దృష్టి రాదిత్యం ప్రాప్య సీదతి॥

తస్మాత్స్రావ్యం నిశాయాంతు ధ్రువమఞ్జనమిష్యతే। 17

తాత్పర్యము నేత్రములు తేజస్వరూపములుగా ఉండును కావున వానికి శ్లేష్మము వలన విశేషముగ భయము కలుగుచుండును అందువలన శ్లేష్మ హరమైన కర్మను చేసినచో నేత్రములకు నైర్మల్యము కలుగును నీరు స్రవించి పోవుటచే దుర్బలముగ నుండు దృష్టికి సూర్యుని వలన బాధ కలుగును కావున పగటియందు తీక్ష్ణమైన అంజనమును నేత్రములందు ప్రయోగింపకూడదు అందువలన స్రవింపజేయు అట్టి అంజనమును రాత్రియందే ప్రయోగింపవలెను

చ పా వ్యా ఆం అ స్రావకాంజన ప్రయోగమును చెప్పుచున్నాడు తేజో భూతాత్మకమైన చక్షురింద్రియమునకు తైజస విరుద్ధమైన ఆప్యమైన శ్లేష్మము వలన వాతపిత్తములకు ఎక్కువగా భయముండును శ్లేష్మమును జయించుటకు స్రావణము ప్రధానమైనది అందువలన స్రావణము చేయించవలయును స్రావణాంజన కాలమును నిర్ణయించు

చున్నాడు నిశాయాం అను వాక్యములో అంజనమును తప్పనిసరిగా రాత్రియందే ఉపయోగించ వలయును అను ప్రకరణము ననుసరించి స్రావణాంజనమును గ్రహించవలయును జతూకర్ణుడు కూడా స్రావణ రసాంజనములను "సప్తాహాద్రసాంజనం నక్తం" అని రాత్రియందే విధించినాడు శాలాక్యమున కూడా 'విరేక దుర్బలా దృష్టిరాదిత్యం ప్రాప్యసీదతి రాత్రౌ స్వప్న గుణాచ్చాక్షి పుష్యత్యంజన కర్ష(ర్శి)తం" అనగా దినమున అంజన ప్రయోగము వలన స్రవించిన నేత్రము సూర్యుని వెలుతురు తాకి దౌర్బల్యమగును రాత్రియందైతే నిద్రించుట వలన అంజనముతో కృశించిన నేత్రము తిరిగి బలమును పొందును అని చెప్పబడినది సౌవీరాంజనము విరేచకము కాదు అది నేత్రప్రసాదమును మాత్రము కల్గించును కావున అది దినమున ఉపయోగించినను విరుద్ధము చేయదు కొందరీ విషయమును ప్రతిరోజు చేయవలసిన అంజనముగా సౌవీరాంజనము చేయదలచినచో దానిని రాత్రి చేయవలయును శ్లేష్మోద్రేక విషయకమైన స్రావణాంజనము వమనము వలె పూర్వాహ్ణమున ఇవ్వవలయునని చెప్పినారు

మూ॥ యథాహి కనకాదీనాం మణీనాం వివిధాత్మనామ్ 18
ధాతునాం నిర్మలాశుద్ధి స్త్రైలచేలక చాదిభిః।
ఏవంనేత్రేషు మర్త్యానామాఙ్జనాశ్చ్యోతనాదిభిః। 19
దృష్టిర్నిరాకులాభాతి నిర్మలే నభసీన్దువత్॥

తాత్పర్యము అనేక విధములైనట్టియు కడుగబడినట్టియు బంగారము మొదలైన వానికిని మణులకును తైలము వస్త్రము కుంచె మొదలగు వానిచే నిర్మలమైన శుద్ధి కలుగు విధమున మనుజులయొక్క నేత్రములకు అంజనము అశ్చ్యోతనము మొదలగు వానిచే నిర్మలమగు శుద్ధికలుగును నిర్మలమైన ఆకాశమునందు చంద్రునివలె నిర్మలమైన నేత్రములయందు దృష్టి అడ్డులేనిదై ప్రకాశించును

చ పా.వ్యా ఆం అ అంజనగుణములను చెప్పుచున్నాడు శుద్ధిః = స్వాభావిక శుద్ధి అది ఆగంతుకమైనధూళి మొదలగు వాటిని తీసివేయుట వలన నిర్మలముగా ప్రకాశించును ఆశ్చ్యోతనం = నేత్రవిరేచనార్థం ఇవ్వబడుద్రవౌషధము అశ్చ్యోతన మిచట చెప్పబడక పోయినను సమాన ఫలమునిచ్చునది గాన చెప్పవచ్చును ఆది శబ్దముతో ఆది శబ్దముతో పుటపాకాదులను గ్రహించవలయును

మూ॥ హరేణుకాం ప్రియఙ్గుంచ పృథ్వీకాం కేశరంనఖమ్॥ 20
హ్రీబేరం చన్దనం పత్రం త్వగేలో శీరపద్మకమ్।

ధ్యామకమ్ మధుకం మాసీరం గగ్గుల్వ గురుశర్కరమ్॥ 21
న్యగ్రోథో దుమ్బరాశ్వత్థప్లక్ష లోధ్రత్వచః శుభాః।

వన్యం స్వర్జరసం ముస్తం శైలేయం కమలోత్పలే॥ 22
శ్రీవేష్టకం శల్లకీంచ శుకబర్హ మథాపిచ।

పిష్ట్వా లిమ్పేచ్ఛరేషీకాం తాంవర్తిం యవసన్నిభామ్॥ 23
అఙ్గుష్ఠ సంమితా కుర్యాదష్టా ఙ్గుల సమాంభిషక్।

శుష్కాం నిగర్భాంతాం వర్తిం ధూమనేత్రార్పితాం నరః 24
స్నేహక్తామగ్ని సంపుష్టాం పిబేత్ప్రాయోగికీం సుఖామ్॥

**తాత్పర్యము** రేణుకలు, ప్రేంఖణము, నల్లజీలకర్ర, నాగకేసరములు నఖపు చిప్పలు,కురువేరు, చందనము, ఆకుపత్రి, దాల్చిన చెక్క, ఏలకులు, వట్టివేళ్ళు, పద్మకాష్ఠము కామంచిపూరి అతిమధురము జటామాంపి మహిషాక్షి గగ్గులు అగురు పంచదార మర్రిపట్ట మేడిపట్ట రావిపట్ట జువ్విపట్ట లొద్దుగపట్టకైవర్తముస్తలు సర్జరసము తుంగముస్తలు రాతిపువ్వు తామరపువ్వు నల్లకలువ సరళ = దేవదారు అందుగు గ్రంథి పర్ణము వీనిని నూరి రెల్లుపూవు యొక్క కాడకు పూసి బొటనవేలంత లావుగాను ఎనిమిది అంగుళముల పొడవుగాను యవగింజవంటి ఆకారముగను వర్తిని చేయ వలయును ఆవర్తి ఎండిన పిమ్మట అందలి కాడను తీసివేసి ఆవర్తికి స్నేహమును పూసి దానిని ధూమపానమునకు ఉపయోగించు గొట్టమునందు ఉంచి ఒకవైపున నిప్పుతో కాల్చి సుఖకరమైన దాని పాగను నిత్యమును పీల్చవలయును

ఇది ప్రాయోగీక ధూమపానమనబడును

**చ పా వ్యా ఆం అ** అంజనము తరువాత ధూమపానము "నావనాంజననిదానాంతే" అనుదానితో చెప్పబడుచున్నది అతః అనగా అంజనానంతరము ధూమపానము చెప్పడుచున్నది శాలాక్యమున గూడా 'తీక్ష్ణాంజనేనాంజితలోచనస్య యః సంప్రదుష్టో ననిరేతి నేత్రాత్ । శ్లేష్మాశిరస్థః సతుపీతమాత్రే ధూమేప్రశాంతింలభతేక్షణేన" అనగా తీక్ష్ణాంజనము ప్రయోగించబడినప్పటికిని మిక్కిలి దుష్టమైన శిరస్సునందుండు కఫము నేత్రముల ద్వారా బయల్వెడలనపుడు ధూమపానము చేసినచో వెంటనే శాంతించు నని చెప్పబడినది, హరేణుకా = రేణుకలు, పృధ్వీకా = నల్లజీలకర్ర, కేశరం = నాగకేసరాలు, పద్మకం = పద్మకాష్ఠము, ధ్యామకం = కామంచిగడ్డి, న్యగ్రోధము మొదలుకొని ప్లక్షము వరకు గల ఓషధులత్వక్కులను గ్రహించవలయును వాటికి

శుభాః అని విశేషణమివ్వబడినది అనగా నవి ఉత్పన్నమైనవని యర్థము

ధూమవర్తి నిర్మాణ విధి పై జెప్పబడిన ఓషధులను మెత్తగా నూరి రెల్లుపువ్వు యొక్క కాడతోచుట్టి 8 అంగుళముల ప్రమాణముగల వర్తిని చేయవలయును దానిని ఎండించి కాడను తీసివేసి స్నేహలిప్తముచేసి ఒక కొనకు నిప్పంటించి చెప్పబోవు ధూమనలికయొక్క ముందు భాగమునందలి రంధ్రముననుంచి ధూమపానము చేయవలయును ప్రాయోగికమనునది నిత్యము ధూమపానము చేయు ధూమవర్తికి పేరు "సుఖామ్" అనగా ఎక్కువ కటు తీక్ష్ణములు లేకుండా అని అర్థము

**మూ॥** వసాఘృత మధూచ్ఛిష్టైయుక్తియుక్తైర్వరౌషధైః॥ **25**

వర్తిం మధురకైః కృత్వా స్నైహికం ధూమమాచరేత్॥

**తాత్పర్యము** శ్రేష్ఠములైన ఓషధులగు జీవనీయ ద్రవ్యములతో వస, ఘృతము, మైనము, వీనిని తగినంత చేర్చి వర్తినిచేసి ధూమపానము చేయవలయును ఇవి స్నైహికధూమపానమనబడును.

చ పా వ్యా అం అ స్నైహిక ధూమవర్తిని వసా అను దానితో చెప్పుచున్నాడు మధూచ్ఛిష్టం = మైనము, ఉత్కృష్టములైన జీవక ఋషభకాది ద్రవ్యములు, యుక్తియుక్తైః అనగా వసాదులను గ్రహించినపుడు వర్తి నిర్మాణము చేయవచ్చునట్లుగా వాటిని గ్రహించవలయును వర్తి నిర్మాణము పూర్వము చెప్పబడినట్లుగానే, స్నైహికీ = స్నేహమును గలిగించునది.

**మూ।** శ్వేతా జ్యోతష్మతీచైవహరతాలం మనః శిలా **26**

గంధాశ్చాగురుపత్రాద్యాధూమం మూర్ధ విరేచనే॥

తాత్పర్యము తెల్లదింటెన, మాల్కంగిని, హరిదళము, మణిశిల, అగురు ఆకుపత్రి మొదలగు సుగంధ ద్రవ్యములు వీనిని వర్తిగా చేసి ధూమపానము చేయవలయును ఇది శిరోవిరేచన ధూమపానమనబడును

చ పా వ్యా అం అ వైరేచనిక ధూమవర్తిని తెలుపుచున్నాడు శ్వేతా = అపరాజిత, గంధాః = సుగంధ ద్రవ్యములు (అగురు, జాపత్రి మొదలగునవి) ఇవి చికిత్సా స్థానమున అ 3 జ్వర ప్రకరణమున చెప్పబడునవి గ్రహించవలయును ఇచట శ్లోకమున పత్రాద్యా అని చెప్పబడినదిగాని అగుర్వాద్యా అని చెప్పబడలేదు కారణమేమనగా అగుర్వాదులలో గల కుష్ఠ తగరములు మిక్కిలి తీక్ష్ణమైనవగుట వలన మస్తులుంగ స్రావమును గల్గించును కావున అగుర్వాద్యా అని చెప్పక పత్రాద్యా

అని చెప్పబడినది అందువలననే త్రిమర్మీయమున "ధూమవర్తిం పిబేద్గంధైరకుష్ఠ తగరో ద్భవైః" అనగా కుష్ఠ తగరములను వదలి మిగిలిన సుగంధ ద్రవ్యములతో చేయబడిన ధూమమును పానము చేయవలెనని చెప్పబడినది శాలాక్యమున గూడా "నతకుష్ఠే స్రావయతో ధూమవర్తి ప్రయోజితే మస్తులుంగం విశేషేణ తస్మాత్తేనైవ యోజయేత్" అనగా కుష్ఠ తగరములతో చేయబడిన ధూమవర్తిని ప్రయోగించిన విశేషముగా మస్తులుంగమును స్రవింపజేయును అందువలన ధూమపానమున వీటినుపయోగించరాదని చెప్పబడినది సు చి 40వ అధ్యాయమున గూడా ఏలాదినా తగరకుష్ఠ వర్జ్యేన అనగా తగర కుష్ఠములను తీసివేసి ఏలాది గణ ద్రవ్యనిర్మితమైన ధూమవర్తినివ్వవలెనని చెప్పబడినది (26)

మూ॥ గౌరవం శిరసః శూలం పీనసార్ధావభేదకౌ॥ 27
కర్ణాక్షిశూలం కాసశ్చ హిక్కాశ్వాసౌ గలగ్రహః।
దంతదౌర్బల్యమాస్రావః శ్రోత్రఘ్రాణాక్షి దోషజః 28
పూతి ఘ్రాణాస్య గంధశ్చ దంతశూలమరోచకః।
హనుమన్యాగ్రహః కండూః క్రిమయః పాండుతాముఖే ॥ 29
శ్లేష్మప్రసేకోవైస్వర్యం గల శుండ్యుపజిహ్వికా।
ఖాలిత్యం పింజరత్వంచ కేశానాంపతనం తథా॥ 30
క్షవథుశ్చాతి తంద్రాచ బుద్ధేర్మోహోఽతి నిద్రతా।
ధూమపానాత్ ప్రశ్యంతి బలంభవతి చాధికమ్॥ 31
శిరోరుహకపాలానామింద్రియాణాం స్వరస్యచ।
నచవాతకఫాత్మానో బలినోఽప్యూర్ధ్వ జత్రుజాః॥ 32
ధూమవక్త్రకపానస్య వ్యాధయః స్యుః శిరోగతాః।

తాత్పర్యము ధూమపానము చేయుట వలన శిరస్సు బరువుగ నుండుట శిరశ్శూల, పడిశము, పార్శ్వపునొప్పి, కర్ణశూల, నేత్రశూల, దగ్గు, ఎక్కిళ్ళు, కంఠముబిగపట్టుట, దంతములు దుర్బలములుగ నుండుట, చెవుల నుండి చీముకారుట, ముక్కులనుండి నీరుగారుట, నేత్రములనుండి నీరుగారుట, ముక్కునందలి దుర్గంధము, నోటియందలి దుర్గంధము, దంతశూల, అరోచకము,హనుగ్రహము, మన్యాగ్రహము, దురద, క్రిములు, ముఖము తెల్లబడుట, శ్లేష్మప్రసేకము (జొల్లుగారుట) స్వరభేదము గల శుండిక, ఉపజిహ్వక, బట్టతల, వెంట్రుకలు పింజర వర్ణముగా నగుట, వెంట్రుకలు ఊడిపోవుట,

తుమ్ముట, అధికమగు పాలు మాలిక, మోహము, అధిక నిద్ర ఇవి నశించును మరియు వెంట్రుకలు శిరస్సునందలి ఎముకలు ఇంద్రియములు స్వరము వీనికి అధికమగు బలము కల్గును వాత కఫముల వలన పుట్టునట్టియు బలవంతము లైనట్టియు ఊర్ధ్వ జత్రుగతములైనట్టియు శిరోగతములైనట్టియు వ్యాధులు కలుగ నేరవు

చ పా వ్యా అం అ ధూమపాన గుణములను చెప్పుచున్నాడు శిరోరుహః = వెంట్రుకలు, శిరః కపాలములు బలిన్యోఽపి = బలవత్కారణములైనప్పటికిని ఊర్ధ్వ జత్రూత్వము - చేతనే శిరోగతములు బోధింపబడినప్పటికిని తిరిగి శిరోగతములని చెప్పుట వలన వాటికి గల విశేషముగా శిరోరోగములు నశించునని భావము

మూ। ప్రయోగపానే తస్యాష్టౌకాలాః సంపరికీర్తితాః 33
వాతశ్లేష్మ సముత్క్లేశః కాలేష్వేషు హి లక్ష్యతే।

స్నాత్వా భుక్త్వా సముల్లిఖ్య క్షుత్వా దన్తాన్నిఘృష్యచ॥ 34
నావనా జ్జన నిద్రాన్తే చాత్మవాన్ ధూమపో భవేత్।

తథా వాతకఫాత్మానోన భవన్త్యూర్ధ్వ జత్రుజాః। 35
రోగాస్తస్యతు పేయాః స్యురా పానా స్త్రి స్త్రయ స్త్రయః॥

తాత్పర్యము స్నానము చేసిన పిమ్మట, భుజించిన పిమ్మట, వమనమైన పిమ్మట, తుమ్మినపిమ్మట, దంతధావనము చేసిన పిమ్మట, నస్యకర్మ చేసిన పిమ్మట, అంజనమును వేసిన పిమ్మట, నిద్రనుండి లేచిన పిమ్మట ఈ ఎనిమిది కాలముల యందు వాతశ్లేష్మములు ఉత్క్లేశము నొంది యుండును గావున ప్రాయౌగిక ధూమపానమును చేయవలయును అట్లు చేసినచో వాత కఫముల వలన పుట్టు నట్టియు ఊర్ధ్వ జత్రుగతములైనట్టియు వ్యాధులు కల్గనేరవు ఒక్కొక్క ధూమపాన కాలమునందు మూడు పర్యాయములు ధూమపానము చేయ వలయును ఒక్కొక్క పర్యాయమునందు మూడేసి మారులు పీల్చి విడిచి పెట్టవలయును ధూమపాన కాలమును తెలియజేయు చున్నాడు

చ పా వ్యా అం అ ప్రాయౌగిక ధూమపానమునకు ఎనిమిది కాలములు, స్నైహికధూమపానమునకు మాత్రమే వాతవృధ్ధ్యుపలక్షిత కాలము వైరేచన ధూమపానమునకు శ్లేష్మవృధ్ధ్యుపలక్షిత కాలమును ధూమపాన కాలముగా తెలుసుకోవలయును స్వస్థవృత్త ప్రకరణమున ప్రాయోగిక ధూమపానమే ప్రాయికమైనది

గాన ఇచట ప్రాయోగిక ధూమపాన కాలములే చెప్పబడుచున్నవి లేక ఎల్లప్పుడు చేయునవి స్వాస్థ్యము కొరకే కావున స్వస్థవృత్త ప్రకరణమున చెప్పడినవి కావున ఈ మూడింటికి ఈ కాలములు వర్తించునని భావము వాత కఫాత్మ శబ్దముతో వాతాత్మ, కఫాత్మ, వాత కఫాత్మ అని గ్రహించవలయును స్నానము, భోజనము, వ్రాయుట, తుమ్ము, దంతధావనము, నస్యకర్మ **అంజనకర్మ,** నిద్ర ఈ ఎనిమిది ధూమపాన కాలములుగా చెప్పబడినవి ఒక్కొక్క **కాలమున 33** పర్యాయములు ధూమమును గ్రహించి విడువ వలయును **ఈ విధంఉగా 3సార్లు** చేయవలయును అనగా 3 ఆవృతాలు ఒక్కొక్క కాలమున చేయవలయును

మూ। పరంద్వికాల పాయీ స్యాదహ్నః కాలేషు బుద్ధిమాన్। 36
ప్రయోగే, స్నైహికే త్వేకం వైరేచ్యం త్రిచతుః పిచేత్
హృత్కణ్ఠేన్ద్రియ సంశుద్ధిర్లఘుత్వం శిరసః శమః। 37
**యధేరి తానామ్ దోషాణాం సమ్యక్ పీతస్య లక్షణమ్॥**

**తాత్పర్యము** బుద్ధిమంతుడగు వాడు ఒక రోజునందు ప్రాయోగిక ధూమ పానమును రెండు మారులు చేయవలయును స్నైహిక ధూమ పానమునైనచో ఒక్క మారును, శిరో విరేచన ధూమపానమైనచో మూడు లేక నాలుగు మారులును చేయవలయును హృదయము కంఠము ఇంద్రియములు ఇవి శుద్ధినొందుట, శిరోలఘుత్వము కలుగుట, పైన చెప్పబడిన దోషములు శమించుట ఇవి ధూమపానము యొక్క సమ్యగ్యోగ లక్షణములుగ నుండును

చ పా వ్యా అం అ చెప్పబడిన ఎనిమిది కాలములలో ఒక్కొక్క దినమున ఏ విధమైన ధూమము, ఎంత కాలము తీసుకోవలయునను విషయమును 'పరం' అను దానితో చెప్పుచున్నాడు కాలము లనగా స్నానాదుల అనంతర కాలమునందు ప్రయోగౌ = ప్రాయోగిక ధూమమునందు 8 కాలములు స్నేహిక ధూమము దినమున కొకసారి వైరేచనికము 3-4 మార్లు దోషబలాపేక్ష ననుసరించి సేవించవలయును

మూ॥ బాధిర్య మాన్ధ్య మూకత్వం రక్త పిత్తం శిరో భ్రమమ్॥ 38
అకాలే చాతిపీతశ్చ ధూమః కుర్యాదుపద్రవాన్।
తత్రేష్టం సర్పిషః పానం నావనాఞ్జన తర్పణమ్॥ 39
స్నైహికం ధూమజేదోషే వాయుః పిత్తానుగోయది।

శీతం తు రక్త పిత్తే స్యా చ్ఛ్లేష్మ పిత్తేవిరూక్షణమ్॥ 40

**తాత్పర్యము** అకాలమునందుకాని, అధికముగ కాని ధూమపానమును చేసినచో చెముడు గ్రుడ్డితనము, మూగతనము, రక్తపిత్తము, తల తిరుగుట యనెడి ఉపద్రవములు కల్గును ధూమపానము యొక్క అసమ్యగ్యోగము వలన కలిగిన దోషమునందు వాతము పిత్తముతోకూడి వృద్ధి నందినచో ఘృత పానమును చేయించవలయును మరియు స్నేహయుక్తమైన నస్యకర్మ అంజనము తర్పణము వీనిని కఫపిత్తములు వృద్ధినందినచో రూక్షములైన నస్యకర్మ అంజనము తర్పణము వీనిని చేయింపవలయును

చ పా వ్యా అం అ ధూమజ మనగా విధి ప్రయుక్తముగాని ధూమపానము వలన వాయువు పిత్తానుగమై ప్రకోపించినచో స్నైహికములైన నావన అంజన, తర్పణములను చేయవలయును రక్తపిత్తమున శీతల ద్రవ్యకృతమైన నావన అభ్యంజన, తర్పణములు, శ్లేష్మ పిత్తమున విరూక్షణమైన నావన - అంజన - తర్పణములను ప్రయోగించ వలయును

మూ॥ పరం తత్వ ప్రవక్ష్యామి ధూమో యేషాం విగర్హితః।
సవిరిక్తః పిచౌద్ధూమం న కృతే వస్తికర్మణి॥ 41
నరక్తి న విషేణార్తో నశోచన్నచ గర్భిణీ।
న శ్రమే న మదే నామే న పిత్తే న ప్రజాగరే॥ 42
న మూర్ఛాభ్రమ తృష్ణాసు నక్షీణే నాపి చక్షతే।
న మద్యదుగ్ధే పీత్వా చ న స్నేహం న చ మాక్షికమ్॥ 43
ధూమం న భుక్త్వ దధ్నా చ న రూక్షః క్రుద్ధ ఏవ చ।
న తాలుశోషే తిమిరే శిరస్యభిహతే నచ॥ 44
న శఙ్ఖకే నరోహిణ్యాం న మేహే న మదాత్యమే।
ఏషు ధూ మకాలేషు మోహాత్పిబతి యో నరః।
రోగాస్తస్య ప్రవర్ధన్తే దారుణా ధూమ విభ్రమాత్॥

**తాత్పర్యము** ఎవరికి ధూమ పానము తగియుండదో వారు చెప్పబడుచున్నారు విరేచనౌషధమును సేవించిన వాడు, వస్తికర్మను సేవించినవాడు, విషముచే పీడింపబడుచున్నవాడు, దుఃఖముకలవాడు, గర్భిణీ స్త్రీ, శ్రమపడిన వాడు,

మత్తుకలవాడు, ఆమదోషము కలవాడు, పిత్తదోషము కలవాడు, నిదుర మేల్కొనిన వాడు, మూర్ఛకలవాడు, భ్రమకలవాడు, దప్పిక కలవాడు, క్షీణించిన వాడు, గాయముకలవాడు, మద్యపానము చేసినవాడు, పాలు త్రాగినవాడు, స్నేహపానము చేసిన వాడు, తేనె త్రాగిన వాడు, పెరుగుతో అన్నమును భుజించిన వాడు, రూక్ష శరీరము కలవాడు, కోపగించినవాడు, తాలు శోషము కలవాడు, తిమిర వ్యాధి కలవాడు, శిరస్సునందు దెబ్బ తగిలినవాడు, శంఖక మనెడి వ్యాధి కలవాడు, రోహిణి యనెడి వ్యాధి గలవాడు, ప్రమేహవ్యాధి కలవాడు, మదాత్యయము కలవాడు వీరు ధూమపానము చేయతగని వారుగ నుందురు ఇట్టివారు అజ్ఞానము వలన ధూమపానమును చేసినచో ధూమము యొక్క దోషము వలన వారి యొక్క దారుణమైన రోగములు వృద్ధినొందును

చ పా వ్యా ఆం అ  నవిరిక్తః అను మొదలగు చోట్ల ప్రతిశబ్దము చివర న కారము చెప్పబడుట వలన ఆ నిషేధమునకు గల ప్రాధాన్య తెలియుచున్నది అనగా ఆయా సందర్భములలో అసలే చేయరాదని భావము శ్లోకమున భోజనము తరువాత నిషేధింపబడి, తిరిగి దధి భోజనము చేసిన తరువాత అని చెప్పుట వలన దధి భోజనము చేసిన వానికి మిక్కిలి నిషేధమని తెలుసుకో వలయును.

మూ॥ ధూమయోగ్యః పిభేద్దోషే శిరోఘ్రాణాక్షి సంశ్రయే॥ 46
ఘ్రాణేనా స్యేన కణ్ఠ స్థే, ముఖేన ఘ్రాణపో వమేత్,
ఆస్యేన ధూమ కవలాన్ పిబన్ ఘ్రాణేన నోద్గమేత్॥ 47
ప్రతిలోమం గతో హ్యాశుధూమో హింస్యాద్ధి చక్షుషీ,

తాత్పర్యము  ధూమ పానమునకు అర్హుడైన వాడు దోషము శిరస్సును ముక్కును నేత్రములను ఆక్రమించి యున్నచో ముక్కుతోడను, కంఠము నాశ్రయించి యున్నచో నోటితోడను ధూమపానము చేయవలయును ముక్కుతో పానము చేసినవాడు ఆ ధూమమును నోటితో విడిచి పెటకూడదు నోటితో పానము చేసిన వాడు ఆ ధూమమును ముక్కుతో విడిచిపెట్టవలయును ముక్కుతో విడిచిపెట్టినచో ఆ ధూమము ప్రతిలోమగతిని పొంది వెంటనే నేత్రములకు బాధను కలిగించును

చ పా వ్యా ఆం అ  శిరస్సు, నాసిక మరియు నేత్రములందు దోషములున్నపుడు ధూమపాన యోగ్యుడైన పురుషుడు నాసికతో ధూమపానము చేయవలయును దోషములు కంఠమునందున్నపుడు నోటితో ధూమపానము చేయవలయును నాసిక

నుండి ధూమపానము చేసినపుడు ధూమకబలము ను ముఖుము నుండే వదల వలయును అట్లే ముఖము నుండి ధూమము గ్రహించినపుడు కూడా ముఖము నుండే వదల వలయును గాని నాసిక నుండి వదల కూడదు అట్లు చేసిన అనగా ముఖము నుండి ధూమ కవలములను గ్రహించి నాసిక నుండి వదలుట వలన ధూమము ప్రతిలోమ గతిని పొంది నేత్రములను చేరి వాటిని నశింపజేయును

మూ॥ ఋజ్వఙ్గ చక్షుస్తచ్చేతాః సూపవిష్టస్త్రిపర్యయమ్। 48
పిబౌచ్ఛిద్రం పిధాయైకం నాసయా ధూమమాత్మవాన్॥

**తాత్పర్యము** · బుద్ధిమంతుడగు వాడు ముక్కుతో ధూమపానమును చేయునప్పుడు శరీరము నేత్రములు వీనిని సరిగ నుంచుకొనిన వాడుగను తదేక ధ్యానము కలవాడుగను సరిగ కూర్చొనిన వాడుగనునై ముక్కు యొక్క యొక రంధ్రమును మూసికొని రెండవ రంధ్రముతో ధూమమును మూడు మారులు పీల్చవలయును

**చ పా వ్యా ఆం అ** ధూమయోగ్య పురుషుడు శరీర అంగప్రత్యంగములను, నేత్రములను ఋజువుగా నుంచి ధూమపానమునందే మనసునుంచి, చక్కగ కూర్చుని నాసిక యొక్క ఒక రంధ్రమును మూసుకొని మూడు ఆవృత్తులు నాసికతో ధూమపానము చేయవలయును మూడు ఆవృత్తులు ధూమపానము చేయవలెనని పూర్వము చెప్పబడినప్పటికిని తిరిగి ఇచట చెప్పుట వలన ప్రారంభము వరకు మాత్రమే గాక మూడు ఆవృత్తులగు వరకు అంగప్రత్యంగములు, నేత్రములు ఋజువుగా నుంచి ధూమపానము చేయ వలయునని చెప్పుటకు తిరిగి త్రిపర్యాయములని చెప్పబడినది నాసికతో మాత్రమే ధూమ పానము చేయవలెనని నియమము లేదు

మూ॥ చతుర్వింశతికం నేత్రం స్వాఙ్గులేభిర్వి రేచనే॥ 49
ద్వా త్రింశదఙ్గులం స్నేహే ప్రయోగేఽధ్యర్ధ మిష్యతే॥
ఋజు త్రికోషాఫలితం కోలాస్థ్యగ్ర ప్రమాణితమ్। 50
వస్తినేత్ర సమద్రవ్యం ధూమనేత్రం ప్రశస్యతే॥

**తాత్పర్యము** ధూమపానము నిమిత్తముపయోగించు గొట్టము - శిరోవిరేచన ధూమపానమున కైనచో రోగి యొక్క అంగుళముతో 24 అంగుళముల పొడవుగను, స్నైహిక ధూమపానమున కైనచో ముప్పది రెండంగుళముల పొడవుగను, ప్రాయోగిక ధూమపానమునకైనచో ముప్పదియారు అంగుళముల పొడవుగను నుండవలయును మరియు వంకరలేనిదిగను వస్తి నేత్రమును తయారు చేయుట కుపయోగించు

ద్రవ్యములతో తయారు చేయబడినదిగను నుండవలయును

చ పా వ్యా ఆం అ ధూమనేత్ర ప్రమాణము - నేత్రమనగా నళిక (గొట్టము) వైరేచనిక ధూమపానమునకు ఉపయోగించు నళిక ధూమపానము చేయు వ్యక్తి యొక్క అంగుళితో 24 అంగుళముల ప్రమాణము వుండవలయును స్నైహిక ధూమపానమునకు 32 అంగుళముల ప్రమాణము, ప్రామౌణిక ధూమపానమునకు వైరేచనమునకు 1 1/2 రెట్లు అనగా ముప్పదియారు అంగుళి ప్రమాణము, జతూకర్ణుని మతము ననుసరించి యుండవలయును దీనిని గూర్చి జతూకర్ణుడు "సార్ధ స్త్ర్యంశ యుతః పుర్ణోహస్నః ప్రాయోగికాదిషు।" అని చెప్పినాడు ధూమ నేత్రము 3 పర్వములలో భిన్నమై యుండవలయును

మూ॥ దూరాద్వినిర్గతః పర్వచ్ఛిన్నో నాడీ త నూకృతః ॥ 51

నేన్ద్రియం బాధతే ధూమో మాత్రా కాల నిషేవితః॥

తాత్పర్యము దూరము నుండి బయలు వెడలునట్టియు కణుపులచే అడ్డగింపబడునట్టియు గొట్టముచే సూక్ష్మముగ చేయబడునట్టియు మాత్ర కాలము వీని ననుసరించి సేవింపబడునట్టియు ధూమము ఇంద్రియమును బాధింపనేరదు

చ పా వ్యా ఆం అ పై చెప్పబడినట్లుగా యున్న నళికతో ధూమపానము చేయుట వలన గలుగు గుణములను దూరాత్ అను శ్లోకముతో తెల్పుచున్నాడు మాత్రా కాలముల ననుసరించి పైన చెప్పబడిన నళిక ద్వార చేయబడిన ధూమపానము ముఖమునకు దూరము నుండి వచ్చుచు మూడు పర్వములందు తాకి వేగము తగ్గుటవలన ధూమ నేత్రము నందు క్రమముగా పలుచబడి సేవించు వాని ఇంద్రియములకే విధమైన బాధను కలిగించదు

మూ॥ యదా చోరశ్చ కణ్ఠశ్చ శిరశ్చ లఘుతాం వ్రజేత్। 52

కఫశ్చ తనుతాం ప్రాప్తః సుపీతం ధూమ మాదిశేత్ ॥

అవిశుద్ధః స్వరోయస్య కంఠశ్చ సకఫోభవేత్। 53

స్తిమితో మస్తకశ్చైవ మపీతం ధూమ మాదిశేత్।

తాలు మూర్ధచ కణ్ఠశ్చ శుష్యతే పరితప్యతే॥ 54

తృష్యతే ముహ్యతే జన్తూ రక్తం చ స్రవతేఽ ధికమ్।

శిరశ్చ భ్రమతేఽ త్యర్థం మూర్ఛా చాప్యోప జాయతే। 55

ఇన్ద్రియాణ్యుపతప్యన్తే ధూమేఽ త్యర్థం నిషేవితే॥

తాత్పర్యము వక్షః స్థలము కంఠము శిరస్సు ఇవి లఘుత్వమును పొందుట, కఫము క్షీణించుట, ఈ లక్షణములు కలిగినచో ధూమము సరిగ పానము చేయబడినదని తెలిసికొనవలయును స్వరము అవిశుద్ధముగా నుండుట, కంఠము కఫముతో కూడి యుండుట శిరస్సు బరువుగా నుండుట ఈ లక్షణములు కలిగినచో ధూమము సరిగా పానము చేయబడలేదని తెలిసికొనవలయును తాలు ప్రదేశము శిరస్సు కంఠము ఇవి ఎండుట తాపమును బొందుట, దప్పికను బొందుట, మోహము నొందుట, రక్తము అధికముగా స్రవించుట, తల అధికముగా తిరుగుట, మూర్ఛకలుగుట ఇంద్రియములు తపింపబడుట ఈ లక్షణములు కలిగినచో ధూమము అధికముగ పానము చేయబడినదని తెలిసికొనవలయును

చ పా వ్యా ఆం అ ధూమపాన సమ్యక్, అయోగ, అతియోగ లక్షణములు - యదాచోరశ్చ అనునవి సమ్యక్ పాన లక్షణములు అవిశుద్ధ మొ॥ అయోగ లక్షణములు తాలు మొ॥ అతియోగ లక్షణములు

సమ్యక్ యోగలక్షణములు - ధూమపానము చేసిన తరువాత ఉరః ప్రదేశము కంఠము, శిరస్సులు తేలికయై కఫము తగ్గినచో ధూమపానము సమ్యక్ యోగమని తెలుసుకోవలయును

ధూమపానము చేసినప్పటికిని స్వరశుద్ధి గాకపోవుట కంఠమున కఫము నిండినట్లుండుట, తల బిగబట్టినట్లుండుట ఇవి ధూమపాన అయోగ లక్షణములు తాలు, మూర్ధ, కంఠములు ఎండిపోవుట, తపింపబడుట, దప్పికపి, మోహము, నోటి నుండి రక్తము స్రవించుట, తల తిరుగుట, మూర్ఛగలుగుట, ఇంద్రియ తాపము ఇవి ధూమపాన అతియోగ లక్షణములు

మూ॥ వర్షేవర్షే ఽ ణు తైలం చ కాలేషు త్రిషు నాఽ చరేత్। 56

ప్రావృట్ శరద్వసన్తేషు గతమే ఘే నభస్తలే॥

నస్యకర్మ యథాకాలం యో యథోక్తం నిషేవతే। 57

నతస్య చక్షుర్న ఘ్రాణం నశ్రోత్ర ముప హన్యతే।

నస్యుః శ్వేతా నకపిలాః కేశాః శ్మశ్రూణి వాపునః॥ 58

నచకేశాః ప్రలు ఛ్యన్తే వర్ధన్తే చ విశేషతః।

మన్యాస్తమ్భ శిరః శూల మర్దితం హనుసంగ్రహః ॥
పీనసార్ధావ భేదౌ చ శిరః కమ్పశ్చ శామ్యతి।
సిరాః శిరః కపాలానాం సన్ధయః స్నాయుకణ్డరాః ॥ 60
నావన ప్రీణితాశ్చాస్య లభ్యన్తేఽ భ్యధికం బలమ్।
ముఖం ప్రసన్నోపచితం స్వరః స్నిగ్ధః స్థిరో మహాన్॥
సర్వేంద్రియాణాం వైమల్యం బలం భవతి చాధికమ్।
నచాస్య రోగాః సహసా ప్రభవ న్త్యూర్ధ్వ జత్రుజాః।
జీర్యతశ్చోత్తమాఙ్గే షు జరా న లభతే బలమ్॥

తాత్పర్యము ప్రతి సంవత్సరము నందు ప్రావృడృతువు, శరదృతువు, వసంత ఋతువు అనెడి మూడు కాలములలో ఆకాశము నందు మేఘములు లేనపుడు మనుజుడు అణు తైలమును ఉపయోగింపవలయును ఎవడు నస్యకర్మను చెప్పబడిన విధముగ తగు కాలమునందు సేవించునో అట్టివాని యొక్క నేత్రములు ముక్కు, చెవులు వీనికి బాధ కలుగ నేరదు వెంట్రుకలు, మీసము ఇవి తెల్లగగాని కపిల వర్ణముగ గాని కానేరవు వెంట్రుకలు వుడిపోవును మరియు వృద్ధినొందును. మెడ నరములు బిగియుట, తలనొప్పి, అర్దిత వాతము, అంకిళ్ళు బిగియుట, పడిసెము, పార్శ్వపు నొప్పి, శిరః కంపము ఇవి నశించును శిరస్సంబంధమగు సిరలు సంధులు స్నాయువులు కండరములు ఇవి అధికమగు బలమును పొందును ముఖము నైర్మల్యము నొందును స్వరము స్నిగ్ధముగ, స్థిరముగా, గొప్పదిగ అగును. సమస్తేంద్రియ ములకు నైర్మల్యము బలము ఇవి అధికముగా కలుగును ఊర్ధ్వ జత్రుగతములగు వ్యాధులు శీఘ్రముగా కలుగనేరవు ముసలితనము కలిగినను దాని లక్షణములు శిరస్సునందు కలుగనేరవు

వ పా వ్యా ఆం అ ధూమ నస్యములకు నాసా ద్వారము సమానమగుటచే ధూమా నంతరము నస్యమును చెప్పుచున్నాడు ప్రతి సం॥ వర్షా, శరత్, హేమంతములందు ఆకాశమందు మేఘములు లేనపుడు అణుతైల నస్యమును చేయవలయును కాలానుసారముగా శాస్త్రమున చెప్పబడిన విధి ననుసరించి నస్యకర్మ చేసినచో నేత్రములు ఘ్రాణము, శ్రోత్రములు వికృతి నొందవు తల వెంట్రుకలు, మీసములు తెల్లబడవు పింగళ వర్ణముగావు వెంట్రకలూడిపోక మిక్కిలి వృద్ధినొందును మరియు విధి పూర్వకముగా అణుతైలముతో నస్యకర్మ చేయించుకొన్న మన్యాస్తంభము, శిరః

శూల, అర్దితము, హనుగ్రహము, పీనసము, అర్థావ భేదము, శిరః కంపములు శమించును శిరః కపాలమునందలి సిరలు, స్నాయువులు కండరములు సంధులు అణుతైల నస్యముచే తృప్తములై మిక్కిలి బలమును పొందును ముఖము ప్రసన్నమై ఉపచితమగును స్వరము స్నిగ్ధ, స్థిర, గంభీరమై మొప్పును అన్ని ఇంద్రియములు నిర్మలములై మిక్కిలి బలమును పొందును మరియు ఊర్ధ్వ జత్రుగత రోగములు శీఘ్రముగా ఆక్రమించవు వృద్ధాప్యము వచ్చునప్పటికిని నవృద్ధాప్య లక్షణములుగా కనిపించును

చ పా వ్యా ఆ అ అణూనాం అనగా స్రోతస్సులకు హితమైనది అణుతైల మనబడును ఇది ముందు చెప్పబడును శిరః స్నాయు కండరములు, సంధులు శిరః కపాలమునకు సంబంధించినవే ఉత్తమాంగేషు అనుచోట బహువచన ప్రయోగము శిరస్సునకు గల ప్రాధాన్యతను అనుసరించి, లేదా జరావలీ పలితాది లక్షణములుగల ముసలితనము శిరస్సు మొదలగు అంగములందు బలమును పొందదనియు అర్థము చెప్పుటకై ప్రయోగింపబడినది

మూ॥ చన్దనా గురుణీ పత్రం దార్వీత్వఙ్మధుకం బలామ్। 63
ప్రపౌణ్డరీకం సూక్ష్మైలాం విడఙ్గం బిల్వ ముత్పలమ్।
హ్రీ వేరమభయం వన్యం త్వఙ్ముస్తం సారివాం స్థిరామ్॥ 64
సురాహ్వాం పృశ్ని పర్ణీం చ జీవన్తీం చ శతావరీమ్।
హరేణుం బృహతీం వ్యాఘ్రీం సురభీం పద్మ కేశరమ్॥ 65
విపాచయేచ్ఛ తగుణే మాహేన్ద్రే విమలేఽమ్భసి।
తైలాద్దశగుణం శేషం కషాయమవతారయేత్॥ 66
తేన తైలం కషాయేణ దశకృత్వో విపాచయేత్।
అథాస్యదశమే పాకే సమాంశం ఛాగలం పయః। 67
దద్యాదేషోఽణు తైలస్య నావనీయస్య సంవిధిః॥
అస్యమాత్రాం ప్రయుఞ్జీత తైల స్యార్థ పలోన్మితామ్॥ 68
స్నిగ్ధ స్విన్నోత్తమాఙ్గస్య పిచునా నావనైస్త్రిభిః।
త్ర్యహం త్ర్యహాశ్చ సప్తాహమే తత్కర్మ సమాచరేత్॥ 69

నివాతోష్ణ సమాచారో హితాశీ నియతే న్ద్రియః।
తైలమే తత్త్రి దోషఘ్న మిన్ద్రియాణాం బలప్రదమ్।
ప్రయుఞ్జానో యథాకాలం యథోక్తా నశ్ను తే గుణాన్॥

తాత్పర్యము చందనము, అగరు ఆకుపత్రి, మ్రాని పసుపు బెరడు అతిమధురము ముత్తవ పులగము, ప్రపౌండరీకము, సన్న యేలకులు, వాయు విడంగములు, మారేడు, నల్లకలువ, కురువేరు, కరక్కాయ, అడవి తుంగముస్తలు, దాల్చిన చెక్క, తుంగముస్తలు, సుగంధి పాల, ముయ్యాకు పొన్న, దేవదారు, కోలపొన్న, మనుబాల పిల్లిపీచర, రేణుకలు, పెద్దవాకుడు, వాకుడు, తులసి, పద్మకేసరములు వీనిని స్వచ్ఛమైన నూరు రెట్ల వర్షోదకము నందు చేర్చి తైలమును పదిరెట్లు మిగులునట్లుగ కషాయమును కాచవలయును ఆ కషాయముతో తైలమును పదిసారులు కాచవలయును పదియవసారి కాచునప్పుడు అందు తైలమునకు సమముగ మేక పాలను చేర్చి కాచవలయును నస్యకర్మ నిమిత్తముపయోగించు అణుతైలమును ఈ విధముగ తయారు చేయవలయును స్నేహ స్వేదకర్మలు చేయబడిన శిరస్సు కలవారి యొక్క ముక్కునందు అర్ధ ఫల పరిమితికల అణుతైలమును దూదితో మూడు మారులు వేయవలయును ఇట్లు మూడు దినములకొకమారు వేయ వలయును ఈ నస్యకర్మను ఏడు దినములు చేయవలయును నస్యకర్మ నాచరించిన పిమ్మట గాలిలేని ప్రదేశమునందు సంచరించువాడుగను ఉష్ణోపచారములు కలవాడుగను హితమైన యాహారములను సేవించువాడుగను ఇంద్రియ నిగ్రహముకలవాడుగను నున్నచో ఈ అణుతైలము త్రిదోషములను పోగొట్టును మరియు ఇంద్రియములకు బలమును కలిగించును దీనిని తగిన కాలమునందు ప్రయోగించినచో చెప్పబడిన గుణములను పొందును

చ పా వ్యా ఆం అ అణుతైల నిర్మాణ విధి చందనము, అగరు, జాపత్రి,మానుపసుపు, బెరడు, యష్టిమధు, బలా, ప్రపౌండరీకము, చిన్నఏలకులు, వాయు విడంగాలు, బిల్వము, నల్లకలువ, సుగంధిపాలు, వట్టివేళ్ళు, జీవంతి, పృశ్నిపర్ణి,దేవదారు, శతావరి, దాల్చిన చెక్క, తుంగముస్తలు, రేణుకలు, బృహతి ద్వయము, (వాకుడు, ములక) పద్మకేసరములు వీటన్నింటిని తీసుకొని 100 రెట్లు అంతరిక్షజలమున క్వాథ పరిభాషతో కాచి, ఆ క్వాథమును తైలమునకు 10 రెట్లు తీసుకొని వడగట్టి యుంచుకొనవలెను ఆ క్వాథమును 1/10 భాగమును తీసుకొని తైలవిధి ననుసరించి కాచవలయును ఈ విధముగా 9 మార్లు చేయవలయును చివర పదవ మారు తైలమునకు సమానంగా

మేకపాలు కలిపి కావచవలయును ఈ విధముగా కాచిన అణుతైలము నశ్య విధియందు ఉపయోగించవలయును ఈ తైలము 1/2 ఫలము 2 తు॥ ప్రమాణము ఉపయోగించవయును

**అణుతైల ఉపయోగవిధి** మొదట శిరస్సునకు స్నేహస్వేదములు చేసి పిచును 2 తు॥ అణుతైలమున తడిపి రోజు మూడుమార్లు చొప్పున 3 రోజులు దినము విడిచి దినము అనగా ఏడు దినములు నశ్యమును సేవింపవలయును

**చ పా వ్యా ఆం అ** చందనము మొ॥ అనుచోట ద్వార్వ్యిస్త్వక్ = ధార్వీత్వక్, జీవంతీ = సువర్ణనాలా పద్మకేసరములు మహేంద్రే = అంతరిక్షజలమున, శతగుణే = అనగా తైలాదుల కంటె 10 రెట్లు అని తెలుసుకో వలయును దశ గుణము అనునది తైలమునకు 10 రెట్లు అని తెలుసూవలయును ఇచ్చట క్వాథ్వ భేషజము గూడా అనగా క్వాథమును సిద్ధము చేయుటకు ఉపయోగించు జలము భేషజమునకు 4 రెట్లుండవలయును అందుకే "క్వాధ్యచ్ఛతుర్గుణంవారి" అని చెప్పబడినది అంటే భేషజమునకంటె 100 రెట్లు జలమును తీసుకోవలయునని అర్థము చెప్పకూడదు దీనిని గూర్చి జతూకర్ణుడు "పక్వాఽదాంబు ప్రస్థేదశ భాగస్థితేనతు తైల ప్రస్థంపచేత్తేన సంయుతమ్" అనగా 100 ప్రస్థములు నీటిని పోసి 10 భాగములు మిగులునట్లు కాచి తైలము ఒక ప్రస్థము పోసి మేకపాలతో కలిపి తైలపాకము చేయవలయునని చెప్పబడినది లేక తైలపాక విధి ననుసరించి "స్నేహాచ్ఛతుర్గుణం క్వాథ్వం" అను పరిభాషతో క్వాథ్యద్రవ్య పరిమాణమును కల్పించవలయును "పిచునా" అనగా దూది పింజతో నావనైస్త్రిభిః మూడు మార్లు నశ్యకర్మత్త్ర్యహాత్త్ర్యహాత్ అనగా ఒక్కొక్క దినము విడచి ఏడు రోజులు ఒ నగా ప్రతి ఋతువునందు మొత్తము 13 రోజులలో నస్యకర్మ సమాప్తి చేయవలయును

మూ॥ అపోధితాగ్రం ద్వౌకాలౌ కషాయ కటు తిక్తకమ్। 71
భక్షయేద్దన్త పవనం దన్తమాంసాన్య బాధయన్॥
నిహన్తి గన్ధ వైరస్యం, జిహ్వాదన్తా స్యజం మలమ్॥ 72
నిష్కృష్య రుచిమాధత్తే సద్యో దన్త విశోధనమ్।
కరఞ్జకర వీరార్క మాలతీ కకు భాసనాః। 73
శస్యన్తే దన్త పవనే యే చాప్యేవం విధా ద్రుమాః॥
సువర్ణ రూప్య తామ్రాణి త్రపురీతి మయాని చ॥ 74

జిహ్వా నిర్లేఖనాని స్యు రతిక్ష్ణాన్యనృజాని చ।

జిహ్వా మూలగతం యచ్చ మలముచ్ఛ్వా సరోధిచ।

దౌర్గన్ధ్యం భజతే తేన, తస్మాజ్జిహ్వాం వినిర్లిఖేత్॥

తాత్పర్యము వగరుగ గాని కారముగ గాని చేదుగ గాని ఉండు పలుతోము పుడకను గ్రహించి దాని యొక్క చివరి భాగమును నలియగొట్టి నములుచు దంత మాంసములకుబాధకలుగ కుండునట్లుగ ఉదయమునందును సాయంకాలము నందును దంతములను త్రోముకొనవలయును ఈ దంతధావనము నోటియందలి దుర్గంధమును వైరస్యమును పోగొట్టును నాలుక దంతములు నోరు వీనియందలి మలమును తీసివేసి వెంటనే రుచిని కలిగించును కానుగ గన్నేరు జిల్లేడు జాజికాయచెట్టు మద్ది వేగిస వీని యొక్కయు ఇట్టి ఇతరముల యొక్కయు కాష్ఠములు దంతధావన నిమిత్తము ప్రశస్తములుగ నుండును బంగారము, వెండి, రాగి, తగరము ఇత్తడి వీనిలో దేనితోనైనను నాలుక గీచుకొను నిమిత్తము రేకులను చేయింపవలయును ఇవి పదును లేనివిగను,వంపుకలవిగను నుండవలయును నాలుక యొక్క మొదటి భాగము నుండునట్టియు ఉచ్ఛ్వాసము నరికట్టు నట్టియు దౌర్గంధ్యమును కలిగించు నట్టియు మలము నశించుటకై నాలుకను గీచుకొన వలయును

చ పా వ్యా ఆం అ సందర్భము ననుసరించి దంతకాష్టగుణములను ఆపోత్థితా అను దానితో తెలుపుచున్నాడు ద్వికాలౌ సాయంప్రాతః కాలములని దన్తపవనం - దంతములను శుభ్రపరచునది కావున దంత పవన మనబడును దంత పవనమనగా దంత కాష్టాము నిష్కృష్య అనగా మలమును తొలగించి అని అర్థము కకుభః . మద్ది ఏవంవిధా ఈ విదమైన రసములు గలది

మూ। ధార్యాణ్యాస్యేన వైశద్యరుచి సౌగన్ధ్య మిచ్ఛతా॥ 76

జాతి కటుకపూగానాం లవఙ్గస్య ఫలానిచ।

కఙ్కోలక ఫలం పత్రం తామ్బూలస్య శుభం తదా।

తథా కర్పూర నిర్యాసః సూక్ష్మైలాయాః ఫలాని చ॥ 77

తాత్పర్యము నోటియందు నిర్మలత్వమును, రుచిని, సువాసనను కోరిన మనుజునిచే, జాజికాయలు, లతాకస్తూరి, పోకచెక్కలు, లవంగములు, కంకోలములు తమలపాకులు, పచ్చకర్పూరము, సన్నయేలకులు వీనిని నోటియందు ధరింపవలయును

చ పా వ్యా ఆం అ  కటుకం = లతా కస్తూరి, లవంగము అను నపుడు తొడిమ గ్రహించబడినప్పటికి అని ఫలములు గ్రహించుట వలన ఫలములో చేర్చబడి "ఛత్రిణాగచ్ఛంతి" అను న్యాయ ప్రకారము ఫలమని చెప్పబడినది

మూ॥ హన్వోర్బలం స్వరబలం వదనోపచయః పరః।
స్యాత్పరం చరసజ్ఞాన మన్నేచరుచీ రుత్తమా। 78
న చాస్య కంఠశోషః స్యాన్నోయోః స్ఫుటనాద్భయేమే
నచదన్తాః క్షయం యాన్తి దృఢమూలా భవన్తి చ। 79
న శూల్యన్తేన చామ్లేన హృష్యన్తే భక్ష యన్తిచ।
పరానపిఖరాన్ భక్ష్యాన్ తైలగణ్డూష సేవనాత్॥ 80
నిత్యం స్నేహార్ద్ర శిరసః శిరః శూలం న జాయతే॥
న ఖాలిత్యం న పాలిత్యం నకేశాః ప్రపతన్తిచ। 81
బలం శిరః కపాలానాం విశేషేణాభి వర్ధతే।
దృఢమూలాశ్చ దీర్ఘాశ్చ కృష్ణాః కేశ భవన్తి చ। 82
ఇన్ద్రియాణి ప్రసీదన్తి సుత్వశ్భవతి చామలమ్।
నిద్రాలాభః సుఖంచ స్యాన్మూర్ధ్ని తైలనిషేవణాత్॥ 83
నకర్ణరోగా వాతోత్థా నమన్యా హను సంగ్రహః॥
నోచ్చైః శ్రుతిర్న బాధిర్యం స్యాన్నిత్యం కర్ణ తర్పణాత్॥ 84
స్నేహాభ్యఙ్గాద్యథా కుమ్భశ్చర్మ స్నేహ విమర్ధనాత్॥
భవత్యుపాఙ్గాదక్షశ్చ దృఢః క్లేశ సహోయదా! 85
తథా శరీర మభ్యఙ్గా ద్దృఢం సుత్వక్చజాయతే॥
ప్రశాన్త మారుతా బాధం క్లేశ వ్యాయామ సంసహమ్। 86
స్పర్శనే చాధికో వాయుః స్పర్శనం చ త్వగాశ్రితమ్॥
త్వచ్యశ్చ పరమోఽభ్యఙ్గాస్తస్మాత్తం శీలయేన్నరః। 87
న చాభిఘాతాభి హతం గాత్ర మభ్యఙ్గసేవినః॥
వికారం భజతే ఽ త్యర్థం బిలకర్మణి వాక్వచిత్। 88

సుస్పర్శోపచితాఙ్గశ్చ బలవాన్ ప్రియదర్శనః।
భవత్యభ్యఙ్గ నిత్యత్వాన్నరోఽల్పజర ఏవచ॥ 89

తాత్పర్యము తైలముతో గండూషమును చేసిన యెడల తాలువులకు బలము, స్వరమునకు బలము, ముఖ వికాసము, రసములను బాగుగ తెలిసికొనుట, ఆహారము నందు రుచి ఇవి కలుగును కంఠము ఎండదు, పెదవులు పగలవు దంతములు క్షీణింపవు మరియు వాని యొక్క మొదళ్ళు గట్టి పడును దంతముల యందు బాధ కలుగదు పులుపుతగిలినను గగుర్పాటునొందవు కఠినములైన భక్ష్యములను గూడ నమల గలుగును శిరస్సునందు తైలమును ఎల్లప్పుడు పూసికొనినచో శిరశ్శూల, బట్టతల, వెంట్రుకలు నెరయుట, వెంట్రుకలూడుట ఇవి కలుగవు శిరస్సునకు, కపాలమునకు అధిక బలము కలుగును వెంట్రుకలు దృఢమైన కుదుళ్ళు కలవిగను దీర్ఘములుగను నల్లగను నగును శిరస్సునకు తైలమును మర్ధన చేసికొనినచో ఇంద్రియములు నిర్మలమగును చర్మము కాంతికలదిగానగును సరియగు నిద్రయు సుఖమును కలుగును చెవియందు తైలమును తరుచు పోసికొనినచో వాతము వలన కలుగు కర్ణవ్యాధులు కలుగవు మన్యాస్తంభము, హనుగ్రహము, శ్రవణ కాఠిన్యము, బాధిర్యము ఇవి కలుగవు చమురును పూయుట వలన కుండయు, తోలును, ఇరుసును గట్టిపడి క్లేశములను సహించు విధముగ అభ్యంగము వలన శరీరము గట్టిపడి మంచి చర్మము కలదిగ నగును మరియు వాతము వలన బాధలను పొందదు కష్టములను వ్యాయామమును సహించును స్పర్శనేంద్రియము నందు వాతము అధికముగ నుండును అట్టి స్పర్శనము చర్మమును ఆశ్రయించి యుండును అభ్యంగము చర్మమునకు, హితమును కల్గించును అందువలన అభ్యంగమును తరచు ఆచరింపవలయును అట్లు చేసినచో శరీరమునకు దెబ్బ తగిలినను బలవత్తరమైన పనులను చేసినను విశేషించి బాధ కలగదు అభ్యంగమును తరుచు ఆచరించిన వాడు శరీర మృదుత్వమును అవయవ సౌష్ఠవమును బలమును చక్కదనమును పొందును ముసలితనము నందు వార్ధక్య లక్షణములను స్వల్పముగనే పొందును

చ పా వ్యా అం అ హన్వోః అను మొదలగు శ్లోకముల ద్వార స్నేహ గండూష గుణములను చెప్పుచున్నాడు నిత్యం అను మొదలగుకొని నిషేవణాత్ అనునంత వరకు శిరస్తైల గుణములు చెప్పబడినవి "మూర్ధ్నితైల నిషేవణాత్" అని చెప్పి తిరిగి "స్నేహార్ద్ర శిరసః" అని చెప్పుటతో తైలముతో శిరస్సు తడుపబడు నంతవరకు తలకు నూనెను పట్టించుకొనవలెనని గ్రహించవలయును "స్నేహాభ్యంగాద్" అను చోట

ఉపాంగ స్నేహనము వలన అక్షః = ఇరుసు ఇచట అనేక ఉదాహరణలు ఒక్కొక్కచోట ఒకటి మాత్రమే ప్రసిద్ధమై యుండును గాని అన్ని అన్ని చోట్ల ప్రసిద్ధములు గావు అందువలన అనేక దృష్టాంతములివ్వబడినవి లేక స్నేహము అనేక కార్యములు చేయు శక్తిగలదిగా తెలుపుటకు అనేక ఉదా॥ ఇవ్వబడినవి స్పర్శనే అనగా స్పర్శనేంద్రియము అనగా వాయువు అధికముగా నుండును 'త్వచ్యశ్చ పరమభ్యంగః' అను చోట చకారము వలన అభ్యంగము కేవలము త్వచ్యము మాత్రమేగాక వాత వికారములతో హితమైనదని తెలుసుకోవలయును అందువలన వాతాధిక్యత గలిగి ఆశ్రయించు గుణము గల స్పర్శనేంద్రియమునకు ఆశ్రయమైన త్వక్కునకు రెండింటికి స్నేహము హితమని చెప్పవచ్చును బలము నెరవేర్చుబరువులు మోయుట మొదలగు కర్మలు బలకర్మలనబడును

మూ॥ ఖరత్వం శుష్కతా రౌక్ష్యం శ్రమః సుప్తిశ్చ పాదయోః॥
సద్య ఏవోపశామ్యన్తి పాదాభ్యఙ్గ నిషేవణాత్। 90
జాయతే సౌకుమార్యంచ బలం స్థైర్యంచ పాదయోః
దృష్టిః ప్రసాదం లభతే మారుతశ్చోపశామ్యతి। 91
న చ స్యుర్గృధ్రసీవాతః పాదయోః స్ఫుటనం నచ।
న సిరాస్నాయు సంకోచః పాదాభ్యఙ్గన పాదయోః॥ 92

తాత్పర్యము పాదముల యందు తైలమును రుద్దుటవలన కాఠిన్యము, ఎండుట, రౌక్ష్యము, బాధ, మొద్దుబారుట ఇవి వెంటనే నశించును, మరియు మృదుత్వమును బలమును, స్థైర్యమును కలుగును దృష్టికి నైర్మల్యము కలుగును వాతము శమించును గృధ్రసీ వాతములును, పాదములు పగులుటయు కలుగవు పాదముల యందలి సిరలును స్నాయువులును సంకోచమును పొందును

చ పా వ్యా ఆం అ ఖరత్వమను వాటితో పాదాభ్యంగ గుణములు చెప్పబడుచున్నవి ఈ శ్లోకములందు "పాదయోః" అను పదము నాల్గుమార్లు చెప్పబడినది అందు మొదటి శబ్దము పాదములకు గల ఖరత్వాది విశేషణములను బోధించగా, రెండవది అభ్యంగము (పాదాభ్యంగము) వలన కాలాంతరమున బలము, సౌకుమార్యము గలుగునని సూచించుచున్నది మూడవ మారు చెప్పబడిన "పాదయో"ః అను శబ్దము పాద స్ఫుటనమునకు విశేషణము, నాల్గవది సిరాస్నాయు విశేషణము మిగిలిన పాదాభ్యంగమను పదము పాదములకు చేయు అభ్యంగమును గుర్తు చేయుచున్నది

మూ॥ దౌర్గన్ధ్యం గౌరవం తన్ద్రాం కణ్డూం మలమరోచకమ్।
స్వేదబీభత్సతాం హన్తి శరీర పరిమార్జనమ్॥ 93
పవిత్రం వృష్యమాయుష్యం శ్రమస్వేద మలాపహమ్।
శరీర బలసంధానం స్నానమోజస్కరం పరమ్॥ 94

తాత్పర్యము శరీరమునకు నలుగు పెట్టుకొనుట వలన దౌర్గంధ్యము, భరువుగా నుండుట, తంద్ర, దురద, మాలిన్యం, అరోచకము, చమట వలన కలుగు అసహ్యాత ఇవి నశించును స్నానము పవిత్రింప చేయునదిగను వృష్యముగను అయుర్వృద్ధిని చేయునదిగను నుండును శ్రమను చెమటను మాలిన్యము.ను పోగొట్టును శరీరమునకు బలమును ఓజస్సును కలిగించును

చ పా వ్యా అం అ ఉద్వర్తన మభ్యంగన పూర్వకముగాన "దౌర్గంధ్యమను" శ్లోకములతో అభ్యంగము తరువాత చేయదగు ఉద్వర్తనము చెప్పుచున్నాడు స్వేదబీభత్సత అనగా స్వేదముతో గల్గిన బీభత్సత శరీరబల సంధానం అనగా శరీరమునకు బలమును చేకూర్చుటను అని అర్థము

మూ॥ కామ్యం యశస్య మాయుష్యమలక్ష్మీఘ్నం ప్రహర్షణమ్॥
శ్రీమత్పారిషదం శస్తం నిర్మలామ్బర ధారణమ్। 95
వృష్యం సౌగన్ధ్యమాయుష్యం కామ్యం పుష్టిబలప్రదమ్॥
సౌమనస్య మలక్ష్మీఘ్నం గన్ధ మాల్యనిషేవణమ్। 96
ధన్యం మఙ్గల్య మాయుష్యం శ్రీ మద్వ్యసన సూదనమ్।
హర్షణం కామ్య మోజస్యం రత్నాభరణ ధారణమ్॥ 97
మేధ్యం పవిత్ర మాయుష్యమలక్ష్మీ కలినాశనమ్॥
పాదయోర్మల మార్గాణాం శౌచాధాన మభీక్ష్ణశః। 98
పౌష్టికం వృష్య మాయుష్యం శుచి రూపవిరాజనమ్॥
కేశశ్మ శ్రున ఖాదీనాం కల్పనం సంప్రసాదనమ్॥ 99
చక్షుష్యం స్పర్శనహితం పాదయోర్వ్య సనాపహమ్॥
బల్యం పరాక్రమ సుఖం వృష్యం పాదత్రధారణమ్। 100
ఈతేః ప్రశమనం బల్యం గుప్త్యావరణ సంకరణమ్॥
ఘర్మానిలరజోమ్బుఘ్నం ఛత్రధారణ ముచ్యతే। 101
స్ఖలతః సంప్రతిష్ఠానం శత్రూణాం చ నిషూదనమ్।
అవష్టమ్భన మాయుష్యం భయఘ్నం దణ్డ ధారణమ్॥ 102

తాత్పర్యము స్వచ్ఛమైన వస్త్రములను ధరించిన యెడల మనోహరముగాను, కీర్తికరముగను, ఆయుర్వృద్ధి కరముగను నుండును అలక్ష్మిని పోగొట్టును సంతోషమును శోభను కల్గించును సభలోనికి పోవుటకు యోగ్యతను కలిగించును మంగళప్రదముగ నుండును చందనాది గంధములను, పుష్పమాలికలను ధరించుట వలన వీర్యవృద్ధియు పరిమళమును ఆయుర్వృద్ధియు, మనోహరత్వమును, పుష్టియు, బలమును, సంతోషమును కలుగును అలక్ష్మి నశించును రత్నాభరణములను ధరించిన యెడల ధన్యతను మంగళములను ఆయుర్వృద్ధిని శోభను కలిగించును దుఃఖములను పోగొట్టును సంతోషమును, మనోహరత్వమును, ఓజస్సును కలిగించును పాదములను, మలమార్గములను తరచు శుభ్రపరచు కొనుట వలన బుద్ధి వికాసమును పవిత్రతయు ఆయుర్వృద్ధియు కలుగును అలక్ష్మియు పాపమును నశించును తల వెంట్రుకలు గడ్డము నందలి వెంట్రుకలు, గోళ్ళు మొదలగు వానిని ఖండించి సరిచేసుకొనుట వలన పుష్టియు, వీర్యవృద్ధియు, ఆయుర్వృద్ధియు, శుభ్రతయు స్వరూపము ప్రకాశించుటయు కలుగును అలంకారముగ నుండును కాళ్ళకు పాదరక్షలను ధరించుట వలన నేత్రములకు హితమును, పాదముల యందు స్పర్శ సుఖమును కలుగును పాదములందు బాధ కలుగదు బలమును, పరాక్రమ సుఖమును వీర్యవృద్ధియు కలుగును గొడుగును ధరించుట వలన ఈతి బాధలు తొలగును బలము కలుగును పిశాచాదుల వలన భయము కలగదు ఆచ్ఛాదనముగ నుండును ఎండ, గాలి, ధూళి, వర్షము వీని నుండి రక్షించును చేతియందు కఱ్ఱను ధరించుటవలన జాఱి పడినప్పుడు ఆధారముగ నుండును శత్రువులను నశింపజేయును అవష్టంభనముగ నుండును ఆయుర్వృద్ధిని కలిగించును భయమును పోగొట్టును

చ పా వ్యా ఆం అ శ్రీమత్ = అందమునిచ్చునది పరిషత్తులలో ప్రశస్తమైనది శస్త్రమన మంగళ ప్రదమైనది వ్యసనం - సర్పపిశాచాదుల వలన అభిఘాతము, రత్నాభరణములనగా రత్నములు పొదిగిన ఆభరణములు రత్నములనగా విశుద్ధములైన మాణిక్య, వజ్ర, ముత్య, బంగారములు మొదలగునవి మలస్థానములను నీటితో గాని, మట్టితోగాని శుభ్రపరచుకోవలయును మాటి మాటికిని, శుచి = పరిశుభ్రకరమైనది కల్పనం = ఛేదించుట, సంప్రసాదనం = అందంగా అమర్చుట ఈ రెండింటిని అవసరమును బట్టి ఆచరించ వయును అదెట్లనగా వెంట్రుకలను బాగుగా ముడుచుట ద్వార, మీసము, గడ్డము వీనిని కత్తిరించుట ద్వారాను, గోళ్ళను అలంకరించుకోవలయును ఆది శబ్దముతో ముక్కునందలి, మరియు

గుహ్యప్రదేశము నందలి వెంట్రుకలను ఛేదించవలయును పాదములకు అనువైన పాదుకలను (జోళ్ళను) ధరించిన కాలి బాధలను పోగొట్టును. పాదత్రం = పాదుకలు (జోళ్ళు) పాదుకలు ప్రయోగించుట వలన గలుగు చక్షుస్యము అనగా నేత్రములకు హితమగుట వృష్యము = వాజీకరణముగాను అను గుణములు. పాదుకలకు ప్రభావముతో గల్గినది లేక పాదమును తాకియున్న నేత్రపోక్షిక నాడి దోషమును తగ్గించుట వలన చక్షుష్యము అని అర్థము . = దుర్దైవవశాత్తు గలిగిన రోగాదులు గుప్తిః = పిశాచాదులనుండి రక్షణ, శంకరం = శుభకరమైనది అవష్టంభనం = బలము కల్గించునది. సర్పాదుల నుండి గులుగ భయమును పోగొట్టునది

మూ॥ నగరీ నగర స్యేవ రథ స్యేవరథీ యదా॥
స్వశరీరస్య మేధావీ కృతేష్వ వహితో భవేత్। 103

తాత్పర్యము నగర రక్షకుడు నగరము యొక్కయు, రథికుడు రథము యొక్కయు కృత్యముల యందువలె బుద్ధిమంతుడు తన శరీరము యొక్క కృత్యముల యందు జాగరూకత కలవాడై యుండవలయును

చ.పా.వ్యా ఆం అ ఇపుడు పైన చెప్పగా మిగిలిన స్వస్థవృత్త విధిని సంగ్రహముగా చెప్పుట కొరకు మరియు ఇంత వరకు చెప్పిన దానిని విధిగా చేయుటకు నగరి అను శ్లోకముతో చెప్పుచున్నాడు కృత్యేషు అనగా చెప్పబడినవి చెప్పగా మిగిలినవి యైన కార్యములందు నగర దృష్టాంతము నిచ్చుటచే అంతర్గత దుష్టిని బోగొట్టుట యందుగల ఆవశ్యకత చూపించబడుచున్నది రథ దృష్టాంతము బాహ్య స్పర్శము మొ॥ వాటిని పరిహరించుట యందుగల ఆవశ్యకతను చూపించుచున్నది నగర నాశనము సాధారణముగ అంతర్గత దుష్ట జనుల వలననే కలుగును రథ భంగమునకు మాత్రము బాహ్యమైన విషమ పతనాదులు కారణములు

మూ॥ వృత్త్యుపాయాన్ని షేవేత యే స్యుర్ధర్మా విరోధినః।
శమమధ్యయనం చైవ సుఖమేవం సమశ్నుతే॥ 104

తాత్పర్యము ధర్మమునకు విరోధమును కలిగింపని జీవనోపాయములను, శాంతగుణమును, వేదాధ్యయనమును సేవించినచో సుఖము కలుగును

చ.పా వ్యా ఆం అ ప్రధానమైన శరీర పాలనా విధానము చెప్పి స్వస్థుడుగా ఉంటూ చేయదగిన ఇతర కర్తవ్యమును వృత్త్యుపాయాన్ అను శ్లోకములో చెప్పుచున్నాడు వృత్తిః = నడవడి దానికి ఉపాయములు కృషి మొ॥ నవి

ధనైషణము యందు చెప్పబడినది శమః శాంతి, అధ్యయనం = వేదాధ్యయనము అనుష్టించ వలెనని అన్వయము ఈ విధంగా ఉంటే సుఖమును పొందును వీనిలో వృత్త్యాదుల వలన ధనము శాంతి అధ్యయనముల వలన అర్థధర్మము వలన సుఖ లక్షణ కామము ఈ విధంగా త్రివర్గానుష్టానము చూపించబడినది

మూ॥ మాత్రాద్రవ్యాణి మాత్రాం చ సంశ్రిత్య గురులాఘవమ్।
ద్రవ్యాణాం గర్హితోఽ భ్యాసో యేషాం యేషాంచ శస్యతే॥ 105
అఞ్జనం ధూమ వర్తిశ్చ త్రివిధావర్తి కల్పనా।
ధూమపాన గుణాః కాలాః పానమానం చయస్యయత్॥ 106
వ్యాపత్తి చిహ్నం భైషజ్యం ధూమో యేషాం విగర్హితః।
పేయో యథా యన్మయం చనేత్రం యస్యచ మద్విదమ్॥ 107
నస్యకర్మ గుణా నస్తః కార్యం యచ్చ యథాయథా।
భక్ష యేద్దన్త పవనం యథా యద్యద్గుణం చయత్॥ 108
యదర్థం యాని చాస్యేన ధార్యాణి కవల గ్రహే।
తైలస్య యే గుణా దృష్టాః శిలస్తైల గుణాశ్చయే॥ 109
కర్ణతైలే తథాఽ భ్యఙ్గే పాదాభ్యఙ్గేచ మార్జనే।
స్నానే వాససి శుద్ధేచ సౌగన్ధ్యే రత్న ధారణే॥ 110
శౌచౌ సంహరణే లోమ్నాం పాదత్రచ్ఛ త్రధారణే।
గుణా మాత్రాశితీయేఽ స్మిన్ తథోక్తా దణ్డ ధారణే॥ 111

తాత్పర్యము ఈ మాత్రా శితీయా ధ్యాయము నందు ఆహారము యొక్క పరిమాణము, ఆహారమునకు ఉపయోగించు ద్రవ్యములు, గురులఘు ద్రవ్యములు మాత్రను అనుసరించుట, నిత్యము అభ్యసింపకూడని ద్రవ్యములు, నిత్యము అభ్యసింపదగిన ద్రవ్యములు, అంజనము, ధూమవర్తి, మూడు విధములగు వర్తికల్పనములు, ధూమపానము యొక్క గుణములు, తగిన కాలములు, ధూమపాన ప్రమాణము, ధూమపాన వ్యాపత్తుల వలన కలుగు లక్షణములు, వానికి చికిత్స ధూమపాన అనర్హులు ధూమపానము చేయు విధానము, ధూమపానము చేయు గొట్టమును చేయవలసిన విధి ఆయా ధూమపానముల ననుసరించి గొట్టము యొక్క పరిమాణము,

నస్యము యొక్క గుణములు, నస్యకర్మకు ఉపయోగించునది, నస్య కర్మ చేయింపవలసిన విధానము, నస్యకర్మ చేయదగు కాలము, దంతధావన విధి దానియొక్క గుణములు, దీని నిమిత్తము ఉపయోగింప తగినవి నోటియందుంచుకో తగినవి వాని వలన కలుగు ఫలము ఇవి చెప్పబడినవి మరియు తైలమును గండూషము చేయుట, శిరస్సు నందు తైలము నుంచుకొనుట, చెవి యందు తైలమును పోసికొనుట, అభ్యంగము, పాదాభ్యంగము, నలుగు పెట్టుకొనుట, స్నానము, స్వచ్ఛమైన వస్త్రముల ధరించుట, సుగంధ ద్రవ్యములను ధరించుట, రత్నాభరణముల ధరించుట మలస్థానాదుల శుభ్రపరచుకొనుట, కేశాదులను ఖండించుకొనుట, పాదరక్షలను ధరించుట, గొడుగును ధరించుట కఱ్ఱను ధరించుట వీనివలన కలుగు గుణములు చెప్పబడినవి

చ పా వ్యా అ అ మాత్ర అను దానితో అధ్యాయమున చెప్పిన దానిని సంక్షేపముగా చెప్పుచున్నాడు 'యావద్ధ్య స్యాశనమును దానితో మాత్ర చెప్పబడినది అట్లే శాలి మొ॥గు వాటితో ద్రవ్యములు చెప్పబడినవి ద్రవ్యగత గురులాఘవములు మాత్ర నాశ్రయించి యుండుట, స్వభావతః లఘువులైనప్పటికిని మాత్రాశ్రితములేయనుట మొ॥నవి చెప్పబడినవి పానము చేయువాని ప్రమాణము అపానాస్త్రి స్త్రయస్త్రయః అను మొ॥వానితో చెప్పబడినది "నస్త్రః కార్యం యత్" అనునది అణుతైలము 'యధా అను దానితో దూది పింజముతో, యధా అంటే ఎప్పుడూ అనగా ప్రావృట్ శరత్కాలము నందని అర్థము మిగిలినది సుభోదితమే

చక్రదత్త కృతమైన ఆయుర్వేద దీపికయను చరక తాత్పర్య టీకాయందు రెండవదియైన స్వస్థవృత్త చతుష్కమున మాత్రాశీతీయమను ఐదవ అధ్యాయమునకు ఆంధ్రానువాదము సమాప్తము

# ఆరవ అధ్యాయము

**అథాతస్తస్యాశితీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1**

**ఇతి హస్మాహభగవానాత్రేయః ॥ 2**

**తాత్పర్యము** అటు తరువాత తస్యాశితీయమను అధ్యాయమును చెప్పుచున్నాము అని భగవంతుడైన ఆత్రేయుడు చెప్పెను

**చ పా వ్యా ఆం అ** మాత్రాశితీయమను అధ్యాయమున మాత్రననుసరించి తీసుకున్న ఆహారము బలము మొ॥వాటికి కారణమెట్లగునో ప్రతిపాదింపబడినది అట్టి ఆహారముగూడా ఋతుసాత్మ్యముననుసరించి సేవించినపుడే బలాదులకు కారణమగును అందువలన ఋతుప్రవిభాగము మొదలుకొని ఋతుసాత్మ్యమును తెలియజేయు తస్యాశితీయాధ్యాయమును చెప్పుచున్నాడు (1) (2)

**మూ॥ తస్యాశితాద్యాదాహారాద్బలం వర్ణశ్చ వర్ధతే।**
**యస్యర్తుసాత్మ్యం విదితం చేష్టాహారవ్యపాశ్రయమ్॥ 3**

ఎవడైతే ఋతుసాత్మ్యము నెరిగి తదనుగుణముగా వ్యాయామ, ఆహారములను అనుసరించుచు ఆహారమును తీసుకొనునో అట్టివానికి బలము వర్ణము వృద్ధినొందును

చ పా వ్యా ఆం అ అశితాద్యాత్ అనగా అశితము, పీతము, లీఢము, ఖాద్యములైన ఆహారములనుండి అని అర్థము బలంవర్ణ అనగా బలము వర్ణము గూడా వర్ణశ్చ అను చోట చకారముండుట వలన పూర్వాధ్యాయమున చెప్పబడిన సుఖాయువు గూడా

గ్రహించవలెనని చకారమునకర్థము లేక బలవర్ణములను శబ్దముతోనే ధాతుసామ్యముతో కలుగు సుఖాదులను గ్రహించవలయును విదితం అను శబ్దముతో ఋతుసాత్మ్యమును బాగుగా నెరిగి అనుష్ఠించవలెనని తెలుపుచున్నాడు చేష్టాశబ్దముచేత వ్యవాయవ్యాయామ అభ్యంగాదులను గ్రహించవలయును చేష్టాహారవ్యపాశ్రయం అనగా చేష్టాహార గోచరమైన అని అర్థము

మూ॥ ఇహఖలు సంవత్సరం షడఙ్గమృతు విభాగేన విద్యాత్। తత్రాది త్యస్యోదగయన మాదానంచ త్రీనృతూంచ్ఛిశిరాదీన్ గ్రీష్మాంతాన్ వ్యవస్యేత్, వర్షాదీన్ పునర్హే మంతాంతాన్ దక్షిణాయనం విసర్గంచ ॥

**తాత్పర్యము** ఈ ప్రకరణమున ఋతు విభాగముననుసరించి సంవత్సరము ఆరు అంగములుగా విభజించబడినది అవి శిశిర ఋతువు మొదలగుకొని గ్రీష్మఋతువు యొక్క అంతమువరకు (3) ఋతువులు (6) మాసములు సూర్యుడు ఉత్తర దిశయందు సంచరించును ఇది ఆదానకాలము వర్ష ఋతువు మొదలు హేమంత ఋతువు యొక్క అంతము వరకు (3) ఋతువులు (ఆరుమాసములు) సూర్యుడు దక్షిణదిశగా సంచరించును ఇది విసర్గకాలము

చ పా వ్యాం ఆం అ ఋతువులు తెలియనిచో ఋతుసాత్మ్యజ్ఞానము గలుగుట అసంభవము కావున ఉపయుక్తమైన ఋతుస్వరూపమును చెప్పుచున్నాడు ఋతువులను ప్రతిపాదించు సందర్భమున "సంవత్సరం విద్యాత్" సంవత్సరమని తెలుసుకోవలెను అని సంవత్సరమును ప్రతిపాదించుట అన్ని ఋతువులు కలిసి సంవంత్సరమని చెప్పుటకే సంవత్సరమని ప్రతిపాదించబడినది ఋతువుల కలయిక బుద్ధిగమ్యమే గాని పరమార్థతః ఋతువులకలయిక లేదు ఋతువులకు సంవత్సరాత్మకత్వము ప్రతిపాదించుట వలన ఆయా ఋతువులే మాటిమాటికి పరివర్తనము చెందుచున్నవని తెలియజేయుటకొరకే అవశ్యముగా సంవత్సరత్వము ఋతువులకు చెప్పబడినది ఈ ప్రకరణమున సంవత్సరము షడంగమని తెలుసుకోవలయును ఇది గాక "రోగభిషగ్జితీయము" మొదలగు ప్రకరణములందు ఆయా కార్యములననుసరించి సంవత్సరము మరియొక విధముగా గూడా ప్రతిపాదింపబడును ఉదా శాస్త్రమున కాలమును ప్రతిపాదించుచు మరియొక చోట "శీతోష్ణ వర్షలక్షణః కాలః" శీత, ఉష్ణ, వర్ష లక్షణములుగలది కాలము అని చెప్పబడినది షడంగమను చోట ఋతువులకంటె భిన్నముగా సంవత్సరము లేదు గావున సమాహార ద్విగుసమాసమును చెప్పుకోవలయును లేదా సముదాయములకంటె ఇంకొక

సముదాయమను అర్థముననుసరించి బహువ్రీహి చెప్పుకోవలయును తత్ర అనగా ఋతువిభాగమును చెప్పుసందర్భమున "ఆదిత్యస్య ఉదగయనం" అనగా సూర్యుడు ఉత్తర దిశను గూర్చి ప్రయాణము చేయుట ఆదానమనగా పృధివి యొక్క సౌమ్యాంశమును మరియు ప్రాణుల యొక్క బలమును క్షీణింపజేయునది గావున ఆదానమనబడును శిశిర ఋతువు మొదలుకొని మూడు ఋతువులు అని చెప్పుట వలననే గ్రీష్మఋతువు యొక్క చివర అని యర్థము వచ్చినప్పటికిని తిరిగి "గ్రీష్మాంతాన్" అని చెప్పుటవలన శిశిరఋతువు యొక్క ఆది అను విగ్రహార్థము నిషేధింపబడును అంతేగాక ఆది శబ్దమునకు గల ప్రకారవాచిత్వము గూడా నిషేధించుటకొరకే "గ్రీష్మాంతాన్" అని చెప్పబడినది ఇదే విధముగా "హేమంతాంతాన్" అనుచోట గూడా తెలునుకోవలయును సూర్యుడు దక్షిణ దిశను గూర్చి పయనించుట దక్షిణాయనమనబడును విసర్గమనగా పృధివిలో జలాంశమును ప్రాణులకు బలమును గలిగించునది విసర్గమనబడును నామకరణములోక వ్యవహారము కొరకు మరియు పారిభాషిక పద ప్రతిపాద్యమైన అర్థమును తెలియజేయుట కొరకు (4)

**మూ॥ విసర్గే పునర్వాయవోనాతి రూక్షాః ప్రవాంతి, ఇతరే పునరా దానే, సోమశ్చావ్యాహతబలః శిశిరాభిర్భాభిరాపూరయ న్జగదా ప్యాయయతి శశ్వత్, అతో విసర్గః సౌమ్యః ఆదానం పునరాగ్నేయం, తావేతావర్కవాయూ సోమశ్చకాలస్వభావమార్గ పరిగృహీతాః కాలర్తురసదోష దేహబలనిర్వృత్తి ప్రత్యయభూతాః సముపదిశ్యంతే॥ 5॥**

**తాత్పర్యము** విసర్గకాలమునందు మిక్కిలి రూక్షములుగానివాయువులును, ఆదాన కాలమునందు మిక్కిలి రూక్షములైన వాయువులును వీచుచుండును విసర్గకాలమునందు చంద్రుడు అధికమైన బలముగలవాడై చల్లని కిరణములచే జగత్తును నిండించుచు ఎల్లప్పుడు ఆప్యాయనమును గల్గించును అందువలన విసర్గ కాలము సౌమ్యముగ నుండును ఆదాన కాలము ఆగ్నేయముగ నుండును సూర్యుడును వాయువును చంద్రుడును కాల స్వభావమున మార్గములననుసరించి కాలము, ఋతువు, రసబలము, దోషబలము, దేహబలము ఇవి గలుగుటకు కారణములుగ నుండును

**చ పా వ్యా ఆం అ** విసర్గ కాల ధర్మమును "విసర్గే పునః" అను వాక్యముచే నిర్దేశించుచున్నాడు అధ్యాయ ప్రారంభమున మొదలు ఆదానము చెప్పబడినప్పటికిని వాటిని వివరించు సందర్భమున ప్రతిలోమ తంత్రయుక్తి ననుసరించి మొదట విసర్గ కాలమును ప్రతిపాదించుచున్నాడు అని గ్రహించవలయును లేదా ఉత్తరాయణము

ప్రశస్తమైనదిగాన దానిని మొదట చెప్పినప్పటికిని ప్రస్తుతమున మాత్రము వైద్యశాస్త్రప్రాధాన్యతననుసరించి బలమును గలుగజేయునదైన విసర్గ కాలము మొదట వివరించబడినదని తెలుసుకోవలయును "నాతిరూక్షాః" అనగా వాయువులు సౌమ్యమైన విసర్గకాల సంబంధముతో మందగించిన రూక్ష గుణముగలవై వీచును ఆదానకాలమున ఆగ్నేయాదాన సంబంధముతో మిక్కిలి అహితకరమైన రూక్షత్వము గలిగి వాయువులు వీచును అని అర్థము "సోమశ్చ" అనునది ప్రకృతమున "విసర్గేణ" అను పదము సంబంధించును చంద్రుడు కాల, మార్గ మేఘ, వాత, ఆతపాదులచే అర్దగింపబడిన బలము కలవాడగుట చేతను చల్లని కిరణముల చేతను ఎల్లప్పుడు లోకమును ఆప్యాయనము చేయును అందువలన విసర్గ కాలము సౌమ్యము అనగా సోమగుణప్రధానముగా నుండును ఆగ్నేయమనగా అప్రతిహత బలము కలదగుట వలన అగ్ని గుణ ప్రధానమైనవి అని అర్థము

సూర్యచంద్రులకు గల బలవత్వ అబలవత్వములు ఎట్లు కల్గుచున్నవో దానిని "తావేతౌ" అను వాక్యముతో వివరించుచున్నాడు కాలము దేవతా స్వరూపము అది ప్రాణులకు నిత్యరూపమైనప్పటికిని అదృష్టవశాత్తుగా అనేక రూపములుగా గ్రహించబడి ఒకప్పుడు వాయు బలమును ఒకప్పుడు సూర్య బలమును మరియొకప్పుడు చంద్రబలమును కల్గించునదిగా యుండును సౌమ్యాంశములు క్షీణింపజేయుట సూర్యునకు, విరూక్షనాదులను కల్గించుట వాయువునకు ఆప్యాయనము మొదలగు వాటిని కల్గించుట చంద్రునకు స్వభావ గుణములై యున్నవి దక్షిణ ఉత్తరములు మార్గములు వాటిలో కర్కట రేఖ నుండి ధనురేఖాంతము వరకు దక్షిణ మార్గము మకర రేఖ మొదలుకొని ఉత్తర మార్గము ఈ కాల స్వభావ మార్గ పరిగ్రహములు యధాసంభవముగా గ్రహించవలయును అది ఎట్లనగా చంద్రునికి సంబంధించినంత వరకు మార్గ పరిగ్రహమున విశేషమేది లేదు వాయువునకు మార్గ పరిగ్రహమే లేదు పోతే ఒక్క సూర్యుని విషయమున మార్గ పరిగ్రహము ఒక విశిష్టతను కల్గియున్నది అందువలననే కాలస్వభావాదులు యధాసంభవముగా గ్రహించవలెనని చెప్పబడినది "పరిగ్రహితాః" అనగా సంబద్ధములని అర్థము "కాలర్తు రస దోష దేహబల నిర్వృత్తి ప్రత్యయ భూతాః" అనగా కాలము ఋతువు రసము దోషము దేహ బలము మొదలగు వాటియొక్క ఉత్పత్తికి కారణభూతములుగా ఆచార్యులచే ఉపదేశించబడినవి కాలము సంవత్సరము మరియు రెండు అయనములు (ఉరత్తరాయణం, దక్షిణాయనంలు) ఋతువులు (శిశిర వసంత గ్రీష్మ వర్ష శరత్

హేమంత ములు) దేహము యొక్కబలము దేహ బలము కొందరు దీనిని మరియొక విధముగా వ్యాఖ్యానించుచున్నారు అదెట్లనగా రెండు అయనంలు సంవత్సరము ఋతువులు కలయిక వలన ఋతు గ్రహణము చేతనే సంవత్సర అయనములు గ్రహించబడుచున్నవి కావున కాలమును ఋతువునకు విశేషముగా గ్రహించినచో ఋతురూపమైన కాలమని అర్థమును గ్రహించవలయును అందువలన స్త్రీలయందలి ఆర్తవరూపమైన ఋతు కాలం గ్రహించబడదని కొందరి అభిప్రాయము ఈ సందర్భమున కొందరు "అర్కవాయు" అని "సోమశ్చ" అని రెండింటిని విడివిడిగా ఉచ్చరించుచున్నారు దీనిని అనుసరించి సూర్యుడు వాయువులు కలిసి ఆదానమునకు కారణంలుగా నుండునని అట్లే చంద్రుడు విడిగా విసర్గ కాలమునకు కారణముగా నుండునని తెల్సుకోవలయును ఇదే విధముగా బలక్షయమునకు బలకరమునకు సంబంధించిన విషయములు కూడా గ్రహించవలయును

**మూ॥ తత్ర రవిర్భాభిరాదదానో జగతః స్నేహం వాయస్తీవ్ర రూక్షాశ్చోపశోషయంతః శిశిర వసంతగ్రీష్మేషు యథాక్రమం రౌక్ష ముత్పాదయంతో రూక్షాన్ రసాం స్తిక్త కషాయకటుకాంశ్చా భివర్థయంతో నృణాం దౌర్భల్యమావహంతి ॥ 6 ॥**

**తాత్పర్యము** ఆదానకాలమునందు సూర్యుడు తన యొక్క కిరణములచే జగత్తునందలి స్నేహామును ఆకర్షించును మరియు వాయువులు తీవ్రములుగాను, రూక్షములుగానుండి స్నేహమును శుష్కింపజేయును అట్టి సూర్యుడు వాయువులు శిశిర వసంత గ్రీష్మములయందు రూక్షత్వమును యథాక్రమముగా వృద్ధినొందించి రూక్షస్వభావముగల తిక్త, కషాయ, కటు రసములను వృద్ధినొందించి మానవులకు దౌర్భల్యమును కలిగించును

**చ.పా.వ్యా ఆం అ** ఆదదానః = మిక్కిలి శోషింపజేయుచు జగతః = స్థావర జంగమ ప్రపంచముయొక్క, స్నేహం = సారమును (సౌమ్యభాగమైనది) స్నేహమును శోషింపజేయువాడు సూర్యుడు మాత్రమే గాదు వాయువులుగూడా శోషింపజేయును అని అన్వయించుకోవలయును ఇచట వాయువునకు తీవ్ర, రూక్షత్వ విశేషణములున్నవి వాటి ననుసరించి తీవ్రమైన వాయువులు - మరియు - రూక్షత్వము గల వాయువులు అనియు, లేక తీవ్రమైన రూక్షత్వము గల వాయువులనియు అర్థము ఈ తీవ్రరూక్షత్వము వాయువునకు, వాయువుయోగ వాహియగుట వలన సూర్యుని సంబంధముచే గలుగును వాయువునకు గల యోగవాహిత్వము శాస్త్రమున "యోగవాహీ(హః) పరం వాయుః సంయోగాదు భయార్థకృత్" (చ చి 3) అని చెప్పబడినది యథాక్రమమనగా

శిశిరమున అల్పరూక్షత తిక్తరసము, దౌర్భల్యాల్పత, అట్లే వసంత ఋతువునందు మధ్య రూక్షత కషాయరసము, దౌర్భల్యము మధ్యమముగా నుండుట, గ్రీష్మమున అధిక రూక్షత, కటురసము, అధిక దౌర్భల్యము అని తెలుపుచున్నాడు "రౌక్ష్యాత్ కషాయో రూక్షాణాం ప్రవరోమధ్యమః కటుః" అని సూత్రస్థానమున 26వ అధ్యాయమున చెప్పబడినది దీనిననుసరించి కషాయరసము రూక్షతమమై కటురసము రూక్షతరమైనప్పటికిని, అట్లే కాలముననుసరించి గ్రీష్మమున రూక్షప్రకర్ష, వసంతమున మధ్య బలరూక్షమున్నప్పటికిని కటురసము వాయ్వగ్ని గుణబహులముగావున తత్సమాన గుణముగల వాయ్వగ్ని గుణ బహులమైన గ్రీష్మఋతువునందు ఉత్పన్నమగును అట్లే వాయు పృథివీ బహులమైన వసంత ఋతువునందు వాయువు పృథివీ ఉత్కర్షజన్యమైన కషాయరసముద్భవించును. ఇదే విషయము శాస్త్రమున "వాయ్వగ్ని భూయిష్టత్వాత్ కటుకః పవన పృథ్వివి వ్యతిరేకాత్ కషాయః" అని సూత్ర, 26వ అధ్యాయమున చెప్పబడినది ఇందలి పృథివి మొదలగు వాటి ఉత్కర్షము కాల స్వభావజన్యము అది కార్యమువలన అనుమానించదగినది "అభివర్ధయంతి" అను మాటతో వాటివాటి కనువైన కాలమున తిక్తాదులయొక్క వృద్ధి సూచించబడుచున్నది (అందువలన ఇచట ఒకే రసము కాదని భావము) ఇచట రూక్షత్వమునుత్పత్తి జేయునదనియు, తిక్త, కటు, కషాయరసములను వృద్ధి చేయునదనియు రెండు హేతుగర్భములైన విశేషణములను చెప్పి తదనంతరము దౌర్బల్యము కలుగజేయునను విశేష్యము చెప్పుటవలన క్రమముగా నున్న రూక్షత్వము మరియు తిక్తాది రసముల యొక్క ఉత్పత్తి ఈ రెండును దౌర్బల్యమునకు కారణములుగా యుండునని బోధపడుచున్నది (6)

మూ॥ వర్షాశరద్ధేమంతేషుతు దక్షిణాభిముఖేఽ ర్కే కాలమార్గ మేఘవాతవర్షాభిహత ప్రతాపే, శశిని చావ్యాహత బలే, మాహేంద్ర సలిలప్రశాంత సంతాపేజగతి, అరూక్షా రసాః ప్రవర్ధంతే ఽ మ్లలవణ మధురా యథాక్రమం తత్ర బలముపచీయతే నృణామితి ॥7॥

**తాత్పర్యము** వర్ష శరత్ హేమంత ఋతువులందు సూర్యుడు దక్షిణాభిముఖుడై కాలము, మార్గము, మేఘముల సంబంధమగు గాలి, వర్షము వీనిచే అణగగొట్టబడిన ప్రతాపముగల వాడగుటవలనను, చంద్రుడు ఎదురులేని బలము గలవాడగుట వలనను, జగత్తు వర్షోదకముచే శాంతినొందిన తాపము కలదగుటవలనను రూక్షస్వభావములేని అమ్ల లవణమధుర రసములు వృద్ధినొందును అట్టి విసర్గకాలమునందు మనుష్యులకు బలము యథాక్రమముగా వృద్ధినొందును

చ పా వ్యా ఆం అ  ఇచట "తు" శబ్దము పూర్వపక్ష వ్యావర్తకము అనగా మొదట చెప్పినదానికి భిన్నార్థమును సూచించుచున్నది "దక్షిణాభిముఖేఽర్కే" అనగా సూర్యుడు దక్షిణ దిశగా ప్రయాణించుటకు ద్యుక్తుడైనపుడు అనగా దక్షిణాయన ప్రారంభమున పూర్తిగా దక్షిణ దిశనుపొందక మధ్యదేశమునకుత్తరముగా నున్నప్పటికిని దక్షిణ దిశగా ప్రయాణించుట కుద్యుక్తుడైన తోడనే క్షీణించుచున్న బలము గలవాడగును మరియును ఉత్తర దిక్కుగా ప్రయాణించునప్పుడు గల అహితబల ప్రకర్షతో పోల్చినపుడు అంతబలవంతుడుగా లేక క్రమముగా క్షీణించుచున్న బలము గలవాడైనప్పటికిని అంత దుర్బలత్వమును పొందినట్లుగా కూడా దక్షిణాయన ప్రారంభమున గనబడదు ఇదే విధముగా ఉత్తరాయణ గమనోద్యుక్తుడైనప్పుడు గూడా తెలుసుకోవలయును కాలమును గూర్చి ఇంతకు ముందే చెప్పబడినది ఇచట మార్గమనగా దక్షిణాభిముఖమైన మార్గము మేఘవాతమనగా మేఘములకు సంబంధించినగాలి, వర్షము వీటితో అడ్డగింపబడిన సూర్యుడు ఈ దక్షిణాయనమున వాతము మేఘసంబంధముతో అహితకరమైన శీతలత్వముగలదై సూర్యతాపము ననుసరించు చుండును చంద్రుడీకాలమున నవ్యాహత బలముగలవాడగుటకు సూర్యశక్తి అడ్డగించబడుటయు మరియు చంద్రుని కనుగుణములైన మేఘవాత వర్షముల యొక్క కలయిక కారణములు జగతి అనగా స్థావర జంగమాత్మకమైన ప్రకృతి అని అర్థము ఇచట ఆమ్ల లవణ, మధుర రసములుత్పన్నములగునని మూలమున చెప్పబడినది వాటిలో ఆమ్ల లవణ రసములు శాస్త్రప్రమాణముననుసరించి "పృథివ్యగ్ని భూయిష్ఠత్వాదమ్లః' ' సలిలాగ్ని భూయిష్ఠత్వాల్లవణః" అని సూత్ర 26వ అధ్యాయమున చెప్పబడినది అందు ఆగ్నేయములైన ఆమ్ల లవణరసముల యొక్క ఉత్పత్తిసౌమ్యమైన విసర్గకాలమున ఎట్లు జరుగునని శంకించరాదు ఎందుకనగా బలప్రకర్షగల సూర్యుడు క్షీణించుచున్న బలముకలవాడైనప్పటికిని కొంతకాలము దాటువరకు బలవంతుడుగా నుండునని ఇంతకుపూర్వమే ప్రతిపాదించబడినది

భవతి చాత్ర -

మూ॥ ఆదావంతేచ దౌర్బల్యం విసర్గాదానయోర్నృణామ్।
మధ్యే మధ్యబలం, త్వంతే శ్రేష్ఠమగ్రేచ నిర్దిశేత్॥

తాత్పర్యము  విసర్గకాలము యొక్క ఆదియందును ఆదాన కాలము యొక్క అంతమునందును దౌర్బల్య మధికముగా నుండును విసర్గ కాలము యొక్క మధ్యయందును ఆదాన కాలముయొక్క మధ్యయందును బలము మధ్యమముగా నుండును విసర్గ కాలము యొక్క అంతమునందును ఆదానకాలముయొక్క ఆది

యందును బలము అధికముగా నుండును

చ పా వ్యా అం అ ఇంతవరకు శిశిరాది ఋతువులందు బలహ్రాసము వర్షాది ఋతువులందు బలోత్కర్షము గలుగునని ప్రతిపాదించబడినది వాటిలో శిశిర ఋతువునందు ప్రాణులు దుర్బలురుగాను, వర్షఋతువునందు బలవంతులగుదురను ఒక విపరీతార్థమును నిషేధించుచు "ఆదావంతేచ" అను శ్లోకమును వివరించుచున్నాడు విసర్గకాలము యొక్క ఆదియందు అనగా వర్షఋతువునందు, ఆదానకాలము యొక్క అంతమునందు అనగా గ్రీష్మఋతువునందు దౌర్బల్యము ఎక్కువగా నుండునని తెలుసుకొనవలయును అట్లే విసర్గకాల మధ్యమునందు అనగా శరదృతువునందును, ఆదానకాలమధ్యమైన వసంత ఋతువునందును బలము మిక్కిలి ఎక్కువగాగాక మిక్కిలి తక్కువగాగాక మధ్యరకమైన బలము గలిగియుండునని తెలుసుకోవలయును అదే విధముగా విసర్గకాలాంతమైన హేమంత ఋతువునందు, ఆదానకాల ప్రారంభమైన శిశిరఋతువునందు శ్రేష్ఠమైన బలముండునని గ్రహించవలయును విసర్గకాల ప్రకర్షచే పొందబడిన బలప్రకర్షగల పురుషుడు ఆదానకాలము యొక్క ప్రారంభమైన శిశిర ఋతువునందు కొద్దిగా బలక్షయము ప్రారంభమైనప్పటికిని పుష్యమాసాంతమున వృద్ధిలోనున్న రాత్రి మాఘఫాల్గుణ మాసములందు క్షీణించుచున్నప్పటికిని దినమునకంటే అధికముగానేయున్నట్లు పురుషుని బలముగూడా కొంచెము క్షీణించినప్పటికిని మొత్తము మీద బలవంతుడుగానే యుండును ఈ న్యాయమునననుసరించి వర్షఋతువున దౌర్బల్యము, వసంత శరదృతువులందు మధ్యమ బలమును తెలుసుకొనవలయును ఈ విధముగా కాల, ఋతు, రస, దేహములకు సూర్యాదుల కారణత్వము తెలుపబడినది దోషకారణత్వము - ఋతువిధానమును నిర్దేశించు సందర్భమున ముందు చెప్పబడును

మూ॥ శీతే శీతానిలస్పర్శ సంరుద్ధో బలినాంబలీ!
పక్తా భవతి హేమంతే మాత్రాద్రవ్యగురుక్షమః॥ 9
సయదా నేంధనంయుక్తం లభతే దేహజంతదా।
రసం హి నస్త్యతో వాయుః శీతః శీతే ప్రకుప్యతి ॥ 10
తస్మాత్తుషార సమమేస్నిగ్ధామ్లలవణాన్ రసాన్।
ఔదకానూపమాంసానాం మేద్యానాముపయోజయేత్॥ 11
బిలేశయానాం మాంసాని ప్రసహానాం భృతాని చ।
భక్షమేన్మదిరాంశీధుం మధుచానుపిబేన్నరః॥ 12
గోరసానిక్షు వికృతీర్వసాంతైలం నవౌదనమ్ ।
హేమంతేఽభ్యస్యతస్తోయముష్ణం చాయుర్నహీయతే॥ 13

అభ్యంగోత్సాదనం మూర్ధ్నితైలం జేంతాకమాతపమ్।
భజేద్భూమిగృహంచోష్ణముష్ణం గర్భగృహంతథా ॥ 14
శీతేషు సంవృతం సేవ్యం యానం శయనమాసనమ్।
ప్రావారాజి నకౌషేయ ప్రవేణీకుథకాస్తృతమ్॥ 15
గురూష్ణవాసా దిగాగ్ధాంగో గురుణాఽగురుణా సదా।
శయనేప్రమదాం పీనాం విశాలోపచితస్తనీమ్॥ 16
ఆలింగ్యాగురుదిగ్ధాంగీం సుప్యాత్ సమదమన్మథః।
ప్రకామంచ నిషేవేత మైథునం శిశిరాగమే॥ 17
వర్జయేదన్న పానాని వాతలాని లఘూనిచ।
ప్రవాతం ప్రమితాహారముదమంథం హిమాగయే 18

**తాత్పర్యము** శీతగుణయుక్తమగు హేమంత ఋతువునందు శరీరముయొక్క పై భాగమున చలిగాలి సోకుటవలన లోన నిర్బంధింపబడిన జఠరాగ్ని బలము గలదై అధిక పరిమాణమున నుపయోగింపబడి నట్టియు గురుగుణము గలిగినట్టియు ఆహారమును సైతము జీర్ణము జేయుటకు సమర్థముగ యుండును అట్టి జఠరాగ్ని తగిన ఆహారము లభించని ఎడల దేహమునందలి రసమును నశింపజేయును అందువలన శీతకాలమునందు శీతస్వభావముగల వాతము ప్రకోపించును కావున హేమంత ఋతువునందు - ఉదకమునందును అనూపదేశమునందును సంచరించు జంతువులకు సంబంధించినదియు, చమురు, పులుపు, ఉప్పు వీనితో గూడినట్టిదియు, బుద్ధివర్ధకములైనట్టియు మాంసరసములనువయోగింపవలయును బిలములయందుడు జంతువుల యొక్కయు ప్రసహములనెడి జంతువుల యొక్క కాల్చబడిన మాంసములను తిని వెంటనే మదిరయనెడి మద్యమును సీధువనెడి మద్యమును, మధువనెడి మ్యదమును త్రాగవలయును ఆవుపాలు చెరుకుతో చేయబడిన పదార్థములు వస, తైలము, క్రొత్తయన్నము ఉష్ణోదకము వీటిని తరచు సేవించువారికి ఆయువు క్షీణించదు అభ్యంగము, నలుగు, శిరస్సునందు తైలముంచుకొనుట, జేంతాక స్వేదము, ఎండవేడిమి, ఉష్ణముగనుండు భూమి గృహము, ఉష్ణముగ నుండు గర్భగృహము, వీనిని సేవింపవలయును దుప్పటి, చర్మము, పట్టువస్త్రము, కంబళిబొంత వీనిలో పరచబడినట్టియు ఆవరణముతో గూడినట్టియు, యానమును, శయనమును, ఆసనమును సేవింపవలయును, దట్టముగను వెచ్చగను, నుండు వస్త్రమును ధరించి కృష్ణాగురును దట్టముగ

పూసికొనినవాడై బలిసినట్టియు విశాలముగను పెద్దవిగనున్న స్తనములు గలగినట్టియు, కృష్ణాగురును పూసికొనినట్టియు స్త్రీని మన్మధోద్రేకముగలవాడై ఆలింగనము చేసికొని నిద్రింపవలయును మైధునమును ఇష్టానుసారముగ ఆచరింపవలయును ఈ ఋతువునందు లఘుగుణము గలిగినట్టియు వాత వర్ధకములైనట్టియు అన్నపానములను, అధికమగు గాలిని మిక్కిలి స్వల్ప పరిమితిగల ఆహారమును ఉదమంథమును సేవింపగూడదు

చ పా వ్యా ఆం అ హేమంత ఋతువు వర్ధమాన బలప్రకర్షగలదిగా చెప్పబడినది గావున తత్సాత్మ్యమే "శీతే" అను దానితో చెప్పుచున్నాడు శీతే = శీతగుణయుక్తమైన హేమంతమునందు "శీతే" అను విశేషణము చెప్పకపోయినను హేమంతే అను శబ్దముచేతనే శీతలత్వము లభించినప్పటికిని ఇంతకు పూర్వమెచ్చటను హేమంతమున శీతలత్వము ప్రతిపాదింపబడని కారణమున ఇచ్చట శీతలత్వ విశేషణము హేమంతమునకు చెప్పబడినది. లేక హేమంతమున శీతము ఎక్కువైనపుడు మాత్రమే విశేషముగా అగ్ని (జఠరాగ్ని) బలమును పొందునేగాని కేవలము ఉపక్రమమాత్రముచేత వృద్ధి పొందదనియు లేక ఋతువ్యాపత్తి యందు హేమంతమున సైతము శీతాయోగముండుననియు, శీతే అను విశేషణమునకర్థములుగా గ్రహించవచ్చును హిమసంబంధముతో మిక్కిలి చల్లగా నున్న గాలి శీతానిలముగా చెప్పబడినది విశేష శీతలత్వము యోగవాహిగుణమువలన శీతకాల సంబంధముచే వాయువునకు గల్గుచున్నది అట్టి వాయువు హిమసంబంధమువలన, బయల్వెడలుచున్న అగ్నిని కోష్ఠముననే అడ్డగించి వృద్ధినొందించును ఇందుకు కుంభకారుల ఉదాహరణ మివ్వబడినది కుంభకారులు కుండలను నిర్మించుసమయమున వామును పేర్చినిప్పంటించి లోపలనున్న అగ్ని బయటకుపోకుండా వాముపై మట్టిని పూయుట ద్వారా అగ్ని లోపలనే ప్రజ్వలించుటకవకాశము కల్పింతురు ఇందువలన అంతర్భాగమున అగ్ని మిక్కిలి వృద్ధిపొందును అట్లే హిమయుక్త వాయువుచే ఆవరింపబడిన జఠరాగ్ని కోష్ఠాంతర్భాగమున మిక్కిలి వృద్ధినొందును దీనిననుసరించి అసమానగుణముగల శీతవాతము నుండి అగ్ని వృద్ధిఎట్లు గలుగునను సందేహము నివారించబడినది ఇచ్చట శీతలమైన వాయువు అగ్నిగా పరిణమించుటలేదు పోతే బచల్వెడలునట్టి అగ్ని అడ్డగించబడి స్వస్థానమున వృద్ధి పొందుచున్నది శీతానిలస్పర్శ శరీరానికి సంబంధించినది బలవంతులైన వారికి అగ్ని హేమంత స్వభావముతో బలమును పొందును దీనిననుసరించి ప్రాణబలవత్త్వము అగ్నిబలవత్త్వమునకు

కారణమని తెలుపుచున్నాడు హస్తివైద్యకమున గున్న ఏనుగులకు ఆరోగ్యమును ప్రతిపాదించు సందర్భమున "అవ్యాహతాదభిప్రాయాత్ ప్రీతిః, ప్రీతేర్బలం బలాదగ్నిః అగ్నేశ్చధాతూనాంబలం, నాశస్త్రతోరుజామ్" అనగా కొట్టబడని అభిప్రాయమువలన ప్రేమ, ప్రేమవలన బలము, బలము వలన అగ్ని, అగ్నివలన ధాతువులకు బలము, వీటివలన రోగము శమించుట గలుగునని చెప్పబడినది అతిమాత్రయనగా మాత్రా గురువని యర్థము ద్రవ్యతః గురువు ద్రవ్యస్వభావతః గురువులైన నవధాన్యాదులను గూడా పచింపజేయు సామర్థ్యము గలదై అగ్నియుండును ఈ విధమైన అగ్ని అనగా బలప్రకర్షకలదైన అగ్ని అనుకూలమైన గురుభూతమైన అన్నము లభించనప్పుడు దేహ (రసము) సారమును క్షీణింపజేయును దేహ రసమనగా దేహము కొరకు దేహమున బుట్టిన ధాతురూప రసము (సారము) అని అర్థము అందువలన ఇంధనము దొరకని ఎడల రసధాతు క్షయమేర్పడి దాని వలన హేమంతమున వాత ప్రకోపము గలుగును వాత ప్రకోపమునకు మరియొక కారణమును "శీతః శీతే" అను దానితో చెప్పుచున్నాడు వాయువు శీతగుణము గలది గావున శీతకాలమైన హేమంతఋతువున సమానకారణమును శీతలత్వమును పొందుట వలన ప్రకోపించును ఇచట వృద్ధినొందిన వాయువు అగ్నివృద్ధినే గలిగించును అతిగావృద్ధి నొందక పోవుట వలన అగ్నివేషమ్యమును గలిగించదు వాయువు అతిగా వృద్ధిపొందిననేగాని అగ్నివైషమ్యమును గలిగించదు అందువల్ల, అతివృద్ధము గాకుండుట వలన అగ్ని వృద్ధిని మాత్రమే కల్గించును, కాని వైషమ్యమును కలిగించదు ఇదే విషయము "మేదసావృత మార్గత్వాద్వాయుః కోష్ఠేవిశేషతః చరన్ సంధుక్షయత్యగ్నిం ఆహారం శోషయత్యపి" అనగా - మేదస్సుచే ఆవరించబడిన మార్గము కలదైన వాయువు కోష్టమున విశేషముగా సంచరించుచు అగ్నిని (జఠరాగ్నిని) ప్రజ్వలింప - చేయుచు ఆహారమును శోషింపచేయునని సూత్రస్థాన 21వ అధ్యాయమున చెప్పబడినది తస్మాత్ అనగా దేహజన్యమైన రసక్షయ భయం వల్ల। ప్రకరణముననుసరించి చెప్పబడిన చర్య తుషార సమయమునకు సంబంధించినదైనప్పటికిని తిరిగి "తుషార సమయే" అని చెప్పుటవలన, మంచుకురియు సమయమున తప్పని సరిగా స్నిగ్ధము మొదలగు ఆహారములను, భోజనము కొరకై ఉపయోగించవలనని తెలుసుకొనవలెయును "మేద్యానాం" యనగా మేదురములైన వాటియొక్క మాంసములను, ఔదకానూప మాంసాదులు హేమంత కాలమున కలుగు కఫ సంచయ సందర్భకములైనప్పటికినీ, మహాత్యయమైన వాతవికారమునకు విరుద్ధమగుట వలనను, అధిక వ్యవాయాదుల

వలన, ప్రకోపించు వాతమును శమింపజేయుటకు గాను కఫ సంచయము కల్గించుటకొరకై చెప్పబడినది 'ఔదకము' అనగా అన్న పానాధ్యాయమునందు చెప్పబడు కూర్మము మొదలగునవి 'అనూపములనగా ఖడ్గమృగము మొదలగునవి బిలేశయములనగా 'గోధా' మొదలగునవి ప్రసహనములనగా గోవు, గాడిద మొ॥, భృతములనగా - వేయించుట ఉష్ణోదక స్నాన విషయమున హేమంతమని - పేర్కొనుట వలన హేమంత ఋతువున మొత్తము ఉష్ణోదక స్నానముచేయవలెనని గ్రహించవలెను జేంతాకమనగా స్వేదప్రకరణమున చెప్పబడు స్వేద విశేషము గర్భగృహం = లోగిలి కప్పుకొనుట ఉపదేశించు సందర్భమున ప్రయాణము, కూర్చొనుట, పరుండుట, ఈ ఈ సమయములలో కప్పించుకోవలెనని చెప్పబడినది ఇది శీతకాల సంబంధమైన చర్య ఐనప్పటికినీ, తిరిగి ఈ ప్రకరణమున "శీతే" యని చెప్పబడుట వలన యానము - శయనము ఆసనము ఈ సందర్భములలో శీతకాలమున మాత్రమేగాక, శీతకాలముకాని వర్షాది కాలముల యందు కూడా ఎక్కువగా చలిగాయున్నపుడు కప్పుకోవలెనని గ్రహించవలెను. ప్రావారము యనగా కంబళి మొ॥ గురు ప్రావరనములు అజినము = పులి చర్మము మొ॥ కౌషేయము = పురుగుల నుండి తీయబడిన పట్టు వస్త్రములు ప్రవేణి = తాడు కుథకము = చిత్రకంబలము, గురుణాఽగురుణా అగురు లేపమును దట్టముగా వేసుకొని, విశాలౌ = చుట్టుకొలతలతో విశాలముగానున్న, ఉపచితా = పరిమాణముతో బలసిన స్తనములు గల స్త్రీలను యని అర్థము ఈ కాలమున యధేచ్ఛ మైధునసేవను ఉపదేశించుటకు కారణము ప్రాణులు బలవంతులుగా యుండుటయు, చలిపోగొట్టబడుటయు, కాల స్వభావమున సంచితమగు కఫమునకు విరుద్ధగుణము కలది యగుట వలన మైధున కర్మ ఉపదేశించబడినది సుశ్రుతమున గూడా హేమంతమున "తత్రాపనీత హారాశ్చ ప్రియానారః స్వలంకృతాః రమయేయుర్యథా కామం బలాదపి మదోత్కటాః" అనగా ఆభరణాదులను తీసి తాత్కాలికములైన పూలదండలు మొదలగు వాటిని అలంకరించుకున్న ప్రియురాండ్రను బలవంతముగా యధేచ్ఛగా అనుభవించవలెనని చెప్పబడినది (9-18)

మూ॥ హేమంతశిశిరేతుల్యౌశిశిరేఽల్పవిశేషణమ్।
రౌక్ష్యమాదానజంశీతం మేఘమారుత వర్షజమ్॥ 19
తస్మాద్ధైమంతికః సర్వః శిశిరేవిధిరిష్యతే।
నివాతముష్ణంత్వధికం శిశిరేగృహమాశ్రయేత్॥ 20

కటుతిక్తకషాయాణి వాతలానిలఘూనిచ ।
వర్జయేదన్నపానాని శిశిరేశీతలానిచ ॥ 21

**తాత్పర్యము** హేమంత ఋతువును, శిశిర ఋతువును సమాన ధర్మములు గలవిగ నుండును కాని శిశిర ఋతువునందు స్వల్పమగు విశేషము మాత్రమేగలదు ఆదానకాలమగుట వలన గలుగు రౌక్ష్యము, మేఘములు, గాలి, వర్షము వీని వలన గలుగు అధికమైన శీతమును ఉండును అందువలన హేమంత ఋతువునందు చెప్పబడిన విధానమంతయు శిశిర ఋతువునందును ఆచరింపవలయును మరియు గాలివీచనట్టియు మిక్కిలి వెచ్చగానుండునట్టియు గృహమునాశ్రయింపవలయును ఈ ఋతువునందు కటుతిక్త కషాయరసములు గలిగినట్టియు, వాతవర్థకములైనట్టియు లఘు గుణముగలిగినట్టియు చలువచేయునట్టియు అన్నపానములను సేవింపకూడదు

చ పా వ్యా అం అ హేమంత అనుదానితో శిశిర ఋతుచర్యను చెప్పుచున్నాడు. విశేషణం అనగా విశేష విధి శిశిర ఋతువు ఆదానకాలమున కారంభముగావున రూక్షత్వముగా నుండును మరియు మేఘ, మారుత, వర్షములు శిశిరమున అధికములగును తజ్జన్యమైన శీతముగూడా హేమంతమునకంటే అధికముగా నుండును తస్మాత్ అనగా హేమంత తుల్యమగుటవలనను రౌక్ష్య, శీతత్వ యుక్తమగుట వలనను హేమంత ఋతుచర్యనే ఆచరించవలయును "నివాతముష్ణంతు" అనుచోట "తు" శబ్దము పక్షాంతరగ్రహము కొరకు ఉద్దేశించబడినది హేమంత ఋతువున చెప్పబడిన "నివాత" ఉష్ణగృహమునకంటె రూక్షాతిశీతమైన శిశిరమున అధికోష్ణముగల గృహమునాశ్రయించవలయునని విశేషవిధి చెప్పబడినది కొందరిచట అధికోష్ణ గృహసేవన చేయరాదని చెప్పుదురుగాని అది అనార్షము (19-21)

మూ॥ వసంతేనిచితః శ్లేష్మాదినకృద్భాభిరీరితతః
కాయాగ్నింబాధతే రోగాంస్తతః ప్రకురుతే బహూన్॥ 22
తస్మాద్వసంతే కర్మాణి వమనాదీని కారయేత్।
గుర్వమ్లస్నిగ్ధమధురం దివాస్వప్నంచ వర్జయేత్॥ 23
వ్యాయామోద్వర్తనం ధూమం కవలగ్రహమంజనమ్।
సుఖాంబునాశౌచవిధింశీలయేత్ కుసుమాగమే॥ 24
చందనా గరుదిగ్ధాంగోయవ గోధూమభోజనః।
శారభం శాశమైణేయం మాంసం లావకపింజలమ్॥ 25
భక్షయ్యేన్నిర్గన్నిదం సీధుం పిబేన్మాధ్వీకమేవవా।
వసంతేఽనుభవేత్ స్త్రీణాం కాననానాంచయౌవనమ్॥ 26

**తాత్పర్యము** శీతకాలమున సంచయము నొందిన కఫము వసంత ఋతువునందు సూర్యకిరణములచేత కరిగింపబడి జఠరాగ్నిని చెరచి అనేక విధములైన వ్యాధులను గలిగించును అందువలన వసంతఋతువునందు వమనాది కర్మలనాచరించ వలయును గురుగుణమును అమ్ల రసమును, స్నిగ్ధ గుణమును, మధురరసమును గల ఆహారములను పగటినిద్రను విడిచిపెట్టవలయును వ్యాయామము నలుగుడును పెట్టుకొనుట ధూమపానము కవలగ్రహమనెడి గండూషము అంజనము, గోరువెచ్చని నీటితో శౌచవిధి నాచరించుట వీనిని సేవించవలయును. చందనము, కృష్ణాగురును శరీరమునకు పూసికొనవలయును యవాన్నమును గోధుమాన్నమును భుజింపవలయును శరభమృగము, కుందేలు, జింక, లావుకపక్షి, కపింజల పక్షి వీనియొక్క మాంసములను తినవలయును మంచిదియగు సీధువనెడి మద్యమును గాని, మాద్వీకమనెడి మద్యమునుగాని త్రాగవలయును స్త్రీలయొక్కయు, ఉద్యానవనముల యొక్క యౌవనమును అనుభవించవలయును

**చ పా వ్యా.ఆం అ** "వసంతే" అను మొదలగు వాటితో వసంత ఋతు చర్యను చెప్పుచున్నాడు నిచిత ః = వసంత ఋతువునకు పూర్వ ఋతువు నందు సంచితమైన (కఫము) వసంతే = వసంత ఋతువునందు, ఈరిత ః = విలయనము చేయబడినదై, కాయాగ్నిం = కాయమును పోషించు జఠరాగ్నిని (ధాత్వగ్నులను గాదు) "తతః ప్రకురుతే బహూన్" అనుచోట "చ" కారములోపించినది అందువలన "అగ్నివధాచ్చ" అను అర్థమును చెప్పుకోవలయును అనగా అగ్ని నశించుట వలనను అని యర్థము చకారమునకు లుప్త నిర్దిష్టత్వము చెప్పని పక్షమున "తతః" అనగా అగ్నిని నశింపజేసిన పిదప అని అర్థము వమనాదీని అనగా వమన ప్రధానములైన అని అర్థము. ఈ విధముగా చెప్పుటచేత ఇది ఆదానమధ్యకాలముగావున ఒకవేళ వాతపిత్త ప్రకోపము గూడా తగినంతగా గలిగిన ఎడల విరేచనా స్థాపన అనువాసన వస్తులుగా ప్రవర్తించును కఫమును జయించుటకు శిరోవిరేచనము చేయవలసియే యుండును వమనము గురించి వసంత ఋతువులైన చైత్రమాసమె గ్రహించవలయును కారణమేమనగా దోష సంచయాదులకు మరియు పంచకర్మల ప్రవృత్తికి, ముందు చెప్పబోవు ప్రావృడాది ఋతువులలో చెప్పబడు శోధనములకు వసంత ఋతువనగా ఫాల్గున, చైత్రమాసములు గ్రహించబడినవి అచ్చట వైశాఖము వసంత ఋతువుగాదు ఈ అభిప్రాయమును దృష్టియందుంచుకొనియే పూర్వశ్లోకమున సామాన్యముగా "నిచితః" అని పదముచ్చరించబడినదేగాని "హేమంతే నిచితః" అని చెప్పబడలేదు ఒకవేళ అట్లు

తస్మాత్సాధారణః సర్వోవిధిర్వర్షాసుశస్యతే।
ఉదమంథందివాస్వప్నమవస్యాయం నదీజలమ్॥ 35

వ్యాయామ మాతపంచైవ వ్యవాయంచా త్రవర్జయేత్।
పానభోజన సంస్కారాన్ ప్రాయః క్షౌద్రాన్వితాన్ భజేత్॥ 36

వ్యక్తామ్ల లవణ స్నేహ వాతవర్షాకులేఽహని।
విశేషశీతే భోక్తవ్యం వర్షాస్వనిలశాంతయే॥ 37

అగ్ని సంరక్షణవతాయవగోధూమశాలయః।
పురాణాజాంగలైర్మాంసై ర్భోజ్యేయూషైశ్చ సంస్కృతైః॥ 38

పిబేత క్షౌద్రాన్వితం చాల్పం మాధ్వీకారిష్టమంబువా।
మాహేంద్రం తప్తశీతంవా కౌసంసారసమేవవా॥ 38

ప్రఘర్షోద్వర్తనస్నాన గంథమాల్యాపరోభవేత్।
లఘుశుద్ధాంబరః స్థానం భజేదక్లేది వార్షికమ్॥ 40

తాత్పర్యము ఆదానకాలమగుట వలన దుర్బలముగ నున్న శరీరమునందు జఠరాగ్ని దుర్బలముగనుండును అట్టి జఠరాగ్ని వర్షాకాలమునందు వాతాదులచే దూషింపబడి మిక్కిలి క్షీణించును వర్షాకాలమునందు జఠరాగ్ని క్షీణించియుండగ భూమి యొక్క ఆవిరి వలనను, మేఘములయొక్క తుషారము వలనను, జలము యొక్క ఆమ్లవిపాకమువలనను వాతాది దోషములు ప్రకోపించును కావున వర్షాకాలమునందు త్రిదోష నాశకములగు విధానములన్నింటిని ఆచరించవలయును ఉదమంథము, పగటినిద్ర, మంచు, నదీజలము, వ్యాయామము, ఎండ, మైథునము వీనిని విడిచిపెట్టవలయును పానము యొక్కయు, ఆహారముయొక్కయు సంస్కారము లయందు ప్రాయికముగ తేనెను కలిపి వానిని సేవించవలయును గాలి, వర్షము, వీనితో గూడిన శీతమధికముగానున్న దినమునందు వాతముశమించుటకై పులుపు, ఉప్పు, చమురు ఇవి అధికముగా గల ఆహారములను భుజించవలయును జఠరాగ్నిని రక్షించుకొను నిమిత్తము యవలు, గోధుమలు, శాలి ధాన్యము, ప్రాతవియగు వీని యొక్క ఆహారములను జాంగలమాంసములతోడను, సంస్కరింపబడిన యూషముల తోడను భుజించవలయును మాధ్వీకమనెడి అరిష్టమునందుగాని ఉదకమునందుగాని తేనెను గలిపి కొద్దిగ త్రాగవలయును వర్షోదకమునుగాని బావియందలి ఉదకమునుగాని సరసుసనందలి ఉదకమునుగాని కాచి చల్లార్చి త్రాగవలయును శరీరమును

పిసికించుకొనుట, నలుగు పెట్టుకొనుట, స్నానము, సుగంధ ద్రవ్యములు, పుష్పమాలికలు వీనిని సేవించవలయును చులకనగను పరిశుభ్రముగను నున్న వస్త్రములను ధరింపవలయును తేమలేని ప్రదేశమునందు నివసింపవలయును

చ పా వ్యాం ఆ వర్షఋతువు చర్యను "ఆదాన దుర్బలే" అను శ్లోకములతో చెప్పుచున్నాడు శరీరము దుర్బలమైనపుడు జఠరాగ్ని కూడా దుర్బలమగును అగ్ని బలము దేహబలముననుసరించి యుండుటయే ఇందుకు కారణము ఈ విషయము "బలినాంబలీ" అనుచోట నిరూపించబడినది "సః" అనగా దుర్బలమైన అగ్ని "అనిలాదీనాం" అనగా వాత ప్రధానములైన వాటికి । వర్షఋతువునందు వాతాదులు ప్రకోపించుటకు కారణమును "భూబాష్పాది" అను వాటితో చెప్పుచున్నాడు భూబాష్పము ప్రభావమువలననే త్రిదోష ప్రకోపకము, మేఘనిశ్యందము వాత కఫకారకము, వర్షఋతువు స్వభావ జన్యమైన జలముయొక్క ఆమ్లపాకత పిత్తశ్లేష్మకరము "అగ్ని బలేక్షీణే" అనగా ఆదానకాల జన్యమైన అగ్ని మాంద్యము గూడా దోష ప్రకోపకరమని యర్థము అపాక విదాహములతో గూడిన అగ్ని మాంద్యముగూడా కఫపిత్తకరము, ధాతు పోషకరసమునుత్పత్తి చేయకపోవుట వలన ధాతుక్షయముగూడా వాతకరము ఈ కారణముల వలన వర్షములందు వాతాదుల ప్రకోపము జరుగును వాతాదుల ప్రకోపము వలన అగ్ని మాంద్యమూ గలుగును అని చెప్పబడినది వాగ్భటమున గూడా "భూబాష్పేణామ్లపాకేన మలినేనచవారిణా। వహ్నినైవచ మందేన తేష్విత్యన్యోన్యదూషిషు॥ సాధారణోవిధిః కార్యస్త్రిదోషఘ్నో ఽ గ్నిదీపనః॥ అ హృ సూ 3॥ అనగా భూబాష్పము, అమ్లపాకము, నీటి కాలుష్యము మరియు అగ్నిమాంద్యము ఇవి పరస్పరము దూషితములై త్రిదోషములను ప్రకోపింపజేయును అందువలన సాధారణముగా త్రిదోషశమన కర్మలు, అగ్నిదీపన కర్మలు చేయవలయునని అ హృ సూ 3వ అధ్యాయమున చెప్పబడినది ఉదమంథమనగా ఉదక ప్రధానమైన మంథము పాన = ఉదకాదులు , భోజనం = రక్తశాల్యాది భోజనము, ఈ అన్నపానాదులు సంస్కారవంతములై యుండవలెను తేనె వాత క్రోపకమైనప్పటికిని "క్షౌద్రాన్విత" మని చెప్పుటవలన వర్షఋతువున గలిగిన క్లేదశమనార్థము స్వల్పముగా ఉపయోగింప వలయునని తెలుసుకోవలయును "విశేషశీతే" అనునది హేతుగర్భవిశేషణము దాని వలన ఎక్కువగా శీతముగా నున్నపుడు మహాత్యాయమైన వాత ప్రకోపము గలుగును అందువలన అట్టి వాతమును జయించుటకు వర్షాకాల ప్రభావముచే గలుగు పిత్తసంచయమున కనుగుణములగు అమ్ల లవణ రసములను ఉపయోగించవలయునని చెప్పబడినది (33-40)

మూ॥ వర్షాశీతోచితాఙ్గానాం సహసైవార్కరశ్మిభిః।
తప్తానామాచితం పిత్తం ప్రాయః శరదికుప్యతి॥ 41

తత్రాన్నపానం మధురం లఘుశీతం సతిక్తకమ్।
పిత్తప్రశమనం సేవ్యం మాత్రయాసుప్రకాంక్షితమ్॥ 42

లావాన్ కపింజలా నేణానురభ్రాన్ శరభాన్ శశాన్।
శాలీన్ సయవగోధూమాన్ సేవ్యానాహుర్ఘనాత్యయే॥ 43

తిక్తస్య సర్పిషః పానం విరేకో రక్తమోక్షణమ్।
ధారాధరాత్యయే కార్యమాతపస్యచ వర్జనమ్॥ 44

వసాంతైలమవస్యాయ మౌదకానూపమామిషమ్।
క్షారందధి దివాస్వప్నం ప్రాగ్వాతంచాత్ర వర్జయేత్॥ 45

దివాసూర్యాంశుసంతప్తం నిశిచంద్రాంశు శీతలమ్।
కాలేన పక్వం నిర్దోషమగస్త్యేనావిషీకృతమ్॥ 46

హంసోదకమితి ఖ్యాతం శారదం విమలంశుచి
స్నానపానావగాహేషు హితమంబు యథాఽమృతమ్॥ 47

శారదానిచమాల్యాని వాసాంసివిమలానిచ।
శరత్కాలే ప్రశస్యంతే ప్రదోషేచేందు రశ్మయః 48

తాత్పర్యము వర్షాకాలమునందలి శీతము అభ్యాసముగ నుండి శరత్కాలమునందు వెంటనే సూర్యకిరణములచేతపింప జేయబడుట వలన పూర్వముసంచయము నొందిన పిత్తము శరత్కాలమున ప్రాయికముగా ప్రకోపమును చెందును ఈ శరత్కాలమునందు మధుర రసమును, శీత వీర్యమును, తిక్తరసమును గలిగినట్టియు, పిత్తమును శమింపజేయు నట్టిదియు అన్నపానములను బాగుగ ఆకలి గలిగినప్పుడు తగు పరిమితిగ సేవించవలయును లావుకపక్షి, కపింజల పక్షి, జింక, పొట్టేలు, శరభమృగము, కుందేలు వీనియొక్క మాంసములను, శాలిధాన్యమును, యవలను, గోధుమలను ఉపయోగింపవలయును తిక్తక ఘృతములను పానము చేయవలయును విరేచన కర్మను రక్తమోక్షణమును ఆచరింపవలయును ఎండ వస, తైలము, మంచు, ఉదకమునందును, అనూపదేశమునందును సంచరించు జంతువుల యొక్క మాంసములు, క్షారము, పెరుగు, పగటి నిద్ర, తూర్పుగాలి వీనిని వర్జించవలయును పగటియందు సూర్యకిరణములచే తపింపజేయబడినట్టియు, రాత్రియందు

చంద్రకిరణములచే చల్లగజేయబడినట్టియు కాల స్వభావముచే పక్వమునొంది నిర్దోషముగ నున్నట్టియు, అగస్త్యోదయముచే నిర్విషముగజేయబడినట్టియు నిర్మలముగను పరిశుభ్రముగను నున్నట్టియు శరత్కాలమునందలి ఉదకము హంసోదకమని చెప్పబడును ఈ ఉదకము స్నానమునకును, పానమునకును అవగాహస్నానమునకు అమృతముతో సమానముగ నుండును. శరత్కాలమునందలి పుష్పమాలికలను పరిశుభ్రములైన వస్త్రములను సాయంకాలమునందలి చంద్రకిరణములను సేవింపవలయును

చ పా వ్యా అం అ వర్షా అను మొదలగు శ్లోకములతో శరద్విధిని చెప్పుచున్నాడు ఉచితం = అలవాటు పడిన, చలికి అలవాటుపడిన అంగములు గలవారికి 'సహసైవ' ' అను పదమును చెప్పుట ద్వారా శరత్కాలమున, అనభ్యస్తమైన తీవ్రమైన ఎండవలన పిత్తప్రకోపము గలుగుట సమంజసమే యని చెప్పుచున్నాడు అచితం - అనగా వర్ష ఋతువున సంచితమైన, ప్రాయః అని చెప్పుట ద్వారా వర్షాకాలమున పిత్తచయ ప్రతికూల విధిని ప్రయత్నపూర్వకముగ ఆచరించుట వలన వర్షఋతువున పిత్తచయమూ గాదు శరత్తున పిత్తప్రకోపమూ జరుగదు అని చెప్పుచున్నాడు దీనిని సామాన్య న్యాయముగా గ్రహించి వాతశ్లేష్మముల యొక్క చయ ప్రకోపములకు కూడా అన్వయించుకోవలయును లేక పిత్తము తరచుగాను శ్లేష్మము అనుబంధముగానుండుననియు అర్థము ఇదే విషయము "తస్యచానుబలః కఫః" అని చ చి 3 అధ్యాయమున చెప్పబడినది లఘు అన్నపానములు అగ్ని సంధుక్షణార్థము చెప్పబడినవి ఇచ్చట పిత్తము అగ్నికి సమానమేయైనప్పటికిని పిత్తము ద్రవాంశ సంబంధముచే అగ్నిని మందగింపజేయును గ్రహణీ అధ్యాయమున గూడా "అప్లావయద్ధం త్యనలం జలంతప్త మివానలం" చ చి 15, అనగా పిత్తము అగ్ని సమానగుణము గలదైనప్పటికిని ఉష్ణజలముగూడా అగ్నిని చల్లార్చు విధమున ద్రవగుణముచే పిత్తము జఠరాగ్నిని నశింపజేయునని చెప్పబడినది భోజనమునకు మాత్రావత్త్వము స్వభావసిద్ధమైనప్పటికిని తిరిగి మాత్రాప్రమాణముతో తీసుకోవలయునని చెప్పుట మాత్రాతిక్రమణమున విశేషించి దోషభూయిష్టత చెప్పుటకొరకే ఇచట "మాత్రయా" అని చెప్పబడినది, సుప్రకాంక్షితైః = బాగుగా ఆకలిగొన్న వారితో, ఉరభ్రః = మేక, ఘనాత్యయే అని మరల చెప్పుట వలన శరత్కాల ప్రవేశముననే ఈ విధిని ఆచరింవలయునని గ్రంధాదిక్యతవలన సూచించుచున్నాడని కొందరు వ్యాఖ్యానించుచున్నారు మా అభిప్రాయముననుసరించి పర్యాయ శబ్దములు

మాటిమాటికి చెప్పుట వలన శాస్త్రమున ఎక్కడ వాటి అర్థము గోచరించునో అక్కడ ఆ తాత్పర్యమునే గ్రహించవలయును ఎక్కడైతే తాత్పర్యాంతరము గనబడదో అక్కడ వాక్య భేదముతో పునరభిధానము చేయబడును ధారాధరాత్యయే = మేఘములేనప్పుడు, అనగా శరత్కాలము ప్రవ్యక్తమైనపుడు తిక్తసర్పిష్పానము విరేకాదులు చేయించవలయును దీనికి క్రమము గూడా ఆచార్యుడీవిధముగా చెప్పినాడు అదెట్లనగా మొదట సర్పిష్పానము చేయించవలయును దానితో పిత్తశమనము జరగని ఎడల విరేచనము, దానితోను పిత్తశమనము గాని ఎడల, రక్తదుష్టిగూడా యున్నపుడు రక్తమోక్షణము చేయించవలయును ఇచ్చట రక్తము గూడా కాల స్వభావముననుసరించి తరచుగా దూషింపబడును శాస్త్రమున గూడా "శరత్కాల స్వభావాచ్ఛ శోణితం సంప్రదుష్యతి" అనగా శరత్కాల స్వభావము వలన గూడా రక్తము దూషింపబడునని చ సు 24 అధ్యాయమున చెప్పబడినది "దివాసూర్యాంశు సంతప్తం" అను శ్లోకార్థము సూర్యాంశుతాపము అను వాక్యముతోనే "దినమున" అను అర్థము వచ్చినప్పటికిని "దివా" అని చెప్పుటతో మొత్తము దినము అని అర్థము సూర్యతప్తమని చెప్పవలసియుండగా "అంశుశబ్దమును" గ్రహించుట వలన మేఘావరణ రహితములైన కిరణములు గల సూర్యుడు అని అర్థమును చెప్పవచ్చును "సంతప్తః" అనుచోట "సం" శబ్దము విస్తృతమైన తాపమును బోధించుచున్నది ఇదే విధముగా నిశి మొదలగు సందర్భములలో గూడా అర్థమును గ్రహించవలయును "చంద్రాంశు" అని చెప్పుటచేత రాత్రియందు సౌమ్యాంశ సంబంధమును తెలియజేయుచున్నాడు "కాలేన" అనగా శరత్కాల స్వభావముచేత అని అర్థము పక్వమనగా వర్షములందు కొత్తగా భూమి సంబంధముచే జనించిన, పైచిల్య వ్యమ్ల త్వాది దోషరహితమైన అని అర్థము పక్వమగుట వలననే దోషరహితముగాదు అని అర్థము "అగస్త్యేనావిషీకృతం" అనగా అగస్త్యనక్షత్రచంద్రోదయముచే తత్ప్రభావమువలన వర్షము లందు మేఘ సంబంధము, సర్ప, లూతాదుల సంబంధముతో సవిషమైన జలము, నిర్విషమగునని చెప్పవచ్చును ఇట్లు నిర్విషముగా చేయబడిన జలము హంసోదకమనబడును హంస శబ్దమునకు సూర్యచంద్రులని అర్థము వారిద్దరిచే శుద్ధిచేయబడిన ఉదకము హంసోదకము లేక హంసలు శుద్ధమైన ఉదకమునే సేవించునుగాన హంసలు సేవించుటకు యోగ్యమైన జలము అను అర్థముగూడా హంసోదకమునకు చెప్పవచ్చును అవగాహః = చాలా కాలము నీటియందు ఉండుట, ఇతర ఋతువులందలి పుష్పములను నిషేధించుటకు "శారదాని" అని విశేషణము

చేర్చబడినది "ప్రదోషే" అని చెప్పుటవలన రాత్రిప్రవేశ కాలముననే చంద్రకిరణములు సేవించవలయునుగాని తరువాత అనగా రాత్రికొంత గడచిన తరువాత చలిబాధించునుగాన అప్పుడు చంద్రాంశుసేవన హితము గాదని అర్థము ఇచట పూర్వఋతు సాత్మ్యత్యాగము, భవిష్యదృతుసాత్మ్య అభ్యాసములు, పూర్వఋతువు అంతము నందలి 7 దినములు, రాబోవు ఋతువు యొక్క మొదటి 7 దినములలో చేయవలయును అనగా పూర్వ ఋతుసాత్మ్యత్యాగము, పూర్వ ఋతువు యొక్క చివరి ఏడు దినములలో క్రమముగా చేసి భవిష్యదృతుసాత్మ్య అభ్యాసము క్రమంగా రాబోవు ఋవువు యొక్క మొదటి 7 దినములలో చేయవలయునని యర్థము ఇదే విషయమున వాగ్భటుడు "ఋత్వోరంత్యాది సప్తాహావృతు సంధిరితిస్మృతః తత్ర పూర్వోవిధిస్త్యాజ్యః, సేవనీయః పరః క్రమాత్" అనగా ఋతువుల యొక్క అంతములైన ఏడు దినములు, ఆదులైన ఏడుదినములు ఋతుసంధిగా చెప్పబడును వాటలో పూర్వఋతువిధిని పూర్వఋతువుయొక్క చివరి ఏడు దినములలో క్రమముగా విడుచుచూ భవిష్యదృతువు యొక్క విధిని భవిష్యదృతువు యొక్క మొదటి 7 దినములలో క్రమముగా అభ్యసించవలయునని వాగ్భట సూ॥ 3 వ అధ్యాయమున చెప్పియున్నాడు (41-48)

మూ॥ ఇత్యుక్తమృతుసాత్మ్యంయచ్చే ష్టాహారవ్యపాశ్రయం।
ఉపశేతే యథౌచిత్యాదోకసాత్మ్యం తదుచ్యతే॥

**తాత్పర్యము** ఈ విధముగ ఋతుసాత్మ్యములగు చేష్టలును, ఆహారములు చెప్పబడినవి ఏది అభ్యాసముగ నుండుట వలన వికృతిని గలిగింపదో అది ఓకసాత్మ్యమని చెప్పబడును

**చ పా వ్యా ఆం అ** "ఇత్యుక్తం" అను శ్లోకముతో ఉపసంహారము చేయుచున్నాడు ఋతుసాత్మ్య ప్రసంగమున "ఉపశేతే" అను శ్లోక పాదముతో అభ్యాససాత్మ్యమును చెప్పుచున్నాడు ఉపశేతే = సుఖమును గలిగించునో, అపథ్యమైనప్పటికిని వికారమును గలిగించనిది అభ్యాససాత్మ్యము , దానికి కారణమును చెప్పుచున్నాడు ఔచిత్యాత్ = అభ్యసించుట వలన, అపథ్యము గూడా నిరంతరాభ్యాసము వలన, ఆశీవిషమునకు విషము నాశనము గలిగించని విధముగా శరీరమునకు వికారమును గలిగించదు అని భావము (49)

మూ॥ దేశానామామమాయానంచ విపరీతం గుణం గుణైః।
సాత్మ్యమిచ్ఛన్తి సాత్మ్యజ్ఞాశ్చేష్టితం చాద్యమేవచ॥ 50॥

తాత్పర్యము  ఆయా దేశములకు విపరీతములైన ధర్మములు గల చేష్టలును ఆహారములును దేశసాత్మ్యములని చెప్పబడును  ఆయా వ్యాధులకు విపరీతములైన ధర్మములు గల చేష్టలును ఆహారములును రోగసాత్మ్యములని చెప్పబడును

చ పా వ్యా ఆం అ  దేశానాం అను శ్లోకముతో దేశసాత్మ్యమును, రోగసాత్మ్యమును చెప్పుచున్నాడు  దేశానాం = అనూపము మొదలగు దేశములయొక్క, గుణైః = స్నేహగురుత్వాది గుణములతో, విపరీత గుణం = స్నేహగురుత్వాది గుణములకు విపరీత గుణములైన రూక్ష, లఘు గుణయుక్తములైన జాంగలమాంసము, మధువు - మొదలగునవి  ఆద్యం = తినదగినది, చేష్టితం = వ్యాయామము మొదలగు కర్మలు , ఇట్టివాటిని ఆయుర్వేదజ్ఞులు దేశసాత్మ్యములుగా గ్రహించినారు  ఇట్లే వ్యాధి విపరీతములు గూడా గ్రహించవలయును  గుణ శబ్దముతో నిచట ధర్మమును మాత్రము గ్రహించవలయును

ఉదా  ద్రవ్యగుణమనగా ద్రవ్యధర్మమని యర్థము  దీనితో విపరీత ప్రభావము మొదలగునవి గూడా గ్రహించబడును  ఆమయశబ్దముచే ఆమయ కారణములను గూడా గ్రహించవలయును  అందువలన ఆమయ విపరీతములు, అట్లే ప్రభావ వైపరీత్యము వలన తద్విపరీతార్థకరములు గూడా గ్రహించబడును  వీటికు దాహరణములను సందర్భముననుసరించి నిదాన స్థానమున ఇవ్వగలము  "ఆద్య" అని చెప్పుటవలన ఓషధ ఆహారములు గ్రహించబడును  అట్లే "చేష్టితం" అను శబ్దముతో స్వప్నము, అభ్యంగము మొదలగు వాటిని గ్రహించవలయును  (50)

తత్రశ్లోకాః -

మూ॥ ఋతావృతౌ నృభిః సేవ్యయసేవ్యంయచ్చకించన।
తస్యాశితీయే నిర్దిష్టం హేతుమత్సాత్మ్యమేవచ ॥

తాత్పర్యము  ప్రతి ఋతువునందు సేవింపదగినవియు, సేవింపకూడనివియు హేతువులతోకూడిన సాత్మ్యములును ఈ తస్యాశితీయము అను అధ్యాయమునందు చెప్పబడినవి

చ పా వ్యా ఆం అ  "ఋతావృతే" అను శ్లోకముచే చెప్పబడిన అధ్యాయార్థమును పసంహరించుచున్నాడు  ఈ అధ్యాయమున హేమంత ఋతువున సేవించగూడనిది కంఠోక్తిగా ప్రతిపాదించనప్పటికిని "సయదానేంధనం యుక్తంలభతే" అను మొదలగు వాక్యములుండుటచే అల్ప భోజన పరిహారము చెప్పినట్లే యగును  అందువలన ఈ

శ్లోకమున చెప్పబడిన ప్రతిఋతువులో సేవింపదగినవి, సేవించదగనివి అని చెప్పిన వాక్యము అర్థవంతమైనది లేక "ఛత్రిణోగచ్ఛంతి" అను న్యాయముననుసరించి గ్రహించుకోవలయును శిశిర పరిహార విధిగూడా హేమంత పరిహార విధివలెనే తెలుసుకోవలయును "హేతుమత్" అనగా ఉపపత్తి గలిగి ఔచిత్యాది హేతునిర్దేశోపపన్నమని యర్థము

మూ॥ ఇత్యగ్నివేశకృతేతంత్రే చరకప్రతి సంస్కృతే సూత్రస్థానే
స్వస్థవృత్తచతుష్కేతస్యాశితీయోనామ షష్ఠోఽధ్యాయః

తాత్పర్యము ఈ విధమున అగ్నివేశ కృతమైన, చరక ప్రతిసంస్కృతమైన తంత్రమునందు స్వస్థవృత్తచతుష్కమున తస్యాశితీయమను అధ్యాయమునకు చక్రపాణి విరచితమైన ఆయుర్వేదదీపికావ్యాఖ్యా నమునకు డా శాస్త్రుల మాణిక్యశర్మ విరచితమైన ఆంధ్రానువాదము

# ఏడవ అధ్యాయము

మూ॥ అథాతో నవేగాన్ధారణీయ మధ్యాయం వ్యాఖ్యా స్యామః॥
ఇతి హస్మాహ భగవానాత్రేయః 2

నవేగాన్ ధారయేద్ధీమాఖ్జాతాన్మూత్ర పురీషయోః।
నరేతసో న వాతస్య న వమ్యాః క్షవథోర్నచ ॥ 3

నోద్గారస్య నజృమ్భాయాన వేగాన్ క్షుత్పిపాసయోః
న బాష్పస్య న నిద్రామా నిః శ్వాసస్య శ్రమేణ చ॥ 4

తాత్పర్యము పిమ్మట నవేగాన్ధారణీ యాధ్యాయమును చెప్పబోవుచున్నాను అని భగవంతుడు ఆత్రేయుడు చెప్పెను మూత్రము, పురీషము, శుక్రము, అపాన వాతము, వాంతి, తుమ్ము, త్రేనుపు, ఆవలింత, ఆకలి, దప్పిక, కన్నీరు, నిద్ర, శ్రమ వలన కలిగిన నిశ్వాసము వీని యొక్క వేగములను జనించినపుడు అరికట్టకూడదు

చ పా వ్యా ఆం అ పై రెండు అధ్యాయములలో ప్రధానముగా స్వస్థహితమైన ఆహారము చెప్పబడినది అట్టి ఆహారము గూడ ఆహారపాక జన్యములైన మూత్రపురీషాదులను అడ్డగించక బయల్వెడలించినపుడే స్వాస్థ్యమును గలిగించును అందువలన మూత్రాది వేగములను ధరింపగూడదని ఉపదేశించునవేగాన్ ధారణీయమును చెప్పుచున్నాడు ఇచ్చట గూడ "నవేగ ధారణం' అను శబ్దము లేక మాత్రాశితీయము వలె పర్యాయశబ్దము "న వేగధారయేత్" అని గ్రహించబడినదిగా తెలుసుకోవలయును జాతాన్ = పుట్టిన వెంటనే, వేగః = మూత్రపరీషాదుల యొక్క

బహిః ప్రవృత్తి (బయల్వెడలుట) పురీషాదుల కంటె వేగము గలది గావున మూత్రము మొదట చెప్పబడినది మూత్ర పురీషములు, క్షుత్పిపాసములు అని సమాసముగా చెప్పుట తరచుగా అవి ఒకేసారి కలిసి ఉత్పన్నమగునని తెలియజేయుట కొరకు ప్రతిపదము చివర 'న' కారము చెప్పుట వాటివాటి నిషేధమునకు గల ఆవశ్యకతను ఇనుమడింపజేయుటకు, నిఃశ్వాసస్య శ్రమేణచ అనగా శ్రమవలన గలిగిన నిఃశ్వాసము నడ్డగించ గూడదని తెలుపబడినది. ఈ విషయమునే ముందు "శ్రమనిః శ్వాసధారణాత్' ' అని చెప్పబడును సుశ్రుతమున గూడ "శ్రాంతస్యనిః శ్వాసవినిగ్రహేణ హృద్రోగ మూర్ఛే అథవాఽపి గుల్మః" అనగా శ్రమజన్యమైన నిఃశ్వాస అడ్డగించుట వలన హృద్రోగము, మూర్ఛ లేక గుల్మము గలుగునవి సు ఉ 55 అధ్యాయమున చెప్పబడినది

మూ॥ ఏతాన్ ధారయతో జాతాన్ వేగాన్ రోగాభవన్తి యే।
పృథకృథక్చికిత్సార్థం తన్మే నిగదతః శృణు॥ 5

వస్తిమేహనయోః శూలం మూత్రకృచ్ఛ్రం శిరోరుజా।
వినామో వంక్షణానాహః స్యాల్లి ఙ్గం మూత్రనిగ్రహే॥ 6

స్వేదావగాహనాభ్యఙ్గాన్ సర్పిషశ్చావ పీడకమ్।
మూత్రే ప్రతిహతే కుర్యాత్త్రివిధం వస్తికర్మచ ॥ 7

పక్వాశయ శిరః శూలం వాతవర్చోనిరోధనమ్।
పిణ్డికోద్వేష్టనాధ్మానం పురీషే స్యాద్విధారితే॥ 8

స్వేదాభ్యఙ్గావగాహాశ్చ వర్తయో వస్తికర్మచ।
హితం ప్రతిహతే వర్చ స్యన్నపానం ప్రమాథి చ॥ 9

మేఢ్రే వృషణయోః శూల మఙ్గమర్దో హృది వ్యథా।
భవే త్ప్రతిహతే శుక్రే విబద్ధం మూత్ర మేవచ ॥ 10

తత్రాభ్యఙ్గావగాహశ్చ మదిరా చరణాయుధాః।
శాలిః వయో నిరూహాశ్చ శస్తం మైథున మేవ చ। 11

వాతమూత్ర పురీషాణాం సఙ్గో ధ్మానం క్లమో రుజా।
జఠరే వాతాజాశ్చాన్యే రోగాః స్యుర్వాత నిగ్రహాత్॥ 12

స్నేహ స్వేద విధిస్తత్ర వర్తయో భోజనాని చ।
పానాని వస్తయశ్చైవ శస్తం వాతానులోమనమ్॥ 13

కణ్డూకోఠారుచివ్యఙ్గశోథ పాణ్డ్వామయ జ్వరాః।
కుష్ఠ హృల్లాస వీసర్పాశ్ఛర్ది నిగ్రహజాగదాః॥ 14

భుక్త్వా ప్రచ్ఛర్దనం ధూమో లఙ్ఘనం రక్తమోక్షణమ్।
రూక్షాన్నపానం వ్యాయామో విరేకశ్చాత్ర శస్యతే॥ 15

మన్యాస్తమ్భః శిరః శూల మర్దితార్ధావ భేదకౌ।
ఇన్ద్రియాణాం చ దౌర్బల్యం క్షవథోః స్యాద్విధారణాత్ ॥ 16

తత్రోర్ధ్వజత్రుకేఽ భ్యఙ్గః స్వేదో ధూమః సనావనః।
హితం వాతఘ్నమాద్యం చ ఘృతం చోత్తర భక్తికమ్॥ 17

హిక్కా కాసోఽరుచిః కమ్పోవిబన్ధో హృదయోరసోః।
ఉద్గార నిగ్రహాత్తత్ర హిక్కాయాస్తుల్య మౌషదమ్॥ 18

వినామాక్షేపసంకోచాః సుప్తిః కమ్పః ప్రవేపనమ్।
జృమ్భాయాని గ్రహాత్తత్ర సర్వం వాతఘ్నమౌషధమ్ 19

కార్శ్యదౌర్బల్య వైవర్ణ్యమఙ్గమర్దోఽరుచి చిభ్రమః।
క్షుద్వేగ నిగ్రహాత్తత్ర స్నిగ్ధోష్ణం లఘు భోజనమ్॥ 20

కణ్ఠాస్యశోషో బాధిర్యం శ్రమః శ్వాసోహృది వ్యథా।
పిపాసా నిగ్రహాత్తత్రశీతం తర్పణ మిష్యతే॥ 21

ప్రతిశ్యాయోఽక్షిరోగశ్చ హృద్రోగ శ్చారుచిభ్రమః।
బాష్పనిగ్రహాణాత్తత్ర స్వప్నో మద్యం ప్రియాః కథాః॥ 22

జృమాఙ్గమర్దస్తన్ద్రా చ శిరోరోగాక్షి గౌరవమ్।
నిద్రావిధారణాత్తత్ర స్వప్నః సంవాహనాని చ। 23

గుల్మ హృద్రోగ సంమోహః శ్రమ నిశ్వాస ధారణాత్।
జాయన్తే, తత్ర విశ్రామో వాతఘ్నాశ్చ క్రియాహితాః॥24

వేగనిగ్రహజా రోగాయ ఏతే పరికీర్తితాః।
ఇచ్ఛం స్తేషానుత్పత్తిం వేగానేతాన్నధారయేత్॥ 25

5 - 25

తాత్పర్యము మూత్రాది వేగములను అడ్డగించుట వలన కలుగు రోగములను చికిత్సలతో కూడ వేఱువేఱుగ చెప్పెదను వినుము మూత్రవేగమును అడ్డగించిన

యెడల వస్తిప్రదేశము నందును, మేఢ్రమునందును శూల మూత్రకృచ్ఛ్రము తలనొప్పి శరీరము ముందుకు వంగుట గజ్జలయందు బాధ ఇవి కలుగును అప్పుడు స్వేదకర్మ అవగాహన స్నానము అభ్యంగము అవపీడక మనెడి ఘృతపానము మూడు విధములగు వస్తికర్మలు వీనిని చేయింపవలయును పురీష వేగమును అడ్డగించిన యెడల పక్వాశయమునందును శిరస్సునందును శూల అపాన వాతమును పురీషమును ప్రవర్తింపకుండుట పిక్కల యందు మెలి వేసినట్లు బాధ కడుపుబ్బరము ఇవి కలుగును అపుడు స్వేదకర్మ అభ్యంగము అవగాహన స్నానము ఫలవర్తులు వస్తికర్మ అనులోమనమును కలిగించు అన్నపానములు ఇవి హితములుగా నుండును శుక్రముయొక్క వేగమును అడ్డగించిన యెడల మేఢ్రము నందును వృషణముల యందును శూల ఒడలు నొప్పులు హృదయమునందు బాధ మూత్రము బంధించుట ఇవి కలుగును అపుడు అభ్యంగము అవగాహ స్నానము మదిరయనెడి మద్యము కోడి మాంసము శాల్యాన్నము పాలు నిరూహవస్తి మైథునము నాచరించుట ఇవి హితకరములుగ నుండును అపానవాతము యొక్క వేగమును అడ్డగించిన యెడల అపానవాతము యొక్కయు, మూత్రము యొక్కయు, పురీషము యొక్కయు బంధము కడుపుబ్బరము బడలిక బాధ ఉదరమునందు వాతము వలన కలుగు ఇట్టి ఇతర వ్యాధులు ఇవి కలుగును అప్పుడు స్నేహకర్మము, స్వేదకర్మము ఫలవర్తులును భోజనములు పానములు వస్తికర్మ వాతానులోమనములగు ఇవియు హితకరములుగా నుండును వాంతి యొక్క వేగమును అడ్డగించిన యెడల దురద దద్దుర్లు అరుచి ముఖమునందు కలిగెడు వ్యంగమనెడి రోగము నంజు పాండురోగము జ్వరము, కుష్టము, ఓకరింత, విసర్పము ఇవి కలుగును అప్పుడు భుజింప చేసి వాంతిని జేయించుట ధూమపానము లంఘనము, రక్తమోక్షణము, రూక్షములగు అన్నపానములు వ్యాయామము విరేచనమును చేయించుట ఇవి హితకరములుగ నుండును తుమ్ముయొక్క వేగమును అడ్డగించిన యెడల మన్యాస్తంభము తలనొప్పి అర్ధితము, అర్ధావభేదము ఇంద్రియములకు దౌర్బల్యము ఇవి కలుగును అప్పుడు మెడ కొంకులకు పై భాగమునందు అభ్యంగము చేయుట స్వేదకర్మ ధూమపానము నస్యకర్మ వాతనాశకమగు ఆహారము భుజించిన వెంటనే ఘృతపానమును చేయుట ఇవి హితకరములుగ నుండును త్రేనుపు యొక్క వేగమును అడ్డగించిన యెడల ఎక్కిళ్ళు, దగ్గు, అరుచి, వణుకు హృదయమును ఱొమ్మును బిగపట్టినట్లుండుట ఇవి కలుగును అప్పుడు హిక్కవ్యాధికి చెప్పబడిన చికిత్సలను చేయింపవలయును

ఆవలింతల యొక్క వేగమును అడ్డగించిన యెడల శరీరము ముందుకు వంగుట, అవయవములు ముడుచుకొనిపోవుట, స్పర్శజ్ఞానము లేకపోవుట, కంపవాతము, వణకుట ఇవి కలుగును అపుడు సర్వ విధములగు వాతహర చికిత్సలను చేయింపవలయును ఆకలి వేగమును అడ్డగించిన ఎడల కృశించుట, దౌర్బల్యము, కాంతి తగ్గుట, ఒడలు నొప్పులు, అరుచి, భ్రమ ఇవి కలుగును అప్పుడు స్నిగ్ధముగను, ఉష్ణముగను, లఘువుగను నుండు భోజనము హితకరముగ నుండును దప్పికయొక్క వేగమును అడ్డగించిన యెడల కంఠమును, నోరును ఎండుట, చెవుడు, బడలిక ఆయాసము హృదయమునందు బాధ ఇవి కలుగును అపుడు చల్లనివి యగు తర్పణములనీయవలయును కన్నీటి వేగము నడ్డగించిన యెడల పడిసెము, నేత్రరోగములు, హృద్రోగము అరుచి భ్రమము ఇవి కలుగును అపుడు నిద్ర మద్యపానము మనోహరములగు కథలు ఇవి హితకరములుగ నుండును నిద్రయొక్క వేగమును అడ్డగించిన యెడల ఆవలింతలు, ఒడలు నొప్పులు, జోగు, శిరోవ్యాధులు కండ్లు బరువుగ నుండుట ఇవి కలుగును అప్పుడు నిద్రయు శరీరము పిసికించుకొనుటయు, హితకరముగ నుండును శ్రమవలన కలిగిన నిశ్వాసము యొక్క వేగమును అడ్డగించిన యెడల గుల్మము, హృద్రోగము మోహము ఇవి కలుగును అప్పుడు విశ్రాంతియు వాతనాశకములగు క్రియలును హితకరములుగ నుండును పైన చెప్పబడిన వేగ నిగ్రహజ వ్యాధులు పుట్టకుండ నుండవలయునని కోరువాడు ఈ వేగములను అడ్డగింపకూడదు

చ పా వ్యా.ఆం అ ఏ వేగమును ధరించినపుడు ఏ రోగము కలుగునో వాటికి ఏ చికిత్స చేయవలయునో దానిని ప్రకరణమునందు గురించి కొంచమైనా చెప్పవలయును గాన సంక్షిప్తముగా ఆ విషయమును "వస్తిమేహనయోః" అను మొదలగు శ్లోకములతో చెప్పుచున్నాడు మేహనం = శిశ్నము, వినమనం = శరీరము వంగుట, అవపీడకం = ఎక్కువ మాత్రలో ప్రయోగించుట, ఔషధము మాత్రాధికమైనపుడు దోషములను పీడించును గావున ఇంకొకచో గూడా "అవపీడకసర్పిర్భిః కోష్ణైః క్షతతైలికైస్తథాన భ్యక్తైః' ' అని చెప్పబడినది త్రివిధం = అనగా నిరూహ, అనువాసన, ఉత్తర వస్తుల రూపమున, పిండికా = జాను, జంఘల మధ్య నున్న మాంసపిండిక, వర్తయః= ఫలవర్తులు ప్రమాధిః అనులోమనము చరణాయుధ =కోడి, రుజా ఉదరమున బాధ భోజనములు, పానములు, వస్తులు ఈ మూడు అనులోమనమున శ్రేష్ఠమని గ్రహించవలయును కోరః = ఎఱ్ఱని వాపు, వ్యంగః = ముఖముపైన నల్లని మచ్చ,

హృల్లాసః = ఓకరింతలు, అర్ధావభేదః = ఓంటి (పార్శ్వపు) తలనొప్పి, అద్యం = తినదగినది, భోజనమని యర్థము చ కారము వలన స్వేదాదులు గూడా వాతఘ్నములని సూచించుచున్నాడు సుశ్రుతమున మూత్రాది 13 విధములైన వేగములను నిరోధించుట వలన 13 ఉదావర్తములు చెప్పబడినప్పటికిని ఈ గ్రంధమున మాత్రము అష్టోదరీయమున మూత్ర, పురీష, వాత, శుక్ర, వమి, క్షవధు విఘాత జన్యములైన 6 ఉదావర్తములు మాత్రమే చెప్పవలసి ఉన్నవి ఉద్గారాదుల నిరోధించుట వలన కలుగు ఉదావర్తములు వాత నిరోధజన్య ఉదావర్తముననే అంతర్భవించునను అభిప్రాయమే ఇందుకు కారణము లేక మూత్రాది జన్యవికారములతోనే చరకాచార్యుని ఉదావర్తము చేర్చబడినదని చెప్పుటలో విరోధము లేదు మాటిమాటికి అవయవములను కదలించుట ఆక్షేపము, కీళ్ళు ముడుచుకొనుట, సంకోచము, సుప్తి = స్పర్శ తెలియకుండుట, భ్రమణం = భ్రమ, తిరుగుచున్న చక్రముపై నున్నట్లుండుట, సాదః=అంగావసాదము, తృప్తిని కల్గించునది తర్పణము, చేతితో పాదము మొ॥ ప్రదేశములందు మెల్లగా తాకుట మరియు రాచుట

మూ॥ ఇమాంస్తు ధారయే ద్వేగాన్ హితై ప్రేత్యచేహ చ।
సాహసానామ శస్తానాం మనో వాక్కాయ కర్మణామ్॥ 26

తాత్పర్యము ఇహలోకము నందును పరలోకము నందును మేలుకోరిన మనుజుడు సాహసములైనట్టియు అప్రశస్తములైనట్టియు మనో వాక్కాయ కర్మల సంబంధమైనట్టియు చెప్పబడబోవు నట్టియు వేగములను ధరింపవలయును

చే పా వ్యా ఆం అ వేగములను ధరించకూడదని చెప్పుటవలన లోభాది వేగములను గూడా ధరించవలెనని యర్థము కావున వాటిని గూడ ధరించ వలెనా, ధరించకూడదా అను విషయమును ఇమాంస్తు అను శ్లోకముతో చెప్పుచున్నాడు ప్రేత్య = జన్మాంతరమున , ఇహ = ఈ జన్మలో, సాహసం = తొందరపాటుతో తన శక్తిని ఆలోచించకపనిచేయుట సాహసము ఉదా ఏనుగున కెదురుగా వెళ్ళుట మొదలగునవి అశస్తానామ్ = అప్రశస్తములైన, అనిష్టఫలములనిచ్చు వాటియొక్క మనోవాక్కాయకర్మణాం అనుచోట కర్మవచ్చిన వ్యాపార వాచకము

మూ॥ లోభశోక భయక్రోధ మానవేగాన్ విధారయేత్।
నైర్లజ్జ్యేర్ష్యాతిరాగాణా మభిధ్యాయాశ్చ బుద్ధిమాన్॥ 27

తాత్పర్యము లోభము, శోకము, భయము, కోపము, అభిమానము, నిర్లజ్జ, ఈర్ష్య, అత్యాశ, ద్రోహచింతనము వీని యొక్క వేగములను ధరింపవలయును

చ పా వ్యా ఆం అ  లోభ అను శ్లోకముతో అప్రశస్తమైన మనస్సు యొక్క కర్మను తెలుపుచున్నాడు లోభః = అనుచిత విషయమును కోరుకొనుట, శోకః = పుత్రాదులు నశించుట వలన కల్గిన దైన్యము భయము = అపకారము వలన జనించిన దైన్యము, క్రోధః = ద్వేషము, దీనిలో వ్యక్తి తాను ఉడికి పోవుచున్నట్లుగా తలచుట, మానః = మంచి చెడు గుణములను తనయందారోపించుకుని తననుతాను గొప్పవాడుగా తలంచుట, లజ్జా = హేయములైన వాటిని దాచుకొన ప్రయత్నించుట, దానికి విపరీతమైనది నిర్లజ్జ అనగా దాచవలసినవి దాచకుండుట, తనకు కావలసిన వస్తువునందు ఇతరుల జోక్యమును ఇష్టపడకుండుట ఈర్ష్య అతిరాగః = విషయము మంచిదేయైనప్పటికిని మాటిమాటికి దానియందు ప్రవర్తించు కోరిక అభిద్యా = ఇతరులకు ద్రోహము తలపెట్టుట లేక ఇతరుల ద్రవ్యములందు తలపు

మూ॥ పరుషస్యాతి మాత్రస్య సూచక స్యానృతస్య చ।
వాక్యస్యాకాలయుక్తస్య ధారయే ద్వేగముత్థితమ్॥ 28॥

**తాత్పర్యము** పరుషముగ నుండునట్టియు, అధికముగా నుండునట్టియు వైమనస్యమును కలిగించునట్టియు, అసత్యమైనట్టియు, సందర్భము లేనట్టియు, వాక్యము యొక్క వేగమును ధరింపవలయును

**చ పా వ్యా ఆం అ** పరుషస్య అను శ్లోకముతో అప్రశస్తమైన వచన కర్మను చెప్పుచున్నాడు పరుషం = ఇతరులను కవ్వించుమాటలు , అతి మాత్రం = ఎక్కువగా, సూచకస్య = కొండెములు చెప్పువానియొక్క, అనృతస్య = అబద్ధములు చెప్పువాని యొక్క అకాలయుక్తమ్ = అనవసరపు మాట

**తాత్పర్యము** పరస్త్రీ సంభోగము, దొంగతనము, హింసించుట మొదలగునట్టి ఇతరులకు బాధను కలిగించునట్టియు శరీర వ్యాపారము యొక్క వేగమును ధరింపవలయును

చ పా వ్యా ఆం అ  అప్రశస్తమైన దేహకర్మను చెప్పుచున్నాడు పరపీడయా ఇతరులను పీడించుట నిమిత్తముగా గలది యని యర్థము స్త్రీ భోగః = పరస్త్రీని అనుభవించుట, స్తైయం = పరద్రవ్య గ్రహణమ్ , హింసా = విధి రహితమైన ప్రాణి పీడ ఆది శబ్దముతో గురువున కెదురుగా కాళ్ళుచాచుట మొదలగునవి గ్రహించవలయును

మూ॥ పుణ్యశబ్దో విపాపత్వాన్మనోవాక్కాయ కర్మణామ్।
ధర్మార్థ కామాన్ పురుషః సుఖీభుజ్క్తే చినోతి చ॥ 30

**తాత్పర్యము** మనస్సు, వాక్కు, శరీరము వీని యొక్క కర్మలసంబంధమైన పాపము లేనివాడగుట వలన ధర్మార్థ కామములను సుఖముగ అనుభవించుట మరియు వీనిని వృద్ధి పఱచుకొనును

**చ పా వ్యా ఆం అ** పుణ్య అను శ్లోకముతో పై అప్రశస్తములైన మనోవాక్కాయ కర్మలను ఆపుట వలన కలుగునో దానిని చెప్పుచున్నాడు పుణ్యశబ్దః = పవిత్రమను శబ్దముగలది భుజ్తేచినోతిచ = ఉత్పన్నములైన ధర్మార్థకామములను విరోధము లేకుండా అనుభవించును మరియు వాటిని విరోధము లేకుండా సంపాదించును అని యర్థము

మూ॥ శరీర చేష్టా యా చేష్టా స్థైర్యార్థా బలవర్ధినీ।
దేహవ్యాయామ సంఖ్యాతా మాత్రయా తాం సమాచరేత్॥ 31

**తాత్పర్యము** స్థైర్యమును కల్గించునట్టియు, బలము వృద్ధిపరచునట్టియు, ఇష్టమైనట్టియు శరీర చేష్ట శరీర వ్యాయామమని చెప్పబడును దీనిని తగుపరిమితిగా ఆచరింప వలయును

**చ పా వ్యా ఆం అ** ఆపుకోవలసిన మూత్రాది వేగములను ఆపుకోదగని సాహసాది వేగములను చెప్పి, ఆపుకోదగనిదియైన వ్యాయామమును చెప్పుచున్నాడు దేహము యొక్క వ్యాయామము, దేహ వ్యాయామమని చెప్పుట వలన మానసిక వ్యాయామము అయిన చింతనము మొదలగు వానిని నిరాకరించుచున్నాడు. సంఖ్యాతా = పేరిడ బడినది, యాచ ఇష్టా = యేదైతే ఇష్టమైనదో, దేనితో భారహరణము మొదలగునవి కార్యవశమున చేయబడు, ఇష్టముగాని చేష్ట నిరాకరింపబడి చంక్రమణ రూపమైన క్రియ ప్రాప్తించుచున్నది స్థైర్యార్థ = శరీరము స్థిరముగా నుండుటకు మాత్రయా = అనపాయకరమైన పరిమాణముతో శరీర చేష్ట ఏ ప్రమాణములో చేసిన చెప్పబోవు లఘుత్వము మొదలగు గుణము గలిగి చేష్టలు, యోగముచే గలుగు శ్రమ భ్రమ మొదలగు గుణములు గలుగకుండునో అది చేష్టామాత , సుశ్రుతమున గూడ "యత్తు చంక్రమణం నాతి పీడాకరం భవేత్। తదాయుర్బల మేధాగ్ని ప్రదమింద్రియ భోదనమ్।' ' అనగా శరీరమునకు ఎక్కువ బాధను కలిగించని చంక్రమణము ఆయుస్సుబలము, జరరాగ్ని వీటికి బలమును కలిగించి ఇంద్రియములను జాగృతములుగా చేయును అని చికిత్సా స్థానమున 24 అధ్యాయమున చెప్పబడినది

మూ॥ లాఘవం కర్మ సామర్థ్యం స్థైర్యం క్లేశసహిష్ణుతా।
దోషక్షయోఽగ్ని వృద్ధిశ్చ వ్యాయామా దుపజాయతే॥ 32
శ్రమః క్లమః క్షయస్తృష్ణా రక్తపిత్తం ప్రతామకః।
అతివ్యాయామతః కాసో జ్వరశ్చర్దిశ్చ జాయతే॥ 33
(స్వేదాగమః శ్వాస వృద్ధిర్గాత్రాణాం లాఘవం తథా ।
హృదయా ద్యుపరోధశ్చ ఇతి వ్యాయామ లక్షణం ॥)

తాత్పర్యము వ్యాయామము వలన శరీర లాఘవము, పనులు చేయుటకు సామర్థ్యము, స్థైర్యము, కష్టములను సహించుట, దోష క్షయము, జఠరదీప్తి ఇవి కలుగును వ్యాయామమును అధికముగ నాచరించినచో శ్రమ, బడలిక, ధాతుక్షయము, దప్పిక, రక్తపిత్తము, ప్రతమక శ్వాసము, దగ్గు, జ్వరము, వాంతి ఇవి కలుగును చమటపట్టుట, శ్వాసవృద్ధి, ఒడలు తేలికగా నగుట, మరియు హృదయము మొదలగునవి బిగబట్టినట్లుండును ఇవి వ్యాయామ లక్షణములు

చ పా వ్యా ఆం అ చెప్పబడిన వ్యాయామ గుణములను లాఘవం అను శ్లోకము ద్వార చెప్పుచున్నాడు దోషక్షయము అనుదానితో నిచ్చట శ్లేష్మ క్షయము అని గ్రహించబడినది లేక అగ్నిని కలిగించుట (వృద్ధినొందించుటచే) త్రిదోషక్షయమని గూడ గ్రహించవచ్చును "శమ ప్రకోపౌదోషాణాం సర్వేషామగ్ని సంశ్రితే" అని గూడ చెప్పబడినది అన్ని దోషముల యొక్క శమన ప్రకోపములు అగ్ని నాశ్రయించి యుండునని భావము వ్యాయామము అతి ప్రవృత్తి వలన కలుగు దోషములను "శ్రమః క్లమః" అనుదానితో చెప్పుచున్నాడు ఇచ్చట క్లమః అనగా మనస్సు ఇంద్రియముల యొక్క గ్లాని, క్షయః = ధాతుక్షయము ప్రతామక ః = ప్రతమక శ్వాస విశేషము (31-33)

మూ॥ వ్యాయామహాస్య భాష్యాధ్వగ్రామ్య ధర్మప్రజాగరాన్।
నోచితానపి సేవేత బుద్ధిమానతి మాత్రయా॥ 34

తాత్పర్యము వ్యాయామముతో హాస్యము, సంభాషణ, మార్గము, నడచుట, మైధునము, మేలుకొని యుండుట ఇవి అభ్యాసములుగ నున్నను అధికముగ సేవింపకూడదు

చ పా వ్యా ఆం అ వ్యాయామముతో సమానములైన ఇతర విషయములను గూడ అతిమాత్రతో ఉపయోగించుటను నిషేధించుటకై ఆ విషయములను 'వ్యాయామ' అను శ్లోకముతో చెప్పుచున్నాడు అతి వ్యాయామము ఇది వరకే నిషేధింపబడినప్పటికిని

ఇచ్చట మరల వ్యాయామమని చెప్పుటచేత అతిగ మాట్లాడుట మొదలగు వానియందు గూడ వ్యాయామ జన్య శ్రమ, క్లమాదులు గలుగునని తెలియజేయబడుచున్నది లేక మొదట వ్యాయామాతి సేవ యనగా అనభ్యస్తమైన వ్యాయామ అతి సేవనము అనగా అతిమాత్ర సేవన నిషేధము చేయబడినదని గ్రహించవలయును అందువలననే నోచితానపి అని చెప్పబడినది ఉచితాన్ అనగా అభ్యసించబడినవైనప్పటికిని అని అర్థము అపి శబ్దముతో అనభ్యస్తములైన వాటి అతి నిషేధము ప్రాప్తించు చున్నది భాష్యం = భాషణము, అధ్వ = (మార్గమున) నడచుట, గ్రామ్యధర్మః = మైథునము

మూ॥ ఏతానేవం విధాంశ్చాన్యాన్ యోఽతిమాత్రం నిషేవతే।
గజం సింహ ఇవాకర్షన్ సహసాస వినశ్యతి॥ 35

**(అతివ్యవాయభారాధ్వ కర్మభిశ్చాతి కర్శితాః**
**క్రోధశోకభయాయాసైః క్రాంతాః యేచాపి మానవాః॥ 1**

**బాలవృద్ధ ప్రవాతాశ్చ యేచోచ్చైర్బహు భాషకాః।**
**తేవర్జయేయుర్వ్యాయామం క్షుధితాస్తృషితాశ్చయే॥ 2**

**తాత్పర్యము** వీనిని గాని ఇట్టి ఇతరములుగాని ఎవడు అధికముగా సేవించునో వాడు సింహము ఆకర్షించిన ఏనుగువలె వెంటనే నశించును

మరియు అతిగా వ్యాయామము చేయువాడు, అధిక భారమును మోయువాడు అధికముగా పనులు చేయుట వలన కృశించువాడు, మిక్కిలి కృశించిన శరీరముగలవాడు, క్రోధము, శోకము భయము అయాసములచే పీడింపబడువాడు, బాలురు, వృద్ధులు వాతప్రాబల్యముగలవారు, ఎక్కువగా మాట్లాడువారు బిగ్గరగా మాట్లాడువారు, ఆకలిగొన్నవారు, దప్పికగొన్న వారు ఇట్టి మొదలగు వారు వ్యాయామమును వర్జించవలయును ఈ పై చెప్పిన వారందరు వాత ప్రకోపముగలవారగుదురు కారణమేమనగా పై జెప్పబడిన కర్మలన్నియు వాతమును పెంపొందించును కావున వాటితో మానవులందు వాత ప్రాబల్యము గలుగును అట్టివారు వ్యాయామము చేసిన ఎడల (అధిక వ్యాయామము చేసిన ఎడల) వాతము ప్రకోపించి వాతవ్యాధులు గలుగుటకు అవకాశముండును అందువలన పైపేర్కొనబడినవారు వ్యాయామము చేయరాదని నిషేధింపబడినది

**చ పా వ్యా ఆం అ** ఏవం విధాన్ అను శబ్దముతో ఎక్కువ బరువులను మోయుట పెద్దపెద్ద రాళ్ళను వదలించుట మొదలగునవి గ్రహించవలయును సింహము

చిన్నదిగా నుండి తనకంటె బలముగల గజమును చీల్చుచు శక్తికి మించిన వ్యాయామముచే తరువాత క్షోభవలన నశించును గాన సింహగజముల ఉదాహరణ సరియైనది అందువలననే ఇవ్వబడినది.

మూ॥ ఉచితా దహితాద్ధీమాన్ క్రమశో విరయేన్నరః।
హితం క్రమేణ సేవేత, క్రమశ్చాత్రోపదిశ్యతే॥
ప్రక్షేపాపచయే తాభ్యాం క్రమః పాదాంశికో భవేత్।
ఏకాన్తరం తతశ్చోర్ధ్వం ద్వ్యన్తరం త్ర్యన్తరం తథా ॥(36-37)

**తాత్పర్యము** బుద్ధిమంతుడగు మనుజుడు అభ్యాసముగ నున్న అహితమును క్రమముగ విడిచి పెట్టవలయును అభ్యాసము లేని హితమును క్రమముగ సేవింపవలయును, అట్టి క్రమము ఇచ్చట చెప్పబడగలదు అపథ్యమును విడిచి పథ్యమును సేవించుటను చతుర్థాంశక్రమమున ఆచరింపవలయును ఇట్లాచరించు నప్పుడు క్రమముగా ఒకరోజును, రెండు రోజులును, మూడు రోజులును వ్యవధానముండ వలయును

**చ పా వ్యా ఆ అ** హిత సేవనము, అహిత పరిత్యాగము ఇంతకు పూర్వము చెప్పబడినది అట్టిది క్రమమును తప్పి ఆచరించినచో అక్రమ రహిత వ్యాయామమువలె మిక్కిలి విరుద్ధ గుణములు గలుగజేయును కావున హితసేవన, అహిత పరిత్యాగ క్రమమును 'ఉచితాత్ అను శ్లోకముల ద్వార చెప్పుచున్నాడు ఉచితాత్ = అభ్యసించిన దాని నుండి క్రమశః = చెప్పబోవు క్రమము ననుసరించి హితం= అభ్యాసము లేక హితమైనది "క్రమశ్చ అను దానితో క్రమమును చెప్పుచున్నాడు హితప్రక్షేపము, అహితాపచయము తాభ్యాం = హితాహితముల కొరకు పాదః = నాల్గవ భాగము, తద్రూపాంశము పాదాంశము పాదాంశముతో చేయబడిన క్రమము పాదాంశికము కొందరు పాదాంశమనగా నాల్గవ భాగము యొక్క అంశము అనగా 16వ భాగమని చెప్పెదరు ఇట్టి హితాహితముల యొక్క ఏకకాల ప్రక్షేపాపచయ పాదాంశిక క్రమము ఈ విధముగా నుండును మొదటిది ఏకాంతర మనగా ఒక దినము అంతరము గలది అని అర్థము అందువలన మొదట ఒక భాగము హితప్రక్షేపము ఒక భాగము అహిత అపచయము తరువాత ద్వితీయ పాదహిత ప్రక్షేప ద్వితీయ పాద అహితాప చయమున రెండు దినముల అంతరముగా క్రమముండును అట్లే ద్వితీయ పాదాభ్యాసము తదుపరి తృతీయ పాదహిత ప్రక్షేప అహితాపచయమున మూడు దినముల అంతర్య క్రమముండును చతుర్థపాద ప్రక్షేపాపచయము నందు కాల నియమము లేదు

ఎందువలననగా అటుపైన ప్రక్షేపాపచయములు లేకుండుట వలనను, చతుష్పాదములు సంపూర్ణమగుట వలనను పథ్యములు నిరవధికముగా సేవించవలసి యుండుట వలనను కాల నియమమివ్వబడలేదు ఇదే విషయమును ఇంకా వివరించుచున్నాడు అపథ్యములైన యవకము మొదలగునవి అలవాటులో నున్నవాటిని త్యజించవలయును రక్తశాలి మొ॥ పథ్యములు అలవాటులో లేనివి సేవించవలయును అవి మొదటి దినమున మూడు భాగములు యవకములు, ఒక భాగము రక్తశాలి, రెండవ దినమున రెండు భాగములు పథ్యములు రెండు భాగములు అపథ్యములు అట్లే మూడవ దినమున ఈ విధంగా ద్వితీయాపాదాభ్యాసము ద్వ్యంతరమగును నాల్గవ దినమున మూడు భాగములు పథ్యము, ఒక భాగము అపథ్యము ఇట్లే 5, 6 వ దినమున ఈ విధముగా తృతీయ పాదాభ్యాసము త్ర్యంతర మగును 7వ దినము మొదలుకొని నాల్గు పాదముల పథ్యాభ్యాసము లేక మరియొక విధముగా అంతర శబ్దము వ్యవధివాచకమను కొన్న ఇంకొక ప్రతిభాగ చేయవచ్చును ఈ శ్లోకమున నున్న తథాశబ్దము వలన చతురంతరమని మరియొక అర్థము వచ్చుచున్నది దానిననుసరించి మొదటి దినమున అపథ్యములు 3 భాగములు పథ్యము ఒక భాగము, రెండవ దినమున మొత్తము అపథ్యము మూడవ దినమున రెండు భాగములు అపథ్యము, రెండు భాగములు పథ్యము ఇట్లే 4 దినమున గూడ, 5వ దినమున 1 భాగము పథ్యము, 3 భాగములు అపథ్యము ఇట్లే ద్వ్యంతరములగును 6వ దినమున 3 భాగములు పథ్యము, 1 భాగము అపథ్యము, ఇట్లే 7వ, 8వ దినములలో అటుతరువాత 9వ దినమున 2 భాగములు పథ్యము, 2 భాగములు అపథ్యము ఇట్లు 3 దినముల అంతరములు, అటుతరువాత 10వ దినమున మొత్తము పథ్యము ఈ విధముగా 11, 12, 13 దినములలో గూడా, 14వ దినమున పథ్యభాగములు మూడు, అపథ్య మొకటి ఇది చతురంతర్యము అథా శబ్దముచే సూచింపబడినది 15 దినముల మొదలుకొని అంతా పథ్యమే (36 - 37)

మూ॥ క్రమేణాపచితా దోషాః క్రమేణోపచితా గుణాః।
సన్తో యాన్త్య పునర్భావ మప్రకమ్ప్యా భవన్తిచ॥ 38

తాత్పర్యము ఈ క్రమముచే క్షీణించిన దోషములు మఱల జనింపవు ఈ క్రమముచే వృద్ధినొందిన గుణమును స్థిరముగ నుండును

చ పా వ్యా ఆం అ క్రమేణ అనుదానితో పై విధముగా చేసిన కలుగు దానిని చెప్పుచున్నాడు క్రమేణ = క్రమముగా, దోషాః = దోషజనకములైన అభ్యసించిన

అపథ్యములు, గుణాః = గుణజనకములైన పథ్యములు అపునర్భవంయాతి = దోషములు తిరిగి పుట్టుకను పొందవు అని యర్థము, తొందరపడి క్రమమును తప్పి అపథ్య త్యాగము చేసిన దోషములు గలుగుట నిక్కము అష్టాంగ హృదయమున గూడ "అసాత్మ్యజాహి రోగాః స్యుః సహసాత్యాగశీలనాత్" అనగా తొందరపాటుతో ఒక్కసారి అలవాటును మానినచో అసాత్మ్యము వలన కల్గువ్యాధులు గలుగునని ॥సూ 3 అధ్యాయమున చెప్పబడినది అప్రకంప్యా = గుణములు (చలించక) తొణకకుండా స్థిరముగా నుండునని భావము పథ్యమైనను క్రమముగ అభ్యసించక తొందరపాటుతో ఒక్కసారి ఉపయోగించినచో అరుచి, అగ్ని నాశము మొ॥ దుర్గుణములను గలుగజేయును (38)

మూ॥ సమపిత్తానిలకఫాః కేచిద్గర్భాది మానవాః।
దృశ్యన్తే వాతలాః రేచి త్పిత్తలాః శ్లేష్మలాస్తథా॥ 39
తేషామనాతురాః పూర్వే, వాతలాద్యాః సదాఽఽతురాః।
దోషానుశయితా హ్యేషాం దేహ ప్రకృతి రుచ్యతే। 40

**తాత్పర్యము** గర్భోత్పత్తి మొదలుకొని కొందరు మనుజులు సమానములుగా నున్న వాత పిత్తకఫములు, కొందరు వాత మధికముగ కలవారుగను, కొందరు పిత్త మధికముగ కలవారుగను, కొందరు శ్లేష్మమధికముగ కలవారుగను నుందురు వారిలో వాత పిత్తకఫములు సమానముగ నున్నవారు ఆరోగ్యవంతులనియు, మిగిలిన వారు నిత్య రోగులనియు చెప్పబడుదురు గర్భోత్పత్తి మొదలుకొని శరీరమునందు ఏ దోషమునకు అధికమగు సంబంధముండునో ఆ దోష సంబంధమగు శరీర ప్రకృతికలవారుగ చెప్పబడుదురు

**చ.పా వ్యా ఆం.అ** సాధారణముగా స్వస్థులకు హితమైన రక్త శాల్యాది విషయములు ప్రతిపాదించబడినవి స్వస్థుడు గూడ ప్రకృతి భేదము ననుసరించి అనేక విధములు అట్టి అనేక విధములైన స్వస్థులకు హితముగా గూడ అనేక విధములుగానే యుండును అట్టి దానిని వివరించుటకై సమపిత్తానిల అను శ్లోకములతో ప్రకృతి భేదమును చెప్పుచున్నాడు సమాః= అవైకారికములైన పిత్త - అనిల - కఫములు గలవారు గర్భాది = గర్భదానము మొదలుకొని శుక్ర, శోణిత, జీవతత్వముల సంపర్కము మొదలుకొని అని అర్థము వాతాలాః= వాత ప్రాధాన్యము గలవారు అట్లే పిత్త ప్రధానులు, శ్లేష్మ ప్రధానులు గూడా అన్నింటియందును గర్భాది అని పదము జోడించవలయును ఈ శ్లోకమున దోషములలో పిత్తమును మొదట గ్రహించుటకు

కారణాలు 1 చందస్సున కనుకూలముగా నుండుట 2 పిత్త సమానమైన అగ్నిక్ష ప్రాధాన్యతను చూపించుట లేక 3 ప్రకృతులలోవాత ప్రకృతి శ్రేష్ఠముగాదు, కావున ప్రకృత్యారంభమున దానికి గల అప్రాధాన్యతను తెలుపుట కొరకు మొదలు పిత్తము చెప్పబడినది మరియు నిచట ఒక్కొక్క దోష ప్రకృతి గ్రహణము చేతనే ద్వంద్వ ప్రకృతి గ్రహించవలయును ఇందుకు కారణము సంయోగమునకు సంయోగికి దగ్గర సంబంధముండును నిదానమున గూడ వాతాది జ్వరములు చెప్పి రెండింటి యొక్క లక్షణములు కలిసియున్న ద్వంద్వజములుగా గ్రహించవలెనని చెప్పబడినది దీనితో రోగ భిషగ్జితీయమున చెప్పబడిన ద్వంద్వజములైన మూడు ప్రకృతులు గూడ గ్రహించబడినవి మరి కొందరు మూలమున రెండవసారి చెప్పబడిన 'కేచిత్' శబ్దమువలన ద్వంద్వజములను గ్రహించవలెనని చెప్పినారు తేషాం అనగా సమవాత పిత్తశ్లేష్మ ప్రకృత్యాదులలో పూర్వే అనగా సమప్రకృతులు, సదాతురాః అనగా స్వస్థవృత్తము ననుష్టించుచు ఇప్పటికిని స్ఫుటితాంగత్వము, విషమాగ్నిత్వం కల్గియుండుట వలన సదాతురులుగా నుందురు వాతాది ప్రకృతి గలవారు స్వస్థులైనను ఎందువలన రోగులగుదురని "దోషానుశాయతా" అను శ్లోకముచే చెప్పుచున్నాడు దోషానుశాయతా = ఉల్బణములైన వాతాది భావితమైన అవ్యభిచారము గలదైన దేహ ప్రకృతిః = దేహ స్వాస్థ్యము దానితో వాతలాది పురుషులకు ప్రధానముగా స్వాస్థ్యముండదు కాబట్టి వీరికి ఔపచారికమైన స్వాస్థ్యముండునని తెలుపుచున్నాడు గర్భాది అను దానితో శుక్రశోణిత జీవముల యొక్క సంసర్గమున వాతాదులు సమవికృతులుగా నున్నచో దానిననుసరించి ఆయా ప్రకృతులు గలుగును అట్టి ప్రకృతి రిష్టములు లేక యావజ్జీవము అనువర్తించును సుశ్రుతమున గూడ "ప్రకోపోవాఽన్యభావో వాక్షయోవానోపజాయతే ప్రకృతీనాం స్వభావేన జాయేతాతు గతాయుషి" ॥సు॥ శా॥ 4 అధ్యాయయము అనగా ప్రకృతుల యొక్క ప్రకోపముగాని, అన్య భావముగాని, క్షయము గాని కలుగును ఇది ప్రకృతి స్వభావము కాని ఆయువు క్షీణించినపుడు మాత్రము పై ప్రకోపాదులు ప్రకృతికి కలుగును సమప్రకృతి గలవారికి గాని లేక వాత ప్రకృతి గలవానికి గాని ఆక్షేపకాది వాత వికారములు గల్గినపుడు ప్రకృతి భూతమైన వాతము అధికమగును ఎప్పుడైతే వాత ప్రకృతి పిత్తకారములు కలుగునో అప్పుడు వాత ప్రకృతి యొక్క అన్యధా భావమైన పిత్త ప్రకృతిత్వము కలుగును సమప్రకృతి గలవాని దోషములతో ప్రకృతి స్వకర్మహాని లక్షణాత్మకమైన ఏదో ఒక దోషక్షయమేర్పడినప్పుడు అది ప్రకృతి క్షయమనబడును దోషక్షయ మేర్పడినపుడు అది ప్రకృతిక్షయ మనబడును దోషక్షయ

లక్షణమీ విధముగా చెప్పబడినది "కర్మణః ప్రాకృతాద్వా నిర్వృద్ధిర్వాఽపి విరోధి నామ్" దోష క్షయము జరిగినపుడు ప్రాకృత కర్మక్షయము లేక విరుద్ధ కర్మల వృద్ధి గలుగును ఇచట ఒక విషయము చెప్పవలసి యున్నది ప్రకృతికి సమానమైన రోగోత్పత్తిలో ప్రకృతి భూతమైన దోషము యొక్క వృద్ధి కలుగక హేత్వంతర జనితములైన వాతాదులు అచ్చట వికారములను గలిగించును అచ్చట ప్రకృతి భూతములైన దోషములు వ్యక్తము చేయునవిగా యుండును ఈ విషయమే "కాల దూష్యప్రకృతి భిర్దోషస్తు లోహిసంతతమ్" నిష్ప్రత్యనీకః కురుతే తస్మాత్ జ్ఞేయః సుదుః సహః" చ చి 3 అనగా కాలము, దూష్యములు ప్రకృతి వీటితో సమానమైన దోషమునకు ఎప్పుడు ఎదురు లేదు అందువలన ఇది సుసాధ్యము గాదు అని - చరక చికిత్సలో చెప్పబడినది వాత ప్రకృతి గలవానికి పిత్త వికారములు గలిగినపుడు ప్రకృతి భూతమైన వాతము తన కర్మలైన కర, చరణ స్ఫుటనము మొదలగు వాని కర్మలను జేయునదిగా యుండును అంతేగాని ఆగంతుకమైన పిత్తమేమీ చేయదు ప్రాకృత కర్మహాని రూపమైన స్వప్రమాణము కన్న వాతాదుల యొక్క క్షయము శుక్రశోణిత సంసర్గ కాలము నందలి ప్రకృత భూతము బీజ భూతము అయిన దోష క్షయమును గలిగించదు కావున ప్రకృత భూత దోషక్షయ మేర్పడదు లేక ప్రకృతికి ప్రకృత తత్త్వముండుట వలన ప్రపము అన్యధా భావము క్షయములుండవని చెప్పవచ్చును అందువలన సమప్రకృతి వాత ప్రకృతికాదు వాత ప్రకృతి పిత్త ప్రకృతిగాని, సమ ప్రకృతి గాని గాదు కారణమేమనగా వికారావస్థ హీన అధికములైన వాతాది లక్షణములు గలిగి యుండునని అర్థము

ప్రకృతీయ భూతములైనవి యైనప్పటికి దూషణాత్మకములు అయిన వాతాదులకేల శరీర బాధకత్వముండకూడదు? అని చెప్పుటకు వీలు లేదు ఎందువలననగా అవి జన్మతో కలిసి పుట్టునవి మరియు ఆ విధమైన వినాశకర వికారములను కలుగుజేచనివి కాబట్టి సుశ్రుతమున గూడ "విషజాతో యధా విషేణ నవిపద్యతే తద్వత్ప్రకృతిభిర్దేహ స్తజ్జాతత్వాన్న బాధ్యతే" సు శా 4 అధ్యాయము అనగా విషమునందు ఉద్భవించిన కీటకము, ఆ విషముచే ఏ విధంగా నశించదో, అదే విధముగా వాతాది దోష ప్రకృతుల వలన దేహము బాధింపబడదని సుశ్రుతుడు శారీరస్థానమున 4వ అధ్యాయమున చెప్పినాడు నా బాధ్యతే అనగా ఎక్కువగా బాధింపబడదని యర్థము ఇందుకు కారణమేమనగా వాత ప్రకృతులు ఎల్లప్పుడు వాతాది వికృతులు కల్గి యుండును అందువలననే "వాతాలాద్యాః సదాతురాః" అని

చెప్పబడినది అశ్వవైద్యమున గూడ "సర్వాన్ ప్రాణభృతో హంతి నూనం కాయగతఀ విషం । అస్మింశ్చాపి సముత్పన్నాదృశ్యంతేకృమయోయథా । తథాచ విషమోదోష ప్రకృతీం నాతి బాధతే ॥ అనగా కాయగతమైన విషము సమస్త ప్రాణులను నిశ్చయముగ చంపును ఐనప్పటికిని ఆ విషమున నుత్పన్నములైన క్రిములు మాత్రము మృతి చెందక జీవించియే కనబడును అని చెప్పబడినది వాతాది దోషములు వృద్ధి చెంది శుక్రశోణితములను దుష్టినొందించి వికారములు గల గర్భమును కల్గించినట్లుగానే ఆ శుక్రశోణితములకు గర్భజనకత్వమే లేకుండానే ఎందుకు చేయకూడదు అని అనుటకు వీలులేదు కారణమేమనగా హీన, మధ్య, ఉత్తమ రూపమైన వాతాదుల యొక్క ప్రకోపములు అనేక విధములుగా యుండును అపుడు వాతాదులు ప్రబలములైన యెడల గర్భమును నశింపజేయును హీనములైన ఎడల వికారములు గలిగించును (39-40)

మూ॥ విపరీత గుణ స్తేషాం స్వస్థ వృత్తేర్విధిర్హి తః।
సమసర్వ రసం సాత్మ్యం సమధాతోః ప్రశస్యతే॥ (41)

**తాత్పర్యము** అట్టివారు ఆయా దోషములకు విపరీతములైన గుణములు కలవానిని సేవించుట స్వస్థవృత్తమునకు హితమైన విధిగ నుండును మూడు దోషములును సమానముగ కలవారు సమస్తరసములను తగు విధముగ సమానముగ నుపయోగించుట ప్రశస్తముగ నుండును

**చ పా వ్యా అం అ** తేషాం = విపరీత గుణః = వాతాది దోషములందలి రౌక్ష్యము మొదలగు గుణములకు విపరీతములైన స్నేహము మొదలగు గుణములు అని అర్థము సమసర్వరసం = అన్ని రసములు సమానముగా గల్గిన ఇచ్చట సమమను శబ్దమునకు సమప్రమాణమని కాక అనురూపత్వమని యర్థము గ్రహించవలయును కారణమేమనగా స్వస్థ భోజనమున మధురరసమెత్తైతే ఉపయోగించబడుచున్నదో కట్వాది రసములంత ప్రమాణమున నుపయోగించబడుట లేదు లేక అవిరుద్ధములైన రసములని గూడా సమశబ్దమున కర్థముగా చెప్పకోవచ్చును అప్పుడు చెప్పబోవు ఉపోదికా, మత్స్యము మొదలగు విరుద్ధ రస వర్జితమైన ఆహారము సమసర్వరసమని యర్థము వచ్చును ఈ విధముగా ప్రకృతి నపేక్షించి (ననుసరించి) సమధాతువు గలవానికి సర్వరసాభ్యాసము ఆయా ఋతు విహితమైన క్రమముతో "తస్మాత్తుషార సమయే స్నిగ్ధామ్ల లవణాన్ రసాన్" సూ అ 6 అనగా "హేమంతమున

స్నిగ్ధామ్ల లవణ రసములు మొదలగు ఋతువిశేష విధాన యుక్తముగా ఆమ్ల లవణ రస ప్రధానముగా సర్వరసయుక్తమైన భోజనము హేమంతమున చేయవలయునని ఫలితార్థము వాత ప్రకృతి గల వానికి మాత్రము కటు, తిక్త, కషాయ వర్జిత మైనదియు, మధురామ్లలవణ రస ప్రధానమైనదియు అయిన భోజనము హేమంతమున విహితమైయున్నది దేహ ప్రకృతి, స్వభావముల ననుసరించి ఆయా ఋతువులందు ఇదే విధమైన క్రమమును పాటించవలయును వాగ్భటుడు గూడ ఇదే విషయమును "నిత్యం రసాభ్యాసః స్వస్వాధిక్యమృతావృతే" అనగా ఆయా ఋతువులందు ఆయా రసముల ఆధిక్యతతో అన్ని ఋతువులందు సర్వ రసాభ్యాసము చేయవలయునని అ హృ.సూ 3వ అధ్యాయమున చెప్పినాడు

మూ॥ ద్వే అధః సప్త శిరసి ఖాని స్వేద ముఖానిచ।
మలాయనాని బాధ్యన్తే దుష్టైర్మాత్రాధి కైర్మలైః॥ 42
మలవృద్ధిం గురుత్వేన లాఘవాన్మల సంక్షయ
మలాయనానాం బుధ్యేత సఙ్గోత్సర్గాదతీవచ॥

**తాత్పర్యము** శరీరము యొక్క అధోభాగమునందున్న రెండు రంధ్రములును, శిరసునందున్న ఏడు రంధ్రములును, రోమకూపములును బలస్థానములుగ నుండును ఇవి క్షీణించినట్టియు, వృద్ధి పొందినట్టియు మలములచే బాధింపబడును మల స్థానమునందు బరువుగా నున్నచో మలము వృద్ధిపొందినదనియు తేలికగా నున్నచో మలము క్షీణించినదనియు తెలిసికొనవలయును మరియు మలము కొంచమైనను వెడలకున్నచో, మలము క్షీణించినదనియు అధికముగ వెడలు చున్నచో వృద్ధి పొందిన దనియు తెలిసికొనవలయును

**చ పా వ్యా అం అ** స్వాస్థ్యోత్పత్తి కారణములను చెప్పి స్వాస్థ్య ప్రతిబంధకమైన దోషసంచక నిర్ధారణమును చెప్పదలచి దోష సంచయ లక్షణములను "ద్వేఅధః" అను శ్లోకములతో చెప్పుచున్నాడు ద్వే = గుదము, లింగము (రెండు), ఖాని = ఛిద్రదములు సప్త శిరసి = అనగా రెండు చెవులు, రెండు నాసాపుటములు, రెండు నేత్రములు మరియు ముఖము, స్వేదముఖములనగా లోమకూపములు ఇవన్నియు మలమున కాధారములు , దుష్టైః అనగా గోబలీవర్ద న్యాయముననుసరించి క్షీణములైన , మాత్రాధికైః అనగా వృద్ధి పొందిన ఈ రెండింటివలన ముందు ముందు క్షయము, వృద్ధి ఈ రెండు లక్షణములు చెప్పబడును మల వృద్ధిని గురుత్వము వలన (మలాయన గురుత్వమువలన) మలాయనముల యొక్క లఘుత్వము వలన మలక్షయము

(స్వప్రమాణముకన్న మలక్షయము) , లేక దుష్టైరనునది మాత్రాదికైః అనుదానికి విశేషణముగా చెప్పుకొన్న "లాఘవాన్మల సంక్షయ" అనగా ప్రాకృతికమైన లఘుత్వముతో మాత్రాధికమైన మలక్షయము అనగా మల ప్రాకృత స్థితి అని అర్థము చెప్పవలయును "సంగోత్సర్గాదతీవచ" అనగా అతిసంగము వలన మలక్షయము, అతి ఉత్సర్గము వలన మలవృద్ధిని తెలుసుకోవలయునని యర్థము

మూ॥ తాన్దోషలింగైరాదిశ్య వ్యాధీన్ సాధ్యానుపాచరేత్।
వ్యాధి హేతు ప్రతిద్వన్ద్వైర్మాత్రాకాలౌ విచారయన్॥ 44

తాత్పర్యము మలము యొక్క వృద్ధి క్షయముల వలన కలిగిన వ్యాధులను దోషముల యొక్క లక్షణములచే బాగుగ తెలుసుకొని సాధ్యములగు వానిని వ్యాధి విపరీతములైనట్టియు, హేతు విపరీతములైనట్టియు ప్రతి క్రియలచే పరిమాణము కాలము వీని ననుసరించి చికిత్సింప వలయును

చ పా వ్యా ఆం అ తాన్ అనగా మలవృద్ధి క్షయాత్మకములైన మల వృద్ధి క్షయ జనితములైన దోషః = వాతాది దోషముల యొక్క , లింగై ః = క్షయ రూప లక్షణములచేత, ఆదిశ్య = తెలుసుకొని, ఏవిసాధ్యములో వాటి నుపచరించవలయును వ్యాధి ప్రతిద్వంద్వేః = వ్యాధి ప్రత్యనీకములతో , హేతు ప్రతి ద్వంద్వేః = హేతుప్రత్యనీకములతో ప్రతిద్వంద్వ శబ్దముతో విపరీతార్థ కారులను గూడ గ్రహించవలయును మాత్రాకాలగ్రహణము ప్రాధాన్యత ననుసరించి చేయబడినది కావున దోష భేషజములను గూడ గ్రహించవలయునని తెలుసుకోవలయును లేక కాలమునందే దోష భేషజములు అంతర్భవించి యున్నవని చెప్పుకోవలయును

మూ॥ విషమ స్వస్థ వృత్తానామేతే రోగాస్తథా ऽపరే।
జాయన్తే ऽ నాతురస్త స్మా త్స్వస్థ వృత్త పరోభవేత్॥ 45
మాధవ ప్రథమే మాసి నభస్య ప్రథమే పునః।
సహస్య ప్రథమే చైవ హారయే ద్దోష సంచయమ్॥ 46
స్నిగ్ధ స్విన్న శరీరాణా మూర్ధ్వం చాధశ్చ నిత్యశః
వస్తికర్మ తతః కుర్యాన్న స్తః కర్మచ బుద్ధిమాన్॥ 47
యథాక్రమం యథాయోగ్య మత ఊర్ధ్వం ప్రయోజయేత్।
రసాయనాని సిద్ధాని వృష్యయోగాంశ్చ కాలవిత్॥ 48
రోగాస్తథా నజాయన్తే ప్రకృతి స్థేషు ధాతుషు।
ధాతవశ్చా భివర్ధన్తే జరామాన్ద్యము పైతి చ॥ 49

విధిరేష వికారాణామనుత్పత్తౌ నిదర్శితః।
నిజానామి రేషాంతు పృధగేవో పదేక్ష్యతే (45-50)

**తాత్పర్యము** స్వస్థవృత్తమును సరిగ నాచరింపని యెడల ఈ వ్యాధులును ఇట్టి ఇతర వ్యాధులును కలుగును కావున ఆరోగ్యవంతుడు స్వస్థవృత్తమును ఎల్లప్పుడు నాచరింపవలయును కూడుకొనియున్న దోషమును చైత్ర మాసమునందును, శ్రావణ మాసమునందును, మార్గశిర మాసము నందును హరింపజేయవలయును స్నేహ స్వేదములను చేయించి పిమ్మట వమనములను, విరేచనములను వస్తికర్మను నస్యకర్మను యధాయోగ్యముగ చేయించవలయును పిమ్మట ప్రసిద్ధములైన రసాయన యోగములను వృష్యయోగములను కాలమును తెలిసికొని తగు విధముగ ప్రయోగింపవలయును ఇట్లు చేసినచో ధాతువులు ప్రకృతియందుండుట వలన రోగములు జనింపవు మరియు ధాతువులు వృద్ధి నొందును ముసలి తనము త్వరలో కలుగదు నిజవ్యాధులు కలుగకుండుటకై ఈ విధానము చెప్పబడినది ఇతర వ్యాధులు కలుగకుండు విధానము ప్రత్యేకమగ చెప్పబడును

**చ పా వ్యా ఆం అ** శ్లోకమునందు "అనాతురా" అని చెప్పుటచేత వ్యాధులు రాక పూర్వమే స్వస్థుడుగా నుండుటకు యత్నించవలయునని చెప్పుచున్నాడు మాధవ ప్రథమః = అమాధవః అనగా వైశాఖము దానికి మొదటిది చైత్రము ఇట్లే నభస్య = భాద్రపదము, దానికి ప్రథమము శ్రావణము అట్లే సహస్య = పుష్యము దానికి ప్రథమము మార్గశీర్షము , క్రమముగా చైత్ర, శ్రావణ, మార్గశిర్ష మాసములు, ఇవి ముందు విమాన స్థానమున రోగభిషగ్జితీయమను 8వ అధ్యాయమున శోధనార్థము చెప్పబోవు వసంత, ప్రావృట్, శరదృతువులందు అంతర్భవించును దృఢబల సంస్కృత భాగమున "ప్రావృట్ శుక్రనభౌజ్ఞేయౌశర దూర్జ సహౌపునః తపస్యశ్చ మధుశ్చైవ వసంతః శోధనం ప్రతి" సి అ 6 అని అనగా శోధనార్థము కొరకై అషాఢ శ్రావణములు, ప్రావృట్ ఋతువు, కార్తీక, మార్గశీర్షములు శరదృతువు పాల్గుణ చైత్రములు వసంత ఋతువుగా చెప్పబడినది సుశ్రుతమున గూడ ఈ విధముగా దోష చయ ప్రకోపములకు ఉపశమనార్థమైన ఋతు క్రమము చెప్పబడినది కావున ముందు చెప్పబోవు శోధనము శోధనార్థము చెప్పబడు ఋతు క్రమముననుసరించే చేయవలయును ఈ విధముగా వసంతాది ఋతువులలో చివరి మాసమున వమనాది శోధనములు దోషములు సంపూర్ణముగా వృద్ధినొందుటను దృష్టియందుంచుకొని చెప్పబడెను ఋతువులలో మొదటి మాసములైన ఫాల్గుణ, ఆషాఢ, కార్తికములందు ప్రకోపము విత్కృష్టతను

పొందదు సంచయము చెంది బాగుగా ప్రకోపించని ఎడల దోషము విలయనము చెందక దోష నిర్హరణము బాగుగా జరుగదు అందువలన బాగుగా ప్రకోపించి విలయనము చెందిన తరువాతనే ఋతు క్రమముననుసరించి ఆయా శోధనములు చెప్పబడినవి అందువలననే కపిల బలుడు గూడ "మధౌసహేనభసిచ మాసి దోషాన్ ప్రవాహయేత్ । వమనైశ్చ, విరేకైశ్చ నిరూహైః సానువాసనైః॥" అని చెప్పినాడు హరిచంద్రుడు మాత్రము సహశబ్దమును అకారాంతముగా చెప్పి దానికి మార్గశీర్షమాసము అని దానికి మొదటిదైన కార్తికమున అని వ్యాఖ్యానించివాడు ఆ మతమునే అనుసరించుచు వాగ్భటుడు "శ్రావణే కార్తికే చైత్రే మాసిసాధారణే క్రమాత్। గ్రీష్మ వర్షహిమ చితాన్ వాయ్వాదీనాశునిర్హరేత్ (వా సూ అ 3) అని చెప్పినాడు సాధారణముగా శ్రావణకార్తిక చైత్రమాసములలో గ్రీష్మ, వర్ష, హేమంతములందు సంచితములైన వాత, పిత్త, కఫములను నిర్హరణము చేయవలెనని పై శ్లోకమునకు అర్థము "కార్తీకే, శ్రావణే, చైత్రేమాసి సాధారణే క్రమాత్ వర్షాది సంచితాన్ దోషాన్ త్రిమాసాంతరితాన్ హరేత్" అని ఎవరో చెప్పిన ఈ శ్లోకమును సరియైనదిగా చెప్పుటకు బుద్ధిమంతులెవరు ప్రయత్నించరు ఊర్ధ్వం = అనగా వమనము చేత అధః = విరేచనముచేత , వస్తికర్మ శబ్దముచే ఆస్థాపన అనువాసములు ఈ వమనాది కర్మలన్నియు అవసరాన్ని బట్టిగాని, యదాసంఖ్యముగా గాదు కావున వమనము మధు మాసమున, మార్గశీర్షమున విరేచనము, శ్రావణమున వస్తి అని అర్థము యధాక్రమం= అనుపూర్వి ననుసరించి యధాయోగ్యం = ఏది ఎవరికి యుక్తముగా నుండునో ఈ రెండు యధాక్రమ యధాయోగ్యములు ముందు వమనము మొ॥ వాటితో ఉత్తరమున రసాయనాని అను వాటిని అన్వయించుకోవలయును సిద్ధాని = కనబడుచున్న ఫలము గలవి, రోగాస్తదా నజాయంతే అనగా వమనాదుల నాచరించు వారికి రోగములు గలుగవు రసాయనముల నుపయోగించు వారికి ధాతువులు కూడ వృద్ధి నొందును అని అర్థము గ్రహించవలయును నిజానాం = నిజ వికారములకు ఇతర ఆగంతుక వికారములకు, ఇచట ఆగంతువులనగా భూత, విష, వాతాదులచే జనించినవి మరియు మానసికములైనవిగా గ్రహించ వలయును దానితో నిజ ఆగంతువుల రెండింటిని చెప్పి అనుత్పత్తే అను శబ్దముతో ఆగంతువులను గ్రహించవలెనని ఉపసంహరించుచున్నాడు

మూ॥ యే భూత విషవాయ్వగ్ని సంప్రహారాదిసం భవాః।
నృణామాగన్తవో రోగాః ప్రజ్ఞా తేష్వ పరాధ్యతి॥

ఈర్ష్యాశోక భయక్రోధ మానద్వేషాదయశ్చ యే।
మనో వికారాస్తేఽ ప్యుక్తాః సర్వే ప్రజ్ఞాపరాధజాః॥

**తాత్పర్యము** భూతములు, విషము, వాయువు, అగ్ని, అభిఘాతము మొదలగు వాని వలన జనించిన వ్యాధులు ఆగంతుక వ్యాధులనబడును ఇవి మనుజుని యొక్క బుద్ధి అపరాధమును పొందుటవలన కలుగును ఈర్ష్య, శోకము, భయము, కోపము, అభిమానము, ద్వేషము మొదలగు మనో వికారములు కూడ ప్రజ్ఞాపరాధజములుగ నుండును

**చ పా వ్యా అం అ** భూతాః = పిశాచాదులు, ఆది గ్రహణముచే పతనము బంధనము మొదలగునవి గ్రహించవలయును ప్రజ్ఞా = బుద్ధి దీని అపరాధము అనగా అజ్ఞానము లేక దుర్జ్ఞానము భూతాభిషంగము ఈర్ష్యాదులు ప్రజ్ఞాపరాధమూలకములే నిజవికారములు గూడ "ప్రజ్ఞాపరాధాద్ధ్య హితానర్థాన్ పంచనిషేపతే" సూ అ 28 అని చెప్పుట వలన ప్రజ్ఞాపరాధ జన్యములేయైనప్పటికిని అవి ప్రధానముగా ప్రజ్ఞాపరాధ జనితమైన బాహ్యములైన వాతాది రూక్ష భోజనము మొదలగు వాటి వలన జనించుటచే తను వాతాదుల అంతర్యముండుట చేతను అవి విడిగా చెప్పబడును (51-52)

మూ॥ త్యాగః ప్రజ్ఞాపరాధానమిన్ద్రియోపశమః స్మృతిః।
దేశకాలాత్మ విజ్ఞానం సద్వృత్త స్యాను వర్తనమ్॥

ఆగన్తూనామను త్పత్తా వేష మార్గో నిదర్శితః।
ప్రాజ్ఞః ప్రాగేవ తత్కుర్యాద్ధితం విద్యాద్య దాత్మనః॥(53-54)

**తాత్పర్యము** ప్రజ్ఞాపరాధముల విడిచిపెట్టుట, ఇంద్రియముల జయించుట, విషయ స్మరణము, దేశమును, కాలమును, ఆత్మశక్తిని తెలిసికొనుట సద్వృత్తమునను సరించుట ఇవి ఆగంతుక వ్యాధులు పుట్టకుండుటకు కారణములుగ నుండును బుద్ధిమంతుడు తనకు హితమైన దానిని రోగము పుట్టుటకు పూర్వమునందే ఆచరింపవలయును

చ పా వ్యా అం అ త్యాగ మొ॥ శ్లోకములతో ఆగంతు మానసపరిహార కారణములను చెప్పుచున్నాడు ఇంద్రియోపశమః = ఇంద్రియములు తమ తమ విషయములకు లోనుగాకుండుట, స్మృతిః = పుత్రాదులు స్వాభావికముగా క్షణికములను తలంపు శారీర స్థానమున 1వ అధ్యాయమున "స్మృత్వా స్వభావం భావానాం స్మరన్ దుఃఖాద్విముచ్యతే" అనగా భావ పదార్థముల యొక్క స్వభావము తలంచినచో దుఃఖము నుండి విముక్తుడగును అని చెప్పబడినది పై రెండు మానస వ్యాధిని

ప్రతిఘటించునవి దేశకాలాత్మ విజ్ఞేయము అనుచోట దేశ జ్ఞానము వలన శూన్యగృహము అడవి, సాంక్రామిక దేశము మొ॥ దేశములను వర్జించుట తెలియును కాలజ్ఞానము వలన పూర్ణిమ - అమావాస్య మొ॥ చెప్పబోవు భూత సంక్రమణ (అభిఘాత) కాలము మొ॥ వాటిని వర్జించు జ్ఞానమేర్పడును ఆత్మ జ్ఞానము వలన తన శక్తిని తెలుసుకొనుట ద్వారా బలవంతములైన అగ్నిఘాతము - అఘాతములను వర్జించుట తెలియునని యర్థము. సద్వృత్తమ్ = ఇంద్రియోపక్రమణీయమున చెప్పబడును ప్రాగేవ = రోగములుత్పన్నము కాకమునుపే (53-54)

మూ॥ ఆప్తోపదేశ ప్రజ్ఞానం ప్రతిపత్తిశ్చ కారణమ్।
వికారణా మనుత్పత్తావుత్పన్నానాం చ శాన్తయే॥

**తాత్పర్యము** ఆప్తోప దేశము వలన కల్గిన విశేష జ్ఞానము చెప్పబడిన విషయమును సరిగ తెలిసికొనుట ఇవి రెండును వ్యాధులు జనింపకుండుటకు జనించిన వ్యాధులు శమించుటకును కారణములుగ నుండును

**చ పా వ్యా ఆం అ** ఆప్తోపదేశ అను శ్లోకముచే ఏది హితమో చెప్పుచున్నాడు ఆప్తాః = జ్ఞానవంతులు, రాగద్వేషములు లేని వారు "రజస్తమోభ్యాం నిర్ముక్తాః" అని సూ11వ అధ్యాయమున చెప్పబడినది అట్టివారు ప్రతిపత్తిః = ఉపదేశించిన దానిని బాగుగా అర్థము చేసుకొనువారు ఈ రెండు పుట్టని వికారములకు కారణములను పోగొట్టుట ద్వార వికారములను ఉత్పత్తి చేయకుండుటకు కారణములగు చున్నవి ఉత్పన్నములైన వికారముల శాంతికి వాటి వాటి చికిత్సయే కారణము (55)

మూ॥ పాపవృత వచ స్సత్త్వాః సూచకాః కలహప్రియాః।
మర్మోపహాసినోలుబ్ధాః పరవృద్ధి ద్విషః శఠాః।
పరాపవాదర తయశ్చపలా రిష సేవినః।
నిర్ఘృణాస్త్యక్త ధర్మాణః పరివర్జ్యా నరాధమాః
బుద్ధి విద్యావయః శీల ధైర్య స్మృతి సమాధిభిః।
వృద్ధోప సేవినో వృద్ధాః స్వభావజ్ఞా గతవ్యథాః॥
సుముఖాః సర్వభూతానాం ప్రశాన్తాః శంసిత వ్రతాః।
సేవ్యాః సన్మార్గవక్తారః పుణ్య శ్రవణ దర్శనాః (59)

**తాత్పర్యము** పాపముతో కూడిన చేష్టలును వాక్యములును మనస్సును కలవారు, కొండెములను చెప్పువారు, కలహప్రియులు, పరుల యొక్క రహస్యములను వెలిబుచ్చి

పరిహాసమును చేయువారు, లుబ్ధులు, పరులు యొక్క అభివృద్ధిని ద్వేషించువారు క్రూర స్వభావము కలవారు పరులపై నిందారోపణము చేయుట యందు ఆసక్తికలవారు చపల చిత్తము కలవారు శత్రుపక్షమును సేవించువారు, దయాహీనులు - ధర్మములను విడిచి పెట్టినవారు ఇట్టి నరాధములను ఆప్తులుగా గ్రహింపకూడదు బుద్ధి విద్య వయస్సు మంచి నడవడిక ధైర్యము విషయ స్మరణము మనో నియమము ఇవి అధికముగ కలవారు, పెద్దలను సేవించువారు స్వభావమును తెలిసిన వారు వ్యధులు లేని వారు, సమస్త ప్రాణులకు సుముఖులుగ నుండువారు, శాంతము కలవారు, ప్రశస్తములైన నియమములు కలవారు, సన్మార్గములను ఉపదేశించువారు, పుణ్య విషయములను వినువారు, పుణ్యస్థలములను చూచువారు ఇట్టి వారిని ఆప్తులుగా గ్రహించి సేవింపవలయును

చ జా వ్యా ఆం అ ఆప్తోపదేశములను గ్రహించుటకై వర్జించ దగిన ఆప్తులు కాని వారిని "పాపవృత్త" మొదలుగు శ్లోకముల ద్వారాను సేవించదగిన 'ఆప్తులను" బుద్ధి విద్యా అను శ్లోకముల ద్వారా తెలుపుచున్నాడు వృత్తం = శరీర వ్యాపార రూపమైన క్రియలు సత్వం = మనస్సు , వచః = మాట ఈ మూడు విషయములతో పాపము ననుష్టించువారు, శఠాః = క్రూరులు, నిర్ఘృణాః = దయలేనివారు మొ॥ వారు అనాప్తులు బుద్ధి విద్యా, వయస్సు, శీలము, ధైర్యము స్మృతి - సమాధి వృద్ధులను సేవించుట మొ॥ అనేకములైన ప్రశస్త గుణములు గలవారు గతవ్యధా = పోయిన శోకాదులు గలవారు సుముఖాః = ప్రసన్నమైన ముఖము గలవారు శంసిత వ్రతాః = నియమములను అవలంభించువారు (56 - 59)

మూ॥ ఆహారాచార చేష్టాసు సుఖార్థీ ప్రేత్యచేహచ।
పరం ప్రయత్న మాతిష్ఠేద్బుద్ధిమాన్ హితసేవనే ॥ 60

తాత్పర్యము పరలోకము నందును ఈ లోకము నందును సుఖమును కోరిన మనుజుడు హితకరములైన ఆహారములను ఆచారములను చేష్టలను సేవించుట యందు అధికమగు ప్రయత్నమును చేయవలయును

చ పా వ్యా ఆం అ ఆహార చేష్టాసు అనుచోట నిర్ధారాణార్థకమైన సప్తమి అందువలన ఆహారము - ఆచారము చేష్ట వీటిలో ఏది హితమో దానిని సేవించుటకై ప్రయత్నించవలయును ఆచారః = శాస్త్రము చెప్పిన దానిని ఆచరించుట (60)

మూ॥ న నక్తం దధిభుఞ్జీన చాప్యఘృత శర్కరమ్।
నాముద్గసూ పం నాక్షౌద్రం నోష్ణం నామలకైర్వినా॥

జ్వరాసృక్పిత్త వీ సర్పకుష్ఠపా ణ్వామయభ్రమాన్।
ప్రాప్నుయా త్కామలాం చోగ్రాం విధిం హిత్వా దధి ప్రియః (61-62)

తాత్పర్యము పెరుగును రాత్రులందు సేవింపకూడదు ఘృతమును పంచదారను చేర్చకుండగను పెసరపప్పుయొక్క సంబంధము లేకుండగను తేనెను కలుపకుండగను వేడిగ చేసియు, ఉసిరికకాయ సంబంధము లేకుండగను భుజింపకూడదు జ్వరము రక్తపిత్తమ్ము వీసర్పము, కుష్ఠము, పాండు రోగము, భ్రమ, భయంకరమైన కామెర్లు వీనిని పొందును

చ పా వ్యా ఆం అ దధి అనేక విధములుగా నిషేధము గావున మచ్చునకొక ఉదాహరణము చెప్పుటకై, దధి భోజన విధానమును "ననక్తమ"ను శ్లోకముతో చెప్పుచున్నాడు ఇచ్చట ననక్తం అనునపుడు, నోష్ణం అనునపుడు గూడ నకారము క్రియతో కలియును అందువలన రాత్రి పెరుగును వేడిగా ఎట్టి పరిస్థితులలోను సేవింపకూడదు "అఘృత శర్కరాం" అను మొదలగు చోట్ల గూడా అశబ్దముతో తెలుపబడిన నిషేధ నఞ్‌తో కలిసి రెండు ప్రతిక్షేధములగును అందువలన ఘృత శర్కరతో కలిపి భుజించవలయునని వాక్యమున కర్థమగును కావున ఘృతము మొ॥ వాటిలో ఏ ఒక్కదానితోనైనా గాని కలిపి పెరుగు నుపయోగించవలెనని చెప్పబడినది నక్తం అను మొ॥ వాటి యందు వలె ఇచ్చట కూడ నకారమునకు క్రియా సంబంధము చెప్పినచో ముద్గసూపముతో కూడా కానియున్నప్పటికిని దధికి ఘృతశర్కర సంబంధము లేనిచో దధి తీసుకోకూడనిదగును జతూకర్ణుడు కూడ ఘృతాదులు అన్నింటిలో ఏది లేకున్నను దధి సేవించని గూడ దగునని "నాశ్నీయాద్ధధి నక్తముష్ణంవా ఘృత మధు శర్కరా ముద్గామలకైర్వినా" అని చెప్పినాడు

మూ॥ వేగా వేగసముత్థాశ్చ రోగాస్తేషాం చ భేషజమ్।
మేషాం వేగా విధార్యాశ్చ యదర్థం యద్ధితాహితమ్॥
ఉచితే చాహితే వర్జ్యే సేవ్యే చానుచితేక్రమః।
యథాప్రకృతి చాహారో మలాయనగ దౌషధమ్॥
భవిష్యతామనుత్పత్తౌ రోగాణామౌషధం చయత్।
వర్జ్యాః సేవ్యాశ్చ పురుషాధీమతా ऽऽ త్మ సుఖార్థినా॥
విధినా దది సేవ్యం చ యేన యస్మాత్తద ద్విజః।
నవేగా న్ధారణేऽ ధ్యాయే సర్వయేవావదన్మునిః॥ (63-66)

తాత్పర్యము  వేగములును, వేగములను అడ్డగించుట వలన కలుగు వ్యాధులను, అట్టి వ్యాధులకు చికిత్సయు, ధరింపదగిన వేగములును, వానిని ధరించుటవలన కలుగు ప్రయోజనమును హితమైనవైనను, అహితముగ నగు విధమును, అహితమైనవానిని విడిచి పెట్టుట, హితమైన వానిని సేవించుట వీని యందలి క్రమమును ప్రకృతి ననుసరించి ఆహార విధియు, మలస్థానములయందలి వ్యాధులును, వాని యొక్క చికిత్సలును వ్యాధులు జనింపకుండుటకు ఉపాయములును, తన యొక్క హితమును గోరు బుద్ధిమంతునిచే వర్జింపతగిన మనుజులును, సేవింపతగిన మనుజులును, పెరుగు సేవింపవలసిన విధియు, విధిగ సేవించుటకు కారణమును ఈ నవేగాన్ధారణీయాధ్యాయమునందు ఆత్రేయ మహర్షిచే చెప్పబడినవి

చ పా వ్యా ఆం అ  అధ్యాయార్థమును క్లుప్తముగా చెప్పుచున్నాడు హితాహితములనగా సేవించదగిన, సేవించదగనివియైన, వ్యాయామ హాస్యాదులు "భవిష్యతామను త్పత్తౌ భేషజం" అనగా చైత్రమున మొదలు కొని ఉత్పన్నానాంచ శాంతయే అనువరకు చక్రపాణి దత్త విరచితమైన చరక తాత్పర్యటీకాయైన ఆయుర్వేద దీపికా వ్యాఖ్యతో రెండవదైన స్వస్థవృత్త చతుష్కమున నవేగాన్ధారణీయా ధ్యాయమను ఏడవ అధ్యాయమునకు ఆంధ్రానువాదము

# ఎనిమిదవ అధ్యాయము

మూ॥ అథాత ఇన్ద్రియోపక్రమణీయ మధ్యాయం వ్యాఖ్యాస్యామః॥
ఇతి హ స్మాహ భగవానాత్రేయః (1-2)

**తాత్పర్యము** పిమ్మట ఇంద్రియోపక్రమణీయాధ్యాయమును చెప్పబోవుచున్నాము అని భగవంతుడు ఆత్రేయుడు చెప్పెను

**చ వ్యా ఆ అ** స్వస్థవృత్త చతుష్కమున ఆహారాచార చేష్టల విషయమున మిక్కిలి శ్రద్ధ వహించవలెనని చెప్పబడినది వాటిలో కొన్ని ఆహార చేష్టలు ఇంతకుముందు చెప్పబడిన 3 అధ్యాయములలో చెప్పబడినవి మిగిలిన ఆచార రూపమైన చేష్టలను చెప్పుటకొరకై మరియు ఇంద్రియములు, మనస్సు యొక్క అతియోగ, అయోగ, మిథ్యాయోగములకు పరిహార రూపమైన చేష్టలను తెలియజేయు ఇంద్రియోపక్రమణీయమను అధ్యాయమును చెప్పుచున్నాడు ఇంద్రియోపక్రమణీయమున గూడ చెప్పబడు చేష్టలు, ఆచారములు, ఇంద్రియాది విషయములు గావున ఇంద్రియాదులనే మొదట చెప్పుచున్నాడు ఇంద్రియస్య = ఇంద్రియముల యొక్క, ఉపక్రమణం = వివరణను ప్రారంభించుట, ఇంద్రియోపక్రమణం = ఇంద్రియ వివరణమును విషయముగా గ్రహించి చెప్పబడినది - ఇంద్రియోపక్రమణీయము

మూ॥ ఇహ ఖలు పఞ్చేన్ద్రియాణి, పఞ్చేన్ద్రియ ద్రవ్యాణీ,
పంచేంద్రియాధిష్ఠానాని, పఞ్చేన్ద్రియార్థాః, పంచేన్ద్రియో భవన్తి
త్యుక్త మిన్ద్రియాధికారే ॥ 3॥

**తాత్పర్యము** అయిదు ఇంద్రియములు, అయిదు ఇంద్రియ ద్రవ్యములు, అయిదు ఇంద్రియాధిష్ఠానములు, అయిదు ఇంద్రియార్థములు, అయిదు ఇంద్రియ జ్ఞానములు ఇవన్నియు ఈ ఇంద్రియాధికారమునందు చెప్పబడినవి

**చ పా వ్యా ఆ అ** ఇహ = అనగా ఈ ప్రకరణమున అయిదు ఇంద్రియములు అని చెప్పుటవలన ఇంకొక ప్రకరణమున ఇతర దర్శనముల ననుసరించి ఇంద్రియములు అని చెప్పుటలో తప్పులేదు కారణమేమనగా ఈ శాస్త్రము సార్వజనికమైనది అందువలన ఆయుర్వేదమునకు విరుద్ధములు కాని వైశేషిక, సాంఖ్యము మొ॥ దర్శన భేదముల ననుసరించి పరస్పర విరుద్ధములైన అర్థములు చెప్పబడినప్పటికిని పూర్వపర విరోధములు కలుగవు అని అర్థము మనస్సు - వైశేషికమున ఇంద్రియమైనప్పటికిని శాస్త్రకారుడు గూడ మధురరస ప్రస్తావమున "షడింద్రియ ప్రసాదనః" అనగా ఆరు ఇంద్రియములను ఆనంద పరచునది అని సూ॥ 26 అధ్యాయమున చెప్పుట వలన ఇంద్రియముగా గ్రహించినప్పటికిని ఈ ప్రకరణమున చక్షురాది ఇంద్రియముల కంటె ఎక్కువ ధర్మముల కల్గియుండుట వలన ఇంద్రియముగా చెప్పబడలేదు "చక్షుః శ్రోత్రం" అను వాక్యముతో ఇంద్రియములను ఆచార్యుడు స్వయముగా ఇదే అధ్యాయమున చెప్పనున్నాడు "ఇత్యుక్త మింద్రియాధికారే అనగా ఈ మాత్రమే ఇంద్రియ వివరణములను వివరించు ప్రకరణమున పూర్వులైన ఆచార్యుల చేత చెప్పబడినదని అర్థము దీనితో ఇతర శాస్త్రములందు కూడా ఇంద్రియ ప్రకరణమున ఇది మాత్రమే చెప్పబడినదని ఫలితార్థము

**మూ॥** అతీన్ద్రియం పునర్మనః సత్త్వ సంజ్ఞకం చేత ఇత్యాహంరేకే,
తదర్థాత్మసం పతదాయత్త చేష్టం చేష్టా ప్రత్యయభూత మిన్ద్రియాణమ్॥

**తాత్పర్యము** మనస్సు అతీంద్రియముగ నుండును సత్వమనెడి పేరును కలిగి యుండును కొందరు దీనిని చేతస్సనియు చెప్పుచున్నారు మనో వ్యాపారమునకును, ఆత్మ వ్యాపారమునకును మనస్సు ఆధారము నుండును మరియు ఇంద్రియముల యొక్క వ్యాపారమునకు కారణముగ నుండును

**చ పా వ్యా ఆం అ** అతీంద్రియం అను వాక్యములతో నేత్రము మొదలగు ఇంద్రియముల కంటె విశిష్ట ధర్మములు గలదిగా మనస్సును తెలుపుచున్నాడు అతీంద్రియం = ఇంద్రియముల నతిక్రమించినది చక్షురాది (నేత్రములు మొ॥) ఇంద్రియములు బాహ్య జ్ఞానమునకు కారణములైతే వాటికంటే అతీతమైన జ్ఞానమునకు కారణమైనదని అతిక్రాంత శబ్దమున కర్థము ఒక విధముగా మనస్సు గూడ సుఖము మొ॥ వాటి యొక్క జ్ఞానమునకు కారణమగుట వలన ఇంద్రియమైనప్పటికిని చక్షురాది ఇంద్రియములను అధిష్టించు వైశిష్ట్యము కల్గియుండుట వలన అతీంద్రియముగా చెప్పబడినది లేక చక్షురాది అతీంద్రియముల కంటె గూడ మిక్కిలి సూక్ష్మమైనది,

సులభముగా తెలుసుకొనబడని దగుట వలన ఇది సత్త్వమను పేరుగలది "చేత ఇత్యాహురేకే" అనగా కొందరు చేతస్సు అని గూడ అందురు ఇది పరమతమైనప్పటికిని త్రోసిపుచ్చబడలేదు గాన ఆచార్యునికి గూడ అంగీకారమె. పర్యాయములను చెప్పుట శాస్త్రమున వ్యవహరించుట కొరకు తదర్థః అనగా మనస్సు యొక్క అర్థము (విషయము) సుఖము మొ॥నవి మరియు చింత్యము, విచార్యము మొ॥నవి ఆత్మ = చైతన్య సంధానము చేయువాడు ఈ రెండింటి యొక్క (మనస్సుఆత్మల యొక్క) సంపద ఇవి మనస్సును ఆశ్రయించుకొని యుండును మనస్సు యొక్క అర్థము మరియు ఆత్మ యొక్క సంపదలో మనస్సు అర్థము యొక్క, సంపద సుఖాదుల యొక్క సంబంధము చింత్యము మొ॥నవి అభిముఖములగుట ఆత్మ యొక్క అర్థ సంపదయనగా ప్రయత్నశీలత సుఖము మొ॥ వాటి యొక్క జ్ఞానము చింత్య, చింతనము మొదలగునవి మరియు చక్షురాదింద్రియ ప్రేరణము చక్షురాది ఇంద్రియములు తమ తమ రూపాదులను గ్రహించుటకు మనస్సు కారణమగునని భావము అందువలన సంక్షిప్తముగా నీ విధముగా చెప్పవచ్చును. ఎప్పుడైతే సుఖాదులు మరియు చింత్యాదులు గూడా తెలుసుకోదగిన విషయములగునో, ఆత్మగూడ ప్రయత్నవంతమగునో అప్పుడు మనస్సుతన విషయమున గూడ మనస్సు నధిష్టించినపుడే స్వ విషయ జ్ఞానమునందు ప్రవర్తించును (4)

మూ॥ స్వార్థేన్ద్రియార్థ సంకల్ప వ్యభిచారణాచ్చానేక మేకస్మిన్
పురుషే సత్త్వం, రజస్తమస్సత్త్వ గుణయోగాచ్చ
న చానేకత్వం, న హ్యేకం హ్యేక కాలమనే కేషు ప్రవర్తతే,
తస్మాన్నైకకాలా సర్వేన్ద్రియ ప్రవృత్తిః॥ 5॥

తాత్పర్యము ఒక పురుషుని యందలి సత్త్వమే మనో విషయములు ఇంద్రియ విషయములు సంకల్పములువీని యొక్క మార్పు వలనను, రజో గుణము, తమోగుణము, సత్త్వ గుణము వీని యొక్క సంబంధము వలనను అనేక విధములుగ తోచబడుచున్నది కాని మనస్సునకు అనేకత్వము లేదు ఒకటియే ఏక కాలమున అనేక విషయములయందు ప్రవర్తింప నేరదు కావున సమస్తేంద్రియముల యొక్క వ్యాపారమును ఒక కాలమునందే కలుగనేరదు

చ పా వ్యా అం అ ఇప్పుడు ఆ మనస్సు ఒకే వ్యక్తియందు ఉపాధి భేదమువలన ననేకములైననూ నిజమునకు ఒకటే యని స్వార్థేంద్రియార్థ అను దానితో తెలుపుచున్నాడు సత్త్వం = మనస్సు, అనేకం = ఒకదానికంటె ఎక్కువగా నున్నదాని వలె, స్వార్థే

వ్యభిచారణాత్ = తన విషయములు, ఇంద్రియ విషయములు సంకల్పము వీటియందొక చోట నిలకడగా నుండక పోవుట వలన మరియు రజస్సు, తమస్సు, సత్వగుణముల యొక్క కలయిక వలన ఇచ్చట చకారము పరస్పర సముచ్చయార్థమున ప్రయోగించబడినది స్వార్థమనగా తన యొక్క అర్థము (విషయమైన) చింత్యమును విడచి ఇతరములైన విషయములను గ్రహించుట వలన అని అర్థము అనగా ఒకటేయైన మనస్సు ధర్మమును గూర్చి ప్రవర్తించునపుడు ధర్మ చింతనముగాను అదే ధర్మమును వదలి కామమును గూర్చి ప్రవర్తించినపుడు కామచింతనము కాదు. ఒకటేయైనప్పటికిని ధర్మ భేదము ననుసరించి అనేక విధములుగా చెప్పబడునని సారాంశము ఇదే విధముగా ఇంద్రియార్థములందు వ్యభిచరించినపుడు గూడ రూపమును గ్రహించినపుడు రూప గ్రాహకము, గంధమును గ్రహించినపుడు గంధగ్రాహకమన బడును ఇక సంకల్ప వ్యభిచరణమున గూడ ఇట్లే తెలుసుకో వలయును సంకల్పమనగా తలచుకొన్న భావములను, వాటి గుణదోషములను బట్టి ఇది నాకుపకరించునది లేక ఇది నాకుపకరించనిది అని తెలుసుకొనుట ఈ విషయమున మనసు వ్యభిచరించినపుడు ఒకప్పుడు మంచిది ఒకప్పుడు దోషభూయిష్టమైనది అను మనో భేదము అట్లే ఒక వ్యక్తియందు ఒకే మనస్సు ఎక్కువ రజోగుణ భూయిష్ఠమైనపుడు కోపము మొ॥నవి కలుగును ఎక్కువ తమోగుణ భూయిష్ఠమైనపుడు అజ్ఞానము, భయము మొ॥నవి కలుగును అదే సత్త్వయుక్తమైనపుడు సత్యము - పవిత్రత మొ॥నవి గలవాడగును అందువలన మనస్సు అనేకములున్నట్లుగా యుండును ఈ విధముగా అనేకములుగా ప్రతిపాదించబడిన మనస్సు నిజమునకు ఒకటేయని 'నచ' అను వాక్యముతో చెప్పుచున్నాడు "నచానేకత్వం" (మనసః) మనస్సునకు అనేకత్వము లేదు అని యర్థము వాక్యమున చకారము నుంచుట చేత మనస్సు "అమహత్" అనగా మహద్గుణములేనిది అని సూచించు చున్నాడు అందువలననే "అణుత్వమథ చైకత్వం ద్వౌగుణౌ మనసః స్మృతౌ" అనగా అణుత్వము, ఏకత్వము ఈ రెండు మనస్సుయొక్క గుణములని చ శా 1 అధ్యాయమున చెప్పడినది "నహి" అను వాక్యముతో అనేకత్వము మనస్సునకెందుకు లేదో ఆ విషయమును వివరించుచున్నాడు అనేకములుగా నున్న వస్తువులు ఒకే కాలమున అనేకములందు ప్రవర్తించును దేవదత్త, యజ్ఞదత్త, విష్ణుమిత్రా - శరీరములందలి అనేకములైన మనస్సులు మూడు గావున ఒకే సమయమున 3 మనస్సులు రూప జ్ఞానము, శబ్దజ్ఞానములందు ప్రవర్తించ వలసి యుండును కాని అట్లు ప్రవర్తించుటలేదు అందువలన ఒక వ్యక్తియందు

మనస్సు కూడా ఒకటే యని యర్థము పెద్దగా నున్న శష్కులి (చక్కిలము) తినుచున్న వానికి ఒకే సమయమున పంచేంద్రియ జ్ఞానములు కలుగుచున్నవనుట నూరు కలువ ఆకులు సూదితో ఒకే కాలమున భేదించబడుచున్న వన్నట్లు భ్రాంతితో గూడిన భావము నిజముగా ఒకే కాలమున అన్ని జ్ఞానములు గలిగిన ఎడల వస్తు (సంబంధ) సన్నికర్షమాత్రముననే ఎల్లప్పుడు ఒకే సమయమున అన్ని జ్ఞానములు గలుగును ఆకారణము వలననే మనస్సునకు మహత్త్వము గూడలేదు మహత్త్వమే గనుక మనస్సునకుండి యుండి ఒకే సమయమున పంచ జ్ఞానేంద్రియములనధిష్టించి మనస్సు పంచేంద్రియ జ్ఞానములను ఒకే సమయమున కలుగజేయునదిగా యుండెడిది అట్లే ఒకే సమయమున అన్ని జ్ఞానములు కలుగుట లేదు అందువలననే మనస్సు ఒకటి అది అణువు అని చెప్పబడినది ఒక వ్యక్తియందు ఒకే మనస్సు అదీ అణువుగా నున్న కారణముననే ఒకే కాలమున అన్ని ఇంద్రియములు తమ తమ విషయములందు ప్రవర్తించుట లేదు అని అర్థము ఇంద్రియములు మనోఽధిష్ఠితములై ప్రవర్తించును గావున మనస్సు చక్షురింద్రియము నాశ్రయించి నపుడు ఘ్రాణము మొ॥వాటి నాశ్రయించదు అట్లే ఘ్రాణము నాశ్రయించి నపుడు చక్షురాదుల నాశ్రయించదు ॥5॥

మూ॥ యద్గుణం చాభీక్ష్ణం పురుషమనువర్తతే సత్త్వం।
తత్స త్త్వ మేవోపదిశన్తి ఋషయో బాహుల్యాను శయాత్॥ 6

**తాత్పర్యము** సత్త్వము రజోగుణము మొదలగు వానిలో ఏ గుణముతో అధికముగ కూడి పురుషుని అనువర్తించుచుండునో అట్టి గుణము యొక్క అధిక సంబంధమువలన ఆ పురుషుని అట్టి సత్త్వము కల వానినిగ ఋషులు చెప్పుచున్నారు

**చ.పా వ్యా ఆం అ** ఒక వ్యక్తి యందలి మనస్సు అదే ఒకప్పుడు రజోగుణయుక్తమై, ఒకప్పుడు తమో గుణయుక్తమై, మరియొకప్పుడు సత్త్వగుణ యుక్తమైనపుడు వీడు - సాత్వికుడు, వీడు - రాజసుడు, వీడు - తామసుడనుట ఎట్లో అను శంకకు "యద్గుణం" అను వాక్యముతో సమాధానము చెప్పుచున్నాడు యద్గుణం సత్త్వాది గుణములలో ఏ గుణముతో కూడుకునియున్న , అభీక్ష్ణం = మాటిమాటికి, సత్వం = మనస్సు, అనువర్తతే = అనుబంధించియుండునో అట్టి మనస్సు సాత్త్వికము, రాజసము, తామసము అని యనబడును బాహుల్యానుశయాత్ = ఎక్కువ సంబంధము వలన, ఇతర గుణములున్నప్పటికిని సత్త్వ బాహుళ్యము వలన సత్త్వకార్యములైన సత్యము, పరిశుభ్రత మొ॥ కార్యములు గల వానిని సాత్త్వికుడందురు ఇట్లేరాజస, తామసులను

తెలుసుకోవలయును

మూ॥ మనః పురస్సరాణీన్ద్రియాణ్యర్థ గ్రహణ సమర్థాని బవన్తి ॥ 7

తాత్పర్యము మనస్సుతో కూడిన ఇంద్రియములు విషయములను గ్రహించుటకు సమర్థములైనవిగా నుండును

చ పా వ్యా ఆం అ ఇంద్రియ చేష్టలకు కారణభూతము మనస్సని చెప్పబడినది అట్టిదానిని "మనః పురస్సరాణి" అను దానితో వివరించుచున్నాడు మనః పురః సరాణి = మనస్సు నాధారముగా చేసుకొని

మూ॥ తత్ర చక్షుః శ్రోత్రం, ఘ్రాణం, రసనం, స్పర్శనమితి, పంచేంద్రియాణి॥ 8

తాత్పర్యము చక్షురింద్రియము, శ్రోత్రేంద్రియము, ఘ్రాణేంద్రియము, రసనేంద్రియము, స్పర్శనేంద్రియము ఈ అయిదును ఇంద్రియములుగ నుండును

చ పా వ్యా ఆం అ పంచేంద్రియాణి అని పూర్వము చెప్పబడిన ఐదు ఇంద్రియములలో "తత్రచక్షు!" అను వాక్యముతో వివరించుచున్నాడు రూపమును రూపముగలదానిని ప్రకాశింపజేయునది కావున 'చక్షుః" అనబడినది నేత్రేంద్రియమునకు పేరు ఈ ఇంద్రియము రెండు నేత్రగోళముల నధిష్టించి ఒకటే యుండును దేనితో వినబడుచున్నదో అది శ్రోత్రేంద్రియము వాసన దేనితో తెలుసుకోబడుచున్నదో అది ఘ్రాణేంద్రియము దేనితో రుచి చూడబడుచున్నదో అది రసనేంద్రియము దేనితో తాకబడుచున్నదో అది స్పర్శనేంద్రియము

మూ॥ పఞ్చేన్ద్రియ ద్రవ్యాణి - ఖం వాయుర్జ్యోతిరాపో భూరితి ॥ 9

తాత్పర్యము ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధ్వి - ఈ అయిదు ఇంద్రియద్రవ్యములుగ నుండును

చ పా వ్యా ఆం అ ఇంద్రియములకు ప్రధానముగా ఆరంభముగా నుండు ద్రవ్యము ఇంద్రియద్రవ్యము అన్ని ఇంద్రియములందు ప్రాధాన్యతను గల్గినది కావున ఇంద్రియములను చెప్పినపుడు చక్షురేంద్రియము మొదట చెప్పబడినది శాలాక్యమున గూడ "శ్రోత్రత్వక్ ఘ్రాణ రసనైః శ్రేష్ఠైరపి సమన్వితః! బలవర్ణాద్యుపేతోఽపి నష్టదృక్ కుడ్యసన్నిభః॥ అనగా శ్రోత్ర, త్వక్, ఘ్రాణ, రసనేంద్రియములు బాగుగా నున్నప్పటికిని బలవర్ణయుక్తుడైనప్పటికిని దృష్టిలోపించిన వాడు గోడతో సమానుడని చెప్పబడినది ఇంద్రియ ద్రవ్య నిర్దేశ సందర్భమున మాత్రము ద్రవ్యోత్పత్తి క్రమముననుసరించి శారీరస్థానమున మొదటి అధ్యాయమున చెప్పబడు "మహాభూతాని ఖం వాయురగ్నిరాపః

క్షితి స్తధా'' అను క్రమము నాధారముగా చేసికొని ఆకాశము మొదట చెప్పబడినది

మూ॥ పంచేంద్రియాదిష్ఠానాని - అక్షిణీ కర్ణౌ నాసికే జిహ్వాఃత్వక్ చేతి॥ 10

తాత్పర్యము నేత్రములు, చెవులు, ముక్కు, నాలుక, చర్మము ఈ అయిదు ఇంద్రియాధిష్టానములుగా నుండును

చ పా వ్యా ఆం అ ఇంద్రియాధిష్టానములనగా ఇంద్రియముల కాశ్రయములు నేత్రములు, చెవులు, నాసాపుటములు రెండైనప్పటికిని ఒకే ఇంద్రియమున కధిష్టానములు గావున ఒకటిగానే ఎంచి "పంచ" ఐదు ఇంద్రియాధిష్టానములని చెప్పబడినది (10)

మూ॥ పంచేంద్రియార్థాః - శబ్దస్పర్శ రూప రసగన్ధాః॥

తాత్పర్యము శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ఈ అయిదును ఇంద్రియార్థములుగ నుండును

చ పా వ్యా ఆం అ ఇంద్రియార్థః = ఇంద్రియ విషయములు, ఇక్కడ స్పర్శ అనగా స్పర్శ అనియు, స్పర్శకాశ్రయమైన ద్రవ్యమనియు, స్పర్శకాధారమైన ద్రవ్యము యొక్క పరిమాణము మొ॥నవి గూడా స్పర్శగ్రాహ్యములని గ్రహించవలయును ఇటే రూపాదులలోను గ్రహించవలయును

మూ॥ పంచేంద్రియ బుద్ధయశ్చక్షుర్బుద్ధ్యాదికాః
తాః పునరిన్ద్రియార్థ సత్త్వాత్మ సన్నికర్షజాః
క్షణికాః నిశ్చయాత్మకాశ్చ , ఇత్యేతత్పంచ పంచకమ్॥ 12

తాత్పర్యము చక్షుజ్ఞానము, శ్రోత్రజ్ఞానము మొదలగు అయిదును ఇంద్రియ జ్ఞానములుగా నుండును ఇంద్రియములు, ఇంద్రియార్థములు మనస్సు, ఆత్మ వీని యొక్క సంబంధము వలన ఈ ఇంద్రియ జ్ఞానములు కలుగును ఇవి శీఘ్రముగ నశించునవి గను నిచ్చయజ్ఞానమును కలిగించునవిగను నుండును ఇట్లు ఐదేసి విధములగు ఐదు విషయములును చెప్పబడినవి

చ పా వ్యా ఆం అ అసాధారణ కారణములైన ఇంద్రియములచే తెలుపబడిన బుద్ధులు ఇంద్రియబుద్ధులు గ్రహణమున కసాధారణ కారణమైన చక్షురింద్రియముతో కలిగిన బుద్ధి చక్షుర్బుద్ధి ఇట్లే శ్రోతాది బుద్ధులను చెప్పుకోవలయును ఇచ్చట అనేక విషయములు గల్గియుండుట వలన చక్షుర్బుద్ధి మొదట చెప్పబడినది తాః పునః

అనుదానితో ఇంద్రియ బుద్ధిని గల్గించు సామాగ్రిని చెప్పుచున్నాడు సన్నికర్షః = సంబంధము అట్టి సంబంధము ఒకప్పుడు సంయోగ సంబంధము ఒకచోట సమవాయ సంబంధము అందువలన చక్షుర్బుద్ధి మొ॥ వాటి యందు ఆత్మ మనస్సుతో కలియును మనస్సు ఇంద్రియముతో, ఇంద్రియము అర్థముతో శ్రోత్ర బుద్ధిలో మాత్రము శ్రోత్ర శబ్దములకు సమవాయ సంబంధము విశేషము క్షణికాః = త్వరగా నశించునవి అంతేగాని బౌద్ధ సిద్ధాంతమువలె క్షణకాలముండునవి కావని యర్థము నిశ్చయాత్మకా = వస్తుస్వరూపము యొక్క అంశాంశ కల్పనా పరిజ్ఞానము క్షణికమైనప్పటికిని, వస్తుపరిచ్ఛేద జ్ఞానము బాగుగా మండుచున్న అగ్ని వంటి బుద్ధిగలవారికి సాధ్యమేయని యర్థము ॥12

**మూ॥** మనో మనోఽర్థో బుద్ధిరాత్మా చేత్యధ్యాత్మద్రవ్యగుణ సంగ్రహః
శుభాశుభ ప్రవృత్తి నివృత్తి హేతుశ్చ, ద్రవ్యాశ్రితం చ కర్మ, యదుచ్యతే క్రియేతి ॥13

**తాత్పర్యము** మనస్సు మనో విషయము, మనో జ్ఞానము ఆత్మ ఇవి ఆత్మ సంబంధమగు ద్రవ్యముల యొక్కయు, గుణముల యొక్కయు సంగ్రహముగ నుండును ఈ సంగ్రహము శుభములకును అశుభములకును సంసార ప్రవృత్తికిని మోక్షమునకును కారణముగ నుండును కర్మ ద్రవ్యముల నాశ్రయించి యుండును అది క్రియయని చెప్పబడును

**చ పా.వ్యా.ఆం అ** "మనస స్తు చింత్య మర్థః" అని చెప్పబోవు మనో విషయము బుద్ధియనగా ఇంద్రియ బుద్ధి పంచపంచకముతో గ్రహించబడుటచే ఇచ్చట మనోబుద్ధి వివక్షితమైనది ఆధ్యాత్మము అనగా ఆత్మను అధికరణముగా చేసికొని ఆత్మను ఆధారముగా చేసికొని యున్న ద్రవ్యములు, గుణములు, వాటి సంగ్రహము ఆధ్యాత్మ ద్రవ్యగుణ సంగ్రహము వాటిలో గుణములు రూపాది బుద్ధులు మిగిలినవి ద్రవ్యములు ఆత్మకుప కారకములు మరియు అపకారములైన ద్రవ్యగుణముల యొక్క సంగ్రహమని సారాంశము అట్టి ఈ సంగ్రహము శుభమైన ధర్మము యొక్కయు, సుఖము యొక్కయు ప్రవృత్తియందు కారణమగుచున్నది మరియు అశుభమైన అధర్మము యొక్కయు, దుఃఖము యొక్కయు నివృత్తియందు కారణమగుచున్నది లేక పూర్వార్జితమైన శుభమునకు పూర్వార్జితమైన అశుభమునకు, ప్రవృత్తేః = సంసారమునకు, నివృత్తేః = మోక్షమునకు క్రమముగా కారణమగుచున్నదని అన్వయించుకోవలయును వాటిలో సంగ్రహమునకు శుభాశుభ కారణత్వము పూర్వము వలెనే అన్వయించుకో

వలయును దుర్విజ్ఞాతమైన సంగ్రహము సంసారమునకు కారణమగును తత్త్వముతో తెలుసుకొన్న మోక్ష హేతువగును "ద్రవ్యాశ్రితమ్" అను దానితో ఆధ్యాత్మ ద్రవ్య గుణములతో చెప్పబడనిదియు దానికంటే అధికమైనదియుయైన శుభాది కారణములను చెప్పుచున్నాడు కర్మ అని చెప్పుట వలన వమనాది కర్మలు, ఆస్యస్వప్నాది కర్మలు ప్రసక్తములగును దానిని వారించుటకు 'ద్రవ్యాశ్రితం' అను పదము చేర్చడినది ఐనప్పటికిని కర్మ శబ్ద వాచ్యములైన ధర్మాధర్మములు గూడ ప్రసక్తములగునని దానిని నివారించుటకు "యదుచ్యతే క్రియేతి" అని చెప్పబడినది. కర్మ శబ్దమును వేరుగా చేసి చెప్పుట పంచకర్మలందు ఈ కర్మ ప్రవేశించదని తెలియజేయుట కొరకు (13)

మూ॥ తత్రానుమానగమ్యానాం పంచమహాభూత వికారసముదాయా
త్మకానామపి సతామిన్ద్రియాణాం తేజశ్చక్షుషి,
ఖం శ్రోత్రే ఘ్రాణే క్షితిః, ఆపో రసనే స్పర్శనేఽనిలో విశేషేణోప దిశ్యతే॥
తత్ర యద్యదాత్మక మిన్ద్రియం విశేషాత్తత్తదాత్మక మేవా -
ర్థమనుధావతి, తత్స్వభావాద్విభు త్వాచ్చ ॥ 14

తాత్పర్యము అనుమాన గమ్యములైన ఇంద్రియములు పంచభూతముల యొక్క గుణ సముదాయముతో కూడినవియైనను, చక్షురింద్రియమునందు తేజస్సు యొక్కయు, శ్రోత్రేంద్రియమునందు ఆకాశము యొక్కయు, ఘ్రాణేంద్రియమునందు పృధ్వి యొక్కయు, రసనేంద్రియమునందు జలము యొక్కయు, స్పర్శనేంద్రియము నందు వాయువు యొక్కయు, సంబంధము అధికముగ నుండును కావున ఆయా ఇంద్రియములు ఆయా భూతసంబంధము కలవిగ చెప్పబడుచున్నవి ఏ ఇంద్రియము ఏ భూతము యొక్క సంబంధమును అధికముగ కలిగి యుండునో ఆ ఇంద్రియము ఆ భూతము యొక్క స్వభావమును శక్తిని కలిగి యుండుట వలన ఆ భూతము యొక్క సంబంధమగు విషయమును గ్రహించును

చ పా వ్యా ఆ అ వైద్యక సిద్ధాంతము ననుసరించి పాంచభౌతికములైనప్పటికిని చక్షురాది ఇంద్రియములకు తైజ సత్త్వము మొ॥ వ్యపదేశమెట్లు గలిగినదని ప్రస్తుతము తత్ర అను మొదటి వాక్యములతో చెప్పుచున్నాడు అనుమాన గమ్యానాం = అనుమాన ప్రమాణము ద్వారా తెలుసుకోదగినవి అనుమానములు చక్షుర్బుద్ధి మొ॥నవి అసాధారణ కారణ కార్యములు ఇవి క్రియలు గావున చేదనాదులు ఎట్లు క్రియలో ఆ విధముగా , మహాభూతములు ఆ కాశాదులు వాటి వికారమనగా పరిణామ విశేషము, సముదాయః = కలయిక అదియే ఆత్మ అనగా సమవాయి కారణము

వేటికో అవి పంచమహాభూత వికార సముదాయాత్మకములని యర్థము విశేషేణ = అధికముగా క్లుప్తముగా చెప్పవలెనన్న ఇంద్రియములకు పాంచభౌతికత్వమున్నప్పటికిని చక్షురింద్రియము తేజోభూతాధిక్యత కల్గి యుండుట వలన తైజసముగా చెప్పబడుచున్నది అట్లే ఘ్రాణము మొ॥ ఇంద్రియములందు గూడ పృథివి మొ॥ భూతాంశములధికముగా నుండుట వలన పార్థివము మొ॥ నవిగా చెప్పబడునని సారాంశము ఐతే చక్షురింద్రియము తేజోభూతాధిక్యత గలది, ఘ్రాణము పృథివీ భూతాధిక్యత గలది అను విషయములను తెలుసుకొనుట ఎట్లు అనుదానిని "తత్రయద్యదాత్మకం" అను వాక్యములతో చెప్పుచున్నాడు యత్ = ఏ ఇంద్రియము విశేషాత్ = అధికముగా , యదాత్మకమ్ = ఏ భూతముతో ప్రారంభించబడినదో , తదాత్మక = ఆ భూతాత్మకమైన, అర్థం = విషయమును గూర్చి , అనుగృహ్ణాతి = అనుసరించి వెళ్ళును ఏది తేజః ప్రధానమో అది తేజః ప్రధానమగు విషయమునే గ్రహించునని యర్థము ఇట్లే పార్థివము మొ॥ వాటిని గ్రహించవలయును అట్లు గ్రహించుటకు గల కారణమును "తత్స్వభావాత్" అగా గ్రహించదగినవియైన రూపాదులకు తైజసత్వాది రూపమైన ఏ స్వభావము గలదో చక్షురాది ఇంద్రియములకు గూడ అదే స్వభావముండుట వలన అని యర్థము విభుత్వాత్ అనగా సామర్థ్యముండుట వలన, సమాన జాతీయములైన తైజసాదులను గ్రహించుట యందే చక్షురాది ఇంద్రియములకు సామర్థ్యము కల్గియున్నవని యర్థము అందువలన పై విషయము ననుసరించి రూపము మొ॥ విషయములలో నేత్రము రూపమును మాత్రమే ప్రకాశింపజేయునది యగుట వలన బాహ్య ప్రపంచమున గూడ తేజస్సే రూపమును ప్రకాశింపజేయునదిగా యుండుట వలన, రస నేంద్రియము ఆప్యము అట్లే గంధము గూడ స్వజాతీయగుణోత్కర్షకలదైన ఘ్రాణేంద్రియముచే గ్రహించబడును గాన ఇట్లే భూత గుణముల ఆధిక్యత ననుసరించి ఆయా ఇంద్రియము ఆయా భూతాత్మకములుగా చెప్పబడును ॥ 14

మూ॥ తదర్థాతి యోగా యోగ మిథ్యాయోగాత్సమనస్క మిన్ద్రియం
వికృత మాపద్యమానం యదాస్వం బుద్ధ్యుపఘాతాయ సంపద్యతే,
సమయోగాత్పునః ప్రకృతి మాపద్యమానం యథాస్వం బుద్ధిమాప్యాయ యతి॥
15

తాత్పర్యము మనస్సుతో కూడిన ఇంద్రియములు - ఇంద్రియార్థముల యొక్క అతియోగము, అయోగము, మిథ్యాయోగము వీని వలన వికృతినొందినవై వాని

యొక్క జ్ఞానము నశించుటకు కారణములగును సమ్యగ్యోగము వలన ప్రకృతియందున్నవై వాని వాని యొక్క జ్ఞానము వృద్ధిగా నుండుటకు కారణములగును

చ పా వ్యా అం అ శుభాశుభ ప్రవృత్తులకు కారణమని 13వ సూత్రమున చెప్పిన దానిని "తదార్థాతి యోగ" అను వాక్యముతో నిచ్చట ప్రతిపాదించుచున్నాడు తత్ = ఇంద్రియము , అర్థ = రూపాది అర్థముల యొక్క , అతియోగ = ఎక్కువగా కనబడుట , అయోగః = తక్కువగ కనబడుట, మిథ్యాయోగ = వికృతములైన భీభత్సరూపములు కనబడుట, సమనస్కం = మనస్సుతో కూడిన , వికృతిం = వికారమును, ఆపద్యమానం = పొందుచున్న (పొందిన), సమనస్కమను విశేషణమును చెప్పుటద్వారా చక్షురాది ఇంద్రియములు కొట్టబడినపుడు మనస్సునకు కూడ ఉద్విగ్నత దైన్యము మొ॥ లక్షణములు గలుగునని సూచించుచున్నాడు యథాస్వం = ఏది దేనికి సంబంధించిన బుద్ధియో అది , సామర్థ్యయోగాత్ = సమయోగము వలన, పునః అను శబ్దము పూర్వపక్షము నుండి విషయమును తప్పించుచున్నది ప్రకృతిం = స్వభావమును, ఆపద్యమానం = పొందుచున్నదై (ఇంద్రియము) యథా స్వం బుద్ధి మాప్యాఽయతి అనగా తమ తమ బుద్ధులను గా పుట్టించుచున్నది (కల్గించుచున్నది) అని యర్థము ॥

15

మూ॥ మనసస్తు చిన్త్యమర్థః । తత్ర మనసో బుద్ధేశ్చ
తఏవ సమానాతి హీన మిథ్యాయోగాః
ప్రకృతి వికృతి హేతవో బవన్తి ॥

16

తాత్పర్యము ఆలోచింపదగినది మనో విషయముగ నుండును అట్టి దాని యొక్క సమ్యగ్యోగము మనస్సు యొక్కయు, జ్ఞానము యొక్కయు ప్రకృతికి కారణముగ నుండును అతియోగము, హీనయోగము, మిథ్యాయోగము ఇవి వికృతికి కారణములుగ నుండును

చ పా వ్యా అం అ ఇంతకు పూర్వము మనస్సు గూర్చి చెప్పబడినది "మనసస్తు" అను నీ వాక్యములతో ఆమనస్సునకు గ్రాహ్యములైన విషయములను చెప్పుచున్నాడు ఇంద్రియములతో నిమిత్తము (సంబంధం) లేకుండా మనస్సు దేనిని గ్రహించునో అది చింత్యము (లేక ఇంద్రియములు గ్రహించిన విషయమునే తిరిగి ఇంద్రియముతో సంబంధము (నిమిత్తము) లేకుండా మనస్సు గ్రహించిన అది చింత్యము) ఇచట చింత్యము ప్రధానమైనది గావున చెప్పడినది అందువలన మనస్సున కర్థములైన

సుఖాదులను గ్రహించక పోవుట దోషముగా నెంచగూడదు తఏవ = మనో విషయమైన చింత్యము యొక్క సమయోగ, అయోగ, అతియోగ, మిధ్యాయోగములు , ప్రకృతిః = అవికారము (వికారములేని) లేక స్వభావము అని యర్థము వికృతిః = వికారము, వాటితో చింత్యము యొక్క సమ్యగ్యోగము మనస్సునకు, మనోబుద్ధికి గూడ ప్రకృతి హేతువు అగుచున్నది చింత్యము యొక్క అతియోగము మొ॥ యోగములు మాత్రము చింతనము, ధ్యానము మొ॥ లక్షణములు గల మనస్సు, మనో బుద్ధి యొక్క వికృతికి (వికారమును) కారణములగుచున్నవి అని చెప్పుకోవలసియున్నవి అచింతనము, అతిచింతనము, భయానక చింతనము వీటితో మనస్సు వికృతమై, మనో బుద్ధిని గూడ వికృతమైన దానినిగా జనింపజేయునని భావము ॥ 16.

మూ॥ తత్రేంద్రియాణాం సమస్కామను పతప్తానా మనుపతా
పాయ ప్రకృతి భావే ప్రయతి తవ్యమేభిర్తే తుభిః॥ 17

తాత్పర్యము ఇంద్రియములును, మనస్సును వికృతి నొందక ప్రకృతియందుండుటకై ప్రయత్నింపవలయును ఎటులననగా ఇంద్రియార్థముల యొక్క సమ్యగ్యోగమును కలిగి యుండవలయును మరియు బుద్ధిచే బాగుగా తరచు ఆలోచించి కర్మలను సరిగ ఆలోచింపవలయును దేశమునకు కాలమునకు ప్రకృతికిని విపరీతములైన గుణములు కలవానిని సేవింపవలయును ఆత్మ హితమును కోరిన వారందరును ఎల్లపుడు సమస్తమును బుద్ధియందుంచుకుని సద్వృత్తమును ఆచరింపవలయును

చ పా వ్యా ఆం అ మనస్సు మనోబుద్ధి యొక్క వికృతులు కల్గినపుడు చేయదగు కర్మల విశేషమును తత్ర అనునీ సూత్రమున చెప్పుచున్నాడు అనుపతాపాయ = కొట్టబడకుండుటకై (చెడగొట్టు కారణములను వర్జించుటతో అని అర్థము) ప్రకృతి భావే = చికిత్సలనుపయోగించుట ద్వారా వికారములు లేకుండా చేయుటకై ప్రయత్నించవలయునని భావము సాత్మేంద్రియార్థ సంయోగేన అనగా ఇంద్రియ ఇంద్రియార్థముల సమయోగములతో బుద్ధ్యాసమ్యగవేక్ష్యావేక్ష్య = బుద్ధితో ఇది నాకు మంచిది, ఇది నాకు మంచిది గాదు అని బాగుగా ఆలోచించి, కర్మణాం = చేయు పనుల యొక్క సమ్యక్రృతి పాదనేన = అనగా అహితమైన కర్మలను పరిత్యజించుట వలననూ, హితమైన కర్మలనాచరించుట వలననూ దీనితో అసాత్మేంద్రియార్థ, ప్రజ్ఞాపరాధములను పరిహరించుట వలన అనాగత బాధా ప్రతిషేధరూపమైన కర్మచెప్పబడినది ఉత్పన్నములైన వికారములను శమింపజేయు ఉపాయమైతే దేశకాలములు అను మొ॥ వాటితో ముందు చెప్పబడును గుణ శబ్దము, దేశ, కాల

ఆత్మలతో విడివిడిగా అన్వయించును ఆత్మ శబ్దముతో ప్రకృతి, వికారములు గ్రహించబడును కావున శాస్త్రమున చెప్పబడినట్లుగా ప్రతిపాదించబడిన క్రియారూపములైన కర్మలను బాగాగా ఆచరించుట ఆరోగ్యమునకు హేతువగును అట్టి సద్వృత్త అనుష్ఠాన రూపమైన కర్మయే హితమైనది ఆ కారణమువలననే తనకు మేలును కోరుకొనుచున్నవాడు స్మృతిమాస్థాయ = సద్వృత్తమును మనస్సున తలచుకొని , సద్వృత్తం = సజ్జనులచే ఆచరించబడు దేహ, వాక్, మనస్సుల యొక్క ప్రకృత రూపమైన కర్మలు అనుష్ఠేయమ్ = ఆచరింపదగినవి (ఆచరింపవలయునని యర్థము) ఈ జన్మలోను, జన్మాంతర మందును, శాంతి - పవిత్రమైన ఆచారము మొ॥ వాటి యోగము వలన పుట్టిన ధర్మ ప్రభావము వలన త్రివర్గములను (భూత భవిష్యత్ వర్తమానములను) ఏలోటు లేకుండా అనుభవించువారు, సంతః= సజ్జనులను బడును అధార్మికులు అన్నీ ఉన్నప్పటికిని అప్రశస్తములుగా నుండుటచే "అసంతః = ఏమిలేని వారని చెప్పబడుచున్నారు ॥17

మూ॥ తద్ధ్యనుతిష్ఠన్ యుగపత్సం పాదయత్యర్థద్వయమారోగ్య మిన్ద్రియ విజయం చేతి॥

తత్స ద్వృత్త మఖిలేనోపదేక్షామః॥
తద్యథా - దేవగోబ్రాహ్మణ గురు వృద్ధ సిద్ధాచార్యా ఎంచ్చయిత,
అగ్నిముపచరేత్ ఓషధీ ప్రశస్తా ధారయేత్,
ద్వౌ కాలావుపస్పృశేత్, మలాయ నేష్వ భీక్ష్ణం
పాదయోశ్చ వైమల్య మాదధ్యాత్, త్రిః పక్షస్య
కేశశ్మశ్రు లోమనఖాన్ సంహారయేత్, నిత్యమను
పహత వాసాః సుమనాః సుగన్ధిః స్యాత్॥
సాధువేషః ప్రసాదిత కేశః మూర్ధశ్రోత్ర ఘ్రాణ పాదతైల నిత్యః,
ధూమపః పూర్వాభిభాషీ, సుముఖో, దుర్గేష్వభ్యుప పత్తా,
హోతా, యష్టా, దాతా చతుషథానాం నమస్కర్తా,
బలీనాముపహర్తా అతిథీనాం పూజకః పితృభ్యః పిణ్డదః,
కాలే హిత మితమధురార్థ వాదీ, వశ్యాత్మా, ధర్మాత్మా,
హేతావీర్ష్యుః ఫలేనేర్ష్యుః నిశ్చిన్తే, నిర్భీకో, హ్రీమాన్
ధీమాన్, మహోత్సాహో, దక్షః క్షమావాన్, ధార్మికః,
ఆస్తికో, వినయ బుద్ధి విద్యాభిజనవయో వృద్ధి సిద్ధా చార్యాణా

ముపాసితా ఛత్రీదణీ మౌలీ సోపానత్కో యుగమాత్రదృగ్వి
చరేత్, మఙ్గలాచారశీలః, కుచేలా స్థికణ్టకామేద్య కేశ
తుషోత్కర భస్మ కపాల స్నానబలిభూమినాం పరిహర్తా,
ప్రాక్ శ్రమా ద్వ్యాయామవర్జీ స్యాత్, సర్వ ప్రాణిషు
బన్ధు భూతః స్యాత్, క్రుద్ధానామనునేతా, భీతానామా
శ్వాసయితా, దీనానామభ్యుపపత్తా, సత్యసంధః, సామప్రధానః,
పరపరుష వచన సమిష్ణుః, అమర్షఘ్నః, ప్రశమ గుణదర్శీ,
రాగద్వేష హేతూనాం హన్తాచ ॥ 18

**తాత్పర్యము** అట్లు చేసినచో ఆరోగ్యము ఇంద్రియ విజయము అనురెండు ప్రయోజనములను ఒకేమారుగ పొందగలరు అనుష్టింపదగిన సద్వృత్తమును సంపూర్ణముగ చెప్పుచున్నాము దేవతలు, గోవులు, బ్రాహ్మణులు, గురువులు, వృద్ధులు, సిద్ధులు, ఆచార్యులు వీరిని పూజింపవలయును అగ్నిని ఉపచరింపవలయును ప్రశస్తములైన ఓషధులను ధరింపవలయును, ప్రాతః కాలమునందు సాయంకాలము నందు స్నానము చేయవలయును మలస్థానములందు పాదములను ఎల్లప్పుడు పరిశుభ్రముగ నుంచుకోవలయును వెంట్రుకలను, గడ్డమునందలి వెంట్రుకలను రోమములను, గోళ్ళను పక్షమునకు మూడు పర్యాయములు తీసివేయవలయును ఎల్లప్పుడును శుభ్రములైన వస్త్రములను ధరించువాడుగను మంచి మనస్సు గల వాడుగను సుగంధ ద్రవ్యములను పూసికొనువాడుగను, మంచి వేషము గలవాడుగను, అలంకరింపబడిన వెంట్రుకలు గలవాడుగను నుండవలయును శిరస్సు, చెవులు, ముక్కు, పాదములు వీనియందు ఎల్లప్పుడు తైలము నుంచుకోవలయును ధూమ పానమును చేయువాడుగను, ముందుగ మాట్లాడువాడుగను, ప్రసన్నుడుగను, కష్టములతో కూడిన వారిని రక్షించువాడుగను, హోమములను చేయువాడుగను, యజ్ఞములను చేయువాడుగను, దాతగను నుండవలయును నాలుగు మార్గములను కలియుచోట నమస్కరించు వాడుగను, బలులను వేయువాడుగను, అతిధులను పూజించువాడుగను, పితృదేవతలకు పిండ ప్రదానము చేయువాడుగను నుండ వలయును తగు కాలమునందు హితముగను, మితముగను, మధురముగను, అర్థవత్తుగను మాటలాడువాడుగను నుండవలయును ఇంద్రియ నిగ్రహము కలవాడుగను ధర్మాత్ముడుగను, హేతువునందు, ఈర్ష్యకలవాడుగను, ఫలమునందు ఈర్ష్యలేనివాడుగను, చింతలేనివాడుగను, భయములేని వాడుగను, బుద్ధిమంతుడుగను,

లజ్జగలవాడుగను, అధికమగు ఉత్సాహము కలవాడుగను, సమర్థుడుగను, ఓర్పుకలవాడుగను, ధార్మికుడుగను, ఆస్తికుడుగను నుండవలయును వినయము, బుద్ధి, విద్య, కులము, వయస్సు వీనిచే, గొప్పవారుగ నుండువారని సిద్ధులను ఆచార్యులను సేవించువాడుగ నుండవలయును గొడుగును, కఱ్ఱను, తలపాగను, పాదరక్షలను, ధరించి కాడి ప్రమాణముగల మార్గమును చూచుకొనుచు సంచరింపవలయును మంగళకరములైన ఆచారములను ఆచరింపవలయును చెడు వస్త్రములు, ఎముకలు, ముండ్లు, అపరిశుద్ధ పదార్థములు, వెంట్రుకలు, పొల్లుకుప్ప బూడిద పెంకులు స్నానము చేసిన ప్రదేశము బలిభూమి వీనిని విడిచి పెట్టవలయును వ్యాయామము నుండి శ్రమ కలుగక పూర్వమే విరమింపవలయును సమస్తప్రాణులకు బంధుతుల్యుడుగ నుండవలయును కోపగించిన వారిని సమాధాన పరచవలయును భయపడిన వారిని ఓదార్చవలయును, దీనులకు ఉపకారమును చేయవలయును సత్యసంధుడుగను మంచితనముకల వాడుగను ఇతరుల యొక్క పరుష వాక్యములను సహించువాడుగను కోపము లేనివాడుగను శాంత గుణముకలవాడుగను నుండవలయును రాగద్వేషములకు కారణములైన వానిని విడిచిపెట్టవలయును

చ పా వ్యా ఆం అ  సద్వృత్తానుష్ఠానమును "తద్ధి" అను మొ॥ వాటిలో తెలుపుచున్నాడు నాఽన్యశ్రియమభిలషే = అనగా పరద్రవ్యమును అభిలషించగూడదు అను మొ॥ సద్వృత్తానుష్ఠానముతో ఇంద్రియములు నియంత్రణ చేయబడును నియంత్రణ చేయు అభ్యాసము వలన ఆ ఇంద్రియములు జయింపబడునని యభిప్రాయముతో ఇంద్రియ విజయమని సూత్రమున చెప్పబడినది ఇంద్రియ విజయము మొ॥ మహత్తర ఫలములు గలదగుట వలననే సద్వృత్తమును పూర్తిగా చెప్పుచున్నాము ద్వౌకాలౌ = ప్రాతః, సాయంకాలములందు, ఉప స్పృశేత్ = స్నానము చేయవలయును, లేక ఉపస్పృశేత్ అనగా సంధ్యనుపసాసించవలయును త్రిః పక్షస్య అనగా ఐదు దినముల కొకసారి లేక "పతతి పంచదశాహోభ్యాం పక్ష రూపాభ్యాం మాస ఇతి పంచదశాహః పక్షోఽభి దీయతే ఏవం పతతి ఋతుర్మాసాభ్యాం పక్షరూపాభ్యా మింతి మాసోఽపి పక్షాభిధీయః అనగా 15 దినములు 15 రాత్రులు గలది పక్షము లేక పక్షరూపములైన రెండు మాసములతో గూడినది ఋతువని క్షారపాణి వచన ప్రామాణ్యము ననుసరించి మాసమని గూడ పక్షమున కర్థము దీనిననుసరించి పక్షమునకు మూడు మార్లు అనగా ఐదు దినముల కొకసారి లేక నెలలో 3 మార్లు కేశశ్మశ్రులోమ, నఖములను తీయించుకోవలెనని యర్థము ఇదే విషయము క్షారపాణి

'త్రిర్యాసప్య రోమనఖాన్ సంహారయేత్' అనగా నెలకు 3 మార్లు రోమనఖాదుల తీసికోవలెనని చెప్పినాడు అనుపహతవాసా = పరిశుభ్రమైన వస్త్రధారణ చేయవలెను ప్రసిద్ధ కేశః = బాగుగా కేశముల నలంకరించుకోవలయును ఇచట కేశ ప్రసాధనము చెప్పుట వలన ఇంతకు ముందు చెప్పబడిన కేశాది సంహరణము తీర్థ్యాదులందు చేయుటకురె స్నాతకాది విషయములందును ప్రాప్తించును లేక ఎవరికైతే కేశాది ఖండనము నిషిద్ధమో వారికి కేశ ప్రసాధనము ఎవరికి నిషిద్ధముకాదో కేశాధి ఖండనమని గ్రహించవలయును పూర్వాభిభాషే = ముందు పలకరించుట, దుర్గేష్వ భ్యుపపత్తా = దుర్గతి పొందిన వారిని రక్షించువాడు, యష్టా = యజ్ఞములు చేయువాడు వశ్యాత్మ = ఇంద్రియములను స్వాధీనములో నుంచుకొనువాడుగా ఇచ్చట ఆత్మ శబ్దము ఇంద్రియములను బోధించునదిగా యున్నది, హేత్వానీర్ష్యుః = అనగా ఏ కారణము వలన ఇతడు ధనవంతుడుగా గాని లేక విద్యావంతుడుగాని ఐనాడో అట్టి కారణము నాకెట్లు ప్రాప్తించునని ప్రయత్నించువాడుగా యుండవలెనని తెలుపుచున్నాడు ఫలే నేర్ష్యుః అను పదముతో అతనికి గలిగిన ధనము మొ॥ ఫలములను నశింపజేయ ప్రయత్నించకూడదని తెలుపుచున్నాడు నిర్భీకః = భయములేని వాడుగ, ఈ భయములేని తనము పరిహారము చేయలేని కారణములందు మాత్రమే భయరహితుడుగా నుండవలెనుగాని పరిహారము చేయదగినవియైన దృష్ట అదృష్టములైన ప్రత్యవాయ కారణములందు భయపడవలసినదే అభిజన ః = విరుద్ధమైన కులమున పుట్టినవారు, సర్వప్రాణి/ బంధుభూతః = అందరియందు బంధుభావము కల్గియుండవలెను రాజులను ద్వేషించువారు, పతితులు మొ॥ వారికి చికిత్స చేయుట అధర్మకరమే యైనప్పటికిని వారికి చికిత్స చేయనప్పటికిని వా॰ వారి యందు మాత్రము దయచూపవలెనని భావము, అభ్యుపపత్తా = ఉపకారము చేయుటకై దీనులను స్వీకరించుట , సత్యసంధ ః = అనుకొన్న కార్యమును నిర్వహించువాడు, అమర్షఘ్నుః = ఓర్వనితనమును పోగొట్టువాడును, ప్రశమగుణ దర్శి = శాంతినే గుణముగా చూచు స్వభావము గలవాడు

మూ॥ నాస్పృతం బ్రూయాత్, నాన్యస్వమాదద్యాత్, నాన్య
స్త్రియ మభిల న పాపేఽపిస్యాత్, నాఽన్య దోషాన్ బ్రూయాత్ నాఽన్యరహస్యే
న్నాన్యశ్రియం, వైరం రోచయేత్, న కుర్యాత్పాపం,
మాగమయేత్, నాధార్మికైర్న నరేన్ద్ర ద్విష్టైః, సహాసీత నోన్మత్తైర్న
పతితైర్న భ్రూణహన్తృభిర్నక్షు ద్రైర్న దుష్టైః, దుష్టయానాన్యా

రోహేత్, నజానుసమం కఠిన మాసన మధ్యాసీత, నాఽనాస్తీర్ణ
మనుపహిత మవిశాలమసమం వాశయనం ప్రపద్యేత,
నగిరి విషమమస్త కేష్వను చరేత్, నద్రుమ మారోహేత్,

నజలోగ్రవేగమవగా హేత, కులచ్ఛాయామునోపాసీత, నాగ్న్యుత్పాతయా మభితశ్చరేత్, నో చ్చైర్హ సేత్, నశబ్దవన్తం మారుతం ముంచేత్, నా సంవృత ముఖో జృమ్భాం క్షవథుం హాస్యం వా ప్రవర్తయేత్, న నాసికాం కుష్ణీయాత్, నదీన్తావిఘట్టయేత్, న నఖాన్ వాదయేత్, నాస్థీన్యభిహన్యాత్, న భూమిం విలిఖేత్, న ఛిన్ద్యాత్తృణం నలోష్ఠం మృద్నీయాత్, నవిగుణమజ్గై శ్చేక్షా ష్టేత, జ్యోతీంష్యగ్నిమేధ్యమశస్తం చ నాభివీక్షేత, నహుంకుర్యాచ్ఛవం, నచైత్య ధ్వజగురుపూజ్యశ్చ స్తచ్ఛాయా మాక్రయేత్, నక్షపాస్వమరసద న చైత్య చత్వర చదుష్పథోపవనశ్మశానా ఘాత నాన్యాసేవేత్, నైకః శూన్య గృహం న చాటవీమను ప్రవిశేత్, న పాపవృత్తాన్, మిత్ర భృత్యాన్, భజేత్, నోత్తమైర్విరు ధ్యేత, నావరాను పాసీత, న జిహ్మం రోచయేత్, నానార్య మాశ్రయేత్, న భయముత్పాదయేత్, న సాహసాతి స్వప్న ప్రజాగర స్నాన పానాశనాన్యాసేవెత, నోర్ధ్వజానుశ్చిరం తిష్ఠేత్, నవ్యాలానుపసర్పేన్న దంష్ట్రిణోన విషాణినః, పురోవాతాత పావశ్యాయాతి ప్రవాతాన్ జిహ్యాత్, కలిం నారభేత, నాసునిభృతో ఽ గ్నిముపాసీత నోచ్ఛిష్టో నాధః కృత్వా ప్రతాపయేత్, నావిగత క్లమోనాప్లుత వదనో ననగ్న ఉపస్పృశేత్, న స్నానవాట్యాస్పృశేదుత్త మాఙ్గ న కేశాగ్రణ్య ఛిహన్యాత్, నోపస్పృశ్యత, ఏవ వాససీబిభృయాత్,నా స్పృష్ట్వా రత్నాజ్య పూజ్యమఙ్గలంను మనసోఽభి నిష్క్రామేత్, న పూజ్య మఙ్గలాన్యపసవ్యం గచ్ఛేన్నేతరాణ్యను దక్షిణమ్॥ 19

**తాత్పర్యము** అసత్యమును చెప్పకూడదు, ఇతరుల యొక్క ద్రవ్యమును గ్రహించకూడదు, పరస్త్రీని అపేక్షింపరాదు, పరుల సంపదను ఆశింపరాదు, వైరమును కోరకూడదు. పాపమును చేయకూడదు తనకు తనకు పాపము చేసిన వానికి సైతము పాపము చేయకూడదు ఇతరుల యొక్క దోషములను చెప్పకూడదు ఇతరుల యొక్క రహస్యములు బయలు పరపకూడదు అధార్మికులు, రాజులచే ద్వేషింపబడిన వారు, ఉన్మత్తులు. భ్రష్టులు, భ్రూణ హత్యను చేసినవారు, నీచులు, దుష్టులు, వీరలతో సహవాసము చేయకూడదు దుష్టములైన వాహనముల నెక్కకూడదు మోకాటి ఎత్తుగలిగినట్టియు, కఠినముగ నున్నట్టియు, ఆసనములందు కూర్చొనరాదు ఆస్తరణలేనట్టియు, దిండ్లు లేనట్టియు, విశాలముగ లేనట్టియు, సమానముగ లేనట్టియు శయనమునందు పరుండరాదు పర్వతము యొక్క హెచ్చుతగ్గులుగనున్న శిఖరముల

యందు సంచరించరాదు వృక్షమును అధిరోహించరాదు మిక్కిలి వేగముగ ప్రవహించుచున్న జలమునందు స్నానము చేయకూడదు పెద్దల యొక్క నీడను త్రొక్కకూడదు ఉపద్రవకరమైన అగ్నిని సమీపించరాదు బిగ్గరగ నవ్వకూడదు ధ్వనితో కూడిన అపానవాతమును విడువకూడదు నోటికి ఆచ్ఛాదనములేకుండగ ఆవలింతలుగాని, తుమ్మునుగాని, నవ్వునుగాని ప్రవర్తింపజేయగూడదు ముక్కునందు వరిపిడిని చేయకూడదు దంతములను కొరుకుకొనకూడదు గోళ్ళను వాయింపకూడదు ఎముకలను కొట్టకూడదు భూమిని గీయకూడదు గడ్డిని త్రుంపకూడదు మట్టిబెడ్డలను నలుపకూడదు అవయవములతో విషమములగు చేష్టలను చేయకూడదు కాంతిని, అగ్నిని, అపరిశుభ్రపదార్థములను, అప్రశస్త పదార్థములను తరచు చూడకూడదు, శవమును చూచిహుంకరించకూడదు చైత్యవృక్షము, ధ్వజస్తంభము, గురువులు, పూజ్యులు, అయోగ్యులు వీరి యొక్క నీడను దాటకూడదు రాత్రులందు దేవాలయము, చైత్యవృక్షము, జనులు అధికముగ చేరుచోట, నాలుగు త్రోవలు గలియుచోట, ఉద్యానవనములు, స్మశానములు, వధస్థానము వీనియందు ఎల్లప్పుడు సంచరించరాదు పాడుబడిన ఇంటికిని, అడవికిని ఒంటరిగ పోకూడదు పాపవృత్తిగల స్త్రీలను, మిత్రులను, భృత్యులను వర్జింపవలయును ఉత్తములతో విరోధింపకూడదు నీచులను సేవింపగూడదు కుటిల స్వభావముగల వాని యందు ఇష్టమును గలిగియుండకూడదు అయోగ్యుని ఆశ్రయింపకుము, భయమును కలిగింపకుము సాహసకృత్యములు చేయకూడదు నిద్ర, జాగరణము, స్నానము, పానము, ఆహారము, వీనిని అధికముగా సేవింపరాదు మోకాళ్ళను పైకెత్తుకొని, చాలాకాలము ఉండకూడదు సర్పములు, కోరలు గల జంతువులు, కొమ్ములు గల జంతువులు వీని యొద్దకు బోకూడదు ఎదురుగాలి, ఎండ, మంచు, అధికమగు గాలి వీనిని వర్జించవలెను కలహము చేయకూడదు, అజాగ్రత్తగ నుండి అగ్నిని సేవింపరాదు అపరిశుభ్రముగ నుండి అగ్నిని క్రిందనుండి ప్రజ్వలింపజేయకూడదు బడలిక తీరకుండగను, ముఖమును కడుగుకొనకుండగను, వస్త్రము లేకుండగను స్నానము చేయకూడదు స్నానము చేసిన వస్త్రముతో తలను తుడుచుకొనకూడదు, తల వెంట్రుకల యొక్క కొనలను విదలింపకూడదు స్నానముకు పూర్వమునందు ధరించిన వస్త్రములను మరల ధరింపకూడదు రత్నములు, ఘృతము, పూజాద్రవ్యములు, మంగళద్రవ్యములు, పుష్పములు, వీనిని స్పృశింపకుండగ బయలు వెడలకూడదు పూజ్య ద్రవ్యములును, మంగళద్రవ్యములును, ఎడమవైపునకుండునట్లు వెడలకూడదు అపూజ్య ద్రవ్యములును, అమంగళ ద్రవ్యములును కుడివైపునకుండునట్లు వెడలకూడదు

చ పా వ్యా ఆం అ నానృతం బ్రూయాత్ = అబద్ధమాడరాదు , ఈ అబద్ధములాడ రాదనుటతో రాజయక్ష్మయందు "కాకాంస్తిత్తి రశబ్దేన" అనగా తిత్తిరమాంసములని చెప్పుచు కాక మాంసములనివ్వవలెనని చెప్పుట అనృతమేయైనప్పటికిని అది విరుద్ధముగాదు కారణమేమనగా పరులకపకార రూపఫలమునిచ్చు అసత్యభాషణమే దోషముగాని జీవనమువంటి ఉత్తమోత్తమ ఫలమునిచ్చునది అసత్యమేయైనను దానికి దోషమంటుకొనదు శాస్త్రములందు గూడా "ప్రాణాత్యయే సర్వధనాపహారే పంచానృతాన్యాహురపాతకాని" అనగా ప్రాణాపాయ సమయమున, సమస్త ధనమునపహరించు సమయమున, ఐదు అబద్ధములు పాతకములుగావని చెప్పడినది ఆగమయేత్ = తెలుసుకోవలయును, ధర్మమునాచరించని వారితో సాంగత్యమును నిషేధించుటతోడనే పతితాదులతో సాంగత్యము నిషేధించబడినప్పటికిని తిరిగి వారితో సాంగత్యము నిషేధించుట పతితాదులతో సాంగత్యము సర్వధా నిషిద్ధమని విశేష నిషిద్ధార్థము చెప్పబడినది భ్రూణహా = గర్భమును చంపువాడు, అనుపహితమ్ = కప్పబడనిది, నద్రుమమారోహేత్ = చెట్టునెక్కకూడదనునది సామాన్య విధి, అందువలన రసాయన ప్రకరణమునందు చెప్పబడు ఆమలకీవృక్షమునధిరోహించ వలెనను మహాఫలమైన విశేషవిధిచే సామాన్య విధియైన వృక్షారోహ నిషేధము బాధింప బడును అనగా సామాన్యముగా చెట్టునెక్కరాదు గాని రసాయన చికిత్సకొరకై ఆమలకీ వృక్షమును ఎక్కుట అది మహాఫలవంతముగాన తప్పులేదు అని అర్ధము కుష్ణీయాత్ = నలపగూడదు ఇచట సద్వృత్తమును పదేశించు సందర్భమున "ననఖాన్ వాదయేత్ ' గోళ్ళను ఒకదానితో నొకటి కొట్టకూడదు అను మొదలగు వాటియందు సాక్షాత్తుగా దృష్టమైనదిగాని, అదృష్టమైనదిగాని, ఫలము కనిపించనప్పటికిని ఋషి వచన ప్రమాణముననుసరించి అదృష్టఫలమేదోయుండునని తెలుసుకోవలయును "నశవం హుంకుర్యాత్" అనగా శవమును హుంకరించకూడదు అనుటకు ఆగమము అనగా శాస్త్రము "యః శవం హుంకరోతి తేన సోమోబహిర్నిరస్తో భవతి" అనగా ఎవడు శవమును హుంకరించుచున్నాడో వానితో సోముడు బయటికి వెళ్ళగొట్టబడుచున్నాడు అని అర్ధము చైత్య = ఊరిలో ప్రధానవృక్షము, ఆఘాతనం = చంపుస్థలము, అవరా ః = నీచులు, జింహ్మం = కుటిలమైన, అనార్యా ః = పాపమునుండి దూరము పోవువాడు ఆర్యుడు వారికి విపరీతమైనవాడు అనార్యుడు, అనగా పాపమును దరిజేరువాడు అనార్యుడు, సూత్రమున "నసాహసాతిస్వప్న" అనుమొదలగు సందర్భమునందలి అతి శబ్దము స్వప్నము మొదలగు పదములతో విడివిడిగా

అన్వయించును మరియు నీ ప్రకరణమున సాహసము, రాత్రియందు పెరుగన్నము మొ॥ వాటిని ఇతర ప్రకరణమునందే నిషేధించినప్పటికిని తిరిగి వాటిని నిషేధించుట ప్రకరణము ననుసరించియే ప్రకరణముననుసరించి ప్రతిపాదించిన విషయము ముందు చెప్పబడినదైనప్పటికిని ఈ ప్రకరణమున ఆలోటు లేకుండా చేయుటయే గాక తిరిగి చెప్పుట వలన ఆ విధికి విశేష గౌరవము గూడా గలుగును అని తెలుపుచున్నాడు అందువలన నిదిపునరుక్తి దోషముగానేరదు ఇందుకు ప్రమాణము "అధికరణ వశాద్దార్ఢ్యాత్ గుణదోషప్రాప్తితో ఽర్థ సంబంధాత్। స్తుత్యర్థం సంశయతః శిష్యధియాం చాభివృద్ధ్యర్థం। తంత్రేస్యాత్ పునరుక్తం నేష్యతేతద్ధి॥ అనగా అధికరణ వశమున, అర్థగౌరవముండునపుడు, అర్థ సంబంధము, గుణదోషములు ప్రాప్తించినవుడు, పొగొడుటకొరకై, నంశయాత్మకమైన శిష్యుని బుద్ధిని పెంపొందించుటకొరకై వాక్యము పునరుక్తమైనను అది పునరుక్తిదోషముగాదు అని శాస్త్ర ప్రమాణమై యున్నది ఊర్ధ్వజానుః = మోకాళ్ళను నిట్టనిలువుగా యుంచి (చాలాకాలముండకూడదు) వ్యాలాః = పాములు, అసునిభృతః = స్థిరముగా నుండక, నాఽధఃకృత్వా అనునది అగ్నితో అన్వయించి అగ్నిని తనకంటే క్రిందుగా నుంచి ఉపాసించకూడదు అని అర్థమునిచ్చును "త ఏవవాససే న ఉపస్పృశ్య బిభృయాత్ ' అనగా స్నానము చేసిన గుడ్డలు పిండకనే వాటిని ధరించకూడదు అని అర్థము అపసవ్యం = ఎడమ వైపు

మూ॥ నారత్నపాణి ర్నాస్నాతో నోపహతవాసా నాజపిత్వా నాహుత్వా
దేవతాభ్యో నానిరూప్య పితృభ్యోనాదత్వా గురుభ్యోనాతి థిభ్యోనోపా
శ్రితేభ్యో నాపుణ్యగంధో నామాలీ నాప్రక్షాలిత పాణి పాదవదనో
నాశుద్ధముఖో నోదఙుఖో నవిమనా నాభక్త విష్టాశుచిక్షుధిత పరి
చరో నపాత్రీష్వమేధ్యాసు నా దేశేనాకాలే నా కీర్ణే నాదత్వాఽగ్రమగ్నయే
నాప్రోక్షితం ప్రోక్షణోదకైర్నమంత్రైరనభిమంత్రితం న కుత్సయన్నకు
త్సితం నప్రతికూలో పహితమన్నమాదదీత, న-పర్యుషిత మన్యత్రమాంస
హరితక శుష్కశాకఫలభక్ష్యేభ్యః, నాశేషభుక్ స్యాదదన్యత్రదధి మధు
లవణ సక్తుసర్పిభ్యః, ననక్తం దధిభుంజీత, ననక్తూనేకాననశీయాత్
ననిశి నభుక్త్వాన బహూన్నర్ద్విర్నోధకాంతరితాత్, నఛిత్వాద్విజైర్భ క్షయేత్
(20)

తాత్పర్యము చేతియందు రత్నములు లేకుండగను, స్నానము చేయకుండగను ఉతికిన బట్టలను కట్టుకొనకుండగను, జపము చేయకయు, హోమము చేయకయు దేవతలకు నివేదనము చేయకయు, పితృదేవతలకు పెట్టకయు, గురువులకును, అతిధులకును ఆశ్రతులకు పెట్టకయు, పరిశుద్ధములైన గంధములను పూసికొనకయు, పుష్పమాలికలను ధరింపకయు, హస్తములను, పాదములను, ముఖమును కడిగికొనకయు, నోటిని శుభ్రపరచుకొనకయు, ఉత్తర ముఖముగ కూర్చుండియు, మనస్తిమితములేకయు, భక్తి హీనులు, అనాచారులు, పరిశుభ్రతలేని వారు, ఆకలిగలవారు, వీరిని దగ్గరనుంచుకొనియు, అపరిశుభ్రములైన పాత్రలయందును అనుకూలముగాని ప్రదేశమునందును, అకాలమునందును, జనసంమర్ధము గలప్రదేశమునందును, ముందుగ అగ్నియందువేయకయు, ప్రోక్షణోదకముచే అభిమంత్రించకయు, నిందించుచును, ఆహారమును భుజించకూడదు మాంసము, అల్లము మొ॥నవి ఎండింపబడిన కూరలు, ఫలములు, భక్ష్యములు ఇవిగాక మిగిలినవానిని నిలువయుంచి భుజింపకూడదు పెరుగు, తేనె, ఉప్పు, సక్తుపిండి, నెయ్యి ఇవిగాక ఇతరములను మిగల్చకుండ భుజింపకూడదు. పెరుగును రాత్రియందు భుజింపకూడదు ప్రత్యేకముగను రాత్రియందును, భుజించిన పిమ్మటను అధికముగను రెండుసార్లు ఉదకమును త్రాగుచును దంతములతో నములుచును సక్తుపిండిని తినగూడదు

చ పా వ్యా ఆం అ అనిరూప్య = నివేదించక, ఆకీర్ణే = జనసంమర్ధమున , అన్నమును ప్రోక్షణ చేయుమంత్రములు వేదమున తెలుసుకోవలయును కుత్సితం = స్వరూపముతో నింద్యమైన, హరితక = ఆర్ద్రకము (అల్లము) మొ॥నవి, శుష్కశాకం = ఎండిన ఆకుకూరలు, భక్ష్యాః = మోదకములు మొ॥నవి రాత్రియందు పెరుగును భుజించకూడదనుటకు శాస్త్రము "దివాకపిత్థే వసతి రాత్రే దధ్నిచ సక్తుషు శ్రీ లక్ష్మీకలహాధారా కోవిదారే కృతాలయా" అనగా దరిద్రదేవత పగలు వెలగకాయందు, రాత్రిపెరుగు మరియు, సక్తుపేలాలయందును, కోవిదారము (?)ను ఆశ్రయించుకొని యుండును అని శాస్త్రమున చెప్పబడినది ఏకాన్ అనగా ఘృతశర్కరలు లేకుండా కేవలము నోదకాంతరితాన్ అనగా మధ్యమధ్యనీళ్ళను త్రాగకుండా సక్తుపిండిని తినకూడదు అని అర్థము (20)

మూ॥ నానృజుః క్షుయాన్నాద్యాన్నశయీత, నవేగితోఽన్యకార్యః
స్యాత్, నవాయ్వగ్ని సలిల సోమార్కద్విజగురు ప్రతిముఖం నిష్ఠీ

వికా (వాత) వర్చోమూత్రాణ్యుత్సృజేత్, నపంథానమవమూ
త్రయేన్నజనవతి నాన్నకాలే, నజపహోమాధ్యయన బలిమంగ
లక్రియాసు శ్లేష్మ సింఘాణకం ముంచేత్॥

**తాత్పర్యము** తుమ్ముట, భుజించుట, పరుండుట, వీనిని వంకరగ నుండి ఆచరింపకూడదు మూత్రాదివేగముల నరికట్టి ఇతర కార్యములను చేయకూడదు, వాయువు, అగ్ని, ఉదకము, చంద్రుడు, సూర్యుడు, ద్విజులు, గురువులు వీరికి ఎదురుగ ఉమ్మి, అపానవాతము, పురీషము, మూత్రము, వీనిని విసర్జింపకూడదు త్రోవలో మూత్రమును విసర్జింపకూడదు జనులు గల ప్రదేశమునందును, భుజించునప్పుడును, జపము, హోమము, అధ్యయనము, బలికర్మ, శుభ కార్యములు వీనిని ఆచరించునపుడు నాసామలమును (చీమిడిని) విడువకూడదు

**చ పా వ్యా ఆం అ** నాద్యాదనృజుః = వంకరగా కూర్చొని భుజించకూడదు, అట్లే నానృజుఃశయీత అనగా వంకరటింకరగా పరుండరాదని "నానృజుః" అను పదము "అద్యాత్" అనుదానికి మరియు "శయీత" అనుదానికి రెండింటిని కలిపి అన్వయించుకోవలయును

మూ॥ నస్త్రియమవజానీత, నాతి విస్రంభయేత్, నగుహ్యమను శ్రా
వయేత్, నాధికుర్యాత్ । నరజస్వలాం నాతురాం నామేధ్యాం
నాశస్తాం నానిష్టరూపాచారోపచారాం నాదక్షాం నాదక్షిణాం
నాకామాం నాన్యకామాం నాన్యస్త్రియం నాన్యయోనిం నాయోనౌ
నాచైత్యచత్వర చతుష్పథోపవన శ్మశానాఘాతన సలిలౌషధి
ద్విజగురు సురాలయేషు నసంధ్యయోర్నాతి థిషు నాశుచిర్నాజగ్ధ
భేజజోనా ప్రణీత సంకల్పో నానుపస్థిత ప్రహర్షో నాభుక్తవాన్నా
త్యశితో నవిషమస్థో నమూత్రోచ్చారపీడితే న శ్రమవ్యాయా
మోపవాస క్లమాభిహతో నారహసి వ్యవాయం గచ్ఛేత్॥ (22)

**తాత్పర్యము** స్త్రీని అవమానింపకూడదు స్త్రీని మిక్కిలి నమ్మకూడదు స్త్రీకి రహస్యమును చెప్పకూడదు స్త్రీకి అధికారమునివ్వకూడదు రజస్వలగ నున్నట్టియు, వ్యాధితో కూడియున్నట్టియు, అపరిశుభ్రముగ నున్నట్టియు, ప్రశస్తురాలు కానట్టియు, ఇష్టములుగాని రూపము, ఆచారము ఉపచారములను కలిగినట్టియు, సమర్థురాలు గానట్టియు, బుద్ధికుశలత లేనట్టియు కామము లేనట్టియు, ఇతరులయందు కోరిక గలిగినట్టియు స్త్రీని పొందకూడదు పరస్త్రీని ఇతర జాతి స్త్రీని పొందకూడదు

యోనిగాక ఇతర స్థలములందు రమింపగూడదు చైత్యవృక్షము యొక్క నీడ, యాగభూమి, నాలుగు ద్రోవలు గలియుచోట, ఉద్యానవనము, శ్మశానము, వధ్యస్థానము, ఉదకము, ఓషధిస్థానము, బ్రాహ్మణులుండు స్థలము, గురుమందిరము, దేవాలయము వీనియందును, సంధ్యాకాలములయందును, నిషిద్ధ తిధులయందును మైధునము చేయగూడదు శుచిగలేకుండగను, వృష్యౌషధములను సేవింపకుండగను, సంకల్పము లేకుండగను, సంతోషము లేకుండగను, భుజింపకుండగను, అధికముగ భుజించియు విషమముగ నుండియు, మూత్రవేగముచే పీడింపబడుచుండియు, శ్రమ, వ్యాయామము, ఉపవాసము వీనిచే బడలిక నొందియుండియు మైధునము నాచరించకూడదు రహస్యముగాని ప్రదేశమునందు మైధునము చేయకూడదు

**చ పా వ్యా ఆం అ** నాతివిశ్రంభయేత్ = స్త్రీల నెక్కువగా విశ్వసించగూడదు , నాధికుర్యాత్ = ఎక్కువగా అధికారము నివ్వగూడదు, అశస్తాం = కుష్ఠాది రోగములతో అప్రశస్తమైన స్త్రీని , నాన్యయోని మను పదము చివర "అభిగచ్ఛేత్" అను పదమును కలుపుకోవలయును, అన్యయోనిః = ఇంకొక జాతి స్త్రీ, సూత్రమునందలి ఆలయ శబ్దము, ఓషధి, ద్విజ గురు సుర అను శబ్దములతో విడివిడిగా అన్వయించి ఓషధీస్థానములందు (చికిత్సాలయమున) బ్రాహ్మణుల ఇంటిలో, గురువుల ఇండ్లలో, దేవాలయములందు సంభోగము చేయరాదు నా తిధిషు = సంభోగమునకు నిషిద్ధములైన ప్రతిపద, పూర్ణిమ మొదలగు తిధులందు, వ్యవాయము చేయకూడదు అజగ్ధభేషజః = వృష్యములైన ఔషధమును సేవించక వ్యవాయము చేయరాదు అనుపస్థిత ప్రహర్షః = ధ్వజోత్థానము కలగనివాడు, అరహసి = ఏకాంతములేని ప్రదేశమున వ్యవాయము చేయరాదు (22)

మూ॥ నసతోన గురూన్ పరివదేత్, నాశుచి రభిచారకర్మచైత్యపూజ్య పూజాధ్యయన మభివర్తయేత్ (23)

నవిద్యుత్స్వనార్తవీషు నాభ్యుదితాసుదిక్షు నాగ్ని సంప్లవే న భూమికంపే
నమహోత్సవే నోల్కాపాతే నమహాగ్రహోపగమనే ననష్టచంద్రాయాం
తిథౌన సంధ్యయోః నాముఖాద్గురోర్నా వపతితం నాతి మాత్రం న తాంతం
నవిస్వరం నానవస్థితపదం నాతి ద్రుతం నవిలంబితం నాతిక్లీబం
నాత్యుచ్చైర్నాతి నీచైః స్వరైరధ్యయన మభ్యసేత్॥ (24)

**తాత్పర్యము** సత్పురుషులను గురువులను నిందింపకూడదు అభిచార కర్మ, చైత్యవృక్షము, పూజ్యులను పూజించుట, అధ్యయనము వీనిని అశుచిగానుండి చేయకూడదు

మెరుపులు, ఉరుములు, పిడుగులు ఇవియున్నపుడు దిక్కులు ఎఱ్ఱగా మున్నపుడు, అగ్ని విప్లవము కలిగినపుడు, భూకంపము గలిగినపుడు, గొప్ప ఉత్సవములు జరుగుచున్నపుడు, ఉల్కాపాతము గలిగినపుడు చంద్రసూర్యగ్రహణములు గలిగినపుడు, అమావాస్యయందు, సంధ్యాకాలములయందు అధ్యయనము చేయకూడదు గురువు ముఖమునుండి రాకుండగను (గురువులేకుండ), అక్షరలోపముతో గూడి, రూక్షస్వరముగాను, స్వరరహితమగాను, నిలకడలేని పదములతో, మిక్కిలి తొందరగాను, మిక్కిలి ఆలస్యముగాను, మిక్కిలి ఆలస్యము గల ఉచ్చారణ గలుగునట్లును మిక్కిలి బిగ్గరగాను, మిక్కిలి మెల్లగాను అధ్యయనము చేయకూడదు

చ పా వ్యా ఆం అ అభ్యుదితానుదిక్షు = దిక్కులు మండుచున్నపుడు, మహాగ్రహోపగమనం = చంద్రసూర్యగ్రహణములు, అవపతితం = వర్ణహీనమైనది , తాంతం = రూక్షస్వరము , అతిక్లీబం = ఆలస్యముగా ఉచ్చరించుట (23 - 24)

మూ నాతి సమయం జహ్యాత్, న నియమం భింధ్యాత్, ననక్తం నాదేశే
చరేత్, నసంధ్యా స్వభ్యవహారా ధ్యయన స్త్రీ స్వప్న సేవీస్యాత్,
నబాలవృద్ధ లుబ్ధ మూర్ఖ క్లిష్ట క్లీబైః సహ సఖ్యం కుర్యాత్, నమద్య
ద్యూత వేశ్యాప్రసంగరుచిః స్యాత్, నగుహ్యం వివృణుయాత్, నకంచి
దవజానీయాత్, నాహంమానీస్యాత్ నాదక్షో నా దక్షిణో నాసూయాకః,
నబ్రాంహ్మణాన్ పరివదేత్, నగవాం దండముద్యచ్ఛేత్, నవృద్ధాన్న గురూ
న్ నగణాన్న నృపాన్ వ్యాధి క్షిపేత్, నచాతిబ్రూయాత్, నబాంధవాను
రక్త కృచ్ఛ ద్వితీయ గుహ్యజ్ఞాన్ బహిష్కుర్యాత్ ॥ 25 ॥

తాత్పర్యము మంచి సమయమును విడిచి పెట్టకూడదు నియమములను అతిక్రమించకూడదు రాత్రులయందు పోకూడని స్థలములలో సంచరించకూడదు భోజనము, అధ్యయనము, స్త్రీ, నిద్ర వీనిని సంధ్యాసమయము నందు సేవింపగూడదు బాలురు, వృద్ధులు, లుబ్ధులు, మూర్ఖులు, రోగగ్రస్తులు, నపుంసకులు, వీరితో స్నేహము చేయకూడదు మద్యపానము, జూదము, వేశ్యాసంగమము, వీనియందాసక్తి గలవాడుగ నుండకూడదు రహస్యమును వెలిబుచ్చకూడదు ఎవరినైనను అవమానింప కూడదు అహంకారముగల వాడుగను అనమర్థుడుగను దుష్ప్రవర్తనగలవాడుగను అసూయగలవాడుగను ఉండకూడదు బ్రాహ్మణులను దూషింపకూడదు గోవును దండముతో కొట్టగూడదు వృద్ధులు, గురువులు, జనసమూహము, రాజులు, వీరిని అధిక్షేపించకూడదు వీరలతో అధిక ప్రసంగమును

...చిదు బంధువులు తనయందు ప్రేమ గలవారు, ఆపత్తునందు సహాయము ...వారు తన యొక్క రహస్యము తెలిసినవారు వీరిని విడిచిపెట్టకూడదు

చ వా వ్య ఆం అ ప్రతి సమయః = ఎక్కువమంది కలిసి ఏర్పరచిన నియమము దానిని వదలిపెట్టకూడదు (లేక) (మంచి సమయమును వృథా చేయకూడదు) సంధ్యా సమయములందు చేయకూడనివి వివరించు సందర్భమున పూర్వము నిషేధించిన స్త్రీ ప్రసంగమే తిరిగి నిషేధించుట ఈ ప్రకరణమున ఆలోపమును పరిహరించుట కొరకు పూర్వము నిషేధించిన నిషేధము అన్నింటిని నిషేధించు సందర్భమున వివరించబడి ఇక్కడ ప్రకరణ భేదముచే నిషేధించబడుటవలన ఇది పునరుక్తి దోషముగాదు క్లీబః = హీనసత్వము, క్లిష్టః = రోగాదులతో నిందితుడు, గణాన్ = సమూహములను, కృచ్ఛ ద్వితీయః = ఆపదలో సహకరించువాడు, నబహిష్కుర్యాత్ = బహిష్కరించకూడదు (25)

మూ॥ నాధీరో నాత్యుచ్ఛ్రితసత్వఃస్యాత్ నాభృతభృత్యః నావిస్రబ్ధ
స్వజనః, నైకః సుఖీ, నదుఃఖశీలాచారోపచారం నసర్వవిస్రంభీ
నసర్వాభిశంకీ, నసర్వకాలవిచారీ॥ ॥26॥

తాత్పర్యము అధైర్యముగ నుండగూడదు అధికమగు ధైర్యముగ నుండకూడదు భృత్యులను పోషింపకుండగ నుండగూడదు స్వజనమునందు నమ్మకములేని వాడుగ నుండకూడదు తానొక్కడే సుఖింపకూడదు దుఃఖకరములగు నడవడికను అచారమును ఉపచారమును కలిగియుండకూడదు అందరిని నమ్మకూడదు అందరి యందును అనుమానము కలిగియుండకూడదు సర్వకాలము లందును విచారము కలవాడుగ నుండకూడదు (26)

మూ॥ నకార్య కాలమతిపాతయేత్ నాపరీక్షిత మభినివిశేత్, నేంద్రియ
వశగఃస్యాత్, నచంచలంమనో ఽ నుభ్రామయేత్, నబుద్ధీంద్రియాణామతి
భారమదధ్యాత్, నచాతి దీర్ఘసూత్రీస్యాత్, నక్రోధహర్షావనువిద్ధ్యాత్,
నశోకమాను వసేత్, నసిద్ధావౌత్సుక్యం గచ్ఛేత్ నాసిద్ధే దైన్యం, ప్రకృతి
మభీక్ష్ణం స్మరేత్, హేతుప్రభావ నిశ్చితః స్యాత్ హేత్వారంభ నిత్యశ్చ,
నకృతమిత్యాశ్వసేత్, నవీర్యం జహ్యాత్, నాపవాదమను స్మరేత్ ॥27॥

తాత్పర్యము పనులను చేయవలసిన కాలము నతిక్రమింపనీయకూడదు ఇతరుని పరీక్షింపకుండ ప్రవేశింపనీయకూడదు ఇంద్రియములకధీనుడు కాకూడదు మనస్సును చాంచల్యము నొందనీయకూడదు బుద్ధికిని, ఇంద్రియములకును అధికమగు

భారమును గలుగనీయకూడదు మిక్కిలి దీర్ఘమైన ఆలోచనను కలిగియుండకూడదు చిరకాలము దుఃఖముతో నుండకూడదు కార్యము సిద్ధించినచో గర్వమును, సిద్ధించనిచో దైన్యమును పొందకూడదు ప్రకృతిని ఎల్లప్పుడును స్మరింపవలయును హేతువు యొక్క ప్రభావమునందు నిశ్చిత జ్ఞానమును కలిగియుండవలయును శుభ హేతువులను ఎల్లప్పుడు ఆరంభింపవలయును కార్యమును నెరవేర్చితినని ఊరకుండగూడదు పరాక్రమమును విడిచి పెట్టకూడదు తన అపవాదమును స్మరింపకూడదు

చ పా వ్యా ఆం అ ఈ సూత్రమున చంచలమనునది క్రియా విశేషణము లేక మనో విశేషణము అనగా చంచలమను పదము క్రియా విశేషణమైనపుడు మనస్సును చంచలముగా విషయములందు లగ్నము చేయకూడదు అని యర్థము అట్లుగాక మనస్సునకు విశేషణమైనపుడు చంచలమైన మనస్సును విచ్చలవిడిగా సంచరించనీయగూడదు అని యర్థము, బుద్ధీంద్రియములనగా జ్ఞానేంద్రియములపై ఎక్కువ భారమును మోపకూడదు, నచాతి దీర్ఘసూత్రీ అనగా ఎప్పుడూ అనేక విఘ్నములను శంకించ గూడదు అని ఒక అర్థము మరియు పనులను అలస్యముగా చేయగూడదు అని ఒక అర్థము నశోకమను వసేత్ అనగా ఎక్కువకాలము దుఃఖించకూడదు, నసిద్ధావుత్సేకం = కార్యములు సిద్ధించినపుడు ఎక్కువగా గర్వపడకూడదు, ప్రకృతిమభీక్ష్ణం స్మరేత్ = ఉత్పత్తి కారణమునెపుడు స్మరించు చుండవలెను ప్రకృతియనగా జన్మను పంచభూత సముదాయ లక్షణాత్మకమైనదనియు అందువలననే ఇది శాశ్వతమైనది కాదనియు తలంచినచో రాగద్వేషములు గలుగవు హేతుప్రభావ నిశ్చితః స్యాత్ అనగా శుభాశుభ కారణములకు శుభాశుభ ఫలములతో సంబంధముండునని నిశ్చయించుకోవలయును హేత్వారంభ నిత్యశ్చస్యాత్ = శుభకారకములైన యాగాదులను ఆరంభించవలయును 27

మూ॥ నాశుచిరుత్తమ్యాజ్యాక్షత తిలకుశ సర్షపై రగ్నింజుహు
యాదాత్మానమాశీర్భిరాశసానః, అగ్నిర్మే నాపగచ్ఛేచ్ఛరీరా ద్వాయు
ర్మేప్రాణానాదధాతు విష్ణుర్మే బలమాదధాతు ఇంద్రోమే వీర్యం
శివామాం ప్రావిశం త్వాప ఆపోహిష్ఠేత్యాపః స్పృశేత్, ద్విఃపరిమృ
జ్యోష్ఠౌ పాదౌచాభ్యుక్ష్య మూర్ధనిఖాని చోపస్పృశేదద్భిరాత్మానం
హృదయం శిరశ్చ ॥28॥

తాత్పర్యము అశుచిగ నుండి ఉత్తమమగు ఘృతము, అక్షతలు, నువ్వులు కుశదర్భలు, ఆవాలు వీనిని అగ్నియందు హోమము చేయకూడదు "నా యొక్క శరీరము నుండి అగ్నిపోకుండు గాక నాకు వాయువు ప్రాణములను విష్ణువు బలమును ఇంద్రుడు పరాక్రమమును ఇచ్చుదురు గాక, మంగళ ప్రదమైన ఉదకములు నాయందు ప్రవేశించుగాక, అనెడి వాక్యములను పఠించుచును "ఆపోహిష్ఠా, అనెడి మంత్రమును పఠించుచును ఉదకమును చల్లుకోవలయును పెదవులను రెండుసార్లు తుడుచుకొని పాదములయందు ప్రోక్షించుకొని శిరస్సునందలి ఇంద్రియములను ఆత్మను, హృదయమును శిరస్సును ఉదకముతో స్పృశింపవలయును

చ పా వ్యా ఆం అ ఉత్తమాజ్యం = ఆవునెయ్యి, ఆశీర్భిరాశసానః = చెప్పబోవు "అగ్నిర్మే' ' మొదలగు మంత్రములతో తనకు శుభమును కోరుచున్నవాడై "అగ్నిర్మే" అని మొదలుకొని "ఆపోహిష్ఠా" అనువరకు స్నానమంత్రము 28

**మూ॥** బ్రహ్మచర్య జ్ఞాన దానమైత్రీ కారుణ్య హర్షోపేక్షా ప్రశమపరశ్చ స్యాదితి॥ 29

**తాత్పర్యము** బ్రహ్మచర్యము, జ్ఞానము, దానము, మైత్రి, కరుణ, సంతోషము, ఉపేక్ష, శాంతి, వీనియందు ఆసక్తిగలవాడుగ నుండవలయును

చ పా వ్య ఆం అ మైత్రి సర్వభూతముల యందు తనయందు వలె అప్రతికూలమైనప్రవృత్తి, ఇచట "మైత్రీపరః స్యాత్" అనునది విరుద్ధము ఎందువలననగా శాస్త్రకారుడే దిగ్ధము, విద్ధము, స్వయంమృతమైన మాంసములను పరిత్యజించుటతోపాటు వయస్సులోనున్న మొ॥ గుణములతో కూడియున్న సద్యస్కమైన మాంసమును సేవించవలయునని చెప్పుచు మైత్రీ విరుద్ధమైన హింసను సాక్షాత్తుగానే ఉపదేశించినాడు కావున ఇచట అన్ని భూతములు తాననుభావము పరస్పర విరుద్ధములుగా నున్నవి అని అనుటకు అవకాశము లేదు కారణమేమనగా హింసాపూర్వకమైన మాంసభక్షణము శాస్త్రమున చెప్పబడినప్పటికి అది ఆయా విశిష్టమైన రోగములందు ఆయా విశిష్టరోగ గ్రస్తునికి మాత్రమే ఉపదేశింపబడినది అంత మాత్రమున మాంసభక్షణముగాని హింసగాని శాస్త్రమున బుద్ధిపూర్వకముగా ఉపదేశించినట్లు గాదు అదే విధముగా మదిరను గూడా స్వస్థ వృత్తమునను మరియు రోగి పరిచర్య యందును ఉపదేశించుటతో మదిరాపానము గూడా శాస్త్ర సమ్మతము గానేరదు ఇట్లే రోగాధికార ప్రకరణమున రాజయక్ష్మ మొదలగు వ్యాధులందు శరదృతు చర్య మొ॥ సందర్భములలో "లావాన్ కపింజలాన్ ఏణాన్" అనగా ఆయా జంతువుల యొక్క మాంసములు ఉపదేశించబడినప్పటికిని అవి ఆయా రోగములకు హితములగుట వలన రో

హితమునకు చేయు హింస అది హింసగాదు దానిని ఉపదేశించుట శాస్త్ర విరుద్ధము గాదు రోగి హితము కోరి వైద్యుడు చేసిన హింస హింస కానప్పటికి దీనిని సేవించిన రోగులు స్వస్థులు హింసా ఫలమును అనుభవించవలసినదే ఉదా "శ్యేనేనాభిచరన్ యజేత" అను మొ॥ సందర్భములందు అభిచారము ఒక కామ్యము గాన కామ్యుని మిత్రమైన శ్యేనమునకు అభిచారమును సాధించుటయే ప్రయోజనమైనందున దానికా విధి చెప్పబడినది

శ్యేనయాగముచే అభిచారమును చేయుటచే అధర్మము కలిగినప్పటికిని ఇచ్చట ఒక విశేషమున్నది హింసోపార్జితమైన మాంసోపయోగము లేక ఒక వేళ పురుషుడు జీవించలేని పరిస్థితులలో జీవించుటకొరకై హింసను చేసినచో "సర్వత్రా త్మానం గోపాయేత్" అను వేద వచనము ననుసరించి విధి పూర్వకముగా చేసిన హింస పాప హేతువుగాదు జీవనోపాయములు వేరే ఉన్నప్పటికిని కేవలము శరీరపుష్టి మొ॥ ప్రయోజనములు పొందుటకు చేసిన హింస మాత్రము పాపహేతువే అయినను ఆయుర్వేదమున చెప్పబడినది హింసయే అట్టి హింస పాపహేతువే అని చెప్పినను ఆయుర్వేదమున చెప్పబడిన విధులు కేవలము ధర్మోపదేశములు మాత్రమే కావు ధాతుసామ్య క్రియా చోక్తా తంత్రస్యాస్య ప్రయోజనమ్" సూ అ(1) అను వచనములను అనుసరించి ఆరోగ్య సాధకములుగా గూడా యున్నవి అందువలన ఒక గొప్ప ప్రయోజనమును అపేక్షించి చేసిన హింస గూడ అంతగా పాపహేతువుగాదు

**తత్రశ్లోకాః ॥**

పంచ పంచక ముద్దిష్టం మనోహేతు చతుష్టయమ్॥
ఇన్ద్రియోప క్రమేః ధ్యాయే సద్వృత్తమఖిలేనచ॥ 30
స్వస్థవృత్తం యథోద్దిష్టం యః సమ్యగనుతిష్ఠతి।
స సమాః శతమవ్యాధి రాయుషాన వియుజ్యతే॥ 31
నృలోకమా పూరయతే యశసా సాధుసంమతః।
ధర్మార్థావేతి భూతానాం బన్ధుతాముపగచ్ఛతి॥ 32
పరాన్ సుకృతినోలోకాన్ పుణ్యకర్మా ప్రపద్యతే।
తస్మాద్వృత్తమనుష్ఠేయ మిదం సర్వేణా సర్వదా॥ 33

చో పా వ్యా ఆం అ ఇంద్రియముల సంబంధమగు పంచ పంచకమును, మనస్సును, సమయోగము, అతియోగము మొ॥ హేతుచతుష్టయమును, సంపూర్ణమగు స్వస్థవృత్తమును ఈ ఇంద్రియోపక్రమణీ యాధ్యాయమునందు చెప్పబడినది ఇందు

చెప్పబడిన స్వస్థ వృత్తమును ఈ ఇంద్రియ ఉపక్రమణీయాధ్యాయమునందు చెప్పబడినది ఇందు చెప్పబడిన స్వస్థవృత్తమును బాగుగా నాచరించెడి వాడు వ్యాధులు లేనివాడై నూరు సంవత్సరములు జీవించును పెద్దలకు ఇష్టుడై కీర్తితో మనుష్యలోకమును పూరించును ధర్మార్థములను పొందును. సర్వ ప్రాణులకును బంధుతుల్యుగనుండును పుణ్యకర్మములు కలవీడు పుణ్యాత్ములు పొందునట్టి ఉత్కృష్టలోకములను పొందును అందువలన ఈ సద్వృత్తమును సంపూర్ణముగా ఎల్లప్పుడు ఆచరించవలెను

సంగ్రహముగా హేతు చతుష్టయం, సమయోగ, అతియోగ, హీనయోగ, మిధ్యాయోగములు, సమాఃశతం= నూరు సంవత్సరములు, సద్వృత్తము ననుష్టించుచున్నప్పటికి దైవ ప్రతికూలమున మరణము, వ్యాధులు వచ్చినప్పటికిని ఇచ్చట ప్రధానముగా పురుషాపరాధ జన్యములైన వ్యాధులు రావని చెప్పుటకు సమాఃశతం అని చెప్పబడినది ఇదే విషయమున

**పరిహార్యాణి యత్నేన సదాపరిహరన్నరః**
**భవత్య నృణతాం ప్రాప్తం సాధూనా మిహపండితః॥**

అనగా పరిహరించదగిన వాటిని ప్రయత్నముచేసి పరిహరించినచో అట్టి పురుషుడు సాధుజనుల ఋణమునుండి విముక్తుడగును

మూ॥ యచ్చాన్యదపి కించిత్స్యాదనుక్త మిహపూజితమ్।
వృత్తం తదపి చాత్రేయః సదైవాభ్యనుమన్యతే॥

ఆయుర్వేదమునందు చెప్పబడినవి గాక ఇతరములగు సద్వృత్తములు ఏవి యున్నను అవిగూడ అత్రేయునిచే ఎల్లప్పుడును అంగీకరిపబడియున్నవని తెలుసుకొనవలయును అధ్యాయమున చెప్పబడిన సద్వృత్తమునకు "యచ్చాన్యదపి" అను శ్లోకముతో సంగ్రహముగా చెప్పుచున్నాడు వృత్తమ్ ఆచారము (నడవడి) ఇహ = ఇచట ఆయుర్వేదమున చెప్పబడినప్పటికిని ఆచారమును ఉపదేశించు ధర్మశాస్త్రములందు ప్రశంసించబడినది ఉదా నాకస్మాద్వికచో భవేన్న పరశస్యే ఘుగాంచరంతీంధావంతీం వాపరస్యబ్రూయాత్" మొదలగు ధర్మశాస్త్ర విధులన్నియు అత్రేయునికి సమ్మతములే అయినప్పటికిని వాటికి సాక్షాత్తుగా ఆయుర్వేద శాస్త్రముతో సంబంధము లేకుండుట వలనను మరియు గ్రంధవిస్తర భయముతోను ఇచ్చట చెప్పబడలేదని అభిప్రాయము

ఇత్యగ్ని వేశకృతేతంత్రే చరక ప్రతి సంస్కృతే సూత్రస్థానే స్వస్థ వృత్త చతుష్కే

# తొమ్మిదవ అధ్యాయము

మూ॥ అథాతః ఖుడ్డాక చతుష్పాదమధ్యాయం వ్యాఖ్యాస్యామః॥ ॥1

ఇతి హస్మాహ భగవానా త్రేయః॥ ॥2

తాత్పర్యము పిమ్మట ఖుడ్డా కచతుష్పాదమను అధ్యాయమును చెప్పబోవుచున్నాము అని భగవంతుడగు అత్రేయుడు చెప్పెను

చ పా వ్యా ఆం అ స్వస్థవృత్త చతుష్కమును చెప్పిన తరువాత స్వస్థుడు ఆతురుడు ఉభయులకు హితమైనదగుటచే అట్టి నిర్దేశచతుష్కమును చెప్పుచున్నాడు స్వస్థులకు ఆతురులకు హితమైన వైద్య భేషజములను మొ॥ వాటిని నిర్దేశించునదిగాన దీనికి నిర్దేశచతుష్కమని పేరు అట్టి నిర్దేశ చతుష్కమున గూడా స్వస్థునికి, ఆతురునికి హితములైన వాటిలో చికిత్సకు ప్రధాన అంగభూతములైన వైద్యుడు మొ॥ పాదచతుష్టయమును వివరించు ఖుడ్డాక చతుష్పాదము చెప్పబడుచున్నది ఇచ్చట ఖుడ్డాక శబ్దము అల్పము అను అర్థమును బోధించుచున్నది ఉదా "ఖుడ్డికా గర్భావక్రాంతిః" అనగా అల్పము అని యర్థము వైద్యుడు, ఔషధము, పరిచారకుడు రోగి ఈ నాలుగు చికిత్సకు నాల్గు పాదములు ఈ చతుష్పాదములను స్వల్పము (సంక్షిప్తముగ) వివరించుటకు చెప్పబడిన అధ్యాయము గావున ఇది ఖుడ్డాక చతుష్పాద అధ్యాయము దీనికి గల ఖుడ్డాకత్వము అనగా అల్పత్వము, చెప్పబోవు మహాచతుష్పాదమునపేక్షించి అనగా (మహాచతుష్పాదమునకంటే) అల్పముగా నుండుట వలన ఇది ఖుడ్డాకచతుష్పాదము (1-2)

ఇన్ద్రియోక్రమణీయో నామ అష్టమోధ్యాయః!

అగ్నివేశకృతమై చరక ప్రతి సంస్కృతమైన తంత్రమునందలి సూత్రస్థానమున ఇంద్రియోపక్రమణీయమను నవమాధ్యాయము సమాప్తము చక్రపాణి విరచితమైన చరక తాత్పర్య టీకయగు ఆయుర్వేద దీపికా వ్యాఖ్యానమున సూత్రస్థానము 8వ అధ్యాయమునకు ఆంధ్రానువాదము

మూ॥ భిషగ్ద్రవ్యాణ్యుపస్థాతా రోగీపాదచతుష్టయమ్।
గుణవత్ కారణం జ్ఞేయం వికారవ్యుపశాంతయే॥ ॥3

తాత్పర్యము వైద్యుడు, ఔషధము, పరిచారకుడు, రోగి ఈ నలువురు పాద చతుష్టయమనబడును మంచి గుణములతో గూడిన ఈ పాద చతుష్టయము రోగములను శాంతిపొందించుటకు కారణముగ నుండును

చ పా వ్యా అం అ ఇచట పాద చతుష్టయమున ముఖ్యుడగుట వలన వైద్యుడు మొదట చెప్పబడినాడు శాస్త్రమున గూడా ప్రధానంభిషగ త్రతు అనగా వైద్యుడు ప్రధానమైనవాడు అని చెప్పబడినది అటుతరువాత చికిత్సలో ప్రధాన కారణమగుట వలన భేషజము చెప్పబడినది అటుతరువాత కల్కము, క్వాధము మొ॥ ఔషధయోగముల నిర్మాణము పరిచారకుని అధీనమైనది గావున వైద్యుడు భేషజముల తరువాత పరిచారకుడు చెప్పబడినాడు చికిత్సా పాదములతో కల్పించబడు ఆరోగ్యము రోగి నాశ్రయించినదే యైనప్పటికిని, మరియు వైద్యుడు మొ॥ వాటి చేత ఉపకారము పొందువాడు గూడా రోగియే యగుట వలనను నిజమునకు రోగి ప్రధానుడు కావలయును అయినప్పటికిని సాధ్యమైన వ్యాధి శమనమున వైద్యుడు మొ॥ కొని మూడు పాదములు ఏ విధముగ క్రియాశీలురో అట్లు రోగి కాదను ఉద్దేశ్యముతో రోగి చివరగా చెప్పబడినాడు పాదమనగా నాల్గవ భాగము శ్లోకము మొ॥ వాటి యందు ఒక పాదము లోపించిన ఏ విధముగ శ్లోకము సంపూర్ణము కాదో అదే విధముగా వైద్యాది నాల్గుపాదములలో ఏ ఒక్కటి లోపించినను చికిత్స సంపూర్ణము కాదు, అని తెల్పుటకై ఇచ్చట పాద శబ్దము ప్రయోగింపబడినది గుణవత్ అనగా చెప్పబోవు "శ్రుతే పర్యవదాతత్వం" అను మొదలగు గుణములు కల అని అర్థము ఇచ్చట వైద్యుడు మొ॥వారు చికిత్సలో సాక్షాత్తుగా క్రియతో అన్వయించినపుడే వికార ప్రశమనమున కారణభూతులగుచున్నారు ఎందువలన అనగా కార్యములందు కారణములకు గల కారణత్వము వ్యాపారము కలవాటికే కల్గుచున్నది అదెట్లనగా దేవదత్తుడు వంటవాడు అనునప్పుడు మెరిగలు తీసివేయుట మొదలగుకొని వంటకు సంబంధించిన అన్ని పనులు చేయుచున్నవాడని అర్థము గోచరించుచున్నది దీనిని బట్టి "చతుర్ణాంభిషగాదీనాం" అను మొదలగు శ్లోకములలో చెప్పబడు వైద్యుడు మొ॥ వారి యొక్క క్రియాకలాపమే వ్యాధి ప్రశమన కారణమైన చికిత్సగా చెప్పవలసియుండెను కాగా ఇచ్చట కేవలము వైద్యాదులు మాత్రమే వికార ప్రశమనమునకు కారణములుగా చెప్పబడినది కావున ఈ రెండు వాక్యముల యందు పరస్పర విరోధము కనబడుచున్నది

కాని వైద్యుడు మొ॥ వాటితోనే వైద్యాదుల యొక్క ప్రవృత్తి కూడా గ్రహించ బడుట వలన యదార్థమున పరస్పర విరోధము లేదు చతుర్ణాం అను శ్లోకమునందు ధర్మి అయిన వైద్యాదులకు ధర్మ రూపమైన చికిత్స చెప్పబడినది ఈ వైద్యాదులు వికారశమనమున కారణ భూతులు మాత్రమే కాని వికార ప్రశమనములు కావు కారణమేమనగా వైద్యాదులు లేకున్నను రోగశాంతి కావచ్చును మహాచతుష్పాదమున కూడా మేహ్యాతురాః కేవలాత్ భేషజాత్ ఋతే సముత్తిష్ఠంతే సూ॥అ 10 అనగా చికిత్స లేకున్నను కొందరు బ్రతుకుచున్నారు అని చెప్పబడినది

మూ॥ వికారోధాతు వైషమ్యం, సామ్యం ప్రకృతి రుచ్యతే।
సుఖసంజ్ఞక మారోగ్యం వికారో దుఃఖమేవచ॥

**తాత్పర్యము** ధాతువులు వైషమ్యమును చెందినచో వ్యాధి అనియు ధాతువులు సమానముగ నున్నచో ఆరోగ్యమనియు చెప్పబడును ఆరోగ్యము సుఖమనియు వ్యాధి దుఃఖమనియు చెప్పబడును

**చ పా వ్యా ఆం అ** వికారములు శమించుట కొరకైయని పూర్వశ్లోకమున చెప్పడినది అందువలన ఆ వికారమును "వికారోధాతు వైషమ్యం" అను శ్లోకముతో వివరించుచున్నాడు ధాతువులనగా వాతాదులు రసాది ధాతువులు మరియు రజస్సు మొ॥నవి వాటి యొక్క వైషమ్యము స్వాస్థ్యమునకు హేతువులుగా వ్యవహరింపబడు ధాతువుల యొక్క స్వ ప్రమాణమున కన్న తక్కువగాని, లేక ఎక్కువగాని అగుట, సామ్యం = ధాతు సామ్యము ప్రకృతి = ఆరోగ్యము ఉచ్యతే అనగా చెప్పబడుచున్నది సంబంధించినది అని తెలియుచ్నుది అని చెప్పుట వలన ఈ ప్రకృతి వికార వ్యవస్థ అయుర్వేద శాస్త్రమునకు మాత్రమే సంబంధించిన విషయమున వికారములు 6 ప్రకృతి యనగా గుణముల యొక్క సామ్యావస్థ అని తెలియచేయుచున్నాడు రాత్రి, దినము భోజనముల యొక్క ఆయా అవస్థలయందు శ్లేష్మము మొ॥ దోషములు ప్రకోపించుటవలన ఎప్పుడు ధాతువైషమ్యమే యుండును గావున ధాతుసామ్యత ఎక్కడిది అను శంకకు "సుఖ సంజ్ఞక మారోగ్యం" అనుదానితో సమాధానము చెప్పుచున్నాడు సుఖము అనగా సుఖకారణము, అట్లే దుఃఖము అనగా దుఃఖ హేతువు ఎందులకనగా దుఃఖమే వ్యాధి కాదు ఈ విధముగా చెప్పినచో జ్వరాదులకు గూడా వ్యాధిత్వముండదు అందువలన నేను శృతమున గూడా తత్తుసస్తవిదేవ్యాధావుపని పతతి" అని సు సూ 24వ అధ్యాయమున చెప్పడినది "సంజ్ఞకం" అని చెప్పుటచేత నిజమునకు అసుఖమని చెప్పబడినప్పటికిని లోకమున ఏది సుఖమని చెప్పబడుచున్నదో

అది ఇచ్చట గ్రహించబడినదని తెలియజేయుచున్నాడు అందువలన దివారాత్రముల లు మొ॥ వాటివలన జనించిన ధాతు వైషమ్యము ఉద్వేజకములైన వికారములను కలిగించకపోవుట వలన సుఖముగా చెప్పబడుచున్నది అందువలన అల్పమైనది లేని దానితో సమానమని ఎంచి అల్పమైన ధాతువైషమ్యమున ధాతు సామ్యవ్యవహారము సిద్ధమగుచున్నది అట్లే "సంజ్ఞకము" అని చెప్పుటతో సుఖము గూడా లౌకిక దృష్టితో సుఖమేగాని నిజమైన సుఖముగాదని తెలియజేయుచున్నాడు అందువలననే శారీర స్థానమున 1 అధ్యాయమున "సర్వం కారణ వద్దుః ఖం" అను మొ॥ శ్లోకములతో చెప్పినాడు "ఏవచ" అని చెప్పుట చేత దుఃఖము మాత్రము దుఃఖమేయని చెప్పుచున్నాడు దుఃఖము సుఖమువలె వ్యవహారము మాత్రమున దుఃఖము గాదు మరియు నిచట కారణమైన ధాతువైషమ్యముతో ఔపచారికముగా తత్కార్యములైన జ్వరాదులు గూడా చెప్పబడుచున్నవి ఎందువలననగా ధాతువైషమ్యజనితమైనదే వికారముగాని కేవల ధాతువైషమ్యము మాత్రవేం వికారము గాదు ఇదే విషయమును "స్వధాతువైషమ్యనిమిత్తజాయేవికార సంఘాః బహవః శరీరే" అని సూ 19వ అధ్యాయమున చెప్పబడినది ధాతువైషమ్య కారణము వలన బుట్టిన వికారములనేకములని దీనియర్థము అట్లే "వికృతి మాపన్నాః నానావిధైర్వికారైః శరీరముపతాపయంతి" అనగా వికృతిపొందినవై అనేక విధములైన వికారములతో శరీరమును పీడించును అని విమానస్థానమున 1వ అధ్యాయమున చెప్పబడినది అట్లే సుశ్రుతమున గూడా "వాత పిత్తకఫ శోణిత సన్నిపాత వైషమ్యనిమిత్తాః" అనగా వాత, పిత్త, కఫ, రక్త సన్నిపాతముల యొక్క వైషమ్యములను కారణములుగా గలవి అని సు సూ అ1 అధ్యాయమున చెప్పబడినది ఐతే పై వివరణముననుసరించి ధాతు వైషమ్యజనితమైనది వికారమని చెప్పిన పక్షమున వికారమును గలిగించిన ధాతువైషమ్యము తరువాత వికారమున ప్రవేశించునా లేక ఆరోగ్యమున ప్రవేశించునా అంటే ఆరోగ్యమున ప్రవేశించుటకువీలులేదు కారణమేమనగా "ఇత్యుక్తంకారణం ధాతు సామ్యమిహోచ్యతే" ధాతు సామ్య క్రియాచోక్తా తంత్రస్యాస్య ప్రయోజనం" అను శ్లోకముతో ఆరోగ్యమగగా ధాతుసామ్యత అని చెప్పబడినది గాన ధాతు వైషమ్యము ఆరోగ్యము గాదు అట్లే రోగ హేతువుగా చెప్పబడినది గావున రోగముననూ ప్రవేశించదు ఈ రెండూ గాక ధాతు వైషమ్యము గల్గి వికారములు మాత్రము కలుగవు అని చెప్పెదమన్న అట్టి దశలేనే లేదు ఎందువలననగా స్వప్రమాణము కన్నా అధికమైన దోషము తప్పనిసరిగా లక్షణములను ఎక్కువగా జేయును క్షీణించినదోషము అట్లే

క్షీణములైన లక్షణములను గలిగించును అట్లయిన నిచట ధాతువైషమ్యమే వికారమని చెప్పినచో సరిపోవును దానితో నిచట విషయమునకు గూడా పుష్టి గలుగును ధాతువైషమ్యజనిత వికారములనగా ఉత్పన్నములైన జ్వరాది వికారములందన్వయించు కోవలయును ఈ విధముగా చెప్పినచో ధాతు వైషమ్యము దానితో పాటు తజ్జన్య వికార ములు జ్వరాదులు గూడా వికారములగును ధాతువైషమ్య జన్యములైన జ్వరాదులందు గూడా ధాతు వైషమ్యరూపముండనే యుండును మరియు స్వప్రమాణముకన్న క్షీణించినదోషములు క్షీణలక్షణమైనవైషమ్యమునే ఎక్కువగా పొందును ఇందుకు వచనము "క్షీణాజహాతి స్వంలింగం సమాః స్వంకర్మ కుర్వతే" (సూ అ 7) ఎవరైతే వికారము ధాతువైషమ్య జనితమైనదని చెప్పుచున్నారో వారు జనించని స్పష్టముగా లేని వికారములుగల ధాతు వైషమ్యమును రాత్రి దిన భోజనాదుల వలన గలిగిన ధాతు వైషమ్యముల వలె అల్పమైనదిగానెంచి దానిని ధాతు సామ్యముననే అంతర్భవింపజేయుచున్నారు చరకమున తిల కాలకము, మషకము మొ॥ ధాతువైషమ్య జన్యములే గావున వాటికి రోగత్వము చెప్పబడినది ఇవి మనస్సునకు దుఃఖమును గల్గించునవగుట వలన దుఃఖకారణములు (4)

మూ॥ చతుర్ణాం భిషగాదీనాం శస్తానాం ధాతువైకృతే।
ప్రవృత్తిర్ధాతు సామ్యార్థా చికిత్సే త్యభిధీయతే॥ (5)

**తాత్పర్యము** ప్రశస్తములైన గుణములతో గూడిన వైద్యుడు మొదలగు పాద చతుష్టయము ధాతువులకు వైషమ్యము గలిగినపుడు వాటికి సామ్యమును గలిగించుటకై ప్రవర్తించుట చికిత్సయని చెప్పబడును

**చ పా వ్యా ఆం అ** వికార లక్షణమును చెప్పిన పిమ్మట వికార ప్రశమనమునకు కారణమైన చికిత్సా లక్షణమును "చతుర్ణాం" అను శ్లోకముతో చెప్పుచున్నాడు చతుర్ణాం అనుపదము భిషక్ మొ॥ నలుగురిని కలిపి గ్రహించును "శస్తానాం" అనగా చెప్పబోవు "శృతేపర్యవదాతత్వం" అను మొ॥ గుణములు గలిగియుండుట వలన ప్రశస్తములైన, ధాతువైకృతే = చికిత్సకధికరణమైన రోగమున, ధాతుసామ్యార్థా = ఆరోగ్యమును కలిగించుట యే ప్రయోజనము గాగలదియైన, ధాతువైకృతే అను పదమునకర్థము తెలిసినదే, అందువలన వైద్యుడు మొ॥ చికిత్సా చతుష్పాదముల ప్రవృత్తి ధాతువికృతియందే ధాతు సామ్యమును గలిగించుటకై కలుగును చతుష్పాదమున వైద్యుని యొక్క ప్రవృత్తి ఇదిచేయదగినది ఇది చేయదగనిది అని ఉపదేశ రూపముగా నుండును ఉపయోగించినచో తన కార్యము నారంభించుట

ద్రవ్య ప్రవృత్తి, భేషజ సంస్కరణము మరియు రోగి పరిచర్యా రూపమైనది పరిచారకుని ప్రవృత్తి, వైద్యుడు చెప్పినట్లుగా నడచుకొనుట, వ్యాధి స్వరూపమును చెప్పుట మొదలగునవి రోగి ప్రవృత్తి

వైద్య గుణములు

మూ॥ శ్రుతే పర్యవదాతత్వం బహుశో దృష్టకర్మతా।
దాక్ష్యంశౌచమితి జ్ఞేయం వైద్యేగుణ చతుష్టయమ్॥ 6

తాత్పర్యము శాస్త్రమునందు విశేష జ్ఞానమును గలిగియుండుట, అనేక కర్మలను చూచియుండుట, నేర్పరిగ నుండుట, శుచిగ నుండుట, ఈ నాలుగు వైద్యుని కుండవలసిన గుణములు

చ పా వ్యా ఆం అ శ్రుతే పర్యవదాతత్వం అను శ్లోకముతో పూర్వము సూచించబడిన వైద్య గుణములను తెలుపుచున్నాడు వైద్య గుణములలో శ్రేష్ఠమైనదగుట వలన శాస్త్రమునందు విశేష పరిజ్ఞానము గలిగియుండుట అను గుణము మొదటగా చెప్పబడినది ఇట్లే తక్కినవిగూడా ఆయా క్రమముగా చెప్పబడినవి పర్యవదాతత్వం = గురుసేవ, శాస్త్రసేవ మొ॥ వాటితో పరిశుద్ధమైన జ్ఞానము గలిగి యుండుట శౌచం = బాహ్యాభ్యంతరములందు పవిత్రత, ఇవేగాక జితహస్తత్వము మొ॥ ఇతర వైద్యగుణములు గూడా ఈ నాల్గింటియందే అంతర్భవించును (6)

ఔషధ గుణములు

మూ॥ బహుతా తత్రయోగ్యత్వ మనేక విధకల్పనా।
సంపచ్చేతి చతుష్కోయం ద్రవ్యాణాం గుణ ఉచ్యతే॥ ॥7

తాత్పర్యము అధిక పరిమాణముగ నుండుట (ఎక్కువగా లభించుట), ఆయా వ్యాధులందు ఉపయోగింపదగి యుండుట (అనేక వ్యాధులందుపయుక్తముగా నుండుట), అనేక విధములైన కల్పనలు గల్గి యుండుట, రసవీర్యాది సంపత్తును గల్గి యుండుట ఈ నాలుగు ఔషధమున కుండవలసిన గుణములు

చ పా వ్యా ఆం అ బహుతా అనునది భేషజగుణము ఎక్కువగా నుండుట, అల్పముగా నున్నచో అది గుణవంతమైనప్పటికిని తక్కువగా నున్న లేని దానితో సమానము అది కార్యసాధనము చేయలేదు కావున తత్రయోగ్యత్వం = తత్ర అనగా ప్రతీకారము చేయువ్యాధి యందు, యోగ్యత్వం = అర్హత గలిగియుండుట, అనేక విధ కల్పనా యోగిత్వం = అనేక విధములైన స్వరసము, కల్కము మొ॥ వాటికుపయోగించుటకు

యోగ్యముగా నుండుట, కారణమేమనగా కొందరు రోగులు స్వరసము నిష్టపడరు, అట్లే కొన్ని వ్యాధులందు వాటి స్వభావముననుసరించి ఒక్కొక్క వ్యాధిలో ఒక్కొక్క కల్పన హితముగా నుండును ఉదా జ్వరమున కషాయము హితము, అందువలన ఔషధము అనేక కల్పనలకు యోగ్యమైనదిగా యుండవలెను అట్టి ఔషధమే గుణయుక్తమైనది సంపత్ = అనగా క్రిములు, నీరు మొ॥ వాటితో కొట్టబడక యుండి రసవీర్యాది గుణములు యథా ప్రమాణముగ గలిగియుండుట

పరిచారకుని గుణములు

మూ॥ ఉపచారజ్ఞతా దాక్షమనురాగశ్చ భర్తరి।
శౌచంచేతి చతుష్కోయం గుణః పరిచరేజనే॥ 8

**తాత్పర్యము** ఉపచార విధిని తెలుసుకొనియుండుట, సమర్థుడుగ నుండుట యజమాని యందు అనురాగము కల్గి యుండుట, శుచిగ నుండుట ఈ నాలుగు పరిచారకునికుండవలసిన గుణములు

**చ పా వ్యా ఆం అ** ఉపచారజ్ఞతా = యూషము, రసము మొ॥ నవి సిద్ధముచేయు పరిజ్ఞానము, వాటిని రోగులకు చేర్చుటయందు ఉపయోగించుట యందు పరిజ్ఞానము మరియు రోగిని పరుండజేయుట, మొ॥ సేవలను చేయు పరిజ్ఞానము (8)

రోగి గుణములు

మూ॥ స్మృతిర్నిర్దేశకారి త్వమభీరుత్వమథాపిచ,
జ్ఞాపకత్వంచ రోగాణా మాతురస్య గుణాః స్మృతాః॥

**తాత్పర్యము** జ్ఞాపకశక్తిని కలిగియుండుట, వైద్యుడు చెప్పినట్లు చేయుట, భయపడకుండుట, రోగలక్షణములను చెప్పుట ఈ నాలుగు రోగికుండవలసిన గుణములు

**చ పా వ్యా ఆం అ** నిర్దేశకారిత్వం = వైద్యుడు చెప్పినదానిని చెప్పినట్లుగా చేయుట, అభీరుత్వం = భయపడకుండుట, భయము రోగ కారణము అందువలననే "విషాదో రోగవర్ధనానాం" అని చెప్పబడినది (సు అ 25) అథాపి, చ అని శబ్దములు ప్రయోగించుట వలన ఒకప్పుడు భీరుత్వము మరియు అస్మృతి (స్మృతి లేకుండుట) గూడా గుణములేయని చెప్పుచున్నాడు ఉదా ఉన్మాదమున సర్పేణోద్ధృత దంష్ట్రేణ" అను మొ॥ సందర్భములందు చికిత్సలో త్రాసనము చెప్పడినది అచ్చట రోగి ఒకవేళ భీరువు కాని ఎడల చికిత్స ఫలించదు ఇచ్చట అస్మృతి (స్మృతిలేక పోవుటయనునది జ్వర

వేగము గలుగు కాలమును స్మరించకుండుట మొదలగు సందర్భముల కుద్దేశించబడినది అందువలననే చ చికిత్సాస్థాన 3వ అధ్యాయమున జ్వర చికిత్సా ప్రకరణమున "జ్వరవేగంచ కాలంచ చింతయన్ జ్వరతేతుయః తస్యేష్టైశ్చ విచిత్రైశ్చ, ప్రయోగోర్నాశయేత్ స్మృతిమ్" అనగా జ్వరవేగమును, వేగకాలమును గూర్చి ఆలోచించుట వలన ఎవరికి జ్వరము వచ్చునో వానికి ఇష్టములైన, చిత్రములైన ప్రయోగములతో వాని స్మృతిని నశింపజేయవలెనని చెప్పబడినది (9)

వైద్యప్రాధాన్య నిరూపణము

మూ॥ కారణం షోడశగుణం సిద్ధౌ పాదచతుష్టయమ్।
విజ్ఞాతాశాసితా యోక్తా ప్రధానం భిషగత్రతు॥ 10

**తాత్పర్యము** పైన చెప్పబడిన విధమున పదునారు గుణముల గూడిన పాద చతుష్టయము చికిత్సయొక్క సిద్ధికి కారణమగును ఔషధ జ్ఞానము గలవాడును పరిచారకుని శాసించువాడును, రోగికి ఔషధమును తగురీగ ప్రయోగించువాడును అగుటచే వైద్యుడు పాద చతుష్టయమున ప్రధానుడుగ నుండును

**చ పా.వ్యా.ఆం అ** పైచెప్పబడిన శ్లోకములనను సరించి వైద్యుడు మొ॥ నాల్గు పాదములకు చికిత్సలో కారణత్వము సిద్ధించినప్పటికిని ఆ నాల్గింటిలో వైద్యునికి గల ప్రాధాన్యతను "కారణం" అనుశ్లోకముతో తెలుపుచున్నాడు విజ్ఞాతా = ఔషధమును, శాస్త్రమును ఎరిగినవాడు, శాసితా = పరిచారకుని ఈ విధముగా చేయవలెను ఈ విధముగా చేయకూడదని శాసించువాడు; యోక్తా = రోగిని సరియైన మార్గములో నుంచువాడు ఈ పై జెప్పిన కారణముల ననుసరించి భేషజము మొ॥ మూడింటి యొక్క ప్రవృత్తి వైద్యాధీనమై యున్నది వైద్యుడు మాత్రము స్వతంత్రుడు , అందువలననే వైద్యుడు చికిత్సా నాలుగు పాదములలో శ్రేష్ఠుడు అని వాక్యమునకర్థము (10)

మూ॥ పక్తౌహి కారణం పక్తుర్యథా పాత్రేంధనానలాః।
విజేతుర్విజయే భూమిశ్చమూః ప్రహరణానిచ॥ 11
ఆతురాద్యాస్తథా సిద్ధే పాదాః కారణ సంజ్ఞితాః।
వైద్యస్యాతశ్చికిత్సాయాం ప్రధానంకారణం భిషక్॥ 12

**తాత్పర్యము** పాకము చేయువానికి పాక కర్మయందు పాత్రలు, కట్టెలు, అగ్ని ఇవి ఉపకరణములుగ నుండునట్లును, సేనాపతికి యుద్ధమునందు, యుద్ధము నకనుకూలమైన ప్రదేశము, సేన, ఆయుధములు ఇవి ఉపకరణములుగ

నుండునట్లును, వైద్యునికి చికిత్సయందు పరిచారకుడు మొ॥ మూడు పాదములు ఉపకరణములుగా నుండును అందువలన చికిత్సయందు వైద్యుడు ప్రధానమైన కారణముగ నుండును

**చ పా వ్యా అం.అ** ఇంతకుముందు శ్లోకమున వైద్యునికి గల ప్రాధాన్యత చెప్పబడినది అట్టి ప్రాధాన్యతనే పై ఈ రెండు శ్లోకములలో దృష్టాంతముతో నిరూపించుచున్నాడు పక్తే అను శ్లోకములో పక్తే అనగా వంటచేయుటలో అని యర్థము ఇచట ఆతురుని పాత్రతో పోల్చినాడు పరిచారకుడు ఇంధనముతో, అనలము (అగ్ని) భేషజముతో పోల్చబడినవి కారణం = ఉపకరణము, భూమి = యుద్ధ ప్రదేశము రెండవదైన యుద్ధ ఉదాహరణమున గూడా పూర్వోదాహరణమైన పాక కర్మయందు వలెనే భూమి ఆతురునిగా సైన్యము పరిచారకులుగా, ఆయుధములు ఔషధములుగా, సేనాపతి వైద్యుడుగా పోల్చి చెప్పబడినది

మూ॥ మృద్దండ చక్రసూత్రాద్యాః కుంభకారా దృతే యథా।
నావహంతి గుణం వైద్యాదృతే పాదత్రయం తథా॥ 13

**తాత్పర్యము** మట్టి, దండము, చక్రము, సూత్రము ఇవి అన్నియున్నను కమ్మరి లేనిచో ఏ విధముగ వాని యొక్క కృత్యము జరుగనేరదో అదే విధముగ వైద్యుడులేక మిగిలిన మూడు పాదములు (ఔషధము, పరిచారకుడు, రోగి) యున్నను వాని యొక్క కృత్యము జరుగనేరదు

**చ పా వ్యాఅం అ** మృద్దండ అను శ్లోకమున వ్యతిరేక దృష్టాంతములో వైద్య ప్రాధాన్యతను తెలుపుచున్నాడు నావహంతి అనగా సాధించలేవు గుణం అనగా సాధ్యము అని అర్థము (13)

మూ॥ గంధర్వపురవన్నాశం యద్వికారాః సుదారుణాః।
యాంతి యచ్చేతరే వృద్ధి మాశూపాయ ప్రతీక్షిణః 14
సతిపాదత్రయే జ్ఞేజ్ఞేభిషజావత్ర కారణమ్।

**తాత్పర్యము** అన్వయ వ్యతిరేకముల ద్వారా విడిగా దృష్టాంతములను తెలిపి చాకచక్యముగా "గంధర్వ పురవత్" అను నీ దృష్టాంతమున ఒకేచోట అన్వయమున గుణమును, వ్యతిరేకమున దోషమును చూపించుచున్నాడు ఒక పక్షముననుసరించి జ్ఞాన సంపన్నుడైన వైద్యునిచే ఉపక్రమింపబడిన దారుణ వికారములు సైతము గంధర్వపురము వలె శీఘ్రముగా నశించుననియు, ఇంకొక పక్షముననుసరించి

అజ్ఞానియైన వైద్యునిచే ఉపక్రమింపబడిన దారుణ వికారములు గంధర్వపురమువలె శీఘ్రముగా వృద్ధిపొందుననియు అర్థము ఉపాయ ప్రతీక్షిణః అనగా వృద్ధిక్షయములను పొందుటకు వికారములు ఆయా ఉపాయములను ప్రతీక్షించుచున్నవై వృద్ధి క్షయములను పొందును శీఘ్రముగా వికారములు శమించుటకు జ్ఞానవంతుడైన వైద్యుడు కారణముకాగా అవే వికారములు శీఘ్రముగా వృద్ధి నొందుటకు శాస్త్రజ్ఞానము లేని వైద్యుడు కారణమగును (14)

మూ॥ వరమాత్మాహతోఽజ్ఞేన నచికిత్సా ప్రవర్తితా॥ 15
పాణిచారాద్యథా ఽచక్షు రజ్ఞానాద్భీత భీతవత్,
నేర్మారుతవశేవాజ్ఞోభిషక్ చరతి కర్మసు ॥ 16

**తాత్పర్యము** అజ్ఞుడగు వైద్యునిచేచేయబడు చికిత్సను పొందుటకంటె స్వయముగ చనిపోవుటయే మేలుగనుండును గుడ్డివాడు తెలియక (కనపడక) పోవుట వలన ఏ విధముగా చేతులతో తడుముకొనుచు భయపడుచు సంచరించునో నావ గాలితో కొట్టబడినపుడు ఏ విధముగా సంచరించునో అదే విధముగా అజ్ఞానియైన వైద్యుడు చికిత్సా కర్మయందు సంచరించును (భయపడునని యర్థము)

**చ పా వ్యా ఆం అ** "వరం" అను శ్లోకముతో అజ్ఞానియైన వైద్యునికి చికిత్సా ప్రవేశమును నిషేధించుచున్నాడు అజ్ఞానియై వైద్యునిచే బలవంతముగా చేయబడు చికిత్స పనికిరాదు అంతకంటే స్వయముగా మరణించుటయే మేలు ఇచ్చట ప్రవర్తితా అను శబ్దము ప్రయోగించుటచేత అజ్ఞానియైన వైద్యునిచేత బలవంతముగ చేయబడు చికిత్స అని తెలుపుచున్నాడు పాణిచారాత్ = హస్త పరామర్శ వలన, అనగా చేతులతోతడుముకొనుచు అని అర్థము కర్మసు అనగా చికిత్స కర్మలందు

మూ॥ యదృచ్ఛయా సముత్పన్నముత్తార్య నియతాయుషమ్,
భిషజ్మానీ నిహంత్యాశు శతాన్య నియతాయుషామ్॥ 17

**తాత్పర్యము** నియతమైన ఆయువుగల ఒక రోగిని దైవవశమున జీవింపచేసి వైద్యుడనని తలచువాడు నియతములేని ఆయువుగల వందలకొలది జనులను చంపుచున్నాడు

**చ పా వ్యా ఆం అ** యదృచ్ఛయా = వైద్యమునకు సంబంధించిన సమ్యగ్ జ్ఞానము లేకయే క్రియ అనగా కర్మవశమున, సమాపన్నం = దరికి (ఒడ్డుకు) చేరువానిని, నియతాయుషం అనగా ఆయుర్బలముచేతనే వ్యాధి విముక్తుడగుచున్న వానిని (వ్యాధి విముక్తునిచేసి), భిషజ్మానీ = వైద్యుడు కాకున్నను తననుతాను

వైద్యుడనుకొనువాడు, అనియుతాయుషాం = అనుదానితో ఎక్కడ ఆయువునకు బలవత్కారణములేదో అట్టి వారియందు పురుషకారమైన అవరోధముతో వైద్యుని దోషము వలన మరణము సంభవించునని తెలుపుచున్నాడు (17)

మూ॥ తస్మాచ్ఛాస్త్రే ఽర్థ విజ్ఞానే ప్రవృత్తే కర్మదర్శనే
భిషక్ చతుష్టయే యుక్తః ప్రాణాభిసర ఉచ్యతే॥ 18

**తాత్పర్యము** అందువలన శాస్త్రమునందును, అర్థము తెలుసుకొనుట యందును, కర్మలను చూచుటయందును, స్వయముగా నాచరించుట యందును నియోగించబడిన వైద్యుడు ప్రాణాభిసరుడని (పోవుచున్న ప్రాణములను నిలుపువాడని) చెప్పబడుచున్నాడు

**చ పా వ్యా ఆం అ** శాస్త్రే = శాస్త్రజ్ఞానమునందును, అర్థ విజ్ఞానే = శాస్త్రార్థ జ్ఞానమును తెలుసుకొనుటయందును, ప్రవృత్తే = స్వయముగా కర్మలను చేయుటయందు, యుక్తః = ఉద్యుక్తుడైన వాడు అనగా తాను చేయు కర్మలకు ఉత్తమోత్తమమైన ఫలములను సంపాదించువాడు అని అర్థము ప్రాణాభిసరః = పోవుచున్న ప్రాణములను తిరిగి మళ్ళించువాడు (18)

మూ॥ హేతౌ లింగే ప్రశమనే రోగాణామపునర్భవే।
జ్ఞానం చతుర్విధంయస్య సరాజార్హో భిషక్తమః। 19
శస్త్రం శాస్త్రాణి సలిలం గుణదోష ప్రవృత్తయే।
పాత్రాపేక్షీణ్యతః ప్రజ్ఞాం చికిత్సార్థం విశోధయేత్॥ 20
విద్యావితర్కో విజ్ఞానం స్మృతిస్తత్పరతా క్రియా।
యస్యైతేషడ్గుణాస్తత్ర నసాధ్యమతి వర్తతే॥ 21
విద్యామతిః కర్మదృష్టి రభ్యాసః సిద్ధిరాశ్రయః।
వైద్య శబ్దాభినిష్పత్తా మేలమేకైక మప్యతః॥ 22
యస్యత్వేతే గుణాః సర్వేసంతి విద్యాదయః శుభాః।
సవైద్య శబ్దం సద్భూతమర్హన్ ప్రాణి సుఖప్రదః॥ 23

**తాత్పర్యము** రోగముయొక్క హేతువును తెలుసుకొనుట, లక్షణములను తెలుసుకొనుట, రోగములను శమింపజేయుట, మరల పుట్టకుండగ జేయుట ఈ నాల్గువిధములైన జ్ఞానమును గల వైద్యుడు రాజులకు చికిత్సచేయతగిన వాడుగ నుండును ఆయుధము, శాస్త్రము, ఉదకము వీనికి గుణములు గాని దోషములుగాని పాత్రననుసరించి గలుగును కావున చికిత్స కొరకు తన ప్రజ్ఞను శోధించుకోవలయును

శాస్త్రజ్ఞానము ఊహాపోహలు, విశేషజ్ఞానము జ్ఞాపకశక్తి తదేక ధ్యానము, క్రియలనాచరించుట ఈ ఆరుగుణములును ఎవరికి యుండునో వానికి అసాధ్యమైనది ఉండదు శాస్త్రజ్ఞానము, సద్బుద్ధి కర్మలనుచూచుట, కర్మలను చేయుట కార్యసిద్ధిని పొందుట, సద్గురువుల నాశ్రయించుట ఈ గుణములలో నొకగుణమున్నను వైద్యుడనెడి పేరును పొందుటకు తగియుండును శాస్త్రజ్ఞానము మొ॥ ఈ శుభగుణములన్నియు ఎవనికుండునో వాడు యదార్థమైన వైద్య శబ్దమును పొంది ప్రాణులకు సుఖమును గలిగించును

**చ.పా వ్యా ఆం అ** "పాత్రాపేక్షిణీ" అనగా గుణవంతమైన పాత్రలో సగుణములై యుండును దోషయుక్తమైన పాత్రలో దోషయుక్తముగా యుండునని యర్థము, విశోధయేత్ = మంచి గురువు శాస్త్రసేవ మొ॥వాటితో శోధనము చేయవలయును (మెరుగుపెట్టవలయును) విద్యా = వైద్యశాస్త్రజ్ఞానము, వితర్కః = శాస్త్రమూలకమైన ఊహాపోహజ్ఞానము. విజ్ఞానం = ఇతర శాస్త్రపరిజ్ఞానము లేక సహజమైన విశుద్ధ జ్ఞానము. తత్పరతా అనగా ఇచ్చుట (వ్యాధి చికిత్సలో) ఎప్పుడు ప్రయత్నశీలుడై యుండుట, క్రియా = ఎప్పుడు చికిత్సలు చేయుచుండుట మతిః = సహజమై నిర్మలమైన బుద్ధి, అభ్యాసం = కర్మాభ్యాసము, సిద్ధిః = సాధారణముగా వ్యాధులను శమింపచేయగలిగి యుండుట, ఆశ్రయః = మంచి గురువుయొక్క ఆశ్రయము అని అర్థము వైద్య శబ్దాభినిష్పత్తే అనగా దీనితో నిజమైన వైద్యుడని పించుకోవలయునన్న అని తెలుపుచున్నాడు ఏతే అను శబ్దముతోనే విద్య మొ॥ గుణములన్నియు తెలుపబడినప్పటికిని తిరిగి విద్యాది గుణములు అని చెప్పుటచే పూర్వము చెప్పబడిన విద్యాది గుణములను తప్పించుటకు తప్పించిన ఆ గుణములు గూడ విద్యాదులందే అంతర్భవింప జేయవలయును ఈ విద్యాదిగుణములు మళ్ళీ మళ్ళీ చెప్పుటగూడ వైద్యుడు తన గుణములను పెంపొందించుకొనుటకు ఎక్కువ పరిశ్రమ చేయవలయునని ఉపదేశించుటకును అట్లే ద్రవ్యము మొ॥ మూడు పాదములకంటే వైద్యునికే ప్రాధాన్యత గలదని చూపించుట కొరకై రెండవసారి చెప్పబడినవి వైద్యుడు పాదత్రయము సరిగా లేకున్నను కల్పనలో శిక్షలో నియంత్రణతో వాటిని చక్కదిద్దుకొని చికిత్స చేయుటకు సమర్థుడుగా ఉండును అంతేగాని గుణవంతుడైన వైద్యుడు లేక ద్రవ్యాది పాదములు గుణవంతములైనప్పటికిని చికిత్సయందు వాటికి సామర్థ్యము లేదు

"శాస్త్రం జ్యోతిః ప్రకాశార్థం దర్శనం బుద్ధి రాత్మ నాః।
తాభ్యాం భిషక్సుయుక్తాభ్యాం చికిత్సన్నాపరాధతి॥ 24
చికిత్సతే త్రయః పాదాయస్మాద్వైద్య వ్యపాశ్రయాః।
తస్మాత్ప్రయత్నమాతిష్ఠేద్భిషక్ స్వగుణ సంపది॥ 25

**చ పా వ్యా ఆం అ** శాస్త్రము ప్రకాశింపచేయు కాంతివంటిదిగను తనయొక్క బుద్ధినేత్రము వంటిదిగను ఉండును యోగ్యములైన ఈ రెండింటితో కూడిన వైద్యుడు చికిత్సను చేయునపుడు అపరాధము పొందడు చికిత్సయందు ఔషధము మొదలగు మూడు పాదములును వైద్యుని ఆశ్రయించి యుండును గావున వైద్యుడు తన యొక్క గుణసంపత్తిని వృద్ధి పరచుకొనుటకు ప్రయత్నింపవలయును

**చ పా వ్యా ఆం అ** శాస్త్రమనగా శాస్త్రాభ్యాసముచే గలిగిన బుద్ధి ప్రకర్ష, అదే జ్యోతి = (వెలుతురు) అనగా బాహ్య ప్రపంచమున వెలుతురు వంటిది , ప్రకాశార్థం = వస్తువులను గ్రహించుటకు (తెలుసుకొనుటకు) యోగ్యముగా చేయుటకొరకై అని యర్థము, దర్శనం = నేత్రమువంటిది అని యర్థము, బుద్ధి ఆత్మకు సంబంధించిన దైనప్పటికిని ఆత్మనః అని చెప్పుటచేత సహజమైన బుద్ధియని తెలియజేయుచున్నాడు ఎందువలననగా సహజమైన బుద్ధికాక కేవలము శాస్త్రజన్య బుద్ధి వైనాయికీ బుద్ధియనబడును అట్టిదిసమ్యక్ చికిత్సా సామర్థ్యమును గలిగించదు, తాభ్యాం అనగా సహజమైన విశుద్ధ బుద్ధి శాస్త్రములతోనూ, మరియు సహజ వైనాయికీ బుద్ధులతోనూ ఆలోచించి చికిత్సించిన వైద్యుడు పొరబడడని యర్థము (24 25)

మూ॥ మైత్రీకారుణ్యమార్తేషు శక్యేప్రీతిరుపేక్షణమ్।
ప్రకృతిస్థేషు భూతేషు వైద్యవృత్తి శ్చతుర్విధా॥ 26

**తాత్పర్యము** సమస్త భూతములయందును మైత్రి గలిగి యుండుట, బాధపడు వారియందు దయగలిగి యుండుట శక్యమైన (సాధ్యమైన) వ్యాధిని చికిత్సించుటకు ప్రయత్నించుట, మరణమును పొందుటకు సిద్ధముగా నున్న వారికి చికిత్స చేయక ఉపేక్షించుట యని వైద్యవృత్తి నాలుగు విధములుగా నుండును

చ పా వ్యా ఆం అ వైద్యుడెట్టి బుద్ధితో వ్యవహరించ వలయునను విషయమును "మైత్రీ కారుణ్యం" అను శ్లోకముతో తెలుపుచున్నాడు మైత్రీ = సర్వభూతములందు స్నేహ భావము (ఇది ఇంతకు పూర్వమే వివరించబడినది) ఆర్తేషు = వికారగ్రస్తులయందు (బాధ గలిగిన వారియందు), కారుణ్యం = ఇతరుల దుఃఖములను శమింపచేయు

కోరిక, శక్యే = సాధించుటకు శక్యములైన (సాధ్యములైన) రోగములను చికిత్సకు గ్రహించుటయందు, ప్రీతిః = ఇష్టము, ప్రకృతిస్థేషు = ఇచట ప్రకృతి యనగా మరణము, స్వభావము ప్రకృతియనబడును -అట్లే ఇదమస్మాన్ముహూర్తాత్ స్వభావమాపత్స్యతే" (చ సూ అ 30) అని చెప్పబడినది, మరణము దీని కర్థము మరణమునకు దగ్గరగా చేర్చుటవలన "ప్రకృతిస్థేషు" అని చెప్పబడుచున్నది అట్టి దానియందుపేక్షవహించవలయును (అనగా చికిత్సించరాదు) అని యర్థము ఇందువలన యశోహాని మొ॥నవి గలుగును

**మూ॥** తత్రశ్లోకే -

భిషగ్జితం చతుష్పాదం పాదః పాదశ్చతుర్గుణః।
భిషక్ ప్రధానం పాదేభ్యోయస్మాద్వైద్యస్తుయద్గుణః॥ 27

జ్ఞానాని బుద్ధిర్బ్రాహ్మీచ భిషజాంయాచతుర్విధా।
సర్వమేతచ్చ తుష్పాదే ఖుడ్డాకే సంప్రకాశితమ్॥ 28

ఇత్యగ్నివేశకృతే తంత్రే చరక ప్రతి సంస్కృతే శ్లోకస్థానే ఖుడ్డాకచతుష్పాదో నామనవమోఽధ్యాయః

**తాత్పర్యము** చికిత్సయొక్క పాద చతుష్టయము, ఒక్కొక్క పాదమునకు నాలుగేసి గుణములను, ఈ నాలుగు పాదములలో వైద్యుడు ప్రధానుడుగ నుండుటకు కారణమును, వైద్యునకుండవలసిన శాస్త్రపరిజ్ఞానము మొదలగు గుణములును, హేతుజ్ఞానము మొ॥ జ్ఞానములును మైత్రి మొదలగు నాలుగు విధములగు వైద్యవృత్తులును ఈ ఖుడ్డాక చతుష్పాదాధ్యాయమునందు చెప్పబడినవి

సంగ్రహముగా బ్రాహ్మీ బుద్ధి నాలుగు విధములు అవి సమస్త భూతములందు మైత్రి కలిగియుండుట, బాధపడువారి యందు దయ కలిగి యుండుట, సాధ్యమైన వ్యాధిని చికిత్సించుటకు ప్రయత్నించుట, మరణమును పొందుటకు సిద్ధముగా నున్నవారికి చికిత్సచేయక ఉపేక్షించుట మొ॥నవి

అగ్నివేశకృతమై చరకప్రతి సంస్కృతమైన తంత్రమునందలి సూత్రస్థానమున ఖుడ్డాకచతుష్పాదమను నవమాధ్యాయము

చక్రపాణి దత్త విరచితమైన చరక తాత్పర్యటీకా అను ఆయుర్వేద దీపికా వ్యాఖ్యానమునందలి సూత్రస్థానమునందలి మూడవదైన నిర్దేశ చతుష్కమున ఖుడ్డాక చతుష్పాదమను తొమ్మిదవ అధ్యాయమునకు ఆంధ్ర అనువాదము

# పదవ అధ్యాయము

మూ॥ అథాతో మహా చతుష్పాదమధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1

ఇతి హస్మాహ భగవానాత్రేయః॥ ॥2

చతుష్పాదం షోడశకలం భేషజమితిభిషజో భాషంతే, యదుక్తం పూర్వాధ్యాయే షోడశ గుణమితి, తద్భేషజం యుక్తియుక్తమల మారోగ్యాయేతి భగవాన్పునర్వసురాత్రేయః ॥3॥

తాత్పర్యము పిమ్మట మహా చతుష్పాదమను అధ్యాయమును చెప్పబోవుచున్నాము అని భగవంతుడు అగు ఆత్రేయుడు చెప్పెను పూర్వాధ్యాయము నందు పదునారు గుణములుగలదిగ చెప్పబడిన పాద చతుష్టయమును చికిత్స అని వైద్యులు చెప్పుచున్నారు అట్టి చికిత్సను యుక్తి యుక్తముగ నాచరించినచో ఆరోగ్యమును గలిగించునని భగవంతుడైన పునర్వసు ఆత్రేయుడు చెప్పెను

చ పా వ్యా ఆం అ పూర్వాధ్యాయమున వైద్యుడు మొదలగు వారు వ్యాధిశమనమునకు కారణములని చెప్పబడినది తిరిగి దానినిచట ఆక్షేప సమాధానములతో వివరించుట కొరకై మహా చతుష్పాదము చెప్పబడుచున్నది వివరణాత్మకముగ యుండుటవలనను, పూర్వపక్ష సిద్ధాంత రూపమైన అనేక విషయములను తెలుపుటవలనను పూర్వాధ్యాయమున కంటే దీనికి మహత్త్వముగలదు అందువలననేనిది మహా చతుష్పాదము, షోడశకలం = 16 గుణములు, కలాశబ్దమిచ్చట గుణవాచకమైయున్నది

భిషజోభాషంతే అనగా వైద్యులు చెప్పుచున్నారు అని అర్థము. ప్రకృతార్థమున శాస్త్రాంతర సమ్మతిని "యుక్తియుక్తం" అను వచనముతో తెల్పుచున్నాడు "యుక్తి" అనగా యునక్తీతియుకిః అనగా యుక్తి యుక్తముగా ప్రయోగించబడిన అని యర్థము ప్రకృతి యనగా వైద్యుడు మొదలగు చతుష్పాదములతో నిర్వర్తించబడు చికిత్సా రూపమైన క్రియాకలాపము ఇది పూర్వాధ్యాయమున వివరించబడినిది అలం = సామర్థ్యముగలదై యుండును, అని భగవంతుడైన ఆత్రేయుడు చెప్పుచున్నాడని తెలుపబడినది (1--3)

మూ" నేతిమైత్రేయః, కింకారణం? దృశ్యంతేహ్యాతురాః కేచిదుపకరణ
వంతశ్చపరిచారక సంపన్నాశ్చాత్మవంతశ్చ కుశలైశ్చ భిషగ్భిరనుష్ఠితాః
సముత్తిష్ఠమానాః తథాయుక్తాశ్చాపరే మ్రియమాణాః, తస్మాద్భేష
జమకించిత్కరం భవతి, తద్యథా - శ్వభ్రే
సరసిచప్రసిక్తమల్పముదకం,
నద్యాం వా స్యందమానాయాం పాం సుధానేవా పాంసు ముష్టిః
ప్రకీర్ణఇతి,
తథాపరే దృశ్యంతేఽ నుపకరణాశ్చా
పరిచారకాశ్చానాత్మవంతశ్చాకుశలై
శ్చభిషగ్భి రనుష్ఠితాః సముత్తిష్ఠమానాః, తథాయుక్తా మ్రియ
మాణాశ్చాపరే! యతశ్చప్రతికుర్వన్ సిధ్యతి, ప్రతి
కుర్వన్ మ్రియతే, అప్రతికుర్వన్ సిధ్యతి, అప్రతికుర్వన్ మ్రియతే,
తతశ్చింత్యతే భేషజమభేషజేనా విశిష్టమితి ॥4॥

తాత్పర్యము యుక్తియుక్తమైన చికిత్స ఆరోగ్యమును గలిగించలేదని పూర్వ సూత్రమున చెప్పబడిన విషయమును మైత్రేయుడు ఆక్షేపించుచున్నాడు కింకారణం అని కారణమును చెప్పుచున్నాడు ఔషధములతో కూడినట్టియు, పరిచారకులు గలిగినట్టియు, గుణవంతులైనట్టియు, నేర్పరులగు వైద్యులచే చికిత్సింపబడినట్టియు రోగులు కొందరు రోగవిముక్తులగుచున్నారు అట్టి ఉపకరణ, పరిచారక, కుశలవైద్య సంపదయున్నప్పటికి కొందరు రోగులు మరణించుచున్నారు కావున చికిత్సా సంపద పెద్ద ప్రయోజనకారి కాదు అదెట్లనగా గోతియందుగాని సరస్సు యందుగాని జల్లబడిన కొద్ది యుదకమువలెను ప్రవహించుచున్న నది యందుగాని ఇసుక తిన్నె

యందుగాని జల్లబడిన పిడికెడు యిసుకవలెను నిష్ప్రయోజనమగును ఔషధములు లేనట్టియు పరిచారకులు, లేనట్టియు గుణవంతులు కానట్టియు, నేర్పరులుగాని వైద్యులచే చికిత్సింపబడిన కొందరు రోగులు రోగము నుండి విముక్తులగుచున్నారు అట్టి చతుష్పాదములున్నప్పటికిని కొందరు రోగులు మరణము నొందుచున్నారు చికిత్స చేసినను కొందరు రోగులు మృతి నొందుచున్నారు కొందరు జీవించుచున్నారు చికిత్స చేయకున్నను కొందరు జీవించుచున్నారు కొందరు మరణించుచున్నారు అందువలన చికిత్స చేసినను చేయకున్నను సమానమేయని తోచుచున్నది అని మైత్రేయుడు చెప్పెను

**చ పా వ్యా.ఆం అ** నేతి అను సూత్రముతో పూర్వము (పై సూత్రమున) చెప్పిన దానిని మైత్రేయుడు ఆక్షేపించుచున్నాడు ఉపకరణం = ఔషధము, అనుష్ఠితాః = చికిత్సించబడినవారై, తథాయుక్తాః = పూర్వమువలె చికిత్సించబడిన వారైయని యర్థము, అకించిత్కరం = అనగా చికిత్సించినప్పటికిని లేక ఔషధములిచ్చినప్పటికిని ఆరోగ్యము కలుగకున్నచో, అర్థాపత్తితో చికిత్సించినపుడు ఆరోగ్యము కలిగినప్పటికిని ఈ రెండవస్థలందును ఔషధవ్యతిరిక్తమైన దైవసంజ్ఞకమైన కర్మయే కారణముగాని ఔషధము కారణముగాదు దానిని తద్యథా అని రెండు ఉదాహరణములతో తెలుపుచున్నాడు పెద్దగానున్న గుంటలో లేక సరస్సున కొద్దిగా నీరు పోసిన అది అకించిత్కరము అనగా దానివలన ఆశించినంత ఫలమేదీయుండదు అట్లే మరణమాసన్నమైన రోగికి ఔషధమిచ్చినను దానివలన ఫలితముండదని శ్వభ్రే (గుంటలో) అని ఉదాహరణముతో పోల్చినాడు ఇక సరస్సుతో చెప్పబడిన ఉదాహరణము ఇంకొక మార్గమున నిండిన సరస్సులో కొంచెము నీటిని కలిపిన నిజమునకది (సరస్సు) ఇంకొక మార్గము నుండి చేరిన నీటితోనే నిండును గాని అల్పమాత్రలో పోసిన నీటితో నిండినట్లు గాదు అట్లే ఇతర ఆరోగ్య హేతువులైన దైవాదికర్మలతో ఆరోగ్యము కలుగుచున్నప్పుడు ఆరోగ్యమును చేకూర్చుటకై స్వల్ప మాత్రలో ఔషధములిచ్చిన స్వల్ప ఔషధములతో ఆరోగ్యము కలుగుననుట వ్యర్థము అని సరస్సు దృష్టాంతములో తెలుపబడినది ఇదే విధముగా ప్రవహించుచున్న నదిలో పిడికెడు మట్టిని వేయుట అనునది శ్వభ్రదృష్టాంతమువలెను మట్టి కుప్పలో పిడికెడు మట్టిని వేయుట అనునది సరస్సు దృష్టాంతమువలెను తెలుసు కోవలయును ఇచట నీటితో చెప్పబడిన దృష్టాంతము శోధినౌషధములను దృష్టియందుంచుకొనియు, పాంశు (మట్టి) దృష్టాంతము సంశమనౌషధమును దృష్టియందుంచుకొనియు చెప్పబడినది లేక జల దృష్టాంతము సంతర్పణము కొరకై,

పాంశుముష్టి (పిడికెడుమట్టి) అపత్పరణ చికిత్స కొరకై ఉదాహరణములుగా చెప్పబడినవని తెలుసుకొనవలయును ఇక భేషజము యొక్క అన్వయ వ్యభిచారమును తెలిపి ఇపుడు దాని వ్యతిరేక వ్యభిచారమును "తథాకపరే" అను సూత్రముతో తెలుపుచున్నాడు "ప్రతికుర్వన్" అనునది అంతర్భవించిణ్యర్థమగుట వలన ప్రతికారము చేసినను అనియర్థమునిచ్చును లేక ఆతురుడే వైద్యాదులను సమకూర్చుకొని తనకు తానుగా ప్రతికారము చేసుకొనుచు అనియు అర్థమును గ్రహించవలయును పై జెప్పబడిన దానిననుసరించి దైవమను పేరుగల కర్మవశముననే రోగి జీవమునుగాని, మరణమునుగాని, అట్లే ఆరోగ్యమునుగాని, రోగమును గాని పొందుచున్నాడే తప్ప ఔషధమచట అకించిత్కరమేయని పూర్వపక్షము (4)

మూ॥ మైత్రేయ! మిథ్యా చింత్యత ఇత్యాత్రేయః, కింకారణం, యేహ్యా తురాః షోడశగుణసముదితేనానేన భేషజేనోప పద్యమానా మ్రియంత ఇత్యుక్తం తదనుపపన్నం, నహిభేషజసాధ్యానాం వ్యాధీనాం భేషజమ కారణం భవతి; యే పునరాతురాః కేవలాద్భేషజాదృతే సముత్తిష్ఠంతే, నతేషాం సంపూర్ణ భేషజోపపాదనాయ సముత్థానవిశేషోనాస్తి, యథాహి పతితం పురుషం సమర్థముత్థానాయోత్థాపయన్ పురుషో బలమస్యోపాదధ్యాత్, సక్షిప్రతరమ పరిక్లిష్ట ఏవ ఉత్తిష్ఠేత్, తద్వత్ సంపూర్ణభేషజోపలంభా దాతురాః, యేచాతురాః కేవలా ద్భేషజాదపి మ్రియంతే, నచసర్వఏవతే భేషజోపపన్నాః సము త్తిష్ఠేరన్, నహిసర్వే వ్యాధయః భవంత్యుపాయసాధ్యాః, న చోపాయసాధ్యానాం వ్యాధీనా మనుపాయేన సిద్ధిరస్తి, నచాసాధ్యా నాం వ్యాధీనాం భేషజ సముదాయోఽ యమస్తి, నహ్యలంజ్ఞాన వాన్ భిషఙ్మూమూర్షు మాతురముత్థాపయితుం, పరీక్ష్యకారిణోహి కుశలా భవంతి, యథాహియోగ జ్ఞాన భ్యాసనిత్య ఇష్వాసోధను రాదాయేషు మస్యన్నాతి విప్రకృష్టే మహతి కాయే నాపరాధవాన్ భవతి, సంపాదయతిచేష్టకార్యం, తథాభిషక్ స్వగుణ సంపన్న ఉపకరణం వాన్ వీక్ష్యకర్మారభమాణః సాధ్యరోగమన పరాధః సంపాదయత్యే వాతురమారోగ్యేణ, తస్మాన్న భేషజమభేషజేనా విశిష్టమ్ భవతి ॥5

తాత్పర్యము మైత్రేయునకు ఆత్రేయుడు ఈ క్రింది విధమున సమాధానము చెప్పుచున్నాడు ఓ మైత్రేయా నీ ఆలోచన సరిగా లేదు ఎందువలననగా పదునారు గుణములతో కూడిన చికిత్సచే ఉపచరించబడుచున్న కొందరు రోగులు మృతినొందుచున్నారని నీవు చెప్పితివి అది సరియైనది గాదు చికిత్సచే సాధింపదగిన వ్యాధులందు చికిత్స నిష్ప్రయోజనముగానేరదు ఏ రోగులైతే ఏ విధమైన చికిత్స లేకుండగనే వ్యాధి విముక్తులగు చున్నారో అట్టి రోగులకు చికిత్సావసరమేమీ లేదని చెప్పుటకు వీలులేదు ఎటులనగా పడియున్న పురుషుడు లేచుటకు సమర్థుడుగనున్నను ఇతర పురుషునిచే లేవదీయబడినచో బలమును పొంది కష్టము లేకుండగనే శీఘ్రముగ లేచు విధమున రోగులు గూడా చికిత్స వలన ప్రయోజనమును పొందుదురు సంపూర్ణమగు చికిత్స చేసినను ఏ రోగులు మృతినొందుచున్నారో అట్టి రోగులు చికిత్సచే సాధింపదగిన వ్యాధులు గలవారు కాదు సమస్త వ్యాధులును చికిత్సా సాధ్యములు గావు చికిత్సా సాధ్యములైన వ్యాధులు చికిత్సలేక సిద్ధింపవు అసాధ్య వ్యాధులకు చికిత్స లేదు మరణమునకు సిద్ధముగానున్న రోగిని జ్ఞానవంతుడగు వైద్యుడు గూడా బ్రతికించుటకు సమర్థుడుగాడు ఆలోచించి చికిత్సించువారు కుశలురనబడుదురు. ప్రయోగములను గుర్తెరిగినట్టియు, అభ్యాసము గలిగి నట్టియు ధనుర్ధరుడు ధనస్సును గ్రహించి మిక్కిలి సమీపమందున్న గొప్పదైన శరీరమునందు బాణము విచిడి లక్ష్యమును తప్పక ఇష్టకార్యమును పొందును అట్లే వైద్య గుణములతో కూడినట్టియు ఉపకరణములు గలిగినట్టియు వైద్యుడు సాధ్య రోగమును దెలిసికొని చికిత్సచేసి లక్ష్యమును తప్పక రోగికి ఆరోగ్యమును గలిగించును కావున చికిత్స నిష్ప్రయోజనమైనదని తలంచరాదు

చ పా వ్యా ఆం అ మిథ్యా అను సూత్రముతో సిద్ధాంత పక్షమును చెప్పుచున్నాడు కేవలాత్ = సంపూర్ణమైన దాని వలన న నాస్తి అని రెండు కారకములను చెప్పుటచేత సముత్థాన విశేషమున్నదని యర్థము తద్వత్ అనగా వెంటనే బాధ లేకుండా లేచెదరు అని అర్థము ఇంకొక విధముగా గూడా అన్వయించవచ్చును అదెట్లనగా అదృష్టమే ఉత్థానమునకు కారణమైనప్పటికిని దానిని ఒక వేళ దృష్టముగూడాతోడైనచో దృష్టాఽదృష్ట బలములు రెండింటి వలన మిక్కిలి శీఘ్రముగా ఆరోగ్యము గలుగును "సర్వ ఏవ" అనగా సాధ్యవ్యాధులు, అసాధ్యవ్యాధులు సంపూర్ణమైన భేషజము (చికిత్స) లభించినప్పటికిని అసాధ్యవ్యాధులు తగ్గవు అనగా సాధ్య వ్యాధులు తగ్గునని భావము మరియు "నచాసాధ్యానాం వ్యాధీనాం భేషజసము దాయోఽయమస్తి,

నహ్యలంజ్ఞానవాన్ భిషజుమూర్చషమాతురముత్థాపయితుం" అనగా అసాధ్య వ్యాధులకీ చెప్పబడిన చికిత్సా సముదాయము వర్తించదు అట్లే వైద్యుడెంత జ్ఞానవంతుడైన మరణోన్ముఖుడైన రోగిని రోగ విముక్తుని చేయుటకు సమర్థుడుగాడు అను శాస్త్ర ప్రమాణముననుసరించి అసాధ్యవ్యాధులకు చికిత్స లేనేలేదని చెప్పబడినప్పటికిని ఇచటకొద్దిపాటి అసంపూర్ణ భేషజమునందును సంపూర్ణ భేషజత్వము చెప్పబడినది దీనిని బట్టి ఏవైతే సాధ్యవ్యాధులు గలవో అవి భేషజ సంపద యున్నప్పుడే తగ్గుచున్నవి. భేషజ సంపదలేనప్పుడు బలవజ్జీవన కర్మాభావమున రోగులు చనిపోవుచున్నారని "నచోపాయ"అను సూత్రముతో చెప్పుచున్నాడు ఉపాయ సాధ్యాః = దృష్టప్రయోజనము గల చికిత్సాది ఉపాయములతో సిద్ధించునవి ఇచట నొక విషయము గోచరించుచున్నది అదేమనగా - కర్మబలవత్, అబలవత్ అని రెండు విధములు వాటిలో నియతమైనవి పాకముగలవి బలవత్కర్మ ఉదా ఈ విధమైన కర్మ ఈనియత కాలమున మానవుని చంపును అనునది అబలవత్కర్మ మనుష్యుని చంపుట తథ్యమేయైనప్పటికిని దానికొక కాల నియమము లేదు అట్టిది అ బలవతర్మయన బడును అట్టే ఈ అబలవత్కర్మ మారకమునకనుగుణమైన, అపద్యసేవారూపమైన, మరియు ఔషధాభావరూపమైన, దృష్ట సామగ్రి రూపమైన దానిని పొందినపుడు మానవుని చంపును అట్టి సామగ్రి లభ్యము గానపుడు మానవుని చంపదు ఇదే విషయము జనపదో ధ్వంసనీయా ధ్యాయమున "కర్మకించిత్ క్వచిత్ కాలే విపాక నియతంమహత్, కించిన్న కాలనియతం ప్రత్యయైః ప్రతి బుధ్యతే" (వి అ3) అనగా నియత విపాకమైన మహత్కర్మయొకటి ఇది ఒక నియతకాలమున పరిపక్వత చెందును కాల నియమము లేని కర్మమరియొకటి అది తనకనుగుణమైన వస్తుసామగ్రిచే ప్రేరేపించబడి పరిపక్వత నొందును ఇది అమహత్ అనగా అబలవత్ కర్మ అని జనపదో ధ్వంసమున చెప్పబడినది దానికి సంబంధించిన వివరణ అచ్చటనే చేయబడును మరియొక విషయమును "నాకాలేజాయతే కశ్చిత్ నాకాలేమ్రియతేతథా జగత్ కాలవశం సర్వం కాలః సర్వత్రకారణమ్" అనగా అకాలమున పుట్టుటగాని అకాలమున మరణించుటగాని దేనికి లేదు ప్రపంచమంతయు కాలవశముననే నడచుచున్నది అన్నింటికి కాలమే కారణము అను ప్రమాణముననుసరించి కాల రూపమువంటి ఏదో ఒక అదృష్టమే కారణమని చెప్పుటకు వీలులేదు కారణమేమనగా ఏది అదృష్టమని భావించబడుచున్నదో అట్టి కర్మ ఫలముగూడా దృష్టమైన యాగాది జన్యమైనదే మరియు ఏదైతే దృష్టముచేత అనుపపన్నమగునో అచ్చట అదృష్టకల్పనప్రామాణికమగునే గాని దృష్ట ఫలములైన

అగ్ని దాహము మొ॥ వాటి యందు అదృష్టకర్మన వ్యర్థము కావున దుర్బల కర్మ విశేషమున బలవంతములైనదృష్టములైన అపథ్యసేవనచే జనించిన దోషములచే ఆరంభించబడిన వ్యాధులు బలవంతములైన (బలము గల్గిన) చతుష్పాద సంపద గలిగిన, దోషక్షయమును గల్గించు సామర్థ్యము గల భేషజముతో తప్పక సాధ్యములేయగును అట్టి భేజషము లేనప్పుడు దృష్ట దోషబలారబ్ధములైన వ్యాధులు దుర్బల కర్మా రబ్ధములైనను తగ్గవు ఇదే విషయము "దైవంపురుషకారేణ దుర్బలంహ్యుపహన్యతే। దైవేన చేతరత్ కర్మ విశిష్టే నోపహన్యతే" (వి.అ 3) అని చెప్పబడినది అనుపాయేన = భేషజము లేకుండుట వలన ఈ భేషజ సముదాయము సర్వగుణ సంపన్నమైనదని యర్థము అసాధ్యమైన వ్యాధిని చికిత్సించినచో వైద్యుడీ చెప్పబడిన గుణములు గలవాడుగాడని యర్థము నహ్యలం = సమర్థుడుగాడు ఒకవేళ అసాధ్యమని తెలిసినచో దానియందు ప్రవర్తించడు (చికిత్సించడు) అసాధ్యతను తెలుసుకొనని ఎడల జ్ఞానవంతుడు గాడు అని భావము చతుష్పాద సంపదతో తప్పక వ్యాధి శమనము కలుగునని "యథాహి" అను దృష్టాంతముతో తెలుపుచున్నాడు ఇష్వాసః = ధనుర్ధారి, అస్యన్ = వేయుచు, నాతి విప్రకృష్టే = ఎక్కువ దూరము లేని (దగ్గరగా నున్న) అనపరాధః = అనగా లక్ష్యమును పోగొట్టుకొనక, ఇష్టంకార్యం = తాను నెరవేర్చుకొన దలచిన కార్యమును (లక్ష్యమును) (5)

మూ॥ ఇదంచనః ప్రత్యక్షం యదనాతురేణ భేషజేనా తురం చికిత్సామః క్షామమక్షామేణ, కృశంచ దుర్బల మాప్యాయ యామః స్థూలం మేదస్వీన మపతర్పయామః, శీతేనోష్ణాభి భూతముపచరామః శీతాభి భూతముష్ణేన, న్యూనాత్ధాతూన్ పూరయ యామో వ్యతిరిక్తాన్ హ్రాసయామః, వ్యాధీన్ మూల విపర్యయేణోపచారన్తః సమ్యక్ ప్రకృతౌస్థాపయామః, తేషాం న స్త్రాథాకుర్వతా మయం భేషజముదాయః కాన్తతయో భవతి ॥(6)

తాత్పర్యము చెప్పబోవునది మనకు ప్రత్యక్షమేకదా ఆరోగ్యమును కలిగించు ఔషధములచే రోగికి చికిత్సను చేయుచున్నాము శుష్కించినట్టియు, కృశించినట్టియు, దుర్బలులుగనున్నట్టియు మనుజులకు బృంహ్మణములను గల్గించుచున్నాము స్థూలురుగనున్నట్టియు మేదస్సు గలిగినట్టియు మనుజులను కృశింపజేయు చున్నాము ఉష్ణముతో కూడిన వానిని శీత చికిత్సచేతను, శీతముతో గూడినవానిని ఉష్ణ చికిత్సచేతను ఉపచరించుచున్నాము క్షీణించిన ధాతువులకు వృద్ధిని, వృద్ధినొందిన ధాతువులకు క్షయమును గల్గించుచున్నాము వ్యాధులను కారణవైపరీత్యములచే చికిత్సించుచు సమప్రకృతియందు ఉంచుచున్నాము ఇట్లు చేయుచున్నామనకు ఈ ఔషధ సముదాయమంతయు అభీష్టసిద్ధిని కలిగించుచున్నది

మూ॥ భవంతి చాత్ర

సాధ్యాసాధ్య విభాగజ్ఞ జ్ఞానపూర్వం చికిత్సకః।
కాలేచార భతే కర్మయత్త్ సాధయతి ధ్రువమ్॥ 7

అర్థ విద్యాయ శోహానిముపక్రోశమ సంగ్రహమ్।
ప్రాప్నుయాన్నియతం వైద్యో యోఽసాధ్యం సముపాచరేత్॥ 8

**తాత్పర్యము** సాధ్యాసాధ్య విభాగమును తెలిసిన వైద్యుడు జ్ఞానపూర్వకముగ సకాలమునందు ఏ చికిత్సను చేయుచున్నాడో ఆ చికిత్సచే కార్యసిద్ధిని (సాఫల్యమును) పొందును ఏ వైద్యుడు అసాధ్య వ్యాధిని చికిత్సించునో వాడు ధనము, శాస్త్ర జ్ఞానము, కీర్తి వీని యొక్క నాశనమును, జనాపవాదమును, నిరాదరణమును నిశ్చయముగ పొందును

**చ పా వ్యా అం అ** జ్ఞానపూర్వం అనగా భేషజము మొదలగు వాటిని ముందుగా తెలుసుకొని ఏ చికిత్సారూపమైన కర్మ నారంభించునో అది సాధ్యం అనగా సాధయతీతి సాధ్యం అనగా సాధించదగినదానిని సాధించును అని యర్థము "అర్థ" అను మొ॥ వాటితో అసాధ్య వ్యాధులందు చికిత్స నారంభించకూడదని ఉపదేశించుచున్నాడు అర్థః = ధనము, హానిః = క్షయము, ఉపక్రోశః = జనాపవాదము, సంగ్రహః = చికిత్సకొరకై రోగులనాకర్షించకుండుట లేక అసద్గ్రహః = అని పాఠాంతరము గలదు దానిననుసరించి రాజులచే దండింపబడుటగాని లేక అసత్పురుషులచే (నీచులచే) బాధింపడుటగాని గల్గునని యర్థము (7-8)

మూ॥ సుఖసాధ్యం మతం సాధ్యం కృచ్ఛ్ర సాధ్యమథాపి చ।
ద్వివిధం చాప్య సాధ్యం స్యాద్యాప్యం యచ్చానుపక్రమమ్॥ 9

సాధ్యానాం త్రివిధశ్చాల్పమధ్యమోత్కృష్ట తాంప్రతి।
వికల్పోన త్వసాధ్యానాం నియతానాం వికల్పనా॥ 10

**తాత్పర్యము** సాధ్యములైన వ్యాధులు సుఖసాధ్యములు కృచ్ఛ్ర సాధ్యములని రెండు విధములు అసాధ్యమైన వ్యాధులు గూడా యాప్యములు, అనుప్రకమములని (చికిత్సించదగని) యని రెండు విధములు సాధ్యమైన వ్యాధి స్వల్ప చికిత్సా సాధ్యములేక స్వల్పవ్యాధి మధ్య చికిత్సా సాధ్యవ్యాధి ఉత్కృష్ట చికిత్సా సాధ్య వ్యాధి లేక ఉత్కృష్ట వ్యాధి యని మూడు విధములు నియతమైన అసాధ్యవ్యాధికి వికల్పము (భేదము) లేదు

చ పా వ్యా ఆం అ సాధ్యములైన రోగములందు ప్రవృత్తి అసాధ్య వ్యాధులయందు నివృత్తి చెప్పబడినది, అందువలన సాధ్యాసాధ్యములకు గల భేదముతో పాటు వాని లక్షణములను "సుఖసాధ్యం" అను శ్లోకములతో చెప్పుచున్నాడు అకించిత్కరమగుట వలన చికిత్సలేనిది అను పక్రమమనుబడును (ఫలించని చికిత్సయున్నను అది చికిత్సలేని దానితో సమానము అని భావము) రోగి యొక్క రోగమును కొంత కాలము వరకు కాలయాపనచేయుట వలన ఏదో కొంత ఫలమునిచ్చునదై యుండుట వలన యాప్యము అను పక్రమము గాదు ఉపక్రమములైన వాటిలో ఆయా యోగముల ననుసరించి అల్ప మధ్య ఉత్కృష్టతలననుసరించి సాధ్యత్వమును చెప్పుచున్నాడు అందువలన అల్పసాధ్యమనగా అల్ప ఉపాయములతో సాధించ గలిగినది, మధ్య సాధ్యమనగా మధ్యమములైన ఉపాయములతో సాధించ గలిగినది, ఉత్కృష్టసాధ్యమనగా ఉత్కృష్టములైన ఉపాయములతో సాధించగలిగినది అని సాధ్యము మూడు విధములుగా నున్నది "అసాధ్యానాంతునియతానాం" అనగా యాప్యములకు వ్యతిరిక్తములైన అనుపక్రమములైన వాటికి, వికల్పనా = భేదములు, లేవు. అనగా పైన సాధ్యములకు చెప్పబడిన అల్ప సాధ్యాది రూపమైన వ్యవస్థ అనుపక్రమమైన అసాధ్యములకు లేదు, ప్రాణహర, వైకల్యకర సద్యః ప్రాణహర కాలాంతర ప్రాణహర మొ॥ వికల్పములు అసాధ్యములకు గలవు అట్లే యాప్యరూపమైన అసాధ్యములకు గూడా అల్పోపాయములతో చేయబడు యాప్యత్వాది భేదములు గలవు (9-10)

మూ॥ హేతవః పూర్వరూపాణి రూపాణ్యల్పానియస్య చ।
నచతుల్యగుణో దూష్యో న దోషః ప్రకృతిర్భవేత్॥ 11

నచకాల గుణస్తుల్యో నదేశో దురు పక్రమః।
గతిరేకానవత్వంచ రోగస్యోపద్రవోనచ॥ 12

దోషశ్చైకః సముత్పత్తే దేహః సర్వౌషధ క్షమః।
చతుష్పాదోపపత్తిశ్చ సుఖ సాధ్యస్య లక్షనమ్॥ 13

తాత్పర్యము హేతువులు, పూర్వ రూపములు, లక్షణములును స్వల్పముగా నున్నట్టియు తుల్య గుణములు లేని దూష్యములు గలిగినట్టియు శరీర ప్రకృతికి భిన్నమైన దోషము గలిగినట్టియు సమానములైన కాలగుణములు లేనట్టియు, సమానములైన దేశ గుణములతో గూడనట్టియు ఒకే రోగమున జనించినట్టియు, క్రొత్తగా

జనించినట్టిదియు, ఉపద్రవములు లేనట్టియు, ఒకే దోషమువలన జనించినట్టిదియు సమస్తౌషధములను సహించు సామర్థ్యము గలదియగు శరీరము నందు జనించినట్టియు, పాద చతుష్టయముతో కూడినట్టియునైన వ్యాధి సుఖ సాధ్యముగ నుండును

చ పా వ్యా ఆం అ  నదోషః ప్రకృతిర్భవేత్ అనగా వ్యాద్యారంభ దోషమేదో అది ఆ ప్రకృతియందు ఉత్కటముగా నుండకూడదని యర్థము దేశః = భూమి - ఆతుర రూపదేశములు, దేశము దురుపక్రమ మెట్లనగా వాత వ్యాధికి సమానగుణమైన మరుభూమి, అట్లే శ్లేష్మ వ్యాధికి అనూపదేశము, దురుపక్రమమైన దేహదేశమెట్లనగా అన్ని వ్యాధులలోను మర్మరూపమైన దేశము దురుపక్రమము అట్లే వాత వ్యాధిలో పక్వాశయము మొ॥నవి గతిరేకా = త్రివిధరోగ మార్గములలో ఒకే రోగ మార్గమున గలిగినది అని యర్థము ఈ త్రివిధరోగ మార్గములు తిస్రైషణీయములో "శాఖామర్మాస్థిసంధయః కోష్ఠశ్చ" (సూ 11వ అధ్యా) చెప్పబడును ఇచట చెప్పడిన సుఖ సాధ్యత్వాది లక్షణము సామాన్య న్యాయముననుసరించి చెప్పబడినది అందువలన ఒక్కొక్కచోట వ్యాధి ప్రభావముననుసరించి ఇంకొక విధంగా చెప్పబడిన సుఖసాధ్యాత్వాది లక్షణములకిది విరుద్ధమని చెప్పకూడదు ఉదా "జ్వరేతుల్యర్తు దోషత్వం । ప్రమేహేతుల్య దూష్యతా । రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణమ్"॥ జ్వర, ప్రమేహ, రక్త గుల్మములకు సుఖసాధ్య లక్షణమింకొక విధముగా ప్రస్తుతమున చెప్పబడిన సుఖసాధ్య లక్షణమునకు వేరుగా చెప్పబడినది ఐనప్పటికిని ఇది విశేష విధిగాన ఒక దానికొకటి విరుద్ధముగాదు అని అభిప్రాయము (11.12 13)

మూ॥ నిమిత్తపూర్వ రూపాణాం రూపాణాం మధమేబలే।
కాల ప్రకృతి దూష్యాణాం సామాన్యేఽన్యతమస్య చ॥ 14
గర్భిణీవృద్ధ బాలానాం నాత్యుపద్రవ పీడితమ్।
శస్త్ర క్షారాగ్ని కృత్యానామనవంకృచ్ఛ్ర దేశజమ్॥ 15
విద్యాదేకపథం రోగం నాతిపూర్ణ చతుష్పదమ్।
ద్విపథం నాతికాలంవా కృచ్ఛ్రసాధ్యం ద్విదోషజమ్॥ 16

తాత్పర్యము హేతువులు, పూర్వరూపములు, రూపములు (లక్షణములు) మధ్య బలముగనున్నట్టియు, కాలము, ప్రకృతి, దూష్యము వీనిలో దేనితో నైనను సమానములైన గుణములను గల్గినట్టియు, గర్భిణీ స్త్రీలకును, వృద్ధులకును,

బాలురకును, జనించినట్టియు, స్వల్పమైన ఉపద్రవములతో కూడినట్టియు, శస్త్ర క్షారాగ్ని కర్మలలో దేనితోనైనను చికిత్సింపదగినట్టియు, చిరకాలమై జనించినట్టియు, మర్మస్థానాదులందు జనించినట్టియు ఒకే మార్గమునందు జనించినను పాద చతుష్టయముతో సంపూర్ణముగ కూడి యుండనట్టియు, ఉర్ధ్వాధోమార్గాములను పొందియున్నను చిరకాలమై జనింపనట్టియు రెండు దోషముల వలన జనించినట్టియు వ్యాధి కష్టసాధ్యముగ నుండును

చ పా వ్యా ఆం అ కాల ప్రకృతి దూష్యాణామనుచోట నిర్ధారణార్థమున షష్ఠీ విభక్తి సామాన్యే అనగా దోషముతో సమానమైన , గర్భిణీ బాలవృద్ధానాం = గర్భిణీబాల వృద్ధులకు అన్ని వ్యాధులు కృచ్ఛసాద్యమైనవేయని తెలుసుకోవలయును "నాత్యుపద్రవ పీడితా" అనునది పూర్వ వాక్యమైన గర్భిణీ బాలవృద్ధానాం అను వాక్యముతో అన్వయించక స్వతంత్ర వాక్యముగా నుండును శస్త్రక్షారాగ్నికృత్యాః = శస్త్రక్షార అగ్నికర్మలతో సాద్యములు, ఇట్టి వ్యాధులు ఎవరికి కలవో వాడు కృచ్ఛసాధ్యుడని వాక్యార్థము, కృచ్ఛదేశజం = మర్మలు సంధులు మొదలగు వాటిలో జనించునవి, నాతి పూర్ణ చతుష్పదం అను వాక్యము ఏకపథం అను దానికి విశేషణము అందువలన త్రివిధ రోగ మార్గములలో ఒక మార్గమున జనించిన వ్యాధి పరిపూర్ణమైన చికిత్సా చతుష్పాదము లేకున్న కృచ్ఛసాద్యమనియు, ద్విపథం అను దానికి నాతి కాలం అనునది విశేషణమై త్రివిధ రోగమార్గములలో రెండు మార్గముల నాశ్రయించిన వ్యాధి, దీర్ఘ కాలానుబంధము కాకున్న కృచ్ఛసాధ్యమనియు అర్థము (14, 15, 16)

మూ॥ శేషత్వాదాయుషోయాప్యమసాధ్యం పథ్య సేవయా।
లబ్ధాల్పసుఖమల్పేన హేతునాఽఽశుప్రవర్తకమ్॥ 17
గంభీరంబహుధాతుస్థం మర్మ సంధి సమాశ్రితమ్।
నిత్యానుశాయినం రోగం దీర్ఘకాలమవస్థితమ్॥ 18
విద్యాద్విదోషజం, తద్వత్ ప్రత్యాఖ్యేయం త్రిదోషజమ్।
క్రియాపథమతిక్రాంతం సర్వమార్గాను సారిణమ్॥ 19
ఔత్సుక్యారతి సంమోహకర మింద్రియనాశనమ్।
దుర్బలస్య సుసంవృద్ధం వ్యాధిం సారిష్టమేవచ॥ 20

తాత్పర్యము ఆయుశ్శేషము వలన యాప్యముగ నున్న అసాధ్య వ్యాధి పథ్యసేవనచే స్వల్పముగ శాంతించుచు స్వల్పమైన హేతువుచేతనే వెంటనే వృద్ధిచెందుచుండును

గంభీరమైన ధాతువులను పొందినట్టియు, అనేక ధాతువులను పొందినట్టియు మర్మలను సంధులను ఆశ్రయించినట్టియు, ఎల్లప్పుడును అనుసరించియుండునట్టియు, దీర్ఘకాలమునుండి ఉన్నట్టియు రెండు దోషముల వలన జనించినట్టియు వ్యాధి యాప్యముగ నుండును ఈ యాప్యవ్యాధి యొక్క లక్షణములతో గూడినట్టియు, మూడు దోషముల వలన జనించినట్టిదియు ఐన వ్యాధి (ప్రత్యాఖ్యేయం) చికిత్సించదగనిదిగ నుండును మరియు చికిత్సల నతిక్రమించినదియు, సమస్త (త్రివిధ) రోగమార్గములను పొందినదియు, తొందరపాటు, దేనియందు ఇష్టము లేకుండుట, జ్ఞానము తగ్గుట, ఇంద్రియముల శక్తి తగ్గుట ఈ లక్షణములతో కూడియున్న దుర్బలునికి అధికముగ జనించినట్టి, మరణ (అరిష్ట) లక్షణములతోకూడినట్టి వ్యాధి చికిత్సింపతగనిదిగ నుండును

చ పా వ్యా అం అ   యాప్యమనుటతోడనే అసాధ్యమని తెలిసినప్పటికిని తిరిగి అసాధ్యమను పదము యాప్యములైన వాటిని యాపనము చేయుటకై చేయబడు చికిత్సతో సాధ్యములు కావని చెప్పుటకొరకై చెప్పబడినది శేషత్వాదాయుషః అను పదము ఆయుః శేషమున్నపుడే యాప్య వ్యాధులు జనించునని తెలుపుటకై ప్రయోగించబడినది పథ్యసేవయా = ఔషధ సేవనచే, లబ్ధాల్ప సుఖమ్ = కొద్దిపాటి సుఖము గలిగిన, ఆశుప్రవర్తకమ్ = కొద్దిపాటి కారణములతోనే త్వరగా జనించునది, గంభీరం = మేదస్సు మొదలగు గంభీర ధాతువులనాశ్రయించిన, నిత్యానుశాయీ = ఎల్లప్పుడు అనుబంధించి (అంటిపెట్టుకొని) యుండునది విద్యాద్విదోషజం అను నంత వరకు యాప్యరోగ లక్షణము తద్వత్ అనునది మొదలుకొని ప్రత్యాఖ్యేయ లక్షణము, తద్వత్ అనగా గంభీరధాతుగతము మొదలగు లక్షణములతో పాటు త్రిదోషజమైనచో ప్రత్యాఖ్యేయమని యర్థము, ఔత్సుక్యం = హర్షోద్రేకము, అరతిః = మనస్సు నిలకడగా లేకుండుట, సంమోహః = మానసిక మోహము (17, 18, 19, 20)

మూ॥ భిషజాప్రాక్ పరీక్ష్యైవం వికారాణాం స్వలక్షణమ్।
పశ్చాత్కర్మ సమారంభః కార్యః సాధ్యేషు ధీమతా॥ 21
సాధ్యాసాధ్య విభాగజ్ఞో యః సమ్యక్ ప్రతిపత్తిమాన్।
నసమైత్రేయ తుల్యానాం మిథ్యాబుద్ధిం ప్రకల్పయేత్॥ 22

తాత్పర్యము వైద్యుడు తొలుత వ్యాధుల యొక్క లక్షణములనీ విధముగ పరీక్షించి పిమ్మట సాధ్యములైన వ్యాధులకు మాత్రమే చికిత్సనారంభించ వలయును సాధ్యాసాధ్య విభాగమును తెలుసుకొన్నట్టి మంచి బుద్ధి కుశలతగల వైద్యుడు మైత్రేయుని వంటి వారి యొక్క మిథ్యాబుద్ధిని గలిగించడు

చ వ్యా ప్యా అం అ  నసమైత్రేయ తుల్యానాం మిధ్యాజా బుద్ధిం ప్రకల్పయేత్ అనగా అట్టి పై శ్లోకములతో చెప్పబడిన లక్షణములు గల వైద్యుడు మైత్రేయుని వంటి వారికి విపరీత బుద్ధిని గలిగించడు  ఇట్టి గుణములు గల వైద్యుడు నియమమునననుసరించి ఏ వ్యాధినైతే ఉపక్రమించునో దానిని తప్పక సాధించువాడగును  దానిననుసరించి ఔషధము వ్యాధిప్రశమనమును గూర్చి ప్రధానకారణమని తెలియుట వలన భేషజము అభేషజముతో సమానమని మైత్రేయునివంటి కర్మవాదులకు మిధ్యాబుద్ధిపుట్టదు అని భావము  (21, 22)

మూ॥  తత్రశ్లోకా

ఇహౌషధం పాదగుణాః ప్రభావో భేషజాశ్రయః।
ఆత్రేయ మైత్రేయమతీమతి ద్వైవిధ్య నిశ్చయః॥  23
చతుర్విధ వికల్పాశ్చ వ్యాధయః స్వస్వలక్షణాః।
ఉక్తామహాచతుష్పాదే యేష్వాయత్రంభిషగ్జితమ్॥  24
ఇత్యగ్నివేశకృతే తంత్రే చరక ప్రతి సంస్కృతే శ్లోకస్తానే
మహాచతుష్పాదోనామ దశమోఽధ్యాయః॥

తాత్పర్యము · పాద చతుష్టయము, పాద చతుష్టయ గుణములు, చికిత్సా సంబంధమగు ప్రభావము  ఆత్రేయుని యొక్కయు, మైత్రేయుని యొక్కయు మతములు. ఆ రెండు మతములలోని వినిచ్చయము  వ్యాధుల యొక్క చాతుర్విధ్యము, వాని వాని లక్షనములు, ఇవి ఈ మహాచతుష్పాదమునందు చెప్పబడినవి  చికిత్సవీని నాధారముగ చేసికొనియుండును

ఈ విధముగా అగ్నివేశకృతమై చరక ప్రతిసంస్కృతమైన సంహిత గ్రంథము యొక్క శ్లోకస్థానమున మహాచతుష్పాదమను దశమాధ్యాయము సమాప్తము

చ వా ప్యా అం అ  సంగ్రహే = సంగ్రహమున, ఇహ= ఈ అధ్యాయము.  ఔషధం = చికిత్సాచతుష్పాదము, పాదగుణాః = అనగా పూర్వాధ్యాయమున "షోడశగుణం" అను దానితో చెప్పబడిన చతుష్పాదగుణములు, ప్రభావోభేషజాశ్రయః = అనగా "యుక్తియుక్తమలమారోగ్యాయ" అను దానితో చెప్పబడిన భేషజము అని యర్థము

చక్రపాణి దత్త విరచితమైన చరకతాత్పర్య టీకయగు ఆయుర్వేద దీపికా వ్యాఖ్యానమునందు సూత్రస్థానమున మూడవదైన నిర్దేశచతుష్కమున మహా చతుష్పాదమను దశమాధ్యాయమునకు శాస్త్రుల మాణిక్యశర్మచే చేయబడిన ఆంధ్రానువాదము

